# ఈ రెండు లోకాలు

కథా సంకలనం

చిత్తూరుజిల్లా రచయితల
సహకార ప్రచురణ సంఘం
చిత్తూరు

# మనవి



చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం దిన దిన ప్రవర్ధమాన మవుతున్నది. ఇదివరకే ఇది రెండు నవలలను, ఒక సాహిత్య వ్యాస సంపుటిని ప్రచురించడమే గాక, ప్రస్తుతం ఈ కథానికలను ప్రచురిస్తున్నది. ఈ ప్రచురణలద్వారా ఈ సంఘం రచయితలను ప్రోత్సహిస్తున్నది.

ఈ సంఘం ఇంతటితో ఆగబోదు. నాటికలను, కవితలను, తదితర సాహిత్య ప్రక్రియలను గూడ ప్రచురిస్తుంది. ఈ విధంగా ఈ సంఘం ఈ జిల్లా రచయితలు రచించిన నవలలను, నవలికలను, నాటికలను, నాటకాలను, కథలను, కథానికలను, కవితలను, కావ్యాలను, సాహిత్య విమర్శలను, తదితర రచనలను వీలయినప్పుడెల్లా ప్రచురిస్తూనే వుంటుంది. అయితే ఇది ఔత్సాహికులైన మన రచయితల సహకారంమీద, ప్రభుత్వం, జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితులు, రసికులైన, విద్యాధికులైన పతితలు- వీరిచ్చే ప్రోత్సాహంమీద ఆధారపడి వుంటుంది.

ఈ రచయితల సంఘం ఈ జిల్లా రచయితలను ప్రోత్సహించడానికి అహరహం కృషిగావిస్తుంది.రచయితలందరూ ఈ సంఘంలో సభ్యులుగా చేరి దీనిని పెంపొందించాలని, దీనిద్వారా తాముగూడ పెంపొందాలని కోరుతున్నాను.

పి. రాజగోపాల నాయుడు
అధ్యక్షుడు
చిత్తూరు జిల్లా రచయితల సహకార
ప్రచురణ సంఘం.

చిత్తూరు
29-9-72



# విజ్ఞప్తి



ప్రాచీన కాలంనుండి ఈ మండలంలో మహాకవులు ప్రభవించి మహోజ్జ్వలమైన సాహిత్యమును సృష్టించారు. నేటి యుగ ధర్మాన్ని అనుసరించి ఆధునిక కవులు రచయితలు పరిశోధకులు ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తున్నారు.

ఈ జిల్లాలో రచయిత లెక్కువైనా ప్రచురణ సంస్థలు తక్కువ. ఉన్న సంస్థలు సాయశక్తులా కృషిచేస్తున్నా అన్ని గ్రంథాలనూ ప్రచురించలేవు. ఆంధ్ర దేశంలో మదరాసులోనున్న ప్రచురణ సంస్థలు పత్రికలు చిత్తూరు జిల్లా రచయితల నెంతగానో ప్రోత్సహించినవి. నేడూ ప్రోత్సహిస్తున్నవి. ఐనా వందలాది గ్రంథములు అముద్రితంగా ఉన్నవి. ఈ మండలంలో ఏ ఐదారుగురి రచనలను కలిపినా ఐదారు వందల ఉత్తమ సాహితీ సంపుటములు కాగలవు.

ఈ స్థితిలో రచయితల సహకార ప్రచురణ సంస్థను వ్యవస్థీకరించుకొన్నాము. ఈ ఆలోచన నేటిది కాదు. ముప్పదేళ్ళ క్రితం స్వతంత్ర సాహితీ సమితి అవతరణనాటిది. జిల్లా కళాపరిషత్తు యిందుకోసం ప్రయత్నించినది. శారదా పీఠం, జిల్లా రచయితల సంఘం యిందుకోసం కృషిచేసినవి. స్థానిక పత్రిక లెంతగానో ప్రోత్సహించినవి. ఇన్నాళ్ళకు ఇన్నేళ్ళకు ఆ బంగారు కలలు పండినవి.

ఈ గురుతర బాధ్యతను సక్రమంగా నిర్వహించగల

సారథి బహుజన ప్రియులు శ్రీ పి. రాజగోపాల నాయుడు గారని మాకు తెలుసు. ఆయన రాజకీయాలలో ఉన్నా మేము వదలము. ఆయనా మా అభ్యర్థనను కాదనలేరు. రచయితగా మాతో సహకరించక తప్పదు గదా! వారి ధర్మమది.

మా కృషి కొద్దిగా ఫలించినది. ప్రభుత్వం బాగా సహకరించినది. నాలుగు గ్రంథాలను ప్రచురించాము. అందరివీ ఒక్కమారే వెయ్యలేము కాని, ప్రచురణార్హమైన వాటి నొక్కటి కూడా వదలబోము. ప్రభుత్వం యిదే విధంగా సహకరిస్తే, ప్రజలు ప్రోత్సహిస్తే, రచయితలందరూ ఏకీభావంతో కృషిచేస్తే గమ్యం ఎంతో దూరంలో లేదు.

ఈ మహోద్యమం ఈ జిల్లా కవులకు రచయితలకు కల్పతరువును ప్రసాదించడం తథ్యం. స్వాతంత్ర్య భావాలతో స్వేచ్ఛా సాంప్రదాయాలతో కుల మత పార్టీలకు అతీతంగా ఉత్తమ సారస్వతాన్ని సృష్టించే కవులు సాహితీ వేత్తలు రచయితలు పోషించబడే భవిష్యత్తుకు ఈ సహకార సంస్థ బంగారు బాటలను వేస్తున్నది.

ప్రారంభంలో ఎక్కువ త్యాగం అవసరం. త్యాగమే అసలు పునాది కావాలి. అందుకే రచయితలు ఎవరివి ముందు ప్రచురించినా ఓపికతో అన్నీ మనవే అనుకోవాలి. అదే సహకార సూత్రం– సామాజిక దృక్పథం.

ఈ ప్రచురించిన గ్రంథములు డైరెక్టర్లు ఎన్నుకొన్నవి కావు. సాహితీ వేత్తలు పరిశీలించి ఎన్నిక చేసినవి. మేము

సాక్షీభూతులం. రచనల బాగోగులను సమీక్షించకపోయినా మావారిని గురించి ప్రస్తావించకుండా మౌనంగా ఉండగలనా? సాహిత్య వ్యాసాల కర్త సాహిత్య స్వరూపమును సాక్షాత్కరించుకొన్న మహాతపస్వి. 'ఈరేడు లోకాల' కథకులు ఎవరికివారే ప్రత్యేక విశిష్టతగల రచయితలు. అందరూ సుపరిచితులు. చాలమంది ప్రసిద్ధులు. కొందరు సుప్రసిద్ధులు. ఒకరిద్దరు అకాడమీల బహుమానాల గ్రహీతలు. నవలా రచయితలిద్దరూ ఆధునిక సాహిత్యంలో అంతో యింతో మంచి పేర్లు తెచ్చుకొన్నవారు. అటు వచన రచనలోనూ యిటు గేయ రచనలోనూ సిద్ధహస్తులు. అందరూ మా మాండలీకులు.

ఈ గ్రంథాలను ప్రచురించాము. మేము రచయితలం. వ్యాపార దృక్పథాన్ని అలవరచుకోవాలని ప్రయత్నించినా అసలు వర్తకులం కాలేము కదా! అంచేత మా పట్ల సానుభూతి వహించి ఉన్నత పాఠశాలలు, గ్రంథాలయాలు, కళాశాలలు, సాహిత్యాభిమానులు ఈ గ్రంథాలను విరివిగా కొనాలి.

ఈ జిల్లా రచయితలు స్వర్ణయుగాన్ని సృష్టించుకొంటున్నారని విజ్ఞులు భావించడం సత్యం. ప్రతి జిల్లాలోనూ యిట్టి సంస్థలు ప్రభవించగలవని నా విశ్వాసం. విస్తృతమైన పథకములతో పరస్పర అవగాహనములతో అన్ని సంస్థలూ లక్షలాది గ్రంథాలను సమర్పించే శుభ తరుణం ఆసన్నం కాగలదని నా నమ్మకం.

నవలలు, కథలు, వ్యాసాలతోపాటు కవితలు ఖండ కావ్యాలు బాలసాహిత్యాన్ని కూడా ఈ సంస్థ ప్రచురించ బోతున్నది. సాహిత్యంలోని వివిధ ప్రక్రియలనూ ప్రోత్స హించ నున్నది.

జీవనది ప్రారంభదశలో ఎంత చిన్నదో ఈ సంస్థ కూడా అంత చిన్నదిగానే కన్పిస్తున్నది. చిత్తశుద్ధితో సత్సం కల్పంతో త్యాగదీక్షతో ఈ సంస్థ పురోభివృద్ధికై జిల్లాలోని కవులూ రచయితలూ పండితులూ సాహిత్యాభిమానులూ విస్తృతమైన కృషి సల్పబోతున్నందున ఈ సంస్థ విశ్వ విఖ్యాతి నార్జించగలదని నిస్సందేహంగా ప్రకటిస్తున్నాను.

అన్నమాచార్యులు తరిగొండ వేంకమాంబ ధూర్జటి కట్టమంచి వంటి మహామహుల వారసులమని గుర్తిస్తున్న మా మండల రచయితల నిర్విరామ కృషితో ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఈ సంస్థ ఒక మహోజ్వలమైన ఘట్టాన్ని సృష్టించగలదని విశ్వసిస్తున్న మాకు అన్నివిధాలా చేయూత నివ్వమని ప్రభుత్వాన్ని రాష్ట్ర కేంద్ర సాహిత్య అకాడమీ లను అన్ని పత్రికలను దేశమందలి సాహితీ వేత్తలను, సాహిత్యాభిమానులను హృదయపూర్వకంగా ప్రార్థి స్తున్నాను.

ఈ సహకార సంస్థ బోర్డులో డైరెక్టర్లుగా అనన్య మైన కృషిని సాగిస్తున్న శ్రీ కె. రామకృష్ణ, ఓలేటి కృష్ణ, శేషాచార్యులు, ఏ. జి. నాగరాజు, రఘునాధరెడ్డి గార్లను అభినందిస్తున్నాను.

ఈ గ్రంథాల ఆవిష్కరణోత్సవానికి విజయం చేసిన మన అమాత్య సత్తములు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి, శ్రీ బత్తిన సుబ్బారావు, శ్రీ దేవానందరావు, శ్రీ కె. గోపాలనాయుడుగార్లకు, గ్రంథాలకు అందమైన ముఖ పత్రాలను చిత్రించిన సుప్రసిద్ధ చిత్రకారులు మిత్రులు బాపుగారికి, సకాలంలో ముద్రించిన క్రాంతి, కళా ప్రింటర్స్ అధినేతలకు మా కృతజ్ఞతను సమర్పిస్తున్నాము. ఈశ్వరోజయతి!

కె. సభా

ఉపాధ్యక్షుడు

జిల్లా రచయితల సహకార

ప్రచురణ సంఘం.

చిత్తూరు,

1-10-72.

# పరిచయం

చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంస్థ సభ్యులనుంచీ లభ్యమైన కథలను, ప్రచురణార్హమని తోచిన వాటిని, ఈ సంపుటిలో చేర్చడం జరిగింది. జిల్లాలో ప్రసిద్ధులైన కథకుల్ని కోరి, వారి కథల్ని ఏరి, వెలువరిస్తున్న సంకలనం కాదిది. ఇందులో ప్రసిద్ధులూ ఉన్నారు. క్రొత్తవారూ, కేవలం ఒక కథ వ్రాసి ఊరుకున్నవారూ ఉన్నారు. వర్ధమాన రచయితలను ప్రోత్సహించడమే ఈ ప్రచురణ ప్రధానోద్దేశం.

ఈ కథల్లో వైవిధ్యం ఉన్నది. ఇవి 'అమ్మాయి-అబ్బాయి' కథలుకావు. నిత్యజీవితాన్నీ, జీవితంలో విషాదాన్నీ ప్రతిబింబించే కథలు. నేడు వీస్తున్న గాలికి తగినట్లే ఆర్థిక వ్యవస్థలోని హెచ్చు తగ్గుల్నీ, సమాజంలోని దురన్యాయాల్నీ, వింత ధోరణుల్నీ, విపరీత పరిణామాల్నీ ఈ కథలు వ్యక్తిపరంగానూ, సన్నివేశపరంగానూ చిత్రిస్తున్నాయి. సుకుమారంగా, ప్రతీకల సాయంతో చెప్పడం ఉన్నది. అధిక్షేపణగా అవహేళనగా చిత్రించడం ఉన్నది. సూక్ష్మమైన మనోవిశ్లేషణతో, న్యాయనిర్ణయంలోని వైపరీత్యాన్ని మానవతాదృష్టితో విమర్శించడం ఉన్నది. అస్తిత్వవాదధోరణిలో, చైతన్యస్రవంతి పద్ధతిలో వ్యక్తిత్వం రూపు కట్టని మానవుణ్ణి (Faceless man), అధీరుడైన నేటి సామాజికుణ్ణి, వర్ణించడం ఉన్నది. 'తివాచీ', 'రామదాసు చెర', 'న్యాయం', 'ఎవరీ మనిషి' పైరీతుల్లో ఎన్నదగిన కథలు.

'సుడిగాలి', 'కుక్క చచ్చింది- కోడి కూసింది' అనే కథల్లో ప్రత్యేకంగా చిత్తూరుజిల్లా ప్రాదేశిక వాసనలూ, పలుకుబళ్ళూ కథల్లో వస్తువైన సామాజికతకు మరింత వన్నె తెచ్చేలా వున్నాయి. 'సుడిగాలి' కథ ఎంతో నెమ్మదిగా ప్రారంభమై, నిమ్మకు నీరెత్తినట్లు సాగుతుంది. పోలీసు కానిస్టేబిల్ భార్య జీవితంలో ఒక రోజు- సూర్యోదయం మొదలు రాత్రి దాకా

ఎలా నడిచిందో- ఆ 'లయ'ని పట్టుకోవడంలో రచయిత కృతకృత్యుడయ్యాడు. చివర ఆ జీవన ప్రశాంత మాధుర్యాన్ని ఆకస్మికంగా, క్రూరంగా ధ్వంసం చేసిన తుపాకీ ప్రేలుడు నేటి జీవితంలోని Insecurity ని, దాని మూలతత్త్వాన్ని అద్భుతంగా సూచిస్తోంది. 'సుడిగాలి' కథ మానవతా దృక్పథంతో, జీవితాన్ని 'లోతు'గా అర్థం చేసుకున్న రచయిత వ్రాసిన కథ. 'లోతు'గా అంటే కేవలం సంపద, చదువు, నాగరకతవంటి హంగులతో, రాజకీయవాదుల నినాదాలతో, జీవితానికి విలువ కట్టకుండా, ఒక వ్యక్తి తన పరిధిలో పొందగల పరితృప్తినీ, ఆనందాన్నీ ఆకళించుకొని దాన్ని గుర్తించడం! దీన్ని నేటి సామాజిక ప్రగతివాదులు హర్షించరు!!

'కుక్క వచ్చింది-కోడి కూసింది' కథ అందుకు భిన్నమైన దృష్టికి ఉదాహరణ. ఒక వ్యక్తి తన పరిధిలో సాధించే ధర్మమూ, తృప్తి, ఆనందమూ హుళక్కి అని ప్రతిపాదించే చిత్రణ ఈ కథ! వ్యక్తి ధర్మానికి ప్రతీక పెంపుడు కుక్క. అది వచ్చినపుడే కోడి కూయడం, తెల్లవారడం జరిగింది! అయితే ఈ కథలో సామాజిక ధర్మమేమిటో, దాని విప్లవ రూపమేమిటో రచయిత ప్రతిపాదించలేదు. మారిన పరిస్థితులతో, మనుష్యులతో, వ్యాపార, వ్యవహార పద్ధతులతో 'వ్యక్తి'ని రాజీ పడి మారమని మాత్రమే అంటున్నాడు. అవి సవ్యమా? అపసవ్యమా? అనే ప్రశ్న జోలికి పోలేదు. ఒకానొక పరిస్థితిలో బ్రతుకు యాత్ర సాగించడమే మూలధర్మమని సూచిస్తున్నాడు. ఈ కథ కూడా భాషరీత్యా, వస్తు చిత్రణరీత్యా సజీవమైన రచన.

రాజకీయాలు గ్రామీణ జీవితంలో తెచ్చిన సరికొత్త పరిణామాల్ని నిశితంగా పరిశీలించే కథలు 'రాణీ సాహెబా రంగయ్యమ్మారావు', 'గాయపడిన దేవత.'

స్త్రీల సమస్యలకు ప్రాధాన్యం యిచ్చిన కథలు 'పునాదిరాయి', 'దుఃఖభాగుడు', 'హాలాహలంలో అమృత భాండం'. ఇందులో వివాహ వ్యవస్థ,

కుటుంబ వ్యవస్థ చర్చకు వచ్చాయి. రచయితలు ఊహాపథంలో విహరిస్తూ కాక, తమకు తెలిసిన వాస్తవికతనే చిత్రించే ప్రయత్నం చేశారీ కథల్లో. 'అరిటాకు'లోని సంఘటన కొంత విడ్డూరంగా కనిపించవచ్చు. కాని అసహజం కాదు. వ్యక్తుల్లో ఒక్కోసారి అలాంటి ఆవేశాలు ప్రకోపిస్తూనే ఉంటాయి— ముఖ్యంగా బడిపంతుళ్ళల్లో!

'జీవనమాధుర్యం' కథాకథనంలో వాచ్యంగా చెప్పిన దానికంటె పాఠకుల ఊహకూ, అవగాహనకూ రచయిత్రి వదలిపెట్టిన అంశమే ఎక్కువ భాగము. అదే- కథలో ప్రధానాంశం కూడా. కథలోని తల్లి పాత్ర పోషణని పై పద్ధతిలో రచయిత్రి నిర్వహించిన తీరు ప్రశంసార్హంగా ఉన్నది. అంతే కాకుండా, తల్లి పాత్రలోని 'మెలిక' ఏమిటో కథలోని యువకునితోబాటు పాఠకులూ గ్రహిస్తారు. All that glitters is not gold! మరో ఉటంకింపు-మమతలూ మమకారాలూ దూరంగా ఉంటేనే రాణిస్తాయి,ముఖ్యంగా పెద్దలకూ పిన్నలకూ మధ్య!

'అరచేతిలో గీత' కథలో భావుకుడైన యువకుడు స్వప్నానికీ యాదార్థ్యానికీ మధ్య చిక్కి అటూ యిటూ దరి గానక పడే అవస్థ విస్తృతంగా విశిష్టంగా చిత్రింపబడింది. నేటి యువతరం ఎదుర్కొంటున్న Identity Crisis కి చక్కని చిత్రణ.

ఈ సంపుటిలోని కథల్లో, రచయితలు ఒక సిద్ధాంతానికి కట్టువడి తమ దృష్టిని ఉద్దేశపూర్వకంగా కుంచింపజేసుకున్నట్లుగాని, ఎవరో ప్రసిద్ధ రచయితల శైలినీ శిల్పాన్నీ అనుకరించే ప్రయత్నం చేస్తున్నట్లుగానీ నాకు స్ఫురింపలేదు. అందుకు రచయితల్ని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను.

ఈ ప్రచురణ సంస్థ, రచయితల సొంత సంస్థ కావడంవల్ల, మూడు పూవులూ ఆరు కాయలుగా అభివృద్ధి చెందాలని నా ఆకాంక్ష!

చిత్తూరు,
1-9-72

ఆర్. ఎస్. సుదర్శనం.

# ఇందులోని

## — కథలు —



-: o :-

చుట్టూ ప్రహరీ. ప్రహరీ నిండుకూ పూలతోట. దూరాని కాతోట స్పాంజ్ షీట్‌లా ఉంది. తోట మధ్య మేడ, స్పాంజ్ షీట్ మీద ఉంచిన సబ్బు పెట్టెలా. మేడముందు విరగబూసిన మల్లెగుబురు, ఒంటినిండా పూలు అలంక రించుకుని వచ్చేవాళ్ళకు స్వాగతం పలుకుతున్న కన్నెపడుచులా.

ఆ మేడలో ఒక ప్రక్క డ్రాయింగ్‌రూం, శిరస్సులో మెదడులా. ఆ మెదడులో పుట్టిన అందమైన ఊహల జంటలా రెండు ప్రాణులు. ఒక ప్రాణి అతడు, మరొక ప్రాణి ఆమె. అతడు భర్త. ఆమె భార్య. అప్పుడే పాలీష్ ఇచ్చిన స్టీలు గ్లాసులా మెరుస్తున్నా డతడు. సీలు తీసిన సబ్బుబిళ్ళలా నవనవలాడుతోంది ఆమె. స్టీలుగ్లాసు పేరు చంద్రం. సబ్బుబిళ్ల పేరు సునంద.

"వాళ్ళు వస్తామన్నది తొమ్మిదికే గదండి, తొమ్మిది కింక పది నిము షాలు మాత్రమే ఉంది" అన్నది సునంద, చేతిలో మెరుస్తున్న బంగారుచైన్ వాచ్ కేసి చూస్తూ.

"తొమ్మిదంటే తొమ్మిదికేనా? ఇండియాలో ఇంతవరకూ చెప్పిన టైముకి ఎవరైనా వచ్చి ఉన్నారేమిటి?"అన్నాడు చంద్రం,పెద్దగా నవ్వితే పర్స నాలిటీ దెబ్బతింటుందేమో నన్న భయంతో సగం నవ్వులో సగం మింగేసి సగంలో సగం తేలికగా నవ్వుతూ.

"నిన్న మనం వెళ్లలేదూ వాళ్ళింటికి?" అన్నది, కాశ్మీర్ సిల్కుచీర నలగని కుచ్చెళ్లు నలక్కుండా సవరించుకుంటూ.

"మనమంటే—నువ్వూ నేను! నువ్వూ నేనంటే మనమిద్దరమే. నేను తల, నువ్వు తోక. నాకు తలలేదు. నీకు తోకలేదు. అనుకోవడమూ, అప్పుడే టింగు రంగా మని చేతులు పట్టుకుని వెళ్ళిపోవడమూ. వాళ్లో?" అన్నాడు ఆమెవేపు చూస్తూ.

ఆ చూపు ఖాళీగా ఉంది.

"అవును లెండి! వాళ్ళిద్దరూ, ఆ ఇద్దరి వెంట ముగ్గురు. మొత్తం ఐదు మంది. పంచేంద్రియాలు ఒక తాటిమీద నడవడమంటే మాటలా?" అన్నది నిట్టూరుస్తూ. ఆ నిట్టూర్పులో నీటితో నిండిన మబ్బుబరువులోని బరువంత బరువు ఉంది.

"ఇష్! లెక్కకట్టకు" అన్నాడు చిలిపిగా పెదిమల కడ్డం చూపుడు వ్రేలుపెట్టి.

"ఏం?" అన్నది కళ్ళు చికిలించి.

"దిష్టి తగులుతుందని మా అమ్మమ్మ చెప్పేది"—పెదిమల చివరి వంపులో కొంటెతనం.

"ఇది అమ్మమ్మల కాలంగాదు. ఆకాశానికెగిరే కాలం. అది పోనీ—కానీయండి! వాళ్ళ గోపీని చూశారూ, అబ్బ! ఎంతముద్దొస్తాడండి!" అన్నది తన్మయత్వంతో ముద్ద అయిపోతూ.

"అవును. గోపీ వాళ్ళ బిడ్డ కదూ! ఎందుకు రాడూ?"

"పెద్దమ్మాయి ఉంది చూశారూ? ఆరో తరగతి చదువుతుందట. ఇంగ్లీషు పొయ్ట్రీ ఎంత బాగా చెబుతుం దనుకున్నారు?"

"రెండో అమ్మాయి ఏం చేస్తుంది? ముద్దు ముద్దుగా ఏడుస్తుందా?" అన్నాడు విసుగ్గా.

"అయ్యో! ఎంత అమాయకులండీ మీరు! రెండోది అమ్మాయి కాదు అబ్బాయండి." అన్నది వెర్రిగా నవ్వుతూ.

"వాళ్ళ తల్లి తన మంచీ, మర్యాదా మరచి బిడ్డలే తన సర్వస్వం అనుకుని పెంచుతూంటే నీలాంటి వాళ్ళకు వాళ్ళు ముద్దొస్తున్నారు" అన్నాడు నిర్లిప్తంగా.

"అవునండి. మనం వెళ్ళినప్పుడు కూడా ఆమె మాసిన చీరతోనే ఉంది."

"ఆమె చీర మాసినా, మాయని సంస్కారం- మచ్చలేని మాతృత్వం ఉన్నాయామెలో....అదృరేగానీ, మన టామీ ఏమో సడి చేస్తున్నాడు. వాళ్లొస్తున్నారేమో చూడు!" అన్నాడు.

"ఆఁ. టైమయిపోయింది. వాళ్ళే అయివుంటారు" అని ఆదుర్దాగా లేచి వరండాలోకి వచ్చింది. ఎవరూ లేరు. రోడ్డుమీద ఏదో కుక్క మొరుగు తోంది. నీరసంగా వెనక్కి తిరిగి వచ్చింది.

"మీది మరీ పిచ్చండి! రోడ్డుమీద కుక్క మొరుగుతుంటే మన టామీ అంటారు" అని రేడియోగ్రాం ఆన్ చేసివచ్చి ముందు కూర్చున్న సోఫా మీదనే కూర్చుంటూ—"ఇలా ఎదురుచూపులు చూడాలంటే నాకు మహా విసుగేస్తుందంటే నమ్మండి. ఒక్కోరోజు మీరుకూడా ఆఫీసునుంచి ఎంతకూ రాక విసిగించేస్తారిలాగే" అన్నది.

సంగీత సౌరభం గది పునాదుల్ని సన్నగా కదిలిస్తోంది. సంగీతానికి, సాహిత్యానికి అద్భుతమైన ఒక శక్తి ఉంది. రెంటికీ పులిగోళ్ళున్నాయి. ఆ గోళ్ళతో గుండెను గీకి వేదనల నెత్తురును తోడుతాయి. నెత్తురుతో పాటు అలౌకికమైన అమృతాన్ని గూడా వెలికి తీస్తాయి.

"ఏమండీ, నేనొక విషయం చెప్పనా?" అన్నది ఉత్సాహంగా అతని ప్రక్కకు జరిగి.

"ఇప్పుడు చెప్పేవన్నీ నన్నడిగే చెబుతున్నావా? అలాగే ఇదీ, చెప్పు!"

"పోండీ! మీకు మాటకిముందు చిరాకు!" అని ముందున్న స్థానంలో కూర్చుంది మూతి ముడుచుకుని.

"నాకా చిరాకు? టామీని అడుగు. చిరాకు ఎవరికో దానికన్నా బాగా తెలుసు....పోనీ, చెప్పమంటున్నానుగా ఇంతలో ఆ అలక ఏమిటి?" అని భుజంమీద చెయ్యివేసి తనవైపు త్రిప్పుకొన్నాడు.

"మీరు కోప్పడరు కదా?"

కోప్పడనని తలాడించాడు.

"మీరు ఆఫీసరు కదా!" అన్నది.

"ఇప్పుడెందు కొచ్చిం దా సందేహం?"

"మీ ఆఫీసులో పనిచేసే హెడ్‌క్లర్క్ కదా ఆయన?"

"అవును."

"ఆయన కింతమంది బిడ్డలూ, ఇంత సంసారముంది కదా?"

"అవును."

"ఆయన కొచ్చే జీతం ఎక్కడికి చాలుతుందండి?"

"ఉహూ!"

"మీరు ఆఫీసరైనందుకు ఇంకొంచెం జీతం పెంచరాదూ?"

"ఆ!"

"మీకు కొంచెంకూడా జాలి లేదండీ!"

"అవును."

"ఏమిటి అవును?"

"నిజమే!"

"ఏమిటా ఊతపదాలు? ఆయన జీతం విషయం చెబుతుంటే అవును, నిజమే, ఆహా, ఊహూ అంటూ వంతపాట ప్రారంభించారూ?"

"అవును. నాది వంతపాట. నీది వింతమాట. ఆ ఆఫీసు మన తాతది. అంతా మన ఇష్టమే! దానికి రూల్సూ, పాడూ ఏమీలేవు."

"ఈ మగాళ్ళెప్పుడూ ఇంతే! మాటకిముందు రూల్సూ, చట్టాలూ. వీళ్ళు మాత్రం వాటిని మహా పాటించి ఏడ్చినట్టు. అవిమాత్రం మనిషికి మేలు చేయవద్దంటాయా ఏమిటి?"

"ఓహో! బండి మహావేగంతో వెడుతోందే? నువ్వు ఆఫీసరైనప్పుడు అలాగే చేద్దువుగానీ."

"పైగా ఇదొక్కటి నేర్చుకున్నారు. ఏం మాట్లాడినా నువ్వు చేద్దువుగానీ, నువ్వు చూద్దువుగానీ అంటూ నా నోరు నొక్కేస్తారు. మన కెటూ పిల్లలు లేకపోయారు గదా! ఉన్నవారికైనా మేలు చేస్తే...."

"చెయ్యి, చెయ్యి. లోకంలో పిల్లలున్న వాళ్ళనంతా పిలుచుకు వచ్చి పరసాకు మేలుచెయ్యి. లోకంలో ఎవరికి లేరు పిల్లలు, మనకి తప్ప!—" చివర అతని గొంతు జీరబోయింది.

ఆమె మాట్లాడలేదు. అతను మాట్లాడలేదు. ఇద్దరూ మాట్లాడలేదు. సన్నటి సంగీతం హృదయాల్ని తేలిక పరచడానికి ప్రయత్నిస్తోంది. ఇద్దరి మధ్య మౌనంగా దూసుకుపోతున్న కాలపతంగం తన రెక్కల కుంచెలలో సంగీతంలోని కొత్త రంగుల్ని అద్ది వాళ్ళ మనసులకు పూసుకుంటూ పోతోంది.

"ఇది నాకేదో గమ్మత్తుగా ఉందండీ!" అన్నది కొత్త ఉత్సాహంతో.

"ఏది?" అన్నాడు పరధ్యానంగా.

"ఇదేనండి, ఈ ప్లాను. మనం వాళ్ళింటికి వెళ్ళడం, వాళ్ళింట్లో మనకు నచ్చింది చెప్పడం, వాళ్ళు మనింటికి రావడం, మనింట్లో వాళ్ళకి నచ్చింది చెప్పడం. ఇది తలచుకుంటే మీకు మాత్రం గమ్మత్తుగా లేదూ?....అవునూ, ఈ ప్లాను మొదట ఎవరు చెప్పారండి?" అన్నది ఉత్సాహంగా.

"అతనూ, నేనూ రోజు క్లబ్బుకు వెళ్ళేవాళ్ళం, ఆఫీసునుంచీ అలాగే. ఆఫీసరూ, గుమాస్తా ఇంత అన్యోన్యంగా కలిసి ఉండడం చూస్తే అందరకూ ఆశ్చర్యం వేసింది."

"ఎందుకండి ఆశ్చర్యం?"

"ఎందుకా? నా కర్మ! ఆ మాట నీతో చెప్పాను, నీకేమో మహా అర్థమై ఏడ్చేటట్టు! అదంతా నీకు వద్దుగానీ, అసలు విషయం విను. రోజూ క్లబ్బుకు వెళ్ళడమంటే మొహం మొత్తినట్లుండేది. ఇదీ ఎందుకని అడక్కు. క్లబ్బు మీద విసుగుపుట్టి మొన్ననో మాటు అలా పార్కుకు వెళ్ళాం. పార్కులో కూర్చుని ఇద్దరం మాట్లాడుకుంటున్నాం. మాటల మధ్యలో ఈ విషయం ప్రస్తావనకు వచ్చింది. రెండు రోజులు సెలవులు వస్తున్నాయి కదా, లైఫ్ ఒంటెద్దు గానుగ జీవితంలా డల్‌గా ఉంది, ఈ రెండు రోజులు థ్రిల్‌గా గడపాలంటే ఏం చెయ్యాలో ఓ మంచి ప్లాన్ చెప్పమన్నాను. అతనీ ప్లాను చెప్పాడు. నాకు నచ్చింది. అంతే!" అన్నాడు.

"నచ్చిందీ, ఎందుకు నచ్చదూ? మీరూ మీరూ అనుకోగానే సరి పోయిందా? ఇంట్లో ఆడవాళ్ళం మేమున్నామే—మా అంగీకారమేమీ అక్కరలేదా?" అంది చిరుకోపంతో.

"ఇది పెద్ద చిక్కే. అయితే మీరిద్దరూ కలిసి ఒక పని చెయ్యండి" అన్నాడు సీరియస్‌గా.

"ఏమిటది?"

"ఇంటిముందు 'విప్లవం వర్థిల్లాల'ని బోర్డు కట్టి నిరాహారదీక్ష చెయ్యండి."

"చేస్తేగూడా పాపంలేదు" అన్నది బుంగ మూతితో.

"ఆ మొహం చూడు, కొండముచ్చుకు లాగా! మగాళ్ళు చేసే ప్రతీ పనీ ఆడాళ్ళకు చెబుతూ కూర్చుంటే ఇక అన్నీ అయినట్టే!"

"ప్రతిపనీ అని నే ననలేదు. ఇది ఆడవాళ్ళకు సంబంధించిన పని—ముందు మాకు చెప్పి తీరాలంటున్నాను."

"మీ జాతిని బాగా వెనకేసుకొస్తున్నావే! ఈసారి మహిళా సమాజానికి నిన్నే అధ్యక్షురాలిగా ఎన్నుకోమని చెబుతానులే!"

"నా భర్త ఆఫీసరైనప్పుడు మళ్ళీ నాకెందుకింక పదవి?" అని లేచి వంటింట్లోకి వెళ్ళింది, వంట పనికెలా ఉపక్రమిస్తున్నారో కనుక్కోవడానికి.

వెళుతూ, వెళుతూ——

"దాదాపు పది కావస్తోంది. వీళ్ళేం ఇంకా రారే!" అంటూ వెళ్ళింది.

* * *

రావు వెలుపలి గేటు తీశాడు, లోపలికి ప్రవేశించడానికి.

"ఇదేనాండి వాళ్ళ యిల్లు?" అన్నది సీత చంక బిడ్డను క్రిందికి దించుతూ.

"ఇదే కానీ, ముందు వాడి ముక్కు తుడువు" అన్నాడు రావు, ముఖం చిట్లించుకుని.

"అబ్బ! ఎంతందంగా ఉందండి! ఇంత ఇంటిలో వాళ్ళిద్దరేనా?" అన్నది ఆశ్చర్యంగా, చాలీ చాలని తమ అద్దె కొంపను తలుచుకుంటూ.

చీర చెరగుతో గోపీ ముక్కు తుడిచింది.

"నీ బుద్ధి పోనిచ్చావు కావు. ఇంటి దగ్గరైతే ఎలా ఏడ్చినా ఫరవా లేదు. పెద్దవాళ్ళింటికి వచ్చాము. ఇక్కడ కూడా చీరనలా ఖరాబు చేసుకుంటున్నావు. వాళ్ళు చూస్తే ఏమనుకుంటారు? నే నిచ్చిన రుమాలెక్కడ?" అన్నాడు చిరాకుగా.

"ఇదిగో ఉందండి. ఏమిటో అలా అలవాటై పోయింది" అని చీర కట్టులో దోపుకున్న రుమాలు తీసి చూసింది.

"చాల్చాలు! నీ అవతారాలన్నీ కట్టిపెట్టి ఇక్కడున్న నాలుగ్గంటల సేపు కొంచెం శుభ్రంగా ఉండు. ఇంటికి వెళ్ళింతర్వాత నీ విశ్వరూపం ప్రదర్శిద్దువుగాని" అన్నాడు, పెద్దమ్మాయి రాణి చేయిపట్టుకుని గేటుదాటి తోటలో నడుస్తూ.

సీతకు తన శుభ్రతకన్నా పిల్లల శుభ్రత ముఖ్యం. తను శుభ్రంగా ఉండాలనుకున్నా పిల్ల లుండనివ్వరు. పిల్లలు ఖరాబుగా ఉండాలనుకున్నా ఆమె ఉండనివ్వదు.

సీత ముదురు రంగు హేండ్‌లూమ్ చీర కట్టుకుంది. అంతకంటె

విలువైన చీర తన దగ్గరలేదు. ఉన్నా కట్టదు. కట్టినా ఖరాబై పోతుందని ఆమె భయం. అస లలాంటి వేవీ కోరదు గూడా. ఆమెకు ఏ చీర కట్టినా అందంగానే ఉంటుంది. ఎన్ని ఇబ్బందులలోనైనా వాడని చిరునగవు మోమే ఆమెకు పెట్టని ఆభరణం. జాకెట్టు కూడా చీర రంగే! ఆమె పెట్టుకున్న అభరణమల్లా మెడలో ఒక్క బంగారు గొలుసు మాత్రమే!

పిల్లలకిమాత్రం మడతలు నలగని అందమైన రెడీమేడ్ డ్రస్ తొడిగింది. చక్కగా తలలు దువ్వి ముస్తాబు చేసింది. ఆ డ్రస్సులో పిల్లలు ముగ్గురూ రబ్బరు బొమ్మల్లా, చూచేవాళ్ళకి ముద్దొస్తున్నారు.

"నాన్నా! వీళ్ళ కీ పూల మొక్కలన్నీ ఎక్కడివి నాన్నా? మా బడిలో కూడా లేవు ఇన్ని రకాలు" అన్నది రాణి.

"ఇక్కడేమీ అడక్కు. అన్నీ ఇంటికి వెళ్ళిం తర్వాత చెబుతాను తీరిగ్గా" అన్నాడు రావు.

"ఇంటిముందు మల్లెగుబురు ఎంత నిండుగా విరగబూసి ఉందండీ?" అన్నది సీత, తను ఆగి, వెనకపడ్డ ప్రసన్నకుమార్‌ని ముందుకు నడిపిస్తూ.

వరండాలో ఉన్న కుక్క వీళ్లను చూడగానే సింహంలా లేచింది, 'భౌ—భౌ' మని అరుస్తూ. పిల్ల లందరూ దాని అరుపులకు అమ్మా నాన్నలకు అతుక్కుపోయారు, కంగారుతో.

"ఎద్దులా ఎంత ఎత్తుందండీ ఆ కుక్క! పిల్లలు భయపడిపోయారు. ఆ గొలుసే లేకుంటే ఇంతవరకు మన గతి ఏమయ్యుందేది?" అన్నది వొణుకుతూ పిల్లల్ని చేర్చి పట్టుకుంటూ.

"ఏమిటా అదురు? పిల్లలకంటె ముందు నిన్నే ఆస్పత్రికి చేర్చవలసి వట్టుందే!" అన్నాడు తన కాళ్ల కతుక్కుపోయిన రాణి వీపు నిమురుతూ.

"ఏమో బాబు! నే నెప్పుడూ చూడలే దింత కుక్కను. అసలు దీన్ని కుక్కంటే నమ్మలేక పోతున్నాను" అన్నది.

ఇంతలో ఇంట్లోనుంచి చంద్రం, సునంద వరండాలోకి వచ్చారు. వాళ్ల హెచ్చరికను వినగానే కుక్క నోరు మూసుకొని తోకాడించింది. తోకా డించడంలో కూడా దాని దర్జాను విడిచిపెట్టలేదు.

"నమస్కారం సార్!" అన్నాడు రావు.

"నమస్కారం. రండి, రండి!" అన్నాడు చంద్రం.

"టామీని చూచి పిల్లలు భయపడుతున్నట్టున్నారే! రండమ్మా, అదేమీ చెయ్యదు. నేనున్నాగా, రండి!" అంటూ ఆప్యాయంగా పిలిచింది సునంద. ముందుకొచ్చి గోపీని ఎత్తుకుంది.

"మీరింతవరకు ఆఫీసుకి లేటయ్యింది లేదు. అలాంటి మీరు ఇవాళ ఇంత ఆలస్యం చేశారంటే ఇంక రారేమో అనుకున్నాను" అన్నాడు చంద్రం, సగం కొరుక్కున్న నవ్వుతో.

"ఎక్కడ సార్! పిల్లలతో ప్రయాణం. అడుక్కొక ఆటంకం. అందులోనూ ఈ ఆడవాళ్లతో ప్రయాణం ఉంది చూశారూ!" అన్నాడు రావు సీతవేపు కొంటెగా చూస్తూ.

"ఆ మాటే నేనంటే మా ఆవిడ వినదే! ఈ కాలం ప్రయాణం కావడంలో మగవాళ్ళకంటే ఆడవాళ్ళే నయమంటుంది" అంటూ సునందవేపు చూశాడు చంద్రం.

"అప్పుడే ప్రారంభమైందీ, ఆడవాళ్ళని ఆడిపోసుకోవడం? చాలు చాలు, రండి లోపలికి" అని చంద్రంవేపు కొరకొరా చూచి డ్రాయింగ్ రూము లోకి ప్రవేశించింది, సునంద.

ఆమె వెనకనే చంద్రం ప్రవేశించాడు.

రావు వరండాలోనే చెప్పులు తీసేశాడు. సీత గూడా చెప్పులు తీసేసి గడప ముందున్న తివాచీకి కాళ్ళు తగలకుండా దాటుకోవడానికి తంటాలు పడుతోంది.

"వెర్రిమొహమా! ఏమిటా పులుడుగు? కాళ్ల తుడుచుకునే తివాచీ అది. వీధి భాగోతం చాలించి, నీ బంగారు కాళ్ళు దానికి తుడుచుకుని లోపలికి పో!" అని గొంతు తగ్గించి కసురుకున్నాడు రావు, ముందు వాళ్ళకి వినబడకుండా.

"ఇంతందంగా ఉంది. దీని మీద కాళ్ళు ఎలా తుడవనండీ?" అన్నది ఏదో రహస్యం చెబుతున్న దానికిమల్లే.

"ఖర్మ! నిన్ను పిలుచుకు వచ్చాను!" అని విసుగ్గా తివాచీకి కాళ్ళు తుడుచుకుని వెళ్ళాడు, డ్రాయింగు రూములోకి.

సీత తివాచీ మీద కాళ్ళు తుడుచుకుంది. తుడుచుకుంటున్నప్పు

దది మెత్తగా కాళ్ళకు గిలిగింతలు, పెట్టింది. 'కాళ్ళు తుడుచుకోవడానికి కింత విలువైనదాన్నా వీళ్ళు ఉపయోగించుకొంటున్నా'రని ఆశ్చర్యపోయింది. దాన్ని దాటుకుని వెళ్ళింది. మళ్ళీ వెనక్కి తిరిగి చూచింది. తివాచీని చూచి తన చీరను చూచుకుంది. రెండూ ఒకటే రంగు. ముదురు నీలం రంగు. రెంటికీ ఏదో సంబంధమున్నట్టుగా తోచిందామెకు.

సీత డ్రాయింగ్‌రూంలో అడుగు పెట్టింది. అందరిలాగే అడుగైతే పెట్టింది కానీ, ఆ గదిలోని విలువైన అలంకారాల్నీ, అంతకంటె అద్దంలా మెరిసిపోయే దాని శుభ్రతనీ చూడగానే అందులో అడుగు పెట్టడానికి తనకు అర్హత లేదేమో అనేంత బిడియమూ, పిరికితనమూ తన్ను స్థబ్ధురాల్ని చేసేశాయి. ఆ గదిని చూచి మళ్ళీ వెనక్కి తిరిగి తివాచీని చూచింది. నిగనిగలాడే తివాచీ మీద అప్పుడేపడ్డ మరకలు తన్ను వెక్కిరించాయి.

"రండి! అలాగే నిలబడిపోయారేమిటి? ఇలా వచ్చి కూర్చోండి" అని సునంద సోఫా చూపింది.

ఆ మాటతో ఉలిక్కిపడ్డట్టుగా వాళ్ళవేపు చూచింది. అందరూ అంతవరకే ఆసీనులై ఉన్నారు. తను కూడా వెళ్ళి కూర్చుంది. తను కూర్చున్న చోట సోఫా మెత్తగా క్రిందికి వెళ్ళిపోయింది. తనకేమో అదంతా ఏదో మయసభలా తోచింది.

ఇంతలో హోటల్లో సర్వర్‌లాగా ట్రేలో కాఫీలు తెచ్చి, అద్దంలా నిగనిగలాడే టీపాయ్ మీద పెట్టారెవరో! సునంద అందరికీ కాఫీలు అందిస్తోంది. ఇదంతా ఆశ్చర్యంగా చూస్తున్న సీతకు గూడా ఒక కాఫీ కప్పు అందించింది. మారు మాట్లాడకుండా తీసుకుంది సీత.

"నేను గోపీకి కాఫీ తాగిస్తాను. మీరు పెద్దబ్బాయికి తాగించండి" అన్నది సునంద సీతతో, గోపీని తన ప్రక్క సోఫాలో కూర్చోబెట్టుకుని కాఫీ చల్లార్చుతూ.

ఆమె ఆప్యాయతను చూస్తుంటే సీతకు ఆశ్చర్యం వేసింది.

రాణి, వాళ్ళనాన్న ప్రక్క కూర్చుని బుద్ధిగా కాఫీ త్రాగుతోంది. ప్రసన్నకుమార్‌ని తన ఒడిలో కూర్చోబెట్టుకుని కాఫీ తాగిస్తోంది సీత.

"మల్లె గుబురు ఇంటిముందు చాల అందంగా ఉంది. దాని వాసన కిటికీలోంచి ఇక్కడికి గూడా వస్తోంది" అన్నది సీత, కిటికీవేపు చూస్తూ.

"సీతకు మల్లెపూవులంటే చాలు. అవే ప్రాణం" అన్నాడు రావు.

"పెరట్లో ఒక మల్లెమొక్క నాటమంటే వినిపించుకోరు. మనం అద్దె కొంప జీవులం, రేపు ఈ ఇంట్లోనే ఉంటామనే నమ్మకమేముంది అని కొట్టిపారేస్తారు" అన్నది సీత.

"అదీ నిజమే!" అన్నాడు చంద్రం.

"ఇంతెందుకు? ఆ చూచేదేదో మల్లెచెట్టున్న ఇల్లే చూచుకుంటే సరి పోలే" అన్నది తేలిగ్గా సునంద.

"చూడు. కత్తి లేకుండానే సొరకాయ లెలా తెగిపోతున్నాయో?" అన్నాడు చంద్రం.

"అద్దెకొంపల సంగతి వారి కెలా తెలుస్తుందండీ? చిన్నప్పటినుంచి ఏ కష్టమూ తెలియకుండా సుకుమారంగా పెరిగిన వారాయె!" అన్నాడు రావు సర్దిచెప్పే రీతిలో.

సీలింగ్ ఫేన్ మెత్తగా తిరుగుతోంది. రేడియోగ్రాం నుంచి సన్నటి సంగీతం వినవస్తోంది. చంద్రం, రావు ఏవో ఆఫీసు గొడవల్లో పడ్డారు.

"మీరు మొహం కడుక్కుంటారా?" అన్నది సునంద సీతవేపు తిరిగి.

"ఇప్పుడేగా స్నానంచేసి వస్తున్నాం. ఏమీ వద్దులెండి" అన్నది సీత.

సునంద గోపీని ఒడిలో కూర్చోబెట్టుకుంది.

"బాబూ! నీ పేరేమిటి?" అన్నది, గోపీ ముద్దు ముద్దు మాటలు వినాలనే కోరికతో.

"నోపి" అన్నాడు.

"మరి అక్క పేరో?" అన్నది నవ్వుతూ.

"లాని."

సునంద నవ్వు ఆపుకోలేక పోయింది.

"వాళ్లన్నపే రడగండి!" అన్నది సీత కూడా నవ్వుతూ.

"నీకు అన్నపేరు తెలుసా?" అన్నది సునంద నవ్వాపుకుంటూ.

తెలుసన్నట్టు తల వూపాడు.

"ఏం పేరో చెప్పు చూద్దాం?"

"నాకు లాదు."

"అమ్మదొంగ! నువ్వు మంచి గోపీవి కదూ! చెప్పావంటే నీకు చాక్లెట్ ఇస్తాను" అన్నది, ముద్దుగా బుజ్జగిస్తూ.

"ఊలికేనే!" అన్నాడు నంగిగా.

"ఊలికేనా?" అని పగలబడి నవ్వింది సునంద. అంతలోనే నవ్వాపుకుని—"ఊరికే కాదమ్మా! నిజంగానే! వెంకన్నా! బాబుకి చాక్లెట్లు తీసుకురా!" అని ఇంటివేపు తిరిగి కేక పెట్టింది.

మరుక్షణంలోనే వెంకన్న చాక్లెట్ డబ్బా తెచ్చి ఇచ్చాడు. డబ్బా తెరిచి ఒక చాక్లెట్‌తీసి గోపీచేతి కందివ్వబోయింది సునంద. గోపీ ఒప్పుకోలేదు. డబ్బానే కావాలన్నాడు. ఇచ్చేసింది. చాక్లెట్లు చూడగానే వాళ్ళ నాన్న దగ్గరున్న రాణి, తల్లి దగ్గరున్న ప్రసన్నకుమార్ అందరూ సునంద దగ్గరికి చేరారు.

"చాక్లెట్లు అక్కకూ, అన్నకూ ఇవ్వవూ?" అన్నది సునంద.

గోపీయే డబ్బాలోంచి రెండు చాకెట్లుతీసి చెరొకటి ఇచ్చాడు.

"ఇప్పుడు చెప్పు, అన్న పేరేమిటో?" అన్నది సునంద.

"బతన్న" అన్నాడు గోపీ అతికష్టంమీద.

మళ్ళీ నవ్వొందుకుంది సునంద.

"బతన్నకాదు గోపీ! ప్రసన్నకుమార్ అనాలి" అన్నది రాణి చాక్లెట్ చప్పరిస్తూ.

* * *

బిగ్ ఫియట్ ఆగింది, ఒక్క ఊపుతో. ఆ ఊపుకు రాణి వాళ్ళ నాన్నని పట్టుకుంది, ముందుకి పడబోయి. ప్రసన్న వాళ్ల తల్లి ఒడిలో కూర్చున్నాడు. గోపీ మాత్రం సునంద ఒడిలో ఉన్నాడు. వాడామెను వదల్లేదు. ఆమె వాడ్ని వదల్లేదు.

అందరూ కారులోంచి దిగారు.

ఇసుకలో నడుస్తున్నారు.

"జనం మరీ ఎక్కువగా ఉన్నా రివాళ" అన్నది సునంద.

"ఏమండి! ఈ బీచ్, ముదురు నీలంరంగు చీరకి రంగురంగుల డిజైన్ వచ్చిన తెల్ల సరిగంచులా లేదూ?" అన్నది సీత భర్తతో.

"నీవు రచయిత్రివై వుండవలసింది. పొరబాటున నా పెళ్ళానివై పోయావు" అన్నాడు రావు.

"మీకంతా వేళాకోళమే!"

"వేళాకోళం కాదు. నేడు సాహిత్య సామ్రాజ్యాన్ని స్త్రీలే ఏలుతున్నారు" అన్నాడు రావు, రాణి చెయ్యి పట్టుకుని నడుస్తూ.

రాణి, ప్రసన్న ఇసుకలో నడుస్తూంటే, తనుగూడా వాళ్ళలాగే నడవాలని సునంద చేతులోనుంచి దిగాలని మారాం చేస్తున్నాడు గోపి.

"వద్దు గోపీ! ఇసుకలో నువ్వు నడవలేవు" అన్నది సునంద.

"లానీ....ఊఁ....బతన్న....నల త్తాలు. నేనూ నల త్తాను" అన్నాడు గోపి నంగినంగిగా రాగంతీస్తూ.

"అమ్మో! అమ్మో! ఉపన్యాసం దంచేస్తున్నావే! నడవరా బాబూ, నడువు!" అన్నది గోపీని క్రిందికి దింపుతూ సునంద.

"పట్టితే పట్టు అంతే! అప్పుడే వాళ్ళ నాన్నను మించిపోతున్నాడు" అన్నది సీత.

"నీలాగా మొండిపట్టు కాదుగదా!" అన్నాడు రావు కొంటెగా.

అందరూ నడుస్తున్నారు. సీత చుట్టూ కలయజూస్తూ నడుస్తోంది. ఆమెకంతా ఆశ్చర్యంగా ఉంది. కొనేవాళ్ళూ, తినేవాళ్ళూ, తిరిగేవాళ్ళూ, నవ్వేవాళ్ళూ, అమ్మేవాళ్ళూ, అరిచేవాళ్ళూ, పక్కవాళ్ళని కసురుకునే వాళ్ళు, గుంపుగా కూర్చుని కబుర్లాడుకునేవాళ్ళూ, ఖరీదైన బట్టల్లో అర్ధనగ్నంగా తమ అవయవాల సొంపులను ప్రదర్శించేవాళ్లూ, చిరిగిన బట్టల్లో అవయవాలను దాచడానికి తంటాలు పడేవాళ్లూ, మంచివాళ్లూ, మంచి తెలియని వాళ్ళూ, కూలీలు, గుమాస్తాలు, కుంటివాళ్ళు—అందరూ ఒక కప్పుక్రింద సోషలిజం కోసం ప్రాకులాడుతున్నట్టు—ఒకటే సందడి! సముద్రం ఒడ్డున ఎవరిదో పెళ్ళి జరుగుతున్నట్టు ఒకటే హడావిడి! ఎవరికీ తీరికలేదు.

"ఇక్కడ కూర్చుందాం" అంది సునంద.

"ఏం, కాళ్ళు నొప్పు లెట్టాయా?" అన్నాడు చంద్రం.

"మీకేం? పోక చెట్టులా వెళ్ళిపోతారు" అన్నది సునంద కొంటెగా.

"నీకు కొమ్మలూ, రెమ్మలూ ఉన్నాయేమిటి?" అన్నాడు ఎత్తిపొడుస్తూ చంద్రం.

"గోపీ నడవలేకున్నాడు."

"ఎత్తుకో."

"ఏడుస్తాడు."

ఆమెతో వాదులాడుతూనే చంద్రం కాలితో ఇసుక చదును చేసి కూర్చున్నాడు. అందరూ గుండ్రని ఆకారంలో కూర్చున్నారు.

"మా ఇల్లంతా చూశారు గదా! ఇప్పుడు చెప్పండి—మా ఇంట్లో మీకేం నచ్చిందో?" అన్నది సునంద, ప్రక్కన కూర్చున్న సీతకేసిచూస్తో.

"మీ ఇల్లు ఇంద్రభవనంలా ఉంది. ఇది నచ్చిందని ఎలా చెప్పడం?" అన్నది సీత, చిరునవ్వుతో.

"తప్పించుకునే మాట లివన్నీ. చెప్పేదాకా వదిలేదిలేదు," అన్నది సునంద పంతంతో.

"ఇల్లంతా నచ్చింది" అన్నది సీత బుడుంగున.

"ఇది మరీ బాగుంది" అన్నది సునంద నిష్ఠూరంగా.

"పోనీ, మీరు చెప్పండి?" అన్నది సీత, భర్తవేపు తిరిగి.

రావు ఏమీ మాట్లాడలేదు. మౌనంగా నవ్వుతో సీత మొహంలోకి చూస్తూ ఉండిపోయాడు.

ఇంతలో వేరుసెనగపప్పు అమ్మేవా డటువేపు వచ్చాడు. గోపీ వాడి వేపే ఆత్రంగా చూస్తున్నాడు. దాన్ని గమనించి సునంద పప్పులమ్మేవాడ్ని పిలిచింది. తలా ఒక పొట్లం ఇప్పించింది. తనూ ఒకటి తీసుకుంది. భర్తను డబ్బులు యివ్వమంది! రావు ఇవ్వడానికి జేబులో చెయ్యివేశాడు. చంద్రం అతన్ని వారించి తనేఇచ్చాడు.

"నిజానికి ముందు మీరు చెప్పాలి. తర్వాతే మేము" అన్నాడు రావు పప్పులు తింటూ.

"విపర్యయం కాకూడదా ఏమిటి?" అన్నాడు చంద్రం.

"కావచ్చు ననుకోండి. కానీ, ముందు మా యింటిని మీరు చూశారు. తర్వాత మీ యింటిని మేం చూశాం. విపర్యయానికి పోతే క్రమాలంకారం దెబ్బ తింటుంది."

"క్రమాలంకారాన్ని దెబ్బతీయడంలోనే ఉంది నావల్టీ!" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"సరే! అలాగే చెబుతాను. మీ యింట్లో నాకు నచ్చింది మల్లెపందిరి" అన్నాడు రావు.

"మేమూ అలాగే ఊహించాము, మీకు అదే నచ్చి ఉంటుందని!" అన్నది సునంద.

"ఇప్పుడు మీరు చెప్పాలి" అన్నాడు రావు చంద్రం వేపుచూసి.

"మీ శ్రీమతిగారు చెప్పాలి. ఆ తర్వాత మేము. మీ శ్రీమతికి గూడా అదే నచ్చి ఉంటుందనుకుంటాను," అన్నాడు చంద్రం.

"నేను చివర చెబుతాను" అన్నది సీత.

"పోనీ, సునందా! నువ్వు చెప్పు" అన్నాడు చంద్రం, సునంద వేపు చూస్తూ.

"మీకు మా ఇంట్లో మల్లె పందిరి నచ్చిందన్నారు. నాకు గూడా మీ ఇంట్లో మల్లి పందిరే నచ్చింది" అన్నది సునంద నవ్వుతూ.

"అదేమిటి? మా యింట్లో మల్లె పందిరెక్కడిది? మీరేదో గమ్మత్తు చేస్తున్నారు" అన్నది సీత అమాయికంగా.

"గమ్మత్తు కాదండి. నిజంగానే. ఈ పిల్లలే మీ ఇంట్లో మల్లెపందిరి లాంటివాళ్ళు. వీళ్ళు వాడని మల్లెపూలు. వీళ్ళ నవ్వులు చెరగని పరిమళాలు" అన్నది సునంద, తన ఒడిలో ఉన్న గోపీ పాలబుగ్గల్ని నిమురుతూ.

"మీ అభిప్రాయం చెప్పనేలేదు" అన్నాడు రావు, చంద్రంవేపు చూసి నవ్వుతూ.

"ఏముంది చెప్పడానికి? సునందతో డిటో" అన్నాడు చంద్రం.

"తేలిగ్గా తప్పుకున్నారు" అన్నాడు రావు నవ్వుతూ.

"ఆయనైనా ఫలానా అని చెప్పారు. మీ శ్రీమతిగా రసలు చివర చెబుతానని వాయిదా వేస్తున్నారు" అన్నది సునంద.

"చెప్పు సీతా! అందరూ అయ్యారుగా, నువ్వే మిగిలావు, నీకు నచ్చిందేదో చెప్పు" అన్నాడు రావు సీత వేపు తిరిగి.

గోపీ పప్పులు తినడం అయిపోయింది. సునంద ఒడిలోంచి లేచి సీత దగ్గరకు వచ్చాడు. సీత గోపీని అందుకుని దగ్గరికి తీసుకుంది. పప్పులు తినే తొందరలో మొహమంతా ఖరాబు చేసుకుని ఉన్నాడు.

"చెప్పరా?" అన్నది సునంద.

"చెప్పకపోతే వదులుతారా?"

"మరెందుకీ సస్పెన్సు?" అన్నది సునంద ఆలస్యాన్ని భరించలేక.

"మీ యిల్లు అంత శుభ్రంగా ఉందంటే దానికి మీ జాగ్రత్త కొంత కారణం. మీ జాగ్రత్తతోపాటు వరండాలో ఉన్న తివాచీ గూడ కొంత కారణం. ఇతర్ల శుభ్రతకోసం అంత అందమైన తివాచీ తన్ను మలినపరచు కొంటోంది. అది అలా మలినపరచుకోవడంలోనే దానికెంతో ఆనందం ఉందని గూడా అనుకుంటాను" అన్నది సీత, తన చీర చెరగుతో గోపీ మరకల ముఖాన్ని తుడుస్తూ.

"అంటే—మీ కా తివాచీ నచ్చిందన్నమాట!" అన్నది సునంద ఆశ్చర్యంగా.

రావు, సీతను తివాచీని చూచినట్లు చూశాడు, ఆ క్షణంలో.

ఆ రోజు ఆలస్యంగా నిద్ర లేచాడు రామదాసు. మనిషి ఆలస్యంగా నిద్ర లేవటానికి కారణం ఒకటే! రాత్రిపూట నిద్రలేక పోవడం! నిద్రలేక పోవడానికి కారణాలు మాత్రం రెండు రకాలుగా వుంటాయి. విషయలోలుడికి, బాధాపీడితుడికి రాత్రిపూట నిద్ర వుండదు.

రామదాసు ఎప్పటిలాగే ఆ రోజుకూడా ఆలస్యంగానే నిద్ర లేచాడు. కప్పుకొన్న చింకి దుప్పటిని పక్కకునెట్టి, బద్ధకంగా ఆవలించి, గ్రహచారం చాలక చేయి జాడించాడు. చేయి ఠకీమని గోడకు కొట్టుకుంది. బాధతో విల విల్లాడి పోయాడతను. 'కావలసిందే! ఇదేమన్నా మంత్రిగారి బసనా? జాగ్రత్తగా పడుకుని జాగ్రత్తగా లేవాలని తెలీదూ? ఒంట్లో భయం వుంటే యిలా చెయ్యి విసురుతావా? నీకు ఈ శాస్తి జరగాల్సిందే!' అంటూ తనని తాను చీవాట్లు వేసుకున్నాడు.

ఆ యిల్లు అతని పిత్రార్జితం కాదు. అసలు పిత్రార్జితంగానీ, స్వార్జితం గానీ అతనికి ఏదీ లేదు. అది అద్దెయిల్లు. అద్దె పాతిక రూపాయలు. అందుకే ఆ యింట్లో మరుగుదొడ్డి కూడా లేదు. వీధిలోని సైడుకాలువ పగటిపూట పిల్లలకు మరుగులేని దొడ్డిగాను, రాత్రిపూట ఆడవాళ్లకు మరుగుదొడ్డిగాను ఉపయోగపడుతున్నది. చెంబు చేతబట్టుకుని ఊరిబయట ఏట్లోకి వెళ్ళి రావడం తప్ప గత్యంతరం లేదు రామదాసుకు. సరాసరి ఏటికే వెడుతున్నవాడికి చెంబెందుకు అని ఎవరైనా అడగొచ్చు. ఏట్లో నీళ్లు ఒక ఋతువులో వుండొచ్చు, మరో ఋతువులో లేకపోవచ్చు. అన్ని ఋతువుల్లోనూ వుండేది ఇసకే!

చెంబు చేత బట్టుకుని వీధిలోకి వచ్చాడు, రామదాసు. తన కొడుకులు- ఆరేళ్ల అశోక్‌కుమార్, మూడేళ్ల భరత్‌కుమార్ నిక్కర్లు ఒళ్లో పెట్టుకుని కాలువ గట్టున కొలువుదీరి వున్నారు. వీధి కొళాయివద్ద అతని కూతురు పదేళ్ల పద్మశ్రీ నిలబడి వుంది. అటు వెడుతున్న తండ్రిని చూచి 'చిల్లి ముంత మనది' అంటూ కలువ పువ్వులా నవ్వింది. రామదాసు ఆగాడు. కొళాయిలో నీళ్లు రావడం యింకా ఆరంభం కాలేదు. డబ్బాలు, ముంతలు, బొక్కెనలు, చేటలు, చీపుళ్లు, కంచాలు—అన్నీ పాతవే, పనికిరానివే—అక్కడ క్యూలో వున్నాయి.

రామదాసుకు నవ్వు రాలేదు. అతను ఆలోచిస్తూ ముందుకు సాగాడు.... కొందరికేమో నీరు సరాసరి వాళ్ల యిళ్లలోకే వెడుతుంది. చాలమందికి వీధి

దాకా వచ్చి ఆగిపోతుంది. స్వయంవర మండపం యుద్ధరంగంగా మారడంలో ఆశ్చర్యం లేదు. యాదవకులంలో ముసలం పుట్టినట్లు—వీధుల్లో నీళ్ల కొళా యిలు పుట్టాయి. మానవ నాగరికత రాజ్యాలకోసం పోట్లాడుకోవడంతో ప్రారంభమై గాలికోసం, నీటికోసం పోట్లాడుకునే దాకా వచ్చింది.

రామదాసు నడుస్తూ నడుస్తూ సూర్యుడివైపు చూశాడు. టైం తెలుసు కోవటంకోసం గడియారాన్ని ఆశ్రయించే అలవాటు అతనికి లేదు. ఆకాశం అనే డయల్‌లో ముల్లులా తిరుగుతూ సూర్యభగవాను డున్నాడు.

"ఎనిమిదికి అయిదు నిమిషాలు అటో యిటో!" అంటూ చురుక్కున నవ్వాడు సూర్యుడు.

రామదాసు యింటికి తిరిగి వచ్చేసరికి కొళాయివద్ద దొమ్మీ జరుగు తున్నది. గంగాభవాని శివుడినెత్తిన దూకి, భగీరథుడివెంట పరుగులు తీసి నప్పటి వడీ, సవ్వడీ—అక్కడ రాజ్యం చేస్తున్నాయి.

ఇంటిగడపలో కాలుపెట్టిన రామదాసుకు పెళ్లాంగొంతు వినిపించింది : "ఈ వీధిలో మనం బతకలేము, మరోయిల్లు చూడమని నెత్తిన నోరు పెట్టు కుని మొత్తుకుంటున్నానా? నా మొరాలించే నాథుడుంటేనా? రాతుండి తగులు కొంటినమ్మా ఈ రోతమొగుణ్ణి!....ఏడుస్తా వెందుకే ఏబ్రాసీ? ఏ నూతిలోనో పడి చావక?...."

పద్మశ్రీ గోడవారగా నిలబడి కళ్లు నులుముకుంటూ ఏడుస్తోంది.

సావిత్రికి ఎప్పుడు ఎవరిమీద కోపం వచ్చినా మొగుణ్ణి, పిల్లల్ని ఆడి పోసుకుంటుంది.

"ఏమిటీ తుఫాను!" అన్నాడు రామదాసు.

నీళ్లకొళాయివద్ద పంచాయతీ మెంబరు పులిగోళ్ల ప్రతాపయ్య ధర్మ పత్ని కనకదుర్గ పద్మశ్రీ మూతిమీద పొడిచి, బురదలోకి నెట్టిందట! పద్మశ్రీ పాలబుగ్గ వాచిపోయింది. దాని పరికిణీ బురద గొట్టుకు పోయింది. "నా వెర్రి బాగుల కూతుర్ని వుత్త పుణ్యానికే ఏల పొడిచావే కనకదుర్గా?" అని అడి గింది సావిత్రి. "నా మొగుడు నా కోసం కట్టించిన కొళాయిదగ్గర నాకే అడ్డాలు పెడతారా, జిడ్డు ముండల్లారా! పొడుస్తానే! దిక్కులేని కోర్టులో దావా వేసుకో పోవే!" అంటూ సవాలు విసిరింది ఆ కలిగిన తల్లి.

కాలువిరిగిన ధర్మగోవులాంటి మూడు కాళ్ళ స్టూలును గోడకానించి కూర్చుని, కూతుర్ని దగ్గరకు పిలిచాడు రామదాసు. ఆమెను అక్కన చేర్చు కుని చెంప నిమిరాడు. దోరమాగిన తియ్యమామిడి పండులా ఆమె చెంప ఎర్రబారింది. 'నా తల్లి — నా కూతురు — నా ఇందిరాగాంధి బుగ్గ ఎలా కమిలి పోయిందో!' అంటూ వాపోయింది మనసు. అతనికి కోపం వచ్చింది. కనకదుర్గ బుగ్గమీద గాటుపెట్టి, ఆ నెత్తురుతో కూతురి బుగ్గమీద పట్టు వేయా లనిపించింది....తరువాత పర్యవసానం ఎలా వుంటుంది? పులిగోళ్ల ప్రతా పయ్య పంజా విప్పడూ? ఊళ్ళోని ప్రతాపులూ, కనకదుర్గలూ తనమీద నిప్పులు కురిపించరూ ?

గొర్రెకు కోపమొస్తే కసాయివాడికేమన్నా భయమా?....తన కోపాన్ని కరకరా నమిలి మింగేశాడు రామదాసు. కూతురి నుదురు ముద్దుపెట్టుకున్నాడు. .... నా మురిపాల కూతురా; నా అందాల రోజా! ఏడవకమ్మా, ఏడవకు. ఏడిస్తే నీ కళ్ళు నీలాలుగారు: కష్టాలు కలకాలం కాపురం వుండవమ్మా! నువ్వు సుఖపడతావు తల్లీ! నీకెందుకు దిగులు? పిచ్చిముండా! నువ్వు రాకుమారివి. ఏ మునివెధవ నిన్ను శపించాడో, నా కడుపున బుట్టావు. నీకు పదారేళ్లు నిండనీ, నీ పాలిటి శాపం తీరిపోతుంది. నీ చక్కదనానికి మురిసిపోయి ఏ రాకుమారుడో నీ కొంగుబట్టుకు తిరుగుతాడు. దేవతలు బొగిడే అంత వైభ వంగా నిన్ను పెళ్ళాడతాడు. అ తరవాత నీ మూతిమీద పొడవటానికి ఏ కనక దుర్గకూ గుండెలుండవు. కర్మచాలక అలా పొడిచింది పో, నీ మొగుడూరు కోడు. కత్తి ఝళిపించి దాని కావరం అణిచేస్తాడు. అంతవరకూ వోర్చుకో తల్లీ! ఆ పని నేను చేయలేను. నేను చేతగాని దద్దమ్మనని నీకు తెలియ దమ్మా, మీ అమ్మకు బాగా తెలుసు!....

పెద్దవాడు, చిన్నవాడు పోట్లాడుకుంటున్నారు. వాళ్ళిద్దరి నిక్కర్లకు బొత్తాములు లేవు. చిన్నవాడు తన పిన్ను పోగొట్టుకుని పెద్దవాడి పిన్నుకోసం పేచీ పెడుతున్నాడు. ఇద్దరి వీపులమీద దరువు వేసింది సావిత్రి. కాందిశీకుల మాదిరిగా పరుగెత్తుకొచ్చి రామదాసుమీద పడ్డారు వాళ్లు.

"ఒరే భరత్! నువ్వు చిన్నవాడివి. నిక్కరు తొడుక్కోకుంటేనే ముచ్చటగా వుంటావ్! పిన్ను అన్నకిచ్చేసెయ్యమ్మా!" అన్నాడు రామదాసు.

"ఊహూఁ!" అన్నాడు వాడు.

సూదీ దారం తెమ్మని పెద్దవాడి నిక్కరు వూడిపడకుండా కుట్టాడు రామదాసు. "తప్పని సరైనప్పుడే తెంపేయ్!" అని వో సలహాకూడా యిచ్చాడు.

పిన్ను నేలమీద పారేసి, కళ్ల ముందు పడుతున్న వుట్టు వెంట్రుకల్ని పైకి నెట్టుకుంటూ "నాక్కూడా అలా కుట్టు" అన్నాడు చిన్నవాడు. పద్మశ్రీ వంగి ఆ పిన్ను తీసుకుంది. మేకపోతు గడ్డంలా వేలాడుతున్న తన జాకెట్టును అదుపులోపెట్టి, తృప్తిగా నవ్వుకుంది.

ధర్మగోవు మీదినుంచి లేచాడు రామదాసు.

ఇవాళ సావిత్రి ధోరణి అతనికేమీ నచ్చలేదు. తనపట్ల ఆవిడ అసంతృప్తి ఆకాశానికి పెరిగిపోయిందనడానికి ఇక వేరే సాక్ష్యమే అక్కర్లేదు. అయినా తనలాంటి అప్రయోజకుడి పెళ్లానికి యింత తల బిరుసు వుండకూడదు. ప్రపంచంలో తనకు లోకువైన ఒకే ఒక వ్యక్తి తన పెళ్ళాం. తాను వూరుకోరాదు. ప్రతీకారం తీర్చుకోవాలి.

పళ్లపొడికోసం గూట్లో చెయ్యి పెట్టాడతను. పళ్లు రాలిపోయిన బోసినోరులా గూడు ఖాళీగా వుంది.

"పళ్లపొడి లేదూ?" అన్నాడు.

"ఒసే పద్మా! ముగ్గుపిండి కాస్త పట్టుకెళ్ళి యివ్వు!" అంది సావిత్రి.

దంతధావనానికి ఇరవై పైసల నంజన్‌గూడు పళ్లపొడి పొట్లం కొనుక్కురావడం రివాజు. అది లేకపోతే వీధిలో అమ్మే చవకరకం పొట్లాలైనా కొంటూనే వున్నారు. ఇవాళ అదీ కూడా లేదు.

"ఇందా నాన్నా, ముగ్గుపిండి!"

ముగ్గుపిండి!....అతని వొళ్ళు గగుర్పొడిచింది. ఇవేమన్నా దంతాలా? కడపరాళ్ళా?

"వొద్దమ్మా! బొగ్గుముక్క ఒకటి తెచ్చిపెట్టు."

బొగ్గుముక్కను కచా పచా నములుతూ పెళ్ళాం మీద బాణం ప్రయోగించాడు: "పెళ్ళికి ముందురోజులన్నీ టూత్‌బ్రష్‌లు, టూత్‌పేస్టులతోనే గడిచిపోయాయి. ఏ ముహూర్తంలో ఆ ముడి వేశానోగానీ, బతుకు బొగ్గుముక్కతో తెల్లారింది...."

అప్రమత్తుడైన సిపాయిలాంటి సావిత్రి ఎదురుకాల్పులు సాగించటానికి సిద్ధంగానే వుంది : "తా దూర సందులేదు, మెడకొక డోలట! నేను జేసుకోమన్నానా పెళ్ళి? నువ్వయినా పెళ్ళి కాకముందు చూశావు టూత్‌బ్రష్‌లూ, టూత్ పేస్టులూ!.... నేను పెళ్లికిముందూ వాడలేదు. పెళ్ళి చేసుకొని నేను మాత్రం ఏం బావుకున్నానని?"

పరమేశ్వరా! సహనానికి మారుపేరైన ఆడది సవాళ్ళకు దిగింది.

సావిత్రి మొగుణ్ణి ఎప్పుడూ ఏకవచనంతోనే సంబోధిస్తుంది. కొత్త పెళ్ళి కూతురుగా వున్న తొలి మూన్నాళ్లూ మాత్రం మర్యాదగా "మీరు" అని పిలిచింది. మూడోనాటి రాత్రి రామదాసు మోజుకొద్దీ పెళ్ళాన్ని వెంట బెట్టుకుని సినిమాకు వెళ్లి రిజర్వుడు సీట్లో కూర్చున్నాడు. కొంతసేపటికి వాళ్ళ బాస్ సతీసమేతంగా వచ్చి పక్కసీట్లో కూర్చున్నాడు. "గుడీవినింగ్" అంటూ లేచి నుంచున్నాడు రామదాసు. ప్రతి నమస్కారం చేసి బింకంగా వుండిపోయాడు బాస్. రామదాసు కూర్చోలేదు. బాస్ కూర్చోమనలేదు. సావిత్రి మొగుణ్ణి కూర్చోమని సైగ చేసింది. చొక్కాపట్టి లాగింది. తొడమీద గిల్లింది. లాభంలేక ఇంటర్వెల్‌లో ఇంటికి వెడదామంటూ పైకి లేచింది. ఇంటికి వెళ్లిన తరవాత బావురుమంది.

"ఏం చెయ్యమంటావు సావిత్రీ? బాస్ ఒక్కడే అయితే ఫరవాలేదు. వెంట అమ్మగా రున్నారుగా? అమ్మగారికి కోపంవస్తే అయ్యగారు మనిషి కాదనుకో! నన్నర్థం చేసుకోవూ? ప్లీజ్!" అంటూ బుజ్జగించాడు రామదాసు.

"అర్థం చేసుకోలేనంత తారకమంత్రం యిందులో ఏముంది గనక? పెళ్ళాం పరువు కాపాడలేని ఈ దిక్కుమాలిన ఉద్యోగం చెయ్యడంకంటే ఇల్లిల్లూ తిరిగి తిరిపె మెత్తుకోవటం నయం!" అంది సావిత్రి. ఆ క్షణంనుంచీ అతన్ని 'మీరు' అనటం మానేసిందామె.

....స్నానానికి నీళ్ళు చాలవు. ముఖం కడుక్కోగలిగితే అదే మహాభాగ్యం.

"పాపా! నబ్బుబిళ్ళ ఎక్కడమ్మా?"

"ఇంకా ఎక్కడుంది నబ్బు?" అంది సావిత్రి.

"బొ తిగా లేదా?"

"ఆ పిట్టగోడమీద ఎక్కడో అరిగిపోయిన గుడ్డలసోపు వుండాలి."

గోరంత గుడ్డలసోపు కనిపిస్తే, దానితో తన జిడ్డుముఖం రుద్దుకున్నాడు రామదాసు. ముఖం భగ భగ లాడింది.

"ఎప్పుడు పుస్తె కట్టానో, అప్పుడే పోయింది. నా సింథాల్ సబ్బు!" అన్నాడు.

ప్రతిధ్వనికంటే చురుగ్గా సమాధానం చెప్పింది సావిత్రి: "పుట్టింటి గడప ఎప్పుడు దాటానో, అప్పుడే పోయింది నా మైసూరు సాండల్ సబ్బు!"

రామదాసు నిజంగా సిగ్గుపడ్డాడు. ఈ సాధింపులు ఇక చాలు. మొగుడూ పెళ్లాలకూ కూడా మోటుసరసం మంచిదికాదు....ముఖప్రక్షాళనం పూర్తిచేసి, అతను దండెంమీద పాత చీరతో ముఖం తుడుచుకున్నాడు.

ఆ రోజు సెలవు. సెలవు దినాలన్నీ రామదాసు పాలిట దుర్దినాలు. అందుచేత అవంటే అతనికి ఇష్టంలేదు. సెలవురోజున ఆకలి ఎక్కువ. ఆలి పోరు ఎక్కువ. పిల్లలమీద చిరాకు ఎక్కువ. మనుషులు దూరంగా వున్నపుడే మనసులు దగ్గరగా వుంటాయి.

పద్మ అతనికి కాఫీ తెచ్చి యిచ్చింది. అతను రెండు మూడు గుక్కలు తాగి, "నా ముఖంలా వుంది...." అన్నాడు.

"వున్న కాఫీపొడి దులిపాను. నా ముఖంలా వుండమంటే ఎందుకుంటుంది?" అంది సావిత్రి.

"అదా సంగతి?...." అని కాఫీ త్రాగటం పూర్తి చేశాడతను.

దోసెడు అమృతం దక్కించుకో గలిగిన రాహు కేతువుల్లా—కాఫీ గ్లాసులు చేతబట్టుకుని సంబరపడిపోతున్నారు పిల్లలు.

....దౌర్భాగ్యపు వెధవలు! ఈ వయస్సులో వీళ్లు శ్రేష్ఠమైన ఆవుపాలు తాగాలి. పాలు సంపూర్ణాహారము! మనిషి శరీరాన్ని, మేధస్సును పెంచే అమోఘమైన పదార్థాలన్నీ అందులో వున్నాయి. ఐదారేండ్ల లోపున తగినంత పాలకు నోచుకోని పిల్లవాడు బౌద్ధికంగాను, శారీరకంగానూ పరిణతి చెంద లేడన్న విడ్డూరాన్ని ఏదో వ్యాసంలో చదివాడు రామదాసు. భరతఖండమ్మే చక్కని పాడియావు. రామదాసు పిల్లలకు మాత్రం పాలు లేవు.

చాప వేసుకుని మత్తుగా పడుకున్నా డతను.

....ఆ రోజు ఊళ్ళో ఏదో ఉత్సవం జరగబోతున్నది. సాయంకాలం తర్వాత పెద్ద వీధులన్నీ విద్యుద్దీపాలతో వెలిగిపోతూ, ఇంద్రుడి దర్బారులా వుంటాయి. వింతలు, వేడుకలు—చూడటానికి రెండు కళ్ళు చాలవు.

తిరణాలంటే ఆడవాళ్ళకు తగని వ్యామోహం. సావిత్రికూడా ఆడదే కదా! సాయంకాలం తిరణాలకు బయలుదేరా లంటుందా?....అనదు. తిరణాలకు కాదుగదా, పక్కింట్లో పెళ్ళికికూడా వెళ్ళదు. పెళ్లాం అంతరంగం రామదాసుకు బాగా తెలుసు. కన్న కలలన్నీ పగటికలలని తెలుసుకుని విసిగిపోయిన సావిత్రి నలిగిన చీరతో, మాసిన రవికతో ముస్తాబై నాలుగుగోడల బయట కనిపించటానికి సాహసించదు. తన చెవులకున్నని ఉమా రోల్డుగోల్డు కమ్మలని సాటి ఆడవాళ్ళకు తెలిసిపోవడం ఆమెకు ఇష్టంలేదు.

రామదాసు తల్లి మెడలో పగడాలదండ ఒకటి వుంది. అగ్గిపుల్లంత సైజులో వెండి గుబిలి గరిటె ఒకటి ఆ దండకు వేలాడుతూ వుంటుంది. ఆ గుబిలి గరిటె మినహా మరో విలువైన లోహంముక్క ఆ యింట్లో గాలించినా దొరకదు.

రెండు గంటలసేపు మాగన్నుగా నిద్రపోయి లేచాడు రామదాసు. పక్కింటి వెంకమ్మ వాకిట్లో తచ్చాడుతూ కనిపించింది.

"ఏం వెంకమ్మా" అంది సావిత్రి.

"మీ ఇంటాయన వున్నట్టున్నారే!....ఏం కూర జేశావు సావిత్రమ్మా?"

"ఇరంపరంలేని మొగుడు ఇంట్లో వున్నాడు, చవిసారం లేనికూర చట్టినిండా వుంది" అంటూ గొణిగింది సావిత్రి.

వెంకమ్మకు బ్రహ్మచెవుడు. "ఏదో ఒకటి...." అంటూ గిన్నె అందించిందామె.

కూర పుచ్చుకుని వెంకమ్మ వెళ్ళిపోయిన తరవాత రామదాసు భోజనానికి కూర్చున్నాడు. సావిత్రి అన్నం పెట్టింది. కూర వేసింది.

"నేను తినను...." అన్నాడు రామదాసు.

"ఎందుకూ?"

"నువ్వన్నమాట ఏమన్నా బాగుందా?"

"ఉన్నమాటంటే ఉలుకెందుకూ? అయినా ఆ వెంకమ్మకేం వినపడి చస్తుందని?...." అంటూ నవ్వింది సావిత్రి.

"నిన్ను కొట్టలేనంత మంచివాణ్ణనేగా నేనంటే నీకింత అలుసు?"

"ఆ మంచితనమేకదా నా బోడి బతుకులో పిసరంత భాగ్యం?........ ముందు అన్నం తిను. ఇదిగో చారు. మజ్జిగ లేదు. పిల్లలకు సరిపోయింది."

మొదటి ముద్ద నోటబెట్టుకున్నాడు రామదాసు. అన్నం మింగుడు పడకుండా అడ్డం వేసింది సావిత్రి: "రాత్రికి బియ్యం లేవు."

రాత్రికి బియ్యంలేవు—అంటూ అతనిలో వెయ్యి అంతరాత్మలు ఘోషించాయి. యాంత్రికంగా భోజనంచేసి లేచాడు. మనశ్శాంతి మాయమైన స్థితిలోనే మరో రెండు గంటలు గడిపాడు.

ఎండ యింకా చల్లబడలేదు. ఎదురింటి పిల్ల యింట్లోకి వచ్చింది. "అక్కా! మేం సినిమాకు వెడుతున్నాం. నువ్వుకూడా వస్తావేమో అడిగి రమ్మంది మా అమ్మ."

"వెడతావా సావిత్రీ?" అన్నాడు రామదాసు.

"చూచిన సినిమాేనేగా? మీరు వెళ్ళిరండి సుశీలా!" అంది సావిత్రి.

ఆ అమ్మాయి వెళ్ళిపోయిన తరవాత అతను పెళ్ళాన్ని అడిగాడు: "ఈ సినిమా ఎప్పుడు చూశావు నువ్వు?"

"నా ముఖం! నేనెప్పుడు చూశాను? ఆ అర్ధరూపాయి వుంటే ఏ కూరకో నారకో అవుతుంది. ఇలా ఇవ్వు!"

"ఏమిటి?"

"ఆ డబ్బు!"

"నా దగ్గరెక్కడుంది?"

"డబ్బిచ్చి సాగనంపేవాడిలా, వెడతావా సావిత్రీ అన్నావు గదా?...."

రామదాసు సమాధానం చెప్పలేదు.

"అన్నం లేకుంటే చచ్చిపోముగానీ, డంబం లేకుంటే బతకలేము గదా!" అంది సావిత్రి.

ఉతికిన బట్టలు తీసి, ఇస్త్రీ మడతలు విప్పాడు తను. ప్లాకు భుజం

మీద కాస్తా చిరిగిపోయి వుంది. సూది తీసుకుని చిరిగిన చోట్ల జాగ్రత్తగా కుట్టుకుని బట్టలు తొడుక్కున్నాడు. సావిత్రి చూడకుండా సంచీ తీసి పంట్లాం జేబులో దోపుకున్నాడు. ఆమె చూస్తే, అగ్నిసాక్షిగా పెండ్లాడిన తన మొగుడు బియ్యం తెస్తాడని కొండంత ఆశ పెట్టుకుంటుంది. బియ్యం లేకుండా వుత్త చేతులతో తిరిగివస్తే ఆ ఆశ వమ్ము అయిపోతుంది. ఆమె ఆశ నిరాశ కావడం అతనికి యిష్టం లేదు.

రామదాసు తల్లి ముసలిది. కనుక ఆమెకు నోట్లో పళ్ళులేవు. పళ్ళు లేవు కదా, తాంబూలం వేసుకోవడం మానెయ్యవచ్చుగదా? ఆమె యింకా బ్రతికున్నదంటే—ప్రపంచంలో వక్కలూ ఆకులూ వుండడమే అందుకు కారణం. తన బోసినోటికి వక్కలాకులు నలగవు. వాటిని దంచుకోటానికి పనికొచ్చే చిన్న ఇనప రోలు. రోకలి—ఆమెకు మొగుడిచ్చిపోయిన ఆస్తి.

....కొడుకు వీధిలోకి వెడుతున్నాడని గ్రహించి, మూలపడుకుని మూలుగుతున్న ముసలి నోరు విప్పింది: "ఉదయం నుంచీ పిచ్చెత్తినట్లుంది. అణా ఆకువక్కా పట్టుకు రారా!"

రామదాసు వీధివెంట పడ్డాడు.

బియ్యం కావాలి, బ్రతకటానికి అత్యవసరమైన వస్తువు. అది లేక పోతే—తన కాముకత్వం కారణంగా ఈ పాపపు నేలమీదికి వూడిపడ్డ తన పిల్లలు ముగ్గురూ పస్తు పడుకోవలసి వస్తుంది.

తనను పదినెలలు మోసి కని పెంచి యింతవాణ్ణి జేసిన తన తల్లి— తన దారిద్ర్యానికంతా మూలకారణమైన ముసలి ముండ—అణా వక్కలాకులు కావాలంది. అణా వక్కలాకులతో తన తల్లి ఋణం తీరిపోతుంది....వోసి ముసిల్దానా! నీ కిప్పుడు అణా ఎక్కడ దొరుకుతుంది? నీ కొడుక్కి జీతం రావటానికింకా ఏడు రోజులున్నాయని తెలీదూ?

రామదాసు కిరాణా కొట్లోకి వెళ్ళాడు. అక్కడ తనకు కాతా వున్నా, సరుకు దొరుకుతుందన్న ధైర్యం మాత్రం లేదు. ప్రతినెలా సావిత్రి వేసి యిచ్చే పట్టీ మేరకు పూర్తిగా సరుకులివ్వడు సెట్టి. ముప్పై శేర్ల బియ్యానికి ఇరవై శేర్లు చాలంటాడు. నూనె రెండువీశలా, ఒక వీశ సరిపోదూ అంటాడు.

మినప్పప్పెందుకూ అంటాడు. పొదుపుగా బ్రతకటం నేర్చుకోవాలంటాడు. మళ్ళీ జీతం వచ్చి బాకీ చెల్లించేవరకు సోలెడు బియ్యమైనా సరే యివ్వ నంటాడు. వస్తువులకు ధరలు కట్టినట్లే, తన బ్రతుక్కి కూడా విలువ కట్టే శాడు సెట్టి.

జేబులో సంచీ జేబులోనే వుంది. రామదాసు తల వేలాడేసుకుని కొట్టు దిగాడు....పచ్చనికోక కట్టుకున్న తెనుగుతల్లి ఒడిలో శేరు బియ్యం లేవా?

పొడవాటి రోడ్డు.రామదాసు ఆయుర్దాయం ఎంత పొడవో అంత పొడవు రోడ్డు. తాయిలం తింటూ వెక్కిరించే గడుగ్గాయిల్లా—రోడ్డు పొడుగునా దుకాణాలు! దుకాణాలు! దుకాణాలు! బియ్యం, పప్పు, ఉప్పు, మిరప కాయలు, చింతపండు, మూటలు మూటలు! రాసులు రాసులు! రాత్రికి తన బిడ్డలకు మెతుకు లేదు. అంగడిలో అన్నీ వున్నాయి, అల్లుడి నోట్లో శని! తాను సావిత్రి మొగుడు! వాళ్ళ నాన్నకు అల్లుడు!

రాఫిల్ టిక్కెట్లు అమ్మేకుర్రాడు వెంటబడ్డాడు. టిక్కెట్టు—రూపాయి రూపాయి పెట్టుబడితో లక్షరూపాయల రాబడి—ప్రతి భారతీయుడి లక్ష్యం! రూపాయికి తక్షణం అర్ధశేరు బియ్యం వస్తుంది. అదే రూపాయికి రేపు లక్ష రూపాయలు వచ్చినా రావచ్చు! ప్రస్తుతం రూపాయి లేదు. ఉంటే బియ్యం కొనుక్కోవచ్చు.

మెయిన్‌రోడ్డు జనసమూహంతో నిండిపోతోంది. వస్తున్న బస్సులో, పోతున్న బస్సులో గాలి చొరడం లేదు. కండక్టరు మాత్రం చార్జీలు వసూలు చేసుకోగలుగుతున్నాడు. హోటళ్ళలో తింటున్నవాళ్ళు తింటూ వుంటే, అంతకు రెట్టింపు మంది సీట్ల కోసం వేచి వున్నారు. హోటలు యజమాని చేతులు చిత్రమైన వేగంతో భరతనాట్యం అభినయిస్తున్నాయి. ఫైనాన్సు కార్పొరేషన్ల కుర్రవాళ్ళు వసూళ్ళ కోసం కొట్టు కొట్టుకూ తిరుగుతున్నారు. రోడ్ల కూడలిలో పిన్‌బోర్డు డేరాలో కరెన్సీనోటు పది మందికీ కొంగు పరు స్తున్నది. సినిమాహాలు ముందర జనం క్యూలో నిలబడే వోపికలేక టిక్కెట్లు కోసం కుమ్ములాడుకుంటుంటే, హాలు యజమాని 'శాంతి,శాంతి'అంటున్నాడు.

డబ్బు! డబ్బు! కప్పలన్నీ కలిపి బెకబెక లాడినట్లు, మనుషులందరూ మూక వుమ్మడిగా 'డబ్బు డబ్బు' అంటున్నారు. మనిషిలో మానవత్వం లేదు.

వివేకం లేదు. కారుణ్యం లేదు. మైత్రీభావం లేదు. మనిషి తొడుగులో ధన పిశాచి పరకాయ ప్రవేశం చేసింది. మనిషికి డబ్బు కావాలి! రామదాసు పెళ్లాం పిల్లలు తిన్నారో లేదో ఎవరిక్కావాలి?

ఊరి బయట గుట్టవారి గుండుమీద కూర్చుని, ఊళ్ళో వెలిగిన విద్యు ద్దీపాలను చూస్తూ చాలాసేపు గడిపాడు రామదాసు. కాళ్ళీడ్చుకుంటూ మళ్ళీ ఊళ్ళోకి నడిచాడు. ఇంటికి వెళ్ళటానికి మనస్కరించలేదు. తిరణాల సంద డితో, సంబరాలతో మెయిన్‌రోడ్డు కిటకిట లాడుతున్నది. రాజుగారి ఉంపుడు గత్తెను చూచి నిట్టూర్చే బికారివాడిలా ఖాళీ జేబులతో, ఖాళీ సంచితో రోడ్లంతా తిరిగాడు రామదాసు.

....పక్షి వాహనారూఢుడై స్వామి వేంచేస్తున్నాడు. బోయీలు పల్లకి మోస్తున్నారు. వందిజనులు కీర్తిస్తున్నారు. దివిటీల వాళ్ళు! వింజామరముల వాళ్ళు! గాయకులు! నర్తకులు! స్వామివారి వైభవాన్ని చూడటానికి రెండు కళ్ళూ చాలవు.

స్వామికి ప్రతినిత్యం జరిగే పూజావిధులు వింటే, పాత ప్రభువుల వారసులకైనా పళ్ళు పుల్లనై పోవాల్సిందే! స్వామిని నిద్రలేపటానికి వేకువనే మేలుకొలుపులు పాడాలి. వారిని పన్నీటితో జలకమాడించి, పట్టు పీతాంబర ములు కట్టబెట్టించి, మణిమయ భూషణములు తొడగాలి. సహస్ర నామార్చన చెయ్యాలి. తరవాత స్వామి నైవేద్యం స్వీకరిస్తాడు. నేయి, ద్రాక్ష, జీడిపప్పు, బాదంపప్పు, ఏలకులు, చీనీ చక్కెర మొదలైన పదార్థాలను కలగలిపి ప్రత్యే కంగా తయారుచేసే నైవేద్యం అది. స్వామికి పచ్చకర్పూరపు విడెమే కావాలి. వారి దర్శనార్థం రోజూ వేలకొద్దీ ఆశ్రితులు అయన వాకిట పడిగాపులుంటారు. అలా ఆయన కోసం వెళ్ళినవారు వృత్తచేతులతో వెళ్ళరు. ఆయన పాద పద్మాలమీద ఘనమైన కానుకలుంచి వస్తారు.

స్వామివారి వినోదాలు యింకా చాలానే వున్నాయి. ఆయన తన దేవే రులతో విహరిస్తాడు. తూగుటూయలలెక్కి వూగుతాడు. రోజుకొక వాహనం అధిరోహించి సేవలందు కుంటాడు. నిద్ర రాకపోతే, జోల పాడమంటాడు.

ఇలా జనం మధ్యకు రావడం మాత్రం ఏ ఏడాదికోగానీ జరగదు. అలా వచ్చిన స్వామిని చూడటం కోసం నేల నాలుగు చెరగుల నుండి జనం

వస్తారు. స్వామికి పూలదండలు వేస్తారు. కర్పూరహారతి పడతారు. కొబ్బరి కాయలు కొడతారు. చేతులు జోడించి 'నువ్వే రక్షించాలి తండ్రీ!' అంటారు. స్వామి నేలమీద కాలు పెట్టకనే, నేలమీది జనాన్ని నవ్వుతూ పలకరించిపోతాడు.

రోడ్డు పొడుగునా జనం పూలు, పళ్ళు, కొబ్బరికాయలు పట్టుకుని నుంచునున్నారు. అందరి పూజలూ చిరునవ్వుతో అందుకుంటూ మెల్లగా సాగివస్తున్నాడు స్వామి.

రోడ్డువార మూడు కార్లు ఆగి వున్నాయి. మూడుకార్ల వద్ద ముగ్గురు పెద్దమనుషులు నిలబడి వున్నారు. ఒకాయన పేరు పరశురాములు. ఆయన గొప్ప పారిశ్రామిక వేత్త. స్వామి తేరు ఆపమన్నట్లుగా బోయీలకు సైగ చేసి, పరశురాముల్ని చూపి కన్నెగరేశాడు. పరశురాములు చేతిలోని పెద్ద పూలమాలను స్వామి మెడలో వేసి నమస్కరించాడు.

"కులాసా?" అంటూ చిరునవ్వుతో పరామర్శించాడు స్వామి.

"తమ చలవ వల్ల లాస్ లేదు. కులాసానే!"

"ఏమి నీ కోరిక?"

"మరో నాలుగు లైసెన్సు లిప్పిస్తే...ముడుపు చెల్లించుకుంటాను...."

"మరిచిపోను....ఘా మంతిరికేశీ!" అంటూ ముందుకు కదిలి, రెండో మనిషి దగ్గర ఆగాడు స్వామి.

ఆయన పేరు భూపతి. వెయ్యి ఎకరాలు మాత్రమే వున్న ఒక్క రైతు.

"స్వామీ! నేను గుర్తున్నానా?" అన్నాడు భూపతి.

అతను వేసిన పూలదండను సర్దుకుంటూ "మరిచి పోలేదులే!....ఏమి నీ కోరిక?" అన్నాడు స్వామి.

"కాలవగట్టున వందెకరాల బంజరు భూమివుంది కదా! నన్ను నమ్ముకున్న అలగా జనం ఆ భూమి సాగుచేసుకుంటూ, నా మోచేతి నీళ్ళు తాగి బతుకుతున్నారు, పాపం! ఆ ముక్క కాస్తా వాళ్ళ పేరున పట్టా యిప్పించు స్వామి! మనవాళ్ళేలే! ఏదో యింత గంజి తాగుతూ నా దగ్గరే పడుంటారు. అది మరొకడి పాలబడితే, మా వాళ్ళు నాస్తికపు ముండాకొడుకులై పోగలరు! నీ గుళ్ళ గోపురాల్లో దీపం కూడా వెలగదు...."

"జ్ఞాపకం వుంచుకుంటానే్లే!....ఝా మంతిరికేళీ!...." అంటూ స్వామి ముందుకు కదిలి, మూడో మనిషిని చూచి గతుక్కుమన్నాడు. అతని పేరు మంత్రిగారి మల్లన్న. ఇంత లావు మీసాలు, ఇంత పొడుగు కల్లీ జుబ్బా! అతని పేరు వింటే ఉయ్యాలలో పాప కూడా ఉలికి పడుతుంది.

కెకెకెకే అని కర్కశంగా నవ్వాడు మల్లన్న. "నన్నెంతకాలం యిట్లా పడుండ మంటావ్ సామీ?....నేనేం ఒకేసారి మంత్రినై పోవాలంటున్నానా? కడుపులో నల్ల కదలకుండా బతకటానికి చిన్న పదవేదన్నా యిట్లా పారెయ్ రాదూ?....నే నెక్కడికి బోయినా, నువ్వు బెట్టిన మణిసినని జెప్పుకుంటాను గదా!"

ముక్కు గోక్కుంటున్నట్టుగా నటిస్తూ, ముక్కు మూసుకున్నాడు స్వామి.

"ముందు నీ పనే!....ఝా మంతిరికేళీ!"

ఎక్కడ పదవులు ఖాళీగా వున్నాయో ఆలోచిస్తూ ముందుకు సాగాడు స్వామి. ఇంతలో ఆ వూళ్ళో పినిమాతార ఊర్వశి వచ్చిందన్నారెవరో. స్వామి చుట్టూ తొక్కిసలాడుతున్న జనమంతా 'ఎక్కడ? ఎక్కడ' అన్నారు. అప్పటికే ఊర్వశి అల్లంత దూరంలో కారు ఆపి, స్వామి వైపుగా నడిచి వస్తోంది. స్వామి సన్నిధిలో ఒక్క భక్తుడూ లేడు. అందరూ ఆమె చుట్టూ మూగారు. స్వామి ముఖం చిన్నబోయింది. అయినా తాను నొచ్చుకోనట్లే నటించాడు.

ఊర్వశి స్వామి సన్నిధికి వచ్చి సమ్మోహనకరంగా నిలబడి అభివాదం చేసింది. స్వామి తీవిని ఒలకబోస్తూ "వర్తమానమైనా లేకుండా ఏమిటీ ఈ రాక? నాతో అవసరమా?" అన్నాడు. ఆమెను తదేకంగా చూస్తూ పిచ్చి నవ్వులు నవ్వసాగాడు. అతని స్వరం ఎంతో మార్దవంగా వుందిప్పుడు.

"మీ కోసమే పనిగట్టుకుని వచ్చాను," అంటూ బెంగగా బుంగమూతి పెట్టింది తార.

"మళ్ళీ ఏం వచ్చిపడింది?"

"ఇంటిమీద సి.ఐ డి. లు వచ్చిపడ్డారు. ఇరవై లక్షల నల్లడబ్బు పట్టుకు పోయారు. మీరు కలగజేసుకుని నా పరువు కాపాడవలెను. నా డబ్బు యిప్పించవలెను. లేకున్న నేనలిగెదను."

"వద్దు వద్దు! చెట్టంతవాణ్ణి నేనున్నానుగా? దిగులెందుకు? ఊ మంతరికేళీ!"

"ధన్యురాలను!" అంది ఊర్వశి. మోయ లేక మోసి తెచ్చిన పూల మాలను స్వామికి వేసింది. చెంపకు గంధం రాచింది. చక్కిలిగింతలు పెట్టి నట్లుగా నవ్వాడు స్వామి.

"మరి నాకు సెలవా?"

ఆమెకు సెలవిప్పించటానికి స్వామికి మనసు రాలేదేమో—మౌనంగా వుండిపోయాడు. తార కారెక్కి తార్రోడ్డు మీద తుర్రుమంది.

స్వామి ముఖం పూలమాలల్లో పూర్తిగా కప్పుకుపోయింది.

రామదాసు రోడ్డుకు అడ్డంగా సాగిలబడిపోయాడు. బోయీలు అతన్ని తొక్కినంత పనిజేసి ఆగిపోయారు.

"ఎవరదీ?" అన్నాడు స్వామి.

"నేనే తండ్రీ!"

"నేనంటే?....చూస్తున్నావుగా? తలమునగ పూలమాలలు! కళ్ళు కని పించవు. చెవులు వినిపించవు. బిగ్గరగా మాట్లాడు."

రామదాసు గొంతు సవరించుకున్నాడు.

"నీ రామదాసుణ్ణి!"

"ఎవడివో! ఎందరు లేరు రామదాసులు?....ఫలం, పుష్పం, పత్రం.... పట్టుకొచ్చావా?"

"మన్నించాలి! కాళీ జేబులు, కాళీ సంచి!"

"వుత్త చేతుల్తో వచ్చావా? అఘోరించావులే! ఊఁ! అవతల పనుంది ....ఏమి నీ ఏడుపు?" స్వామి కంఠంలోకి కొండంత గాంభీర్యం వచ్చేసింది.

"నా పెళ్లాం పిల్లలు ఈ పూట పస్తున్నారు...."

"పస్తుండడం ఎందుకూ? తింటే పోలే?"

"బియ్యం నిండుకున్నాయి...."

"బియ్యం నిండుకుంటే కొనుక్కోవాలమ్మా?"

"డబ్బు లేదా!" అంటూ ముక్కున వేలేసుకున్నాడు స్వామి....

"హన్నా! తాగిన రొమ్ముకే గుద్దటమంటే యిదే కదా! నీ కొచ్చే జీతమంతా ఏ వంకలో గలిపినట్టు?!"

"అదే నాకూ అర్థం కావటం లేదు స్వామీ! మూడు వారాలు తింటాం. చివరి వారం ఉసూరుమంటాం. జీవితానికి తగ్గట్టుగా ధరలు తగ్గటమో, ధరలకు తగ్గట్టుగా జీతాలు పెరగటమో జరిగితే తప్ప...."

"ఆగాగాగాగు! అలా అనుకోవడం తప్పు! ఆడలేనమ్మ మద్దెలమీద నెపం వేసినట్టు నీ కర్మకు ఎవరు కర్తలు? ఆశకు అంతెక్కడ? తృప్తికి మించిన దర్జా లేదు కదా? పొదుపుగా బ్రతకాలి. ఆడంబరాలు వదిలేయ్. తలకు మించిన అప్పులు చెయ్యకు. నీ ముఖానికి స్నోలు, పౌడర్లు ఎందుకు? టూత్ పేస్టులు, టూత్ బ్రష్‌లు లేకపోతే నీ పళ్ళు రాలిపోతాయా? బీడీలు సిగరెట్లతో కడుపు నిండుతుందా? సినిమాలు చూస్తే ఆకలి తీరుతుందా? మానం కాపాడుకోవటానికి టెర్లిన్ బట్టలే కావాలా? రేడియోలు, టెలివిజన్లూ నీకెందుకయ్యా? మద్యపానం, మాంసాహారం మానుకోరాదా?....ఈ దండగ ఖర్చులన్నీ మానేస్తే, మహారాజులా బతకొచ్చునే! చేతగాకపోతే సరి!.... తప్పుకో, తప్పుకో." అంటుకు పోతున్న కొంపల్ని ఆర్పబోతున్న వాడిలా తొందర తొందరగా వెళ్ళిపోయాడు స్వామి.

రామదాసుకు పువ్వులమీద నమిలి మింగేదా మన్నంత కోపం వచ్చింది. అవి స్వామి కళ్ళకు గంతలు కట్టాయి. చెవులకు బిరడాలు వేసాయి.

స్వామిమీద జాలి వేసిం దతనికి.

అప్పటికి అర్ధరాత్రి అయింది. రామదాసు ఆవలించాడు. అతనికి నిద్రవస్తోంది కనుక ఇంటికి వెళ్ళక తప్పదు! నంచిలో బియ్యం లేకున్నా సరే, మనసులో శాంతి లేకున్నా సరే — ఈ విశాల ప్రపంచంలో తన పెళ్లాం పిల్లలు ఎక్కడున్నారో అక్కడికే వెళ్లాలి.

తాను ఏ యింట్లో అద్దెకున్నాడో ఆ యింటికి వెళ్లాడు రామదాసు. సావిత్రి లేచి వచ్చి తలుపు తీసింది. అతను లోపలికి వెళ్లాడు. పిల్లలు, ముసలావిడ ప్రశాంతంగా నిద్రపోతున్నారు. ఆ ప్రశాంతత అతనికి భయంకరంగా కనిపించింది. కడుపు తరుక్కుపోగా, జేబులోని సంచీతీసి నేలమీద విసిరి

కొట్టాడు. గోడ వారనున్న తన కుంటికాళ్ళ ధర్మగోవుమీద కూర్చున్నాడు. ముఖం అరచేతుల్లో వేలాడేశాడు.

"ఇంత రాత్రిదాకా ఎక్కడున్నావు?" అంది సావిత్రి.

అతడు పెళ్లాం ముఖంలోకి చూశాడు. ఆ చూపుల్లో ఏదో చెప్పలేని బాధ! "స్వామికి మనమీద దయలేదు సావిత్రీ! ధరలు పెరిగిపోతూనే వున్నాయి స్వామీ, జీతం చాలటం లేదు అన్నాను. నన్ను కొట్టాలి చెప్పతో. స్వామి ఏమన్నారో తెలుసా? మింగ మెతుకుంటే చాలదా, మీసాలకు సంపెంగ నూనెందుకు—అన్నాడు. ఎవర్ని? నన్ను. టూత్ బ్రష్‌లు, టూత్ పేస్టులు, స్నోలు, పౌడర్లు, సిగరెట్లు, సినిమాలు, దర్జాలు, దండగ ఖర్చులు మానుకో నంతవరకు మనం హాయిగా బతకలేమట! ఆడంబరం తగదట! వున్నదాంతో తృప్తిపడాలట!...విన్నావా?"

సావిత్రి ముఖం నల్లబడింది. "స్వామి అంటే ఎవరు?"అని అడిగింది.

"అందరూ మోస్తుంటే, తాను అందలంలో కూర్చునేవాడు."

"ఆ పుణ్యాత్ముడేనా?" అందామె, గోడమీదున్న క్యాలెండరులోని మహావిష్ణువును ఉద్దేశించి.

"ఆ దీనబాంధవుడే!"

" 'సేద్యగాడికి కూడానా మగబిడ్డ' అంటూ చిందులు తొక్కాడట వెనకటి కెవడో! బ్రహ్మ ఆలితాడు బండరేవున తెగ!.........ఆయన పెళ్ళాని కెందుకటా మోపెడు నగలు?"

"తప్పు సావిత్రీ! జగద్రక్షకుడు!"

"వాడా జగద్రక్షకుడు? నువ్వే దేవుడంటే నూకలే బత్తెం పొమ్మనే వాడా జగద్రక్షకుడు?....కుచేలుడి కొంగు విప్పుకొని అటుకులు తిన్నాడు చూడూ, వాడూ జగద్రక్షకుడు!"

"వాడి లీలలు మనకే మర్థమవుతాయి లేవే! తలుపు వేసేయ్. పడు కుందాం."

"అన్నం తినవూ?"

ఆ అమృతవాక్కుతో రామదాసు రుగ్మతలన్నీ మాయమైపోయాయి. అతనికి ఏనుగంత బలం వచ్చింది. ఆ బలంతో తన అల్ప సంతోషం బయట

పడకుండా అదిమిపడుతూ "ఆకలి కావటం లేదు....మీరంతా తిన్నారా?" అన్నాడు.

"అందరం తిన్నాం. బట్టలు విడిచేసిరా!" అంటూ సావిత్రి వంట గదిలోకి వెళ్ళింది.

రామదాసు మౌనంగా అన్నం తిన్నాడు. బియ్యం ఎక్కడివి? అన్నం తింటూ ఆ మాట అడగటానికి అతనికి సిగ్గు వేసింది. ఎంత చెడ్డా, మగవాడు కదా? అడగలేకపోయాడు. చెయ్యి కడుక్కుని వెళ్ళి, చాపమీద మేను వాల్చాడు.

సావిత్రి వంట గది సర్ది వచ్చి, పక్కన పడుకుంది. అతను తల గడలో ముఖం దాచుకొని "బియ్యం లేవన్నావే?" అన్నాడు.

"కనకదుర్గమ్మ దగ్గర పట్టుచీర తాకట్టు పెట్టి పది రూపాయలు పుచ్చుకున్నాను."

సావిత్రికి వున్న ఒకే ఒక పట్టుచీర! పెళ్ళినాటి పట్టుచీర! ప్రియమైన పట్టుచీర! పెట్టె దాటని పట్టుచీర! దాన్ని కనకదుర్గ ఎన్ని హింసలు పెడుతుందో, పాపం!

"ముసలావిడకు వక్కా ఆకూ..."

"....నోట్లో నానుతూ వుంటుంది!"

ఐదు నిమిషాల తరవాత తలగడలోంచి ముఖం తప్పించి, పెళ్ళాం వైపు చూశాడు రామదాసు. ఆమె కళ్ళు మూసుకుని వెల్లకిలా పడుకుని వుంది. జారిన పైటను తీసి ఆమె గుండెలమీద సర్దాడతను. వంగి ఆమె పెదవులమీద ముద్దు పెట్టుకున్నాడు. సావిత్రి కళ్ళు విచ్చుకోలేదు. ఆమె పెదవులమీద చిరునవ్వు మెరిసి, చెంపలమీదికి ప్రాకింది.

ఆ నవ్వు చూచి రామదాసు కళ్ళు చెమర్చాయి....పిచ్చిదానా! నీ కెందుకులే మరి పట్టుచీర!

---

సెషన్సు కోర్టులో సుబ్బయ్య హత్యానేరం విచారణ జరుగుతోంది. ముద్దాయి సుబ్బయ్య కొడుకు రామకృష్ణ. రామకృష్ణ క్రొత్తగా పెట్టిన కాలేజీలో జవాను.

మూడేళ్ళ వయస్సులో తల్లిని పోగొట్టుకొన్న రామకృష్ణను తానే తల్లీ తండ్రీ అయి పెంచాడు సుబ్బయ్య. ఫిఫ్తుఫారం దాకా చదివించాడు. తరువాత పెళ్ళి చేశాడు. పెళ్ళి చేశాక కూడా సుబ్బయ్య బాధ్యత తీరిపోయిందని చేతులు దులుపుకోలేదు. చదువుకున్నవాడై యిటు కూలిపనీ చెయ్యలేక, అటు ఉద్యోగమూ దొరక్క వుండిపోయిన కొడుకుని పదేళ్ళపాటు కూర్చోబెట్టి పోషించాడు. తరువాత రామకృష్ణకు ఉద్యోగం దొరికింది, కాలేజీలో జవానుగా. సుబ్బయ్య ముసలివాడై పోయాడు. వృద్ధాప్యంతో నిష్ప్రయోజకుడైన తండ్రిని, యింతకు ముందు తన కోసం ఎంతో కష్టపడ్డాడన్న విషయం విస్మరించి, కోపంతో తల గోడకు వేసి పగులకొట్టి చంపాడు రామకృష్ణ. ఈ విషయం రామకృష్ణ భార్య మొదట్లో పోలీసుల కిచ్చిన స్టేట్‌మెంట్‌లో స్పష్టంగా వుంది. ఇరుగుపొరుగు వారి సాక్ష్యమూ వుంది. ఇటువంటి కృతఘ్నుణ్ణి, పరమ కిరాతకుణ్ణి ఏం చేసినా పాపంలేదు. ఉరిశిక్ష ఒక్కటే వీడికి తగిన శిక్ష. ఇటువంటి రాక్షసుల్ని సంఘంలో నుంచీ వేరుపురుగుల మాదిరి ఏరివేసి నాశనం చెయ్యాలి- ఇదీ ప్రాసిక్యూషన్ వారి వాదన.

సుబ్బయ్య తాగుబోతు. అన్ని వ్యసనాలూ వున్నవాడు. చిన్నప్పటి నుండీ రామకృష్ణను తల్లీదండ్రీ తానేయై పెంచాడనేది సర్వాబద్ధం. మేనత్త నాగమ్మ యింట్లో యింత తిండి తిని, యింటికి వెళ్ళగానే తాగివున్న తండ్రి ఏ మిష మీదనో చితక తంతాడనేది తథ్యం గనుక, భయపడుతూనే విధిలేక యిల్లనే నరకంలో ప్రవేశించి తన్నులు తింటూ పెద్దయినవాడు రామకృష్ణ! విధి చేత చాల చిన్నచూపు చూడబడిన అభాగ్యుడు. ఏ విధమైన అపేక్షనూ ఆప్యాయతనూ ఎరుగక లోకంలో వుండేది తిట్లూ దెబ్బలూ మాత్రమేననే అనుభవంతో పెరిగినవాడు. ఎప్పుడూ ఎవరికీ ఎదురు మాట చెప్పడు. అందరూ ఎదురుగానూ చాటుగానూ 'మందమతి' అని వ్యవహరిస్తుంటారు. మూడో క్లాసు చదువుతున్నవాడి దగ్గర్నుండీ చదువు సంధ్యా లేక రోడ్ల మీద తిరిగే రౌడీలవరకూ అందరికీ రామకృష్ణంటే ఎగతాళే! పత్తిమొద్దు, మూర్ఖుడు. ప్రిన్సిపాలుగారూ, లెక్చరరుగారూ రామకృష్ణ తప్పు చేసినప్పుడు 'మొద్దూ' అనీ

'స్టుపిడ్' అనీ పిలిచి తిడుతుంటారు. దేనికీ ఎవరికీ ఎదురు మాటనేది చెప్పడు. ఎవరేమన్నా అది తనకు తగినదేనన్నట్లుగా ఉదాసీనంగా వుంటాడు. తనతో పాటుగా చేరిన జవాన్లు ఏడో క్లాసు పాసయిన వాళ్ళు ఎటెండర్లుగా ముందుగా ప్రమోషన్ తెచ్చుకుంటే పదో క్లాసు చదివిన రామకృష్ణ యిదేమని అడగలేదు. ఇంత ప్రపంచంలోనూ అట్టడుగుకు తొక్కి-వేయబడి నిర్దాక్షిణ్యంగా నలిపి వేయబడటం, తనకు విధి నిర్దేశించిన సహజమైన పాత్ర అని మనసులో గట్టిగా నాటుకుపోయిన రామకృష్ణ, తండ్రికి ఎదురు తిరిగి త్రోసి చంపాడనేది నమ్మతగిందిగా లేదు. సుబ్బయ్యే తాగివచ్చి మైకంలో తూలి గోడకు తలకొట్టు కున్నాడు. ప్రాసిక్యూషన్ కథనం వట్టి కల్పితం. పోలీసులు అమాయకురా లైన రామకృష్ణ భార్యను బెదిరించి భయపెట్టి ఆ స్టేట్‌మెంట్ తీసుకున్నారు. తరువాత ఆమే నిజమైన రెండో స్టేట్‌మెంట్ యిచ్చింది. కాస్త ఆలోచన వున్న ఏ మానవుడూ నమ్మలేని యీ బూటకపు కేసును మేధావులు న్యాయ మూర్తులైన శ్రీ జడ్జిగారు కొట్టివేస్తారని నమ్ముతున్నామన్నారు డిఫెన్సు తరపు న్యాయవాదులు.

స్తబ్ధంగా బోనులో నిలబడి వున్న రామకృష్ణ మనసులో ఆలోచనలన్నీ కలగా పులగంగా వున్నాయి. తనేం చేశాడో, నేరం చేశాడో లేదో ఏమీ అర్థం కావటంలేదు. ఆలోచనలు ఏ విధంగానూ ముందుకు సాగక, గజిబిజిగా చిక్కు-పడి, శిక్ష పడుతుందేమోనన్న భయం భీకరమైన సుడిగుండం కాగా, ఆ గుండంలో సుళ్ళు తిరుగుతున్నాయి. ఇంత అలజడిలోనూ ఒకే ఒక భావం స్పష్టంగా వుంది. అది ఎట్లైనా యీ శిక్ష తప్పిపోవాలనే గొప్ప ఆరాటం.

ఇప్పుడు స్పష్టంగా మరింత గాఢంగా వున్నదన్నమాటేగాని యీ అల జడి ఆరాటం రామకృష్ణకు సుపరిచితాలే. పెన్సిల్ పోయింది. ఎక్కడో జారి పోయింది, జేబు చిరుగులోంచి. 'చిరుగుజేబులో ఎట్లా వేసుకున్నావురా, వెధవా! మొద్దు వెధవ్వి, చేతిలోనించే జారవిడిచి వుంటావు. రోజుకో పెన్సిల్ తేవటా నికి సొమ్ము పోగుపోసుకొని కూర్చున్నానా? ఆ నాగి పట్టునగాని లేకుంటే నీలాంటి మందమతి వెధవకు చదువెందుకు, దండగ.' ఎర్రటి కళ్ళతో తనమీద విరిగిపడుతూ వున్న పెద్ద పర్వతం లాగా నాయన చెయ్యెత్తి నిల్చున్నాడు. ఈ దెబ్బ తప్పితే, ఎవరైనా వస్తే, చెయ్యి తూలి పక్కకు పడితే- కాని తప్పదు!

యింకా మీద పడలేదు, ఎప్పుడు పడుతుంది? పడుతూ వుందా! ఇది తప్పదు!— అనాడూ యిదే ఆరాటం.

రామకృష్ణ హైస్కూల్లో అడుగుపెట్టాడు. అప్పుడు ప్రసాదరావు, యిప్పుడు జడ్జిగా కూర్చునివున్న ప్రసాదరావు- మూడురోజుల జ్వరం వలన బడికి రాక ఆ మొత్తం నోట్సు రాసుకుంటూ కూర్చున్నాడు బడి అయ్యాక. ప్రసాదరావు పెన్నులో సిరా అయిపోయింది. రామకృష్ణ పాత చొక్కా-జేబు లోంచి మేనత్త నాగమ్మ కొత్తగా కొనిచ్చిన పెన్ను గర్వంగా మెరుస్తోంది. దాన్ని అడిగి తీసుకుని రాసుకుంటున్నాడు ప్రసాదరావు. చీకటి పడుతోంది. రామకృష్ణ పెన్నుకోసం అట్లాగే కూర్చొని వున్నాడు. 'నీ పెన్ను బాగా రాస్తుంది, రేపిస్తానులేరా' అని తీసుకెళ్ళిపోయాడు ప్రసాదరావు. వుసూరు మంటూ యింటి కెళ్ళాడు రామకృష్ణ. 'ఏదిరా నీ కొత్త పెన్ను? యిట్లాగియ్యి' అన్నాడు సుబ్బయ్య తన కూలి డబ్బు గుర్తు రాసుకోటానికి. నోరు తెరచి నిల్చున్నాడు, రామకృష్ణ ఏమీ చెప్పలేక. యివాళ నన్ను చంపేస్తాడు పెన్ను లేదని. ఏం చెప్పినా వినడు. చంపేస్తాడు, చంపేస్తాడు, చంపేస్తాడు!— ఆనాడూ యిదే ఆరాటం.

బోనులో నిల్చున్న రామకృష్ణ మనసులో యీనాడూ అదే ఆరాటం- శిక్ష పడకూడదు, పడకూడదు, పడకూడదు అని.

భయపడిపోయిన చిక్కుముడి అయిన రామకృష్ణ మనసులో నుంచీ యిరుపక్షాల న్యాయవాదులూ తమకు కావలసిన దారాల్ని కావలసినంత మేరకు బయటకు లాగారు. ముడి మాత్రం విడివడలేదు. ఆ పని అసలు తాను ఎట్లా చెయ్యగలిగానా అని రామకృష్ణకు తెలియటం లేదు.

ఆ రోజున జీతం తెచ్చి సుబ్బులు చేతికిచ్చాడు. అన్నం తినటానికి పోతుంటే సుబ్బయ్య రూపాయి కావాలని అడిగాడు. చిత్తుగా తాగటానికి. తాగి తూలుతూ యింటికి వచ్చి ఓపికుంటే రామకృష్ణని ఒక్క పనికిమాలిన మొద్దు వెధవ అయినందుకూ, ఇంత చదివీ ఎకౌండరు పని సంపాయించి ఎక్కువ డబ్బు తేలేనందుకూ తిడతాడు. ఓపిక లేకుంటే అట్లాగే ఏ మూలోపడి నిద్ర పోతాడు. రోజూ జరిగేదే యిది. రోజూ సుబ్బులు ముసిలాడికి తాగటానికి పావలా యిస్తుంది. జీతం వచ్చిన రోజున మాత్రం రామకృష్ణ దగ్గర్నుంచే

రూపాయి తీసుకుంటాడు. ఆ రోజు మర్చిపోయి అంతా సుబ్బులికే యిచ్చే శాడు. 'దాని కిచ్చేశాను, అడిగి తీసుకో' అన్నాడు. సుబ్బయ్యకు కోపం వచ్చింది. సుష్టుగా తాగుదామని ఆశపడ్డాడు. అది యిస్తుందో యివ్వదో, 'ఆడముండ చేతికి డబ్బులిచ్చి దాని చేతిలో ఆడేవాడివి నువ్వా మొగాడివే నంటారా, మొద్దు వెధవా' అన్నాడు. రామకృష్ణ మాట్లాడకుండా బుర్ర వంచుకు నిలబడ్డాడు. 'యిన్నేళ్లూ ఆ ముండ చేస్తే పెద్దోడివయ్యావా, నేను పెడితే అయ్యావా? యివాళ పుట్టగోళంత వుద్యోగం వస్తే నేనూ మొగోడినని అను కుంటున్నావేమో. దాన్నడిగి డబ్బులు తీసుకోమంటావంటరా ఎదవా! నీ చేతి కొచ్చిన నాడైనా అట్టే పెట్టుకో లేవంటరా?....ఒక్క నలుసుని కనలేని ఎదవ్వి....' అంటూ తిడుతున్నాడు. సుబ్బులు కూలికి పోయివచ్చి అన్నం వొండిందేమో, అలసటగా నిల్చుని చూస్తున్నది. ఎంత గర్వంగా తొంబై అయిదు రూపాయలు తెచ్చి దాని చేతిలో పెట్టాడు తాను! రామకృష్ణకు నాయన మీద ద్వేషం పుట్టుకొచ్చింది. 'నోరుముయ్యి' అన్నాడు. సుబ్బయ్య ఒక్క నిముషం ఆగి "ఓహో! వానపాముకి కోర లొచ్చినయ్యే ఎప్పుడో" అన్నాడు, అంత ఎగతాళీ ఒక్కవాక్యంలో యిముడ్చుతూ. 'అవున్రా, ఎదవా, పుట్టు ఎదవ్వి నువ్వు. పదేనేళ్ళయి పెళ్ళయి ఒక్కనలుసుని కన్నావట్రా? అది చూసి చూసి ఎవడ్నో తగులుకుంటుంది. నువ్వు ఎదవ ముండల్లే కూర్చో' అన్నాడు.

యింత ప్రపంచంలో తనూ ఒక మనిషిననీ, మొగుణ్ణనీ, చదువుకున్న వాడిననీ గుర్తు పెట్టుకొని కాస్త చెప్పిన మాటలు వినేది సుబ్బులు. దానిముందు ముసిలాడి మాటలు రామకృష్ణ సహించలేకపోయాడు. ఆవేశంలో పిడికిళ్లు గట్టిగా బిగుసుకు పోయాయి. పళ్లు గిట్టకరుచుకుపోయాయి. 'ఏందీ....మళ్ళీ కుయ్యి' అంటూ ముందుకి పోయాడు. 'పోన్లే. ముసిలాడి మాటలకేం'అన్నది సుబ్బులు. ముందుకు పోయిన రామకృష్ణకు ఒళ్ళు తెలియలేదు. ఎన్నో ఏళ్ళ నుండి పేరుకుపోయిన ద్వేషానికి, ఆవేశానికి కట్ట తెగింది. సుబ్బయ్యను ఒక్క తోపు తోశాడు. తల పట్టుకొని గట్టిగా గోడకేసి కొట్టాడు. అంతే. 'చంపితివి కదరా ఎదవా!' అని అరిచాడు సుబ్బయ్య.

ఇరుగుపొరుగు వాళ్ళు వచ్చేసరికి తల పగిలి రక్తం మడుగులో వున్నాడు. రామకృష్ణ మొద్దుగా చూస్తూ అక్కడే నిలబడిపోయి వున్నాడు.

'ఏందిరా, మందమతి, ఏమైందిరా' అన్న సోములి మాటలతో యీ లోకం లోకి వచ్చాడు.

తరువాత పోలీసులూ, సంకెళ్లూ, గందరగోళం. వున్న యిల్లు కాస్తా తనఖా పెట్టి డబ్బు తెచ్చి లాయర్లను పెట్టించింది సుబ్బులు.

* * *

జడ్జి ప్రసాదరావు మనస్సు గతంలోకి పరుగెత్తింది. తన చిన్నప్పుడు నాన్నగారు ఆ వూళ్ళో వుద్యోగంలో వుండేవారు. చిన్న చొక్కాలో యిరుక్కున్న పెద్దమనిషి లాగా యిరుగ్గా యిబ్బందిగా అప్పుడు ఆ వూరు చిన్నది. కాలేజి లేదు. ఈ రామకృష్ణ తనకు చాల మిత్రుడు అక్కడ. తామిద్దరూ మొదట పరిచయమైన సన్నివేశం బాగా గుర్తుంది. ఆ రోజున తాను బళ్ళో నోట్సు రాసుకుంటూ వుండిపోయాడు ఆలస్యంగా. వాడి పెన్ను పట్టుకొచ్చేశాడు. యింటికివచ్చేసరికి నాన్నగారు బోనులోని వులిలాగా పచార్లు చేస్తున్నారు. ఆయన చండశాసనుడు. ఆలస్యంగా యింటి కొచ్చినందుకు కొడతారేమోనని భయం వేసింది. నోట్సు రాసుకుంటూ వుండిపోయానని చెప్పాడు తాను. 'వేళకు ఇంటికి రావాలంటే రావల్సిందే. ఆ నోట్సు యింటికి పట్టుకొచ్చి రాసుకోకూడదూ? అన్నీ వేషాలు' అంటూ పర్వతంలాగా పెద్దగా నిల్చొని తిడుతున్నారు. అంతలో అమ్మ వచ్చింది. 'అసలే జ్వరంపడి లేచాడు. భయపడిపోయాడు. ఈ మూడురోజుల నోట్సూ రాసుకుంటూ వుండివుంటాడు గాని, యివాల్టికి వూరుకోండి' అంటూ తనని తీసుకువెళ్ళిపోయింది. 'నీ మూలాన్నే వాడు చెడిపోతున్నాడు' అని అమ్మమీద కేకలేశారు నాన్నగారు.

మరునాడు రామకృష్ణ చెప్పాడు—పెన్ను తేలేదని వాళ్ళ నాన్న బాగా కొట్టాడట. 'ఆలస్యంగా వెళ్ళినందుకు నన్నూ కొట్టబోయాడు మా నాన్న' అన్నాడు తాను. నాన్నల నిరంకుశత్వానికి బలి అవుతూ వున్న యిద్దరు బాలుర పరిచయం అట్లా మొదలైంది.

రామకృష్ణ తండ్రి కర్కశత్వం మూర్తీభవించినవాడు, క్రూరత్వానికి మారురూపం అనే విషయం తనకూ బాగా జ్ఞాపకమే. రామకృష్ణకు అమ్మలేదు. అంతరాత్మ నెరుగని శాసనంలో పెరిగాడు. క్షమ, ప్రేమల నెరుగని శాస

నాన్ని ఒప్పుకొని తల ఒగ్గిన మనసు మందమతి కాక ఏమవుతుంది? అమ్మ లేకుంటే తనూ అంతే అయి వుండేవాడా? ఏమో! పాపం, రామకృష్ణ!

శాసనం, అంతరాత్మ- పూర్తిగా భిన్నమైనవి రెండూ. అంతరాత్మ నెరుగని చండశాసనం నుంచీ క్రూరత్వం పుట్టుకొస్తుంది. శాసనం ఎరుగని అంతరాత్మ నుంచీ అరాచకం వుద్భవిస్తుంది. వ్యక్తికీ సంఘానికీ కూడా అర్థం చేసుకొని క్షమించే మెత్తని వెన్నలాంటి అంతరాత్మకు గట్టితనాన్నిచ్చే శాసనం—నియమం—అవసరమే. సంఘం యొక్క స్థితినిబట్టి ఆ రెండూ ఒక బాలన్సు ఏర్పరచుకొంటాయి. అప్పుడు ఏర్పడేది చట్టం. సంఘక్షేమం దృష్ట్యా ప్రయోజనం దృష్ట్యా ఏర్పడుతుంది అది. తానీ వేళ దానికి మంచి ప్రతినిధి కాగలిగాడంటే దాంట్లో అమ్మ పాత్ర ఎంత వుందో నాన్నగారి పాత్రా అంతే వుంది. తన ప్రేమంతా అమ్మ మీదైతే, గౌరవమంతా నాన్న గారి మీద. తన మనసే అమ్మైతే, అది సువాసనలీనే మంచి గంధపు చెక్క అయితే- దాన్ని శ్రీకృష్ణుని మూర్తిగా మలచింది నాన్నగారు.

తనకీ విషయం తెలియనప్పుడు, తన కింత విచక్షణా జ్ఞానం ఏర్పడ నప్పుడు తాను నాన్నగారిని ద్వేషించేవాడు. అమ్మ మెత్తదనాన్ని చూసి కోపగించుకున్నాడు. ఎందుకీ అమ్మ నాన్నగారికి తగిన సమాధానం చెప్పదు? ఎందుకు ఎదురు తిరగదు? ఎందుకు వేరైపోదు? అని అర్థంలేని కక్ష పుట్టు కొచ్చేది.

యిప్పుడు వాళ్ళిద్దరూ లేరు. తన జీవితమే వాళ్ళ జ్ఞాపకానికో నందనం. అందరూ అంతే. తల్లిదండ్రుల జీవితాలకు, వాళ్ళు ఏర్పరచుకొన్న భావ సమన్వయానికి సజీవ ప్రతిబింబాలు బిడ్డలు.

యిప్పుడు తన ఎదురుగా వున్న సమస్యకు న్యాయమైన పరిష్కారం చెయ్యాలి. రామకృష్ణ పరిస్థితి తనకు బాగా తెలుసు. సుబ్బయ్య గుణమూ తెలుసు. రామకృష్ణ మీది ఆనాటి అభిమానం తాను మరచిపోలేదు. బాల్య స్నేహితుణ్ణి చూసి నిట్టూర్చాడు ప్రసాదరావు.

*   *   *

ప్రసాదరావు—చిన్ననాటి తన ఆప్తమిత్రుడు. తనను తప్పకుండా గుర్తించి వుంటాడు. తననూ, తన తండ్రియొక్క క్రూరత్వాన్నీ బాగా ఎరిగిన ప్రసాదరావు జడ్జిగా రావటం తన అదృష్టం. తప్పకుండా కేసు కొట్టేస్తాడు. తన తప్పేమీ లేదని తెలుసుకుంటాడు, తన తండ్రి రాక్షసుడని బాగా తెలిసిన ప్రసాదరావు. రామకృష్ణ మనసులో ఆశ.

ఏడేళ్ళ కఠినశిక్ష పడినదని విన్నప్పుడు రామకృష్ణకు అంతా అయోమయమై పోయింది. తన తండ్రి విషయం బాగా ఎరిగిన ప్రసాదరావే తనకీ శిక్ష విధించాడా? ఎందుకు తనమీద ఎవరికీ దయ కలుగదు? ఎందుకు ప్రపంచమంతా తనమీద కత్తి గట్టింది? ఎందుకు? ఎందుకు? అర్థంగాక దిక్కులు చూస్తూ వుండిపోయాడు. వున్నట్లుండి హృదయంలోంచి ఒక పెద్ద ఆర్తనాదం—ప్రపంచంతో సంబంధం విడిపోయిన పిచ్చివాడి ఏడుపు—బయటికి వచ్చింది. 'ఓ' అంటూ పెద్దగా ఏడిచాడు రామకృష్ణ.

సుమనశ్రీ పోయింది. నా జీవితంలో నేనంతగా ఎప్పుడూ ఏడవలేదు. సుమ నశ్రీ అంటే నాకెంతో గౌరవం; ఆమె అందంగా ఉంది; మంచి వయస్సులో ఉంది; అందుకని కాదు. ఆమెను నేను ఒక కాలేజి కుర్రాడికి మల్లె ప్రేమించనూ లేదు. ఇవేమీ కాకపోయినా సుమనశ్రీ అంటే నాకెంతో గౌరవం.

జీవితంలో నేను చాల త్వరగా ముసలాణ్ణి అయిపోయాను. అవిడను నేనెలా ప్రేమించగలను? నాకు పదహారేళ్ళకే పెళ్ళయింది. ఇరవై యేళ్ళకు నేనిద్దరు పిల్లలతండ్రిని. పాతికేళ్ళు నిండీనిండక ముందే నా మొదటి పెళ్ళాం చచ్చిపోయింది. అప్పటికి నాకు నలుగురు పిల్లలు. మరుసటి యేడాదే రెండో పెళ్ళి చేసుకున్నాను. నా మనోదౌర్బల్యం నాకు తెలుసు. అందుకనే నాకు జీవితంలో ఆదర్శాలు లేవు. పరిస్థితులకనుగుణంగా బ్రతకడంలోనే ఈ జన్మ ముగించుకొంటానని నాకు బాగా తెలుసు. ఔను ప్రపంచంలో అందరూ మహాత్ములే కారు. నాలాంటివాళ్ళే ఎక్కువ. నా తర్కం అంతా అంతే. కొందరు ప్రభుత్వాన్నీ, ఆర్థిక వ్యవస్థనూ, విద్యనూ, సమాజాన్నీ—ఒకదాన్నేమిటీ, విశ్వాన్నంతా తిడుతారు. అన్నీ తమకేదో ద్రోహం చేసినట్లు. కాకపోతే తామేదో బృహస్పతులైనట్టూ—సరే. ఎవడి ఆత్మ విశ్వాసం వాడిది. నా కలాంటి దేదీలేదు. సాధ్యమయితే నన్ను నేను తిట్టుకొంటాను: అసమర్థుణ్ణి; అప్రయోజకుణ్ణి; అయోగ్యుణ్ణి.

సరే. ఆత్మవిశ్వాసమున్న కొందరు నన్నూ బృహస్పతి అన్నారు. మా నాన్నను తిట్టారు. పదహారోవేటనే పెళ్ళిచేసి నా జీవితాన్ని ఆ ముసలాడు గంగలో కలిపాడని అతడిమీద ఒక అభియోగాన్ని మోపారు; నన్ను జాలిగా చూశారు. అలాంటి వాళ్ళలో ఆ వెధవ రఘుపతి ఒకడు.

వాడు బొత్తిగా నాన్నదృష్టిలో ఆలోచించడు.

అప్పుడే మా అమ్మ చచ్చిపోయింది. మా నాన్నకు పెళ్ళయ్యే వయస్సు దాటిపోయింది. (లేకపోతే నాకు బదులుగా మా నాన్నే పెళ్ళిచేసుకొనేవాడు.) ఆలా అనడంకంటే పిల్లనిచ్చే వయసే దాటి పోయిందనాలి. మా నాన్న దర్జాగా బతికిన ఘటం. అంటే జమీందారని అనడంలేదు. స్త్రీ విషయంలో. అంటే ముఖ్యంగా మా అమ్మ విషయంలో. ఆవిడ మహా ఇల్లాలు. 'మహా' అంటే మా నాన్నని చూస్తే దైవంగా లేదా ప్రళయకాల దండధరునిలా భావించేది అని అర్థం. మా నాన్న అవిచ్ఛిన్నంగా అజాత ప్రతిసమాధా

నంగా మా అమ్మని అరశతాబ్దం నిరంకుశంగా ఏలుకొన్నాడు. ఆవిడ అర వై ఏళ్ల క్రింద పుట్టిన మనిషి. ఆవిడకి ఎముకల్లో ప్రాణం. అక్కడెక్కడో దిట్టంగా ఉన్న ప్రాణం కాబట్టే నిరంకుశాధికారం క్రింద నిక్షేపంగా యాభై యేళ్ళు సంసారం చేసింది. ప్రజాప్రభుత్వం చూడకుండానే, స్త్రీ స్వాతంత్ర్యాన్ని దర్శించకుండానే కన్నుమూసేసింది. నిజానికి మగవాడికి భార్య రాజ్యమంత గొప్పది. సంసారంలో ప్రభుత్వం సాఫీగా జరపాలంటే రాజకీయాలలో ఎన్ని హంగామాలున్నాయో అన్నింటిని నిలదొక్కుకొనటమే! మా అమ్మ మా నాన్నకి స్వరాజ్యం. ఆయనకి వలస రాజ్యాలు లేకపోలేదు. అతడి దార్ఢ్యం కాస్త అస్తమించగానే వలసరాజ్యాలు స్వాతంత్ర్యాన్ని ప్రకటించేశాయి. కానీ అమ్మ స్వరాజ్యంగా! చివరిదాకా అనుభవించాడు; చచ్చేట్లు అనుభవించాడు. అమ్మ చచ్చిపోయింది; పతే దైవమని చచ్చిపోయింది; గర్భగుడిలోని మూలవిరాట్టనుకొంటూనే చచ్చిపోయింది.

ఆవిడ చచ్చిపోయేదాకా తాను అసమర్థుడన్న సంగతి నాన్నకు తెలీలేదు. ఆవిడ పీనుగను బయట పడుకోబెట్టి, పురోహితుడు 'అయ్యా, తిలలు పట్టుకురండి' అంటే నాన్న మామూలు ధోరణిలో ఇంట్లోకిపోయి "ఏమే! రాజ్యం! తిలలెక్కడ పెట్టావే?" అని ఓ మగరాయడి కేక వేశాడు. నిశ్శబ్దంతో కరవొచ్చిన వంటింటిని చూచిన తరువాతగానీ తన స్వరాజ్యం చచ్చిపోయిందన్న సంగతి గుర్తురాలేదా మనిషికి. అప్పుడతడు సగం గొంతు తెగిన కోడిలా విలవిలా కొట్టుకొని ఏడ్చాడు.

ఇక నేనా! సద్గతిదాతని. ఒక్కగాని ఒక పుత్రుణ్ణి. అప్పటికే మా నాన్నలో సగం మగరాయడనిపించుకొన్నాను. అమ్మకి నాన్నలో సగం నేను. స్కూల్ ఫైనల్ రెండోసారి తప్పి దాటుకోవడానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నాను. వెధవ యౌవనం! దోరగా ఉంది. పడుచుతనంలో ఉన్న గాడిద కూడా అందంగా అవుపించే చండాలపు యౌవనం. ఏం చేయను?

అమ్మ చచ్చిపోయిన తర్వాతగానీ ఆడదిక్కులేని కొంప పాడుబడిన హంపీ దిబ్బలాంటిదని తెలిసింది కాదు. మా నాన్నని తిట్టేవాళ్లకేం, ఎంతో తేలికగా తిడుతారు. బొత్తిగా ఆయన దృష్టిలో, కనీసం పరిస్థితుల దృష్టిలో ఆలోచించరు. బ్రతుకంటే ఆదర్శాలే కాదుగా మరి! ఎన్నో సౌకర్యాలూ,

ఎన్నో వాంఛలూ, వాని పోరాటమూను. బ్రతుకంతా అంతేమరి. ముసలి తనంలో ఇంటి పనులన్నీ చేసుకొంటూ వండుకొని చావడం ఎంత కష్టమో ఆదర్శాలు చెప్పేవాళ్ల కేమర్థమవుతుంది?

మా నాన్న నాకు పెళ్ళిచేశాడు. అందులో ఆయనకు స్వార్థం లేక పోలేదు. స్వార్థం లేనివాడెవడు? అసలు బ్రతుకే స్వార్థం. కీర్తిగట్రా మాత్రం స్వార్థం కాదూ? అది మరొక్క రూపం. అంతే.

ఇక రెండోదిగా లోకం నన్నంటుంది-ఎందుకీ పెళ్ళికి ఒప్పుకొన్నానని. ఏం చేయను? ఆషాఢ మేఘంలా దిట్టమయిన యౌవనం, బరువైన మగ తనం—ఇదంతా ఎందుకు, అదో బాధ; అణువణువునా కమ్ముకొచ్చేసింది. ముప్పయ్యేళ్ళకి ముసలివాడనయిపోయిన నేను పదహారేళ్ళకే పండు యౌవ నంలో బాధపడ్డున్నాను. కోరిక లెన్నో రోజులుండవుగా మరి. ఉన్న రోజుల్లో అందుబాటులో ఉన్న కోరికల్ని తోసేసుకొనే ఓపిక నాలో లేదని ముందే చెప్పాను. ఆదర్శాలు లేవు నాకు. అయిదు సంసారాలున్న అద్దె కొంపలో బతి కిన నాకూ నియమా లెట్లా ఉంటాయి! "అద్దె కొంపలంటే అవో చిత్రమయిన వ్యూహాలు; సున్నితమైన, ఉదాత్తమైన ఆశయాలకి చుక్కెదు"రని రఘుపతి అనేవాడు. జీవితాన్ని అర్ధ నగ్నంగా—పశుత్వానికి సమీపంగా తీసుకుపోయే వింత శక్తు లద్దెకొంపల్లోనే చాలా ఉన్నాయని రఘుపతి ఏవేవో చెప్పేవాడు. ఎదురొచ్చిన శక్తుల కెదురు తిరగడం జీవితంలో అలవాటు పడలేదు నాకు.

జీవితంలోని కష్టసుఖాలు, వాంఛలు, విరక్తులు, వ్యవహారాలు అన్నీ సంకులంగా జరిగే రంగస్థలంలో, నిర్విరామంగా వీక్షించే ప్రేక్షకుడుగా నా జీవితాన్నే గడిపేశాను. చీకటిని ప్రేమించడం, వికారాన్ని అభిమానించడం, వెగటుని లొట్టలు వేసుకొని తియ్యగా త్రాగడం, జీవితంలోని మురికిని శ్రీచూర్ణంలా లేపనం చేసుకోవడం అలవాటయింది నాకు. జీవితమంటే ఏమిటో తెలిసిపోయింది. వచ్చిన ప్రతి దానిని ప్రేమించడం మాత్రమే నేర్చుకొన్నాను. ఏవగించుకోవడం ఎదురు తిరగడం నా ప్రకృతిలోనే లేవు. అందుకనే నేను నా పదహారో ఏటనే ఆ అద్దె కొంపలోనే ఇంచుమించు స్వయంగా నా భాగే శ్వరిని ఏరుకొన్నాను. దాన్ని మా నాన్న ఎంతో ఆలస్యంగా ధర్మబద్ధం చేసి ముడివేశాడు. అప్పటికే నా భాగేశ్వరికి మూడో నెల. మా నాన్న గొప్ప

సహృదయుడు. అతడు ఆ పని చేయకపోయి ఉంటే మనశ్శాంతి లేక మూడో సారి కూడా స్కూల్ ఫైనల్ తప్పేవాడినే. ఇక పై చదువుల మాట భగవంతు డెరుగు.

ఏలాగైతేనేం, నా భాగేశ్వరిని నేను పెళ్ళి చేసుకొన్నాను. బ్రతుకులో కాలూని నిలబడటం—ఇలాంటివి పెళ్ళికి ముందేదో ఉండాలట. ఏవో ఎన్నయినా ఉంటాయి. వాంఛల కేమిటి అంతు? వాంఛలే మంచివి కానప్పుడు, వాంఛలలో ఆదర్శా లేమిటి! ఆ ఆదర్శాలకోసం అందుబాటులో ఉన్న కొద్దిపాటి సుఖాలనీ వదులుకోవటం గొప్ప అని కొందరి నమ్మకం. ఆ ఆదర్శాలను అందుకోక ముందే ముసలాళ్ళయిపోయి బ్రతుకంతా ఎండిన మ్రోడులా మార్చుకోవటమా? ఏమిటో ఆదర్శాలు. నా కవి అక్కరలేదు. ఆదర్శమైన ప్రేమ ఎడబాటుతోనో ఆత్మహత్యతోనో పరిసమాప్తమవుతుందట. మరి నా భాగేశ్వరిని నేను పెళ్ళి చేసుకొన్నాను. అది ఆదర్శమైనదో కాదో. భాగేశ్వరితో కాపురం చేయడం స్వర్గం!

ఇక మా దాంపత్య జీవితం అయిదు సంసారాలున్న అద్దెకొంపలోనే, అర్ధనగ్నంగానే సాగినా ఎంత ఆనందముంది! నేనూ సుఖాల్ని అనుభవించాను, సుఖాలకి పరిపూర్ణత ఎక్కడిది? సినిమాల్లో చూచి అలాంటి పడకటిళ్ళు లేవు. కాశ్మీరు విహారాలు లేవు అని ఎక్కడి కెక్కడికో అఱ్ఱులు చాచుకొంటే అది ఆదర్శమా! మురికిలో పుట్టి మురికిలోనే చచ్చే వాస్తవ జీవితానికి అలవాటు పడకపోతే అసలు సుఖమన్నది స్వర్గంలోనూ ఉండదేమో! ఎక్కడి కక్కడ గీత గీచుకొని ఇది సుఖం అనుకోవాలిగానీ, సుఖం లేనిదెక్కడ? నేనూ సుఖంగానే ఉన్నాను. నాలుగేళ్ళలో ఇద్దరు పిల్లల్ని కంది నా భాగేశ్వరి. ఇక సుఖమంటే ఏమిటో నా కర్థం కావడంలేదు. ఆకాశ చిత్రాలను చూచి అందుకోవాలనే ఆశ నాకు లేదు. ఆనందంగా ఉంది నా బ్రతుకు.

నా భాగేశ్వరికి రెండుసార్లు పురుడు పోసి మా నాన్న చచ్చిపోయాడు. అమ్మ చచ్చిపోయిన తర్వాత నాన్న సింహాసనం పడిపోయింది. గొప్ప గొప్ప వాళ్ళే అవిచ్ఛిన్నంగా జీవితాంతం సింహాసనాలమీద కూర్చోలేదు. జీవితమంటే అనుభవాల పరంపర మరి. ఆ పనీ ఈ పనీ చేయడంతో ప్రారంభమై చివరికి నా భాగేశ్వరికి పురుడు పోసేదాకా కర్మ వీర్యాన్ని సాధించాడు నాన్న.

చివరి ఘడియదాకా నాకూ నా పెళ్ళానికీ చేతనయినంత చాకిరీ చేశాడు. పురిటిల్లూ వంటిల్లూ తెగ దిరిగాడు. ఇద్దరు మనవరాండ్రను ఆనందంతో చూచాడు. హటాత్తుగా గుండె ఆగి ఒక రోజున చచ్చిపోయాడు. అతడి ఋణం నే నెలా తీర్చుకోగలను?

అతడితోపాటు అతని పెన్షన్ కూడా దిబ్బలో కలిసిపోయింది. ఆ రోజున వచ్చిన ఏడ్పును తమాయించుకో లేకపోయాను. ఏడ్చి ఏం లాభం? నాన్న చచ్చిపోయాడు. తిరిగిరాడు.

నా భాగేశ్వరి ఒంటరి దయిపోయింది. అన్ని పనులూ తానే చేసు కొనేది. నా భాగేశ్వరి ఎంత మంచిది! తన సర్వస్వం నాకర్పించింది- శక్తిని; అభిమానాన్ని; శరీరాన్ని; సర్వమూ. అలా అంతా అర్పితం చేసుకొన్నప్పుడు వాటిని పోషించడం నా వంతుకాదూ మరి! అంత నిస్స్వార్థంగా తానున్నపుడే నేనెలా ఊరుకోగలను? ఆవిడకు చన్నీళ్లు వేన్నీళ్లగా సహకరించడంలో నా మగ తనం ఏ ఏట్లోనో కొట్టుకు పోయిందనీ, నేను భార్యావిధేయుడననీ అద్దె కొంపలో ఉన్న మగరాయళ్లు కొందరు ఒకరి చెవులొకరు కొరుక్కొన్నారు. కోడయి కూయనీలే! ఇందులో పోయిందేముంది? ఆ అద్దె కొంపలోని మగ నాండ్రు ఆ పురుష పుంగవుల గురించి చాటు మాటున ఏ మనుకొంటారో వింటే వారి మగసిరి గాలి కెగిరిపోదూ! ఆ మగరాయుళ్ళు ఒక రోజయినా ఉడికిన కూడు తినిపోయారూ! వాళ్ళ శ్రీమతులకు ఒకటే నమ్మకం. ఎలాగూ హోటళ్ళున్నాయని. మరి నేనో? ఒక్క రోజయినా పూర్తి వంట కానిదే తిన లేదు. ఇక నేను ఇంట్లో ఆపనీ ఈపనీ చేయడమా-చేశాను. తప్పేముంది? కొళాయి నీళ్ళు నేనే పట్టుకొచ్చేవాణ్ణి. ఎప్పుడయినా మరీ అవసరమైతే పిల్లలు బయటికి పోయినా.... ఈలాంటివి చూచుకోవలసి వచ్చేది. తప్పేముంది? వాళ్ళె వరి పిల్లలు? శ్రద్ధగా కనలేదూ! సంసారం అంటే అన్నీను మరి. ఒట్టి పడక టిల్లే కాదుగా! నా భాగేశ్వరికి నే చేసిన సహకారం ఏపాటిది? నాకూ నాపిల్లలకీ చివరి గంట దాకా నిస్స్వార్థంగా సేవచేసి చచ్చిపోయింది. ఆవిడ ఋణాన్ని నేను ఎలా తీర్చుకోగలను? నగలు కావాలని కానీ, ఊళ్ళు తిరగాలని కానీ, కనీసం వచ్చిన ప్రతి తెలుగుసినిమానైనా చూడాలనీ కోరుకో లేదావిడ.గోమాత లాంటి ఇల్లాలు. ఇంతకీ నేను అదృష్టవంతుణ్ణి కాదు. ఆవిడని పోగొట్టు

కొన్నాను. ఆవిడ ప్రతిరూపాలుగా ఆవిడ కష్టపడి కన్న బిడ్డల్ని చూసు కొంటూ ఉండిపోయాను. నాకు పాతికేళ్లు వచ్చేనాటికి నా భాగేశ్వరి మరిద్దరు పిల్లల్ని కని, ఇక పిల్లల్ని కనలేక కాబోలు చచ్చిపోయింది. చచ్చిపోయే దాకా నాకు సేవ చేసింది; పిల్లల్ని కంది; వాళ్ళకి చాకిరీ చేసింది; గంధపు చెక్కలా అరిగిపోయి ఈ లోకాన్ని వదలి వెళ్ళిపోయింది.

ఆవిడ ఋణాన్ని నేనేం తీర్చుకోగలను!

ఇంత త్యాగం చేసిన నా భాగేశ్వరికి నేను కృతజ్ఞుణిగా ఎలా ఉండగలను అని ఆలోచించాను. కనీసం రెండో పెళ్ళి చేసుకోక పోవడంతో ఆ ఆశయం తీరుతుందని ఒక మార్గం గోచరించింది. ఏం లాభం, నా బొంద. ఆ మార్గం నాలాంటి వాడికంత తేలికయిందా? ఒక్క ఏడాది ప్రయత్నించాను. ఆ ఏడా దిలో నేనెంత దుర్మార్గంగా ప్రవర్తించానో తలచుకొంటే రెండో పెళ్ళి చేసు కొంటే ఎంతో బాగుపడ్డాననీ, భాగేశ్వరీ మెచ్చుకొంటుందనీ తేలిపోయింది. ఒక ఆడది 'నాది' అన్నది లేకపోతే నేను బతకలేనని నాకు బాగా తెలిసి పోయింది.

అసలు నా భాగేశ్వరి చచ్చిపోగానే ఎన్నో సంబంధాలు వచ్చాయి. ఏవో గంతకు తగిన బొంతలు. నాకూ, చిన్నదయినా, ఉద్యోగమంటూ ఒక టుంది. మరి ఎవరో రానే వస్తారు.

పూర్వం నా భాగేశ్వరిని ప్రేమించి పెళ్ళిచేసుకొన్నాను. నా భాగేశ్వరికి ప్రేమంటే ఏమిటో బాగా తెలుసు. ఆ రోజుల్లో నాకూ తెలిసినట్టే ఉండేది. ఆవిడ మాత్రం ప్రేమిస్తూనే చచ్చిపోయింది. కథలలోని ప్రేమకాదు. నాకు సంబంధించిన ప్రతి అణువునూ ప్రేమించి, చివరికి దానికే బలయిపోయింది. ఆవిడతో నేనూ చచ్చిపోయిఉంటే ప్రేమంటే సగమయినా అర్థమయి చచ్చే వాణ్ణి. నేను ప్రేమించడానికి అర్హుడను కానని ఇప్పుడు తేలిపోయింది. ప్రేమ కాదు. నాకో స్త్రీ కావాలి. అంతే.

ఏదో సంబంధం వచ్చింది. కట్నంగట్రా ఇచ్చుకోలేని వాళ్ళు. కాక పోతే నాకు పిల్లనివ్వడానికి అంత పైబడి రావలసిన అవసరమేముంది? ఔను. నేనేం గొప్పవాణ్ణని? ఎందుకూ చాలని ఉద్యోగం, రెండోపెళ్ళి? ప్రేతకళ,

నలుగురు ఆడపిల్లయి—గతిలేకపోతే ఇవ్వాలికానీ ఎవరిస్తారు పిల్లని? అందులోనూ సుమనశ్రీ లాంటి పిల్లను. ఒప్పుకొన్నాను. పెళ్ళయిపోయింది.

ఇప్పుడు సుమనశ్రీ నా పెళ్ళాం. ప్రేమించిన భాగేశ్వరి కాదు. ఒక ఆడది. నే కోరిందీ అంతేగా మరి! నా అవసరాలన్నీ చూసుకోవాలి. అది జరుగుతూ ఉంది. నా పిల్లల అవసరాలన్నీ చూసుకోవాలి. అదీ జరుగుతూ ఉంది. ఇంకేం కావాలి నాకు?

నలుగురు పిల్లల్ని కన్న తరువాత, జీవితపు మురికి కాలువల్లో కొట్టుకుని అరిగిపోయిన తర్వాత, నాలో ఎంత ఉత్సాహం, ఎంత అందం, ఎంత శక్తి ఉంటాయో నా సుమనశ్రీని విమర్శించే లోకులకేం తెలుస్తుంది? వెయ్యి కోరికలతో రంగురంగుల ఇంద్రధనుస్సుతో నిండిన జీవితపు తొలి మొగసాలలో ప్రవేశించాలని ఉరకలెత్తే నిండు యౌవనంలో ఉన్న సుమనశ్రీ నడిగితే తెలుస్తుంది.

సుమనశ్రీ ఎంతో మంచిది. నాకూ నా పిల్లలకూ ఏ కొరతా రానివ్వకుండా చూస్తూ ఉంది. నా స్థితిగతు లావిడకు తెలుసు. ఆవిడకె జాలి గుండె. జాలిగుండె ఉన్నంతమాత్రాన కోరికలేలా చస్తాయి? కథలలో అన్నీ చచ్చి కీలుబొమ్మల్లా ఉండొచ్చు. వేడి రక్తం అలజడి చేసే ప్రత్యక్ష జీవితంలో చావడమేమిటి?ఒట్టి కబుర్లు. నా సుమనశ్రీలో కోరికలున్నాయంటే నా కర్థమవుతుంది. జగత్తునంతా కౌగిలించుకోవాలనే పద్దెనిమిదేళ్ళ వయసు, చైతన్య ప్రపంచాన్నంత బంటుగా ఏలుకొనే అందం. ఆవిడకు నేనేం సరిపోగలను? వాళ్ళనాన్నకు నేను నచ్చాను. లేదా వాళ్ళ దారిద్ర్యానికి నేను నచ్చాను. వయసూ, అందమూ, వాంఛలూ—ఇవన్నీ దారిద్ర్యం చెప్పినట్లూ, తల్లిదండ్రులు చెప్పినట్లూ నడుచుకొంటాయా! దారిద్ర్యానికీ వాంఛలకీ ఎప్పుడు విప్లవమే. అసలు ప్రపంచ చరిత్రే ఈ విప్లవం అని నా నమ్మకం. నా సుమనశ్రీనూ అంతే. దారిద్ర్యాన్ని దాటుకొని వాంఛల్ని గెలిపించాలని సుమనశ్రీ అనుకొంటే అది తప్పా? ఏం, ఎందుకవ్వాలి? ఆవిడ వయసూ, ఆవిడ అందం, నా దారిద్ర్యం, నా (కనిపించే) వయసూ మరి ధృవాల తేడాతో ఉన్నాయి. అయినా ఆవిడచేసిన త్యాగం! ఎంత గొప్పది! అకాలవార్ధక్యంతో కమిరిపోయిన నన్నూ, ఎండిపోయిన బెండకాయల్లాంటి నా పిల్లల్నీ, చూడ్డానికయినా

లోకం అసహ్యించుకొనే ఈ గుంపుని ఆదరిస్తూ సేవిస్తూ ఉన్నదే! ఆవిడ శీలాన్ని దుమ్మెత్తిపోసే వాళ్ళకి ఈ మంచితనం ఎందుకవుపించదు? ఇక ఆవిడ వ్యక్తిగతమైన కోరికలా—ఎన్నో ఉన్నాయి. మరి నాకు లేవూ కోరికలు? జీవితంలో ఎండిపోయిన నాకే వాంఛలున్నాయ్. నా వాంఛల కోసం ఆవిడి కోరికల్ని కొన్నింటిని చంపేశానా! ఆవిడ త్యాగం చేయలేదూ! ఎవరి కోసం చేసిందనే ప్రశ్నా? ఎందుకు? తండ్రికోసం. కాకపోతే సంఘంకోసం. అదీ కాకపోతే తనకోసమే అనుకో. స్వార్థం కాకపోతే బ్రతుకులో ఉన్నదేమిటి? ఆవిడ కొంత స్వేచ్ఛగా తిరుగుతుంది! నిజమే. లోకం నన్ను పనికిమాలినవాడనీ, అసమర్థుడనీ అంటుంది. అది నిజమే. నిజమయిందంతా మంచి కాదేమిటి? వీళ్ళ బొంద సామర్థ్యం! ఎక్కడనుండి వస్తుందట, పొట్టు తిని బతికే వెధవ వెధవ జీవితానికి సామర్థ్యమూ; ప్రయోజకత్వమూ; ఆదర్శమూ! ఏవో చలిమంట కబుర్లు! ఎముక ముక్కను వెతుక్కొంటూ ఎగిరే కాకిని చూచి, అదిగో అది మానస సరోవరానికి పోతూ ఉంది అనే వాళ్ళని ఏమనాలి, జాలిపట్టం తప్ప. కాకి తామరతూళ్ళు తినాలనా? లేదా కుళ్ళిపోయిన ఎలుక పీనుగ కాకికి రుచిగా ఉండదనా? ఏమిటో అర్థంలేని మాటలు! ఎవడి ప్రపంచం వాడి కానందం. అమృతమైతేనేం జాల్యాహారంతో ఎట్లా సరిపోతుంది? అలా అనుకొంటేనే తృప్తిమరి. నాకు జీవితంలో నిజంగా తృప్తి ఉంది. ఊరికే ఆదర్శాలను చెప్పేవాళ్లను విని విని అప్పుడప్పుడు నన్ను నేను నిందించుకొంటాను తప్ప, నిజంగా నాకు తృప్తి ఉంది. నాకు ఆదర్శాలంటేనూ, వాటిని గురించి తెగవాగేవాళ్లంటేనూ విపరీతమయిన చిరాకు.

నా బతుకులో నేను దేన్నిగురించీ అంతగా నా మనస్సుని బాధపెట్టలేదు కానీ, ఆ రఘుపతి నా జీవితంలో ఒక ఎలుగుబంటిలాగా ప్రవేశించాడు. వాడు నా సుమనశ్రీతో సంబంధం కలిగించుకొన్నాడని నాకు దుఃఖం లేదు. ఈ లాంటి వెధవలంతా చివరికి గోతిలో పడిపోతారని నాకు తెలుసు. అలాగే వాడూ పడిపోయాడు. నేను జీవితాన్ని ఒక మోస్తరుగా చూస్తూ ఉంటే, వాడు నన్ను ఉద్ధరించాలనుకోవడమేమిటి? ప్రపంచంలో ఎవరిదారిని వాళ్లని పోనివ్వడే. ఏమిటీ వెధవ దురద! అది తప్పు, ఇది తప్పు; ఈలాగే పోవాలిఅనే పట్టింపులెందుకు? నాకు వద్దోయ్ బాబూ ఈ వెధవ విజ్ఞానం, ఈ వెధవ సంస్కృ-

రణ, ఈ వెధవ సాహిత్యం అని మొత్తుకొంటే వినదే! వాడి కొంపేదో తగల బడిపోయినట్లూ– నన్నేదో హిమాలయాల మీద గౌరీశంకరం పైకి మోసుకు పోయేట్టు చస్తాడేమరి! ఇదో పెద్ద బాధ.

వాడి సహవాసం నా జీవితంలో– ఘనీభవించిన నా జీవితంలో, కొన్ని కొన్ని మార్పులను తెచ్చినట్టు అనిపించేది. వాడు నన్ను బృహస్పతీ అన్నాడు. హృదయాన్ని పెంచుకోవాలన్నాడు. డబ్బు ఖర్చుపెట్టి కొన్ని సిని మాలకు తీసుకు వెళ్ళాడు. కొన్ని పుస్తకాలు కొని తెచ్చి గొంతుమీద కూచొని చదివించాడు. చదివి వినిపించాడు. సాహిత్యం, సమాజం, విజ్ఞానం, రాజ కీయాలు, ఎంత విముఖంగా ఉన్నా నెత్తినరుద్దాడు. అవసరంలేని ఇంజెక్షన్‌ల లాగా, దేనికీ అలర్జీ అన్నది ఎరుగని నాలో కొన్ని తత్వాలని నొక్కాడు. నన్నేదో బాగుపరచినట్లు అప్పుడప్పుడు గర్వించాడు. నేనదేమీకాలేదు. కానీ శివపూజలో ఎలుగుబంటిలా వాడు నా జీవితాన్ని తాత్కాలికంగా కలియబెట్టిన మాట మాత్రం నిజం. రోజుకో పుస్తకం, రోజుకో విషయం, రోజుకో రాజ కీయం ఉపన్యాసాలిచ్చేవాడు. ఒకరోజు టాల్‌స్టాయ్ అన్నాడు, ఇంకోదినం విశ్వనాథ, మరో రోజు మార్క్స్. ఇంకా ఏవేవో ఈలాంటివే లారెన్సూ, చలమూ, గోపీచందు, ఊరికే వాగేవాడు. వాడిదో వింతమనసు. వాడో అయో మయం. వాడి బతుకే ఒక మయసభ. వాడెప్పుడో పిచ్చిపట్టిపోతాడు. నా కళ్ల ఎదుటే వాడు వెఱ్ఱెత్తి బ్రహ్మరథం పట్టిన చవట ప్రపంచం మీద దుమెత్తిపోస్తాడు. నాకు తెలుసు. వాడికి బుర్ర చెడిపోవడం నిజం.

పాపం, సుమనశ్రీ జీవితం అన్నివిధాలా నాశమైపోయింది. ఆ పిచ్చి వెధవ వలలో పడిపోయింది. ఆ మేధావి, సంస్కర్త ఆఖరికి గోతిలో పడి పోయాడు. అంతే మరి, వాడు మాత్రం మగాడు కాడు? కానీ నా సుమనశ్రీ ఆ వెఱ్ఱివాణ్ణి చూచి మోసపోయింది. నా వల్ల ఆవిడకేమీ సుఖంలేదు. ఇంత వాడో! పిచ్చిముండావాడు. వాడి దగ్గర సుఖమేముంది? వాడేరోజో సుమనశ్రీ గొంతు నులిమి చంపేస్తాడు. నాకు తెలుసు.

సుమనశ్రీ చాల మంచిది. నాకు ఏ మాత్రం లోటు రానివ్వటంలేదు. రెండు శ్మశానాల మధ్య పెరిగిన ఓ మాలతీలతలా ఆవిడ బ్రతుకు వ్యర్థమయి పోయింది. ఆవిడ చేస్తున్నది గొప్ప త్యాగం. తన అందమయిన పుష్కల

-మయిన శరీరాన్నీ, మెత్తని మనస్సునీ, - కొంగకాలిలాంటి నాకూ, రైల్వే సిగ్నల్ లాంటి వాడికీ పంచిపెట్టింది. ఆమె ఎంత త్యాగం చేస్తూ ఉంది! నేనేం త్యాగం చేశాను? తన దారికి అడ్డురాలేదన్న కృతజ్ఞతా? మరి ఆవిడని పెళ్ళిచేసుకొని సంఘం దృష్టిలో అన్యాయం చేశానన్న ప్రతీకారం లేదే మరి! ఇక్కడే జీవితం వింతగా అవుపించేది నాకు.

జీవితంలో ఎంత అనుభవం గడించినా సుమనశ్రీ చేసిన త్యాగం మాత్రం అర్థంకాలేదు నాకు. ఆవిడంటే అందుకే అంత గౌరవం నాకు. నన్ను చాలా మంది క్షమించరు. ఏంచేయను? వాళ్ళు క్షమించలేదని వాళ్ళ కోసం నే నిప్పుడు ఉన్నట్టుండి ధర్మవీరుడనై పరశురాముడికి మల్లె లేయనా? (లేయ లేను). ప్రళయతాండవం చేస్తూ కొండకోననుంచీ క్రిందికి మహోగ్రంగా సాగి వచ్చే ఆపరాని ప్రవాహాన్ని బంధించడమా! నేనేం రుద్రుణ్ణి కాదుగా? కాలు జారి మురికి కాలువలో పడ్తే మళ్ళీ నా పీనుగను మునిసిపాలిటీ వాళ్ళు వచ్చి ఎత్తేదాకా విముక్తిలేని నేనేమిటి, గొప్ప చరిత్ర నిర్మించుకొని వెలగబెట్టడ మేమిటి? ఆ రఘుపతిగాడితో చేసిన సహవాసం మూలంగా నా కిలాంటి వెఱ్ఱి ఊహాలు రావటం ఎప్పుడయినా తటస్థపడుతూ ఉంది.

రఘుపతి నన్ను అనవసరమైన సానుభూతితో చూడ్డం మొదలుపెట్టాడు. "ఒరే! నీ జీవితమంతా కుళ్ళిపోయింది" అనేశాడు. "బ్రతుకే యింత" అని నిట్టూర్చేవాడు. "సంఘంలో నీ స్థానం యేమిటి?" ఒక పెద్ద ప్రశ్న వేసి బాధపడ్డట్టు కనిపించేవాడు. "లోకం నీకు అన్యాయం చేసింది" అని అంగలార్చేవాడు. "చివరకి సుమనశ్రీ కూడా నిన్ను మోసం చేసింది"అని అనలేక అని బాధపడేవాడు. ఇంకా వాడి పిచ్చికూతలకి అంతేమిటి? విశ్వనాథకూ టాల్స్టాయ్‌కీ నాలాంటి మొగుళ్ళను చూస్తే భయమట. నేనెవణ్ణో - వాడెవడో ఫ్రాయిడట- వాడికి బాగా తెలుసట. డి. హెచ్. లారెన్స్‌కి నన్ను చూస్తే అభిమానమట. పూర్వాశ్రమంలో ఉన్న చెలానికీ, గోపీచంద్‌కీ నే నెవరో బాగా తెలుసట. తప్పతాగి మురికి కాలువలో పడి చచ్చిపోయిన ఎడ్గార్ అలెన్‌పోకి నే నెవరో చక్కగా తెలుసట. "ఒరే, ఈ మనిషెవరు? అని ప్రశ్నించుకొంటే సమాధానమేమిటి?" అని వెఱ్ఱి మొహం వేసుకొని చూచేవాడు. తన బ్రహ్మాండమయిన విజ్ఞానానికి నన్నో బలిపశువును చేసి తృప్తి చెందేవాడు. వాడో పిచ్చివెధవ.

వాడి దృష్టిలో నేనొక అసమర్థుణ్ణి. వాడిదో జాలి గుండె. వాడికి నా మీద సానుభూతి. వెధవ. నా సుమనశ్రీని కొల్లగొట్టి నా మీదే సానుభూతి! నే నసమర్థుణ్ణిట. వాడో పెద్ద సమర్థుడు. దొంగ సన్యాసి. చీడపురుగు. ఛీ-వాడి మొహం చూడాలంటేనే అసహ్యం.

వాడెంత చెప్పినా నా సుమనశ్రీ నాకూ నా పిల్లలకీ అన్యాయం చేయ దనే నమ్మేను. ఔను. ఏలా నమ్మకుండా ఉండగలను? ఆవిడ ఎంత ప్రీతితో చూచేది.

ఆ రోజు రాత్రి తలచుకొంటే నా గుండె నీరై పోతుంది. పిల్ల లంతా నిద్రపోయారు. అద్దె కొంపల్లోని వాళ్ళు కూడా లోపలెక్కడో పడు కొని ఉన్నారు. తులసికోట దగ్గర నే నొక్కణ్ణే పడుకొని ఉన్నాను. రాత్రి పన్నెండో ఒకటో అయివుంటుంది. సుమనశ్రీ నా పక్కన వచ్చి కూచొంది. నా కింకా నిద్ర రాలేదు. సుమనా అని లేచి కూచొన్నాను. వెన్నెల బాగా కాస్తూ ఉంది. సుమనశ్రీ నా కళ్ళల్లోకి జాలిగా చూచింది. ఆవిడ అదోలా అయి పోయింది. గుడ్డి వెన్నెలలో ఆవిడ మొహం కనిపించింది నాకు. కొన్ని క్షణాలు మూగగా గడిచిపోయాయి.

"మీ కింకా నిద్ర రాలేదా?" ఏడ్పు నిండుకుపోయిన గుండెలోంచి వచ్చి నవి ఆ మాటలు.

"ఏదో ఆలోచించుకొంటూ ఉండిపోతే నిద్రరాలేదు సుమా!" అన్నాను.

"మీకు సుఖం లేదు" అంది ఏడ్పునాపుకోలేక.

"సుమనా! ఏమిటిది?" ఓదార్చటానికి ప్రయత్నించాను.

బిగ్గరగా ఏడ్చేసింది. చాలాసేపు ఏడ్చింది. నేనూ ఏమీ మాట్లాడలేక పోయాను. ఆవిడకు కనబడకుండా నేనూ ఏడ్చాను. ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది. నా ప్రక్కనే పడుకొని నిద్రపోయింది. ఆ రాత్రి ఆవిడ శరీరాన్ని ముట్టు కోలేదు. ఒట్టేసుకొని పడుకొన్నాను. ఆవిడ శరీరాన్ని అగ్గిలా చూచాను. మరునటి రోజు మహాలక్ష్మిలా కనిపించింది. ఇంటిలో వెలిగిన దీపంలా కని పించింది. వికసించిన మల్లె పూవుల్లా కనిపించింది. నలుగు రాడపిల్లల్ని కన్యకాపరమేశ్వర్లకు మల్లె అలంకరించింది. ఇంటిలో ఓ వెలుగు వెలిగి నట్లయిపోయింది.

ఆ తర్వాత నా సుమనశ్రీని నిరంకుశంగా ఏలుకొన్నాను. మా నాన్న

మా అమ్మని ఏలుకొన్నట్లు ఏలుకొన్నాను. అది అద్దె కొంప కాదనిపించింది. మనిషికి చావులేదనిపించింది. సుఖానికి అవధిగట్టు కనిపించింది.

రఘుపతి కాళ్ళుకాలిన పిల్లిలా తిరిగి వచ్చాడు. కోపితో తల గీరుకొన్నట్లు నెత్తీ నోటా కొట్టుకొని మరీ తిరిగిపోయాడు. గాంభీర్యం బుగ్గి అయ్యేట్టు ఏడ్చాడు. వాడి సంస్కారం నీఅయ్యేటు పలికించాడు. నా సుమనశ్రీ చెక్కుచెదరలేదు; గర్భగుడిలో మూల విరాట్టులా కదల్లేదు.

* * * *

ఆ రోజున ఆఫీసుకి 8 గంటలకే బయల్దేరాను. ఏదో దిక్కు మాలిన చాకిరీ. మధ్యాహ్నం భోజనానికి కూడా రావడానికి వీల్లేకపోయింది. హోటల్లో టిఫిన్ తిని మళ్ళీ చాకిరీలో దిగిపోవలసి వచ్చింది. ఏదో పీకమీద వచ్చే పని· ఆఫీసరు పీకమీదికి—అంటే మాకూనూ. సాయంత్రం బాగా ఆలస్యమయి పోయింది. ఆరున్నరో ఏడో. ఇంటికి వెళ్ళాను. ఎంత శ్రమపడ్డా సుమనశ్రీ మొహం చూస్తే పోతుంది. సుమనశ్రీ! సుమనశ్రీ! మనసులో అదే ధ్యాస. ఇల్లు చేరుకొన్నాను. సుమనశ్రీ లేదు! చిన్నమ్మాయి శోషపోయే స్థితిలో ఉంది. మిగిలిన ముగ్గురూ ప్రేత కళలతో నన్ను చూసి బావురుమన్నారు. పిన్ని ఎక్కడని అడిగాను. ఎక్కడో పొద్దు ననగా పోయిందట. రాలేదు. ఉన్న సద్దికూడు కాస్తా తిన్నారు. పిల్లలు పస్తు. ఒకటే గోల- ఏడుపు. వెంటనే వాళ్ళ ప్రాణం రక్షించేందుకు, నా భాగేశ్వరికి బుజ్జగించేందుకు హోటలు వెళ్ళి భోజనం పట్టుకొచ్చాను. అయ్యరుగాడిని వేడుకొని బతిమలాడి అప్పు పెట్టి పట్టుకొచ్చాను. అవసరం కాస్తా సర్దిపోయింది. అంతా పడుకొని నిద్రపోయారు.

"ఈ రఘుపతిగాడే ఏమో చేసి ఉంటాడు." అన్నం తిన్న తర్వాత అహంకారం కాస్త ఆలోచనలలో దించింది. వాడితోనేపోయి ఉంటుంది! అని నిర్ణయానికి వచ్చాను. వాడే వచ్చాడు. ఒకడే వచ్చాడు.

"సుమనశ్రీ ఎక్కడ?"

"ఎక్కడ?"

నాకూ నా పిల్లలకే కాదు- రఘుపతికి కూడా అన్యాయం చేసిపోయింది. ఎక్కడికి పోయింది?

ఏమో, తెలీనే లేదు.

ఆ రాత్రి నిద్రపట్టలేదు. అన్నీ పీడ కలలే. మరుసటి రోజు పిల్లలకి అన్నం వండిపెట్టి లేటుగా ఆఫీసుకి పోతూ ఉంటే ఎవరో అనుకొంటూ ఉండటం వినిపించింది- ఏదో వయసులో ఉన్న ఆడది రైలు కిందపడి మూడు ముక్కలయిందని.

ఆఫీసుకో అర ఫర్లాంగులో రైలు పట్టాలు. వెళ్ళి చూడాలనిపించింది. వెళ్ళాను. రాత్రి ఎక్స్‌ప్రెస్ క్రింద పడి చచ్చిందట. శరీరం మూడు భాగా లయింది. గుర్తు తెలీని రీతిగా గాయాలు తగిలాయి. గుమ్మడి కాయంత తల, కల్లు పీపా అంత మొండెం, పోక బోదలంతటి కాళ్ళు- అన్నీ రక్తంలో తడిసి మాంసపు బురదలో పూతపూసుకొని ఉన్నాయి.

నా సుమనశ్రీ ఏనా?

అనుమానం. అంతు దొరకటం లేదు. నా వాలకం చూచి అక్కడున్న దర్యాప్తుదారులు "ఎవరీ మనిషి, మీకు తెలుసా?" ప్రశ్నించారు.

ఏం చెప్పను? తడబడ్డాను. నా తడబాటును దర్యాప్తుదారులు గుర్తించకుండా తమాయించుకొన్నాను.

ఒకచోటు అభిమానం, మరోవేపు అభిమానం. అనవసరపు గొడవ. నూతులు త్రవ్వితే బేతాళాలు పుట్టుకొచ్చాయట. ఏమో, అంతా అయోమయం.

"ఎవరీ మనిషి?" ఈసారి సాధికారంగా వచ్చింది ప్రశ్న.

"అబ్బే. ఈ స్థితిలో ఎవరని గుర్తు పట్టగలం?" సమాధానమిస్తూ ఉన్నాను. శరవేగంతో ఒక ఎక్స్‌ప్రెస్ రైలు గుండె వక్కలయ్యేట్టు ఈల వేస్తూ దూసుకుపోయింది.

ఆఫీసు కప్పుడే లేటయింది.

ఆఫీసులో ఆ రోజు తిట్లు తిన్నాను.

సుమనశ్రీ ఏమయింది?

పాపం, ఏమయిందో!

"రైలు క్రిందపడి చచ్చేంత మనసు ఆ పిశాచానికి లేదు" అన్నాడు రఘుపతి. "ఎవడితోనో లేచిపోయి ఉంటుంది" అన్నాడు.

అందుకేనా ఆ రాత్రి నాకు సుఖం లేదని ఏడ్చింది? ఛీ! వాడి మాటల కేం, వాడో పిచ్చి వెధవ! వాడికి సుమనశ్రీమీద గౌరవం బొత్తిగా లేదు. రైలు క్రిందపడి చచ్చిపోయి ఉంటుంది.

లేకపోతే మళ్ళీ కనిపించలేదే మరి!

పోలీసు రంగయ్య ప్రయాణానికి సిద్ధమై వీధి వసారాలో నిలుచున్నాడు, మీసం సవరించుకొంటూ.

"ఏమండీ!...." ఇంటిలోపలినుండి రాణెమ్మ అనురాగపు పిలుపు వినబడింది.

"ఆఁ! వెళ్ళ లేదులే. రా! పై అధికారి ఉత్తరువయినా సరే, రాణీగారి ఆజ్ఞలేనిదే వెళ్ళగలనా....?" రాణెమ్మ నవ్వు ముఖం-నిండుగా, వికసించిన చేమంతి పువ్వులా వుంది.

"ఏం మాటలండీ, మరీను...." అంటూ చేతిలోని నేతి సీసా తుడుస్తూ నిలుచుంది.

"ఉన్న విషయమే! రంగయ్య రాణెమ్మతో సరసాలాడుతున్నాడని ఇరుగుపొరుగు అనుకుంటారని భయమా?" రంగయ్య మీసాల మీదుగా నవ్వు విరిసింది.

"మీసం నెరిసినా సరసం పోయింది కాదు...."

"హృదయ మెరిగిన భార్య చెంత నుండగా...."

"మీ మాటలకేంగానీ, నెయ్యి తీసుకెళ్ళి అబ్బాయి కిచ్చెయ్యండి."

"అందుకే అన్నానుగా-పోలీసు డ్యూటీ....రాణీగారి డ్యూటీ...."

"మీ మాటలు వింటే పోలీసుపేట పగలబడి నవ్వేటుంది....అబ్బాయిని బాగా చదవమనండి. అంతకంటే ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమనండి."

"కొడుకుమీద ఎంత ప్రేమ! ఆ మాత్రం ఈ పోలీసు రంగయ్యమీద వుండి వుంటే...."

"అయ్యో స్వామీ!...." ముఖం మీసి సిగ్గు తెరలు పైట చెరగుతో దాచుకుంటూ నవ్వింది రాణెమ్మ. రంగయ్య వెన్నెధిని చూసిన పేదలా ఆమెను చూస్తూ నిలుచున్నాడు. రాగ రంజితమైన రాణెమ్మ ముఖం చూడాలనే కోరిక రంగయ్యలో అక్షయంగా వుంది. ఎన్నిసార్లు చూసినా ఆ అందంలో కొత్తదనం కన్పడుతూంటుంది, అప్పటి కప్పుడు. ఎంతసేపు చూసినా తనివి తీరని ఆనందం.

రంగయ్య రాణెమ్మల దాంపత్యం నిత్య నూతనం. నిండుగా అనురాగాలు నింపుకున్న పూర్ణకుంభాలు వారి జీవితాలు.

"ఏమండీ!....అబ్బాయి శెలవుల్లో వచ్చినపుడు ఏమన్నాడో తెలుసా? ఈ మూడు నెలల్లో చదువు పూర్తి కాగానే ఉద్యోగంలో చేరుతాడట. వెంటనే మీరు ఉద్యోగం మానుకోవాలట!" సంతోషంగా చెప్పింది రాణెమ్మ.

రంగయ్య మనస్సు చివుక్కు మన్నది.

"ఏం? తను పోలీసు జవాను కొడుకునని చెప్పుకోవటం తనకు నామర్దాగా వుందటనా? తల వంపుగా వుందటనా?"....కటువుగా వచ్చిన మాటలకు రాణెమ్మ బాధ పడింది.

"అది కాదండీ! అబ్బాయి ఎంత మంచి మనసుతో అన్నాడో అర్థం చేసుకోకుండా అలా మాట్లాడుతా రెందుకండీ?"

"ఊఁ! ఇంకా ఏమన్నాడు? మొదటి జీతం రాగానే నీకు పట్టుచీర కొనిపెడ్తా నన్నాడా?"....తను ఆ మాత్రం తేలేకపోయాననే బాధను అణచుకోలేకపోయాడు రంగయ్య.

"ఎందుకండీ, వా డంటే మీ కంత కోపం?....నాతో చనువుగా వుంటాడనేగా? చిన్నప్పుడే- బుద్ధి తెలియకముందే ఒక దెబ్బతో హడలు కొట్టేస్తిరి; ఇక మీ ఎదుట నిలిచి మాట్లాడే ధైర్యం ఎక్కడిది వాడికి?"

"ఊఁ! కాగితాలు ముద్ర కొట్టి పంపినట్టు డిగ్రీలయితే యిస్తున్నారు కానీ, వాటికి విలువ ఎక్కడుంది? సారం లేని బంజరుకు పట్టా లిచ్చినంత మాత్రాన పంటలు పండుతాయా?....అనుభవంలేని వాడి ఆశలు! లోకం పోకడ తెలియని ఊహలు!"

"ఏ ఉద్యోగమూ రాకపోతే-ఎన్.సీ.సీ కాబట్టి మిలిటరీ ఉద్యోగం తప్పకుండా వస్తుందట. అబ్బాయికి మిలిటరీలో చేరాలనే ఆశయం గట్టిగా వుంది."

"పెళ్ళి చేసుకోడటనా?" మెల్లగా నవ్వుతూ అడిగాడు రంగయ్య.

"మీరు పెళ్ళి చేస్తానంటే వద్దంటాడా?" ప్రసన్నంగా భర్త ముఖంలోకి చూసింది.

పోలీసు వ్యాను హారను వినబడింది.

"అరే! టయమయింది. మల్లయ్య బావ కూడా వెళ్తున్నాడు....రాణీగారి ఆజ్ఞ అయినట్లేనా?"

"వెళ్ళిరండి."

రంగయ్య వ్యానులో కూర్చునేవరకు చూస్తూ నిలుచుంది రాణెమ్మ. తర్వాత తేలికపడిన హృదయంతో, ఉత్సాహంతో ఇంటిలోకి వెళ్ళింది.

కాలేజీ విద్యార్థుల స్ట్రయిక్ స్పెషల్ డ్యూటీమీద వెళ్తున్నారు పోలీసులు, జిల్లా కేంద్రానికి. చెట్లమీద గూళ్ళలో శబ్దం, పోలీసుల యిళ్ళలో శబ్దం—ధ్వని, ప్రతిధ్వనిలాగా విన్పిస్తున్నాయి. రాణెమ్మ వాకిట్లో నీళ్ళు చల్లి ముగ్గు పెట్టింది. చలికి చేతులు వణుకుతున్నాయి. వ్రేళ్లు వంకర్లు పోతున్నాయి. వీధి తలుపు మూసింది. చలికి పాత కోక కప్పుకుంది. తలకు, చెవులకు కూడా గుడ్డ చుట్టింది. నీటిలో తడిపి, సానరాతికింద అణగవేసిన విస్తరాకులు తీసి చాపమీద వేసింది. ఈనె పుల్లలు బుడ్డీ దీపం సెగలో వేడి చేసింది. ఆకుకు ఆకు అంటుపెట్టి కుట్లు వేస్తూంది. విస్తర్లు చకచకా కుట్టుతూంది.

అతుకుల విస్తరిలాగా సాగుతూన్న సంసారం!

నవ్వుకుంటూంది. నవ్వుకుంటూ జోరుగా కుట్లు పెడ్తూంది.

అయినా ఇంకెన్ని రోజులు?

అతుకుల బ్రతుకు ఇంకెన్ని నెలలు?

మూడు నెలలు! మూడు క్షణాలు!

....అప్పుడే ప్రొద్దు పొడిచింది. రాణెమ్మ కుట్టుతున్న విస్తర్లు అవతలకు నెట్టింది. ముసుగు తొలగించింది. గూటినుండి కోడిపెట్టను వదిలింది. తవుడు కలిపి ఎనుముకు పెట్టింది. ఎనుము దూడను పొదుగు దగ్గరకుచేర్చింది-దిష్టి బొమ్మలా. ప్రాణం లేని గడ్డి బొమ్మను చూచి ఎనుము చేపింది. పుట్టిన వారానికి దూడ చనిపోయింది. ఎందుకు? జున్నుపాలు ఎక్కువగా త్రాగిందన్నారు. దూడ లేని ఎనుము పాలు ఇవ్వలేదు. ఎవరో ఉపాయం చెప్పారు. గడ్డి బొమ్మను చేపి ఎనుము దూడ తోలు కుట్టారు: ప్రాణం లేని దూడను చూస్తే ఎనుము పొదుగు చేపు విడుస్తోంది.

రాణెమ్మ పాలు పితుకుతూంది.

ఎప్పటినుండి వేచి కాచి కూర్చుందో వేపచెట్టుమీద దేగ రివ్వున వడి

పింది. పడుతూ లేస్తూ కోడి పెట్టను తన్నుకపోతూంది. కుక్కలు లొళ్ళున మొరిగాయి. ఎనుము బెదిరి తన్నింది. రాణెమ్మ చేతి పాలచెంబు ఒలికింది. గాజులు గల్లున పగిలాయి. ఎనుము దూడ నలిగిపోయింది. రాణెమ్మ చెంబు అవతల పెట్టింది. పట్టరాని కోపం వచ్చింది. కర్ర తీసి నాలుగు బావా లనిపించింది. కాని బెదురుతూ జాలిగా చూ స్తున్న ఎనుమును చూ స్తుంటే, కోపం చల్లారిపోయింది. నవ్వు వచ్చింది. నలిగిపోయిన దూడను సరిచేసింది. కాని ఎనుము పాలు పితకనివ్వలేదు. రాణెమ్మ త్వరత్వరగా వెళ్ళి ఇద్దరు వాడుక వాళ్ళకు పాలు పోసింది. మరొకరికి నచ్చ జెప్పి వచ్చింది. ఇంటికి పాలు మిగల్లేదు.

"అత్తా! ముగ్గు బాగుందా?" నవ్వుతూ పలకరించింది పాప, రాణెమ్మను.

"పాప చేసిన పనికి ఒప్పారమా?"

"అన్నీ నువ్వు నేర్పినవేగా?" చిరునవ్వు నవ్వింది పాప.

పాప ఎవరో కాదు. పోలీసు రంగయ్య ఇంటికి మూడో యింట్లో వున్న పోలీసు మల్లన్న కూతురు. రంగయ్యకు మల్లన్నకు వున్న సామ్యం ఒకే ఉద్యోగం. సంబంధం మంచితనం. పాప పేరేమో కానీ, పాప పోలీసు పేటకు ముద్దు పాప! పాప చిరునవ్వు- విచ్చుకుంటున్న మల్లె మొగ్గలో కాంతిలా వుంటుంది. పాప చిరునవ్వు చూచి నవ్వుకుంటూ వెళ్ళింది రాణెమ్మ.

మగ్గేసిన పేడలో వరిపొట్టు పోసి, తొక్కి, పిడకలు తట్టి ఆరబెట్టింది రాణెమ్మ. మజ్జిగతో చద్ది అన్నం తిని, మాపిన గుడ్డలు చుట్టి, బుట్టలో పెట్టింది. ఇంటికి బీగం వేసింది. ఎనుము పలుపు వదిలింది. చంకలో బుట్టతో, చేతిలో కర్రతో ఎనుము వెనుక పోటుమిట్ట దిగుతూంది రాణెమ్మ. ఎనుము బెదురు చూపులతో బిరబిర నడుస్తూంది.

పోలీసుపేట- పోటుమిట్ట—వూరికి దూరంగా వెలి వేసినట్టుంది. పోటుమిట్టకు ఒక వైపున వేపచెట్టు, మరొక వైపున మర్రిచెట్టు గుబురుగా వున్నాయి. పాడుపడిన కోటగోడలో పోలీసు క్వార్టర్సుకు కాపలా కాస్తున్నట్లు- ముందు, వెనుకల-ఎన్ని ఏండ్ల తరబడి వున్నాయో మరి, ఆ చెట్లు? వూడలు దిగిన మర్రి కొమ్మలు, పుండుపుట్టి చింపిరిగా వున్న వేప కొమ్మలు

కలుసుకున్నాయి, పోలీసు క్వార్టర్సు మీదుగా. ఎన్ని తరాలకు ముందు కట్టారో మరి పోలీసు క్వార్టర్సు! అక్కడక్కడ పెంకుటిండ్లు బూజు పట్టాయి. ఇండ్లమీద చెట్లు మొలిచాయి. వేర్లు చేసిన చీలికల్లోంచి వర్షాకాలంలో పోలీసు ఇళ్ళలో నీటి బొట్లు రాలుతుంటాయి, ముత్యాల్లా. ఊరు పెద్దది కాక పోయినా, పోలీసు క్వార్టర్సు చాలా వున్నాయి. ఒకప్పుడు కనుమదారికాచే బందిపోటుల నివారణకై పోలీసులు స్థిరంగా వుండవలసివచ్చింది. పోలీసు పేట ఎత్తుగా వున్న బోడుమీద వుంది. చుట్టూ పోనుపోను పల్లం. ఎటువైపు గాలి వీచినా, ఎత్తయిన బోడు, గుబురు చెట్లు అడ్డు తగిలి నిలుస్తాయి. పోటు గాలికి అడ్డు పోలీసు పేట. అందుకే పోటుమిట్ట పేరు స్థిరపడింది పోలీసు పేటకు.

ఒక్కోమారు పోటుగాలి సుడిగాలి అవతారం దాలుస్తుంది, పోటు మిట్టలో. సుడిగాలి ఎప్పుడు వస్తుందో, ఎలా వస్తుందో తెలియని పిల్లలు సుడిగాలిలో చిక్కుకుంటారు. కెవ్వున కేక వెయ్యలేక, గుక్క తిప్పుకోలేక, నేలకొరిగి సొలిపోతారు. సగం కళ్ళు మూసుకొచ్చి సుడిగాలి విచిత్ర రూపాన్ని వింతగా చూస్తుంటారు, అలవాటుపడ్డ పోలీసు పిల్లలు. పై చదువుకు పట్నం వెళ్ళి చదువు మాట మరిచిపోయిన పల్లెటూరిపిల్ల ఫ్యాషన్లు మార్చినట్లు, రోజు రోజుకూ మారుతూంది వూరు. జీవనాధారానికి ఒకరిపై ఆధారపడటం యిష్టం లేక ఏదో ఒక పని దీక్షతో కొనసాగిస్తున్న పండు ముసలాడిలా వుండి పోయింది పోటు మిట్ట. పని పూర్తి చేసినప్పుడు సంతృప్తిగా నవ్వే ముసలాడి కళ్ళలో వెలుగుల్లా- పోటు మిట్ట ఇళ్ళవాకిళ్ళ ముందు ముగ్గులు అందంగా వున్నాయి.

"అత్తా!"....దూరంలోనుండి పాప చేయి వూపింది. విద్యార్థులు, తోటి అమ్మాయిలు పాపను చూచి నవ్వారు. పాప సిగ్గుతో జోరుగా నడిచింది. "అత్తా! స్కూలులేదు. సెలవు. కాలేజీకూడా సెలవట! స్ట్రైకు మానేవరకు అందరికీ సెలవులే!" మెల్లగా, సంతోషంగా చెప్పింది.

"సరే, మీ చదువులు సాగినట్లే, యీ సమ్మెలతో!"

"........ .... .... .... .... .... ...."

"ఇదిగో బీగం చెవి." పైటలో ముడిపెట్టిన బీగం చెవి పాప చేతికి యిచ్చింది రాణెమ్మ.

"ఎందుకు?"

"రమేష్ రావచ్చుగా?"

"అత్తా, త్వరగా వచ్చెయ్."

"ఏం?"

"బావ వస్తే?"

"నువ్వున్నావుగా, మీ బావ వస్తే?"

"ఛో, అత్తా!" మెల్లగా పరుగు తీసింది పాప.

ఊరి ముందర పాడు బావి పెద్ద అగాథంలా వుంది. ప్రక్కన సన్నని దారి. బెదురుతూ నడుస్తున్న ఎనుము ప్రక్కగా నడిచింది రాణెమ్మ. వూరు దాటింది. పచ్చని పొలాలు. ఏపుగా పెరుగుతున్న చెరకుతోటను కొట్టేస్తున్నారు. ఎనుమును మేటిలో తోలింది. చపుడు పెట్టి, గుడ్డలుతికి ఆరవేసింది. గాలికి కొట్టుకు పోకుండా నాలుగు చెరగులమీద పిడికెడు ఇసుక పోసింది. బిరబిర బెదురు చూపులతో ఎవరో వెనుకనుండి తరుముతున్నట్లు కలవరపాటుతో తుంగల గట్టున మేస్తూంది ఎనుము. చింతతోపులో పుల్లలు కన్పించాయి. చింతకాయల్ని కోసేస్తున్నారు యానాదులు. కొంతమంది కాయలు ఏరి మూటలకు పోసి బిగిస్తున్నారు. రాణెమ్మ చింత పుల్లలు ఏరి, వాదిగా పెట్టింది. చెట్టు మొదట్లో యానాదుల కంట పడకుండా తప్పిపోయిన చింతకాయలను అందుకొంది. పుల్లలతో చింతతోపు బయటకు నడిచింది.

చింత పండు ధర ఎక్కువ! బెల్లం ధర ఎక్కువ! అన్నిటికీ గిరాకీ!

అందుకే పెరుగుతున్న చెరకు నరికేస్తున్నారు. దోరగా వున్న చింత కాయలు రాలగొట్టేస్తున్నారు.

ఏటి గట్టున రంగులు మాయని కొత్త సమాధి! నిన్న మొన్నటివరకు తిరుగు మందులేని జాడ్యంలా ఆ ప్రాంతాన్ని పీడించిన మనిషి సమాధి. ఆ సమాధికి ఎంత ఖర్చు! కొంపలు లేని పది కాపురాలకు ఇళ్లు కట్టడానికి చాలినంత డబ్బు ఖర్చుపెట్టారు. కాని ఆయన నాయకుడు. కాలానికి తగిన నాయకుడు! ఆ నాయకుడు కీర్తిశేషుడు! గుర్తు....సమాధి!

చల్లని చెట్టు నీడన కూర్చుంది రాణెమ్మ.

దూరంగా—ఊర ఎనుముల్ని మేపే పిల్లలు గుడ్డలు వదిలి నీటి మడుగులో దూకుతున్నారు, ఒకరి మీద ఒకరు.

పని నిలిపిన యానాదుల సరసాల పాటలు!

రాణెమ్మ ఒక చింతకాయ బొబ్బర వొలిచింది. కండ బలిసి ఎర్రగా, పచ్చగా వుంది. తీపు—పులుపు! ఒళ్ళు గగుర్పొడిచింది. గగుర్పాటులో పుల్లదనం గుర్తుకు రాలేదు.

పెళ్ళి అయిన మొదటి రోజు 'ఝాన్సీకి రాణివి కాకపోయినా నా హృదయానికి రాణివి!' అంటూ ఆయన హృదయాని కదుముకొన్నపుడు ఎంత వింత అనుభూతి కలిగింది! క్రొత్త అనుభవాలు పాతబడినా, నేటికీ ఆ పేరుతోనే 'రాణీ' అని పిలుస్తుంటా రాయన. ఆయన పిలుపులో ఎంత మాధుర్యం! ఎంత రుచి!

పెళ్ళయి సరిగా రెండు సంవత్సరాలు తిరగక ముందే కొడుకును కన్నది. హృదయం వూయల లూగింది. మరికొన్ని రోజులకు ఝాన్సీరాణి రాణెమ్మగా మారిపోయింది. కాలం మారింది. మనుషులు మారుతున్నారు. జీవన విధానాలు మారుతున్నాయి. రంగయ్య వయస్సులో మార్పు వస్తూంది. ఉద్యోగంలో మార్పు వచ్చింది—ఒక మెట్టు పైకి! కాని రంగయ్య అలవాటులో మార్పురాలేదు. రంగయ్య తన వృత్తి ధర్మానికి మనసా, వాచా, కర్మణా అంకితమై పోయాడు. జీవితంలో ఎంత ఎదురుగాలి వీచినా, తొణకని బెణకని స్థిరత్వం అతనిలో ఆశ్రయం సంపాదించుకొన్నది. సుడిగాలిలో నిశ్చలంగా నిలబడగలడు, రంగయ్య. రంగయ్య అంటుంటాడు—'నా అదృష్టం చాల గొప్పది!' అని. అదేమిటని సన్నిహితులడిగితే "అదే, రాణి నా భార్య కావటం" అంటాడు. ఆ జవాబు సంతోషంగా, సంతృప్తిగా అతని నోట వస్తుంది ఆ మాట విన్న రాణెమ్మకు పూలతేరుమీద వూరేగినంత ఆనందం.

ఇద్దరు పిల్లలు జుట్లు పట్టుకొని ఇసుకలో పొర్లాడారు. పంచాయతీకి రాణెమ్మ దగ్గరకు వచ్చారు ఏడుస్తూ. మిగతవారు నవ్వుతున్నారు. సర్ది నచ్చజెప్పింది, రాణెమ్మ. కణతమీద గాయం తగిలిన పిల్లవాడు ఏడుపు మానలేదు. దగ్గరకు తీసుకొని వెంట్రుకలు సవరించింది. పైట చెరగు చింపి కట్టు కట్టి

ఓదార్చింది. పిల్లవాడు ప్రక్కనే కూర్చున్నాడు. చిన్న సంఘటన గుర్తు కొచ్చింది రాణెమ్మకు. సంఘటన చిన్నది. కాని చాల విచిత్రమైనది. చింత కాయ పులుపుకి పళ్ళు పులిసిపోయాయి.

రంగయ్యకు వేటలో మంచి నైపుణ్యం వుంది. కొడుకును చిన్న తనంలో దగ్గర పెట్టుకొని వేట విశేషాలు చెప్పేవాడు. ఎగిరే పక్షుల్ని ఎలా కాల్చాలి, జంతువుల్ని ఎలా గురిచూసి కాల్చాలి- మొదలైన విషయాలు కొడుకు శ్రద్ధగా వినేవాడు. ఒక దీపావళి రోజు నిద్రపోతున్న రంగయ్యను లేపి 'నాన్నా! నిన్ను కాల్చేస్తా' అంటూ రంగయ్య కణతకు టాయ్ పిస్టలు గురి పెట్టాడు రమేష్. రంగయ్యకు చివుక్కున కోపం వచ్చింది. రమేష్ చెంప మీద ఛెళ్ళున వేశాడు. కెవ్వుమని, రమేష్ గడగడ వణికిపోయాడు. పనిలో మునిగివున్న రాణెమ్మ పరుగున వచ్చి కొడుకు చెంపనిమిరి కన్నీరు తుడిచింది. ఆనాటినుండి రమేష్‌కు తండ్రి అంటే సింహస్వప్నం. రాణెమ్మ దగ్గర రెండింతలు చనువు పెరిగింది.

రాణెమ్మ జీవితానికి ఆధారం రంగయ్య- చెట్టుకు ఆధారం భూమిలా. ఆమె ఆశల ఆకాశంలో చుక్క రమేష్. ఆమె స్వప్నాలన్నీ అతని ఉన్నతి!

రాణెమ్మ ఆరిన గుడ్డలు మడతపెట్టి బుట్టలో పెట్టింది. కట్టె పుల్లలు తీగతో కట్టి బుట్టమీద పెట్టింది. పిల్లవాడి చేతిలో పది పైసలు పెట్టి "బాబూ! ఎనుమును జాగ్రత్తగా ఇల్లు చేర్చు" అంటూ యింటి ముఖం పట్టింది.

పుస్తకం చేతిలో పెట్టుకొని అరమోడ్పు కన్నులతో పడక కుర్చీలో నిద్రపోతూంది పాప. రాణెమ్మ పుస్తకం తీసి క్రింద పెట్టింది. పాపను ఆట పట్టించాలని వెనుక వైపుగా వెళ్ళి కళ్లు మూసింది చేతుల్తో.

"ఆఁ!" అంటూ ఉలిక్కి పడింది పాప.

"ఫో అత్తా! ఎవరో అనుకున్నాను." కోపం అభినయించింది.

"ఎందుకంత కోపం? తియ్యటి కల చెదరగొట్టానా?"

"పగటి కలలు కనేంత కర్మ ఏముంది?"

"ఇంతకూ ఎవరనుకొన్నావు? రమేష్ అనుకొన్నావు. కళ్ళు తెరిచి చూస్తే నేను! అందుకేనా అంతకోపం?"

"ఫో అత్తయ్యా!"

"....నిజమేనా?"

"అది సరే అత్తా; వట్టి చెయ్యి వుంది, గాజులేమయినాయి?"

"ప్రొద్దున్నే పగిలిపోయాయి."

పాప తన మెడలోని నల్లపూసల దండ తీసి, వద్దంటున్నా వినకుండా, రాణెమ్మ చేతికి చుట్టింది.

"వంటలేం చేశావు?"

"ఏముంది? ఇంటి వెనుక వుందిగా కల్పవృక్షం-మునగచెట్టు! మునక్కాయ తాళింపు. అప్పకయితే తాళింపే సరిపోతుంది. కొద్దిగా రసంకూడా పెట్టా!....అత్తా! ఆకలేస్తూంది. కూరలు ఎలాగూ వున్నాయి. పొయ్యిమీద బియ్యంపెట్టు. బావ రైలుకు రావచ్చు;....పోనీ, నేను సహాయం చేయనా?"

"అదేం వద్దు. నువ్వు చదువుకో!"

పొద్దుతిరిగినా రమేష్ రాలేదు. రైలు వెళ్ళింది. భోజనానికి ఒకటిగా కూర్చున్నారు పాప, రాణెమ్మ. మునక్కాయ నోట్లో వేసుకున్న రాణెమ్మ ముఖం చిట్లించింది.

"ఏమత్తా! తాళింపు బాగాలేదా?"

"తాళింపు బాగానే వుంది. నా పళ్ళే సరిగా లేవు."

"ఏం?"

"పళ్ళు పులిసిపోయాయి" అంటూ నవ్వింది రాణెమ్మ. మునక్కాయలే కాదు, భోజనంకూడా సరిగా మ్రింగుడు పడలేదు.

భోజనం ముగించి చినిగిన గుడ్డలు ముందువేసుకొంది, రాణెమ్మ. పాప పుస్తకం తీసుకొని ప్రక్కన కూర్చుంది. 'పాపా! సూదికి దారం కూర్చవే- నా కంటికి బెజ్జమే కన్పడటంలేదు."

సూదికి దారం కూర్చి యిచ్చింది పాప.

"అత్తా, చూపు తగ్గినట్టుంది కదూ?"

"అలాగే వుంది."

"అత్తా! నా మాట వినవూ?"

"ఏమిటే?"

"విస్తర్లు కుట్టేపని మానెయ్." పాప ఆలోచన అర్థమయింది రాణెమ్మకు.

"సరే! నేను విస్తర్లు కుట్టకపోతే, మీ బావ చదువెలా సాగుతుంది?.... అయినా, ఇంకెన్ని రోజులు లేవే! వేళ్ల మీద లెక్కపెట్టవచ్చు. రమేష్‌కు చదువు పూర్తికాగానే నన్ను ఈనెపుల్లలు పట్టుకోనిస్తాడా?"

మెల్లగా నవ్వింది పాప.

"ఏమిటే నీ ఆలోచన, చదువుకోక?"

ప్రక్కింటివారికి పిడకలు లెక్కపెట్టి ఇచ్చింది రాణెమ్మ.

విస్తరాకులు ముందువేసుక కూర్చుంది.

"అత్తా! అన్ని పనులు నేర్పావు నాకు, మరి విస్తర్లు కుట్టడం ఎందుకు నేర్పవు?"

"ఏమీలేదమ్మా! నీ జీవితం యిలా అతుకుల విస్తరిలా వుండ కూడదని."

పాప హృదయం ఆర్ద్రతతో నిండిపోయింది. రాణెమ్మని ఏదో అడ గాలనుకొని, మరలా మానుకొంది.

ఎనుము ఇంటికి వచ్చిన శబ్దం విని, పలుపు తగిలించి వచ్చింది. పాప సాయంకాలం వంటకు అవ్వకు తోడ్పడటానికి వెళ్ళింది.

రాణెమ్మ పొయ్యిమీద ఎసరు పెట్టి, విస్తర్లముందు కూర్చుంది. పోలీసు రంగయ్యకు రాణెమ్మ పెద్దగా అదృష్టాన్ని తెచ్చి తూగుటుయ్యేలలో ఊపక పోయినా, అతనికి అనుగుణంగా మెలుగుతూ వచ్చింది. ఎప్పుడు నోరు తెరచి ఫలానా కావాలీ అని అడగలేదు. రంగయ్య తెచ్చిన పూచికపుల్లను పెన్నిధిలా భావించి సంసారం గుట్టుగా, గుప్తంగా సాగించింది.

రమేష్ కాలేజీకి వెళ్ళాలన్నప్పుడు రంగయ్య తికమక పడ్డాడు. గుండె ధైర్యం చాలకపోయింది. కష్టపడి రేయింబవళ్ళు చదివి పరీక్షలో ఏ మాత్రం అర్థంకాని ప్రశ్నలు చూసిన విద్యార్థిలా తెల్ల మొగం వేశాడు. నవ్వుతూ రాణెమ్మ తన చెవుల్లో కమ్మలు తీసి యిచ్చినపుడు ఆశ్చర్యంగా చూశాడు. తానుగా ఎప్పుడూ ఆమెకు నగలరూపంలో ఏమీ పెట్టలేకపోయాడు. పుట్టింటివారు

పెట్టిన సొమ్ము రాణెమ్మ సంతోషంగా యిస్తుంటే తీసుకోలేకపోయాడు. అయినా, కమ్మలు అమ్మినా మూడు నెలలకు సరిపడిన డబ్బు మాత్రమే వస్తుంది. రమేష్‌కు తన కుటుంబ పరిస్థితి ఎందుకు తెలియదు? ఎందుకు ఆలోచించడు? కాలేజీ చదువులు తనలాంటి వాడికి అందని ద్రాక్షపళ్లని ఎందుకు గ్రహించలేడు? ఆలోచనలతో సతమతమయ్యాడు రంగయ్య.

"ఎందుకండీ, అలా చూస్తారు? మరేం ఫరవాలేదు. నాకు నగలు పెట్టుకోవాలనే కోరిక లేదు. ఇవి అమ్మి, బాగా పాలుపిండే ఎనుమును పట్టుకరండి." చిరునవ్వుతో చెప్పింది రాణెమ్మ. మరి, మాట్లాడలేక వెళ్ళాడు రంగయ్య.

రాణెమ్మ చేసిన మరొక ప్రయత్నం బాగా ఉపకరించింది. ఇంటి ముందర మర్రిమాకులు చిగిర్చినపుడు ఆకులు కుట్టి తోరణాలు కట్టి ఎండబెట్టి సంవత్సరం పొడుగునా విస్తర్లు కుట్టేది. విస్తర్లలో వచ్చే ఆదాయం దాదాపు వారానికి పదిరూపాయల నుండి పదిహేను రూపాయలవరకు పెరిగింది. తీరిక సమయంలో పుస్తకాలు చదివే అలవాటు రాణెమ్మకు. కానీ కొడుకు కాలేజీకి వెళ్ళాక క్షణం తీరిక లేకపోయింది.

పొయ్యిమీద ఎసరు పొంగిపోయింది. రాణెమ్మ సగం కుట్టిన ఆకు అవతలకు నెట్టి లేచివెళ్ళింది. వంట చేసింది. విస్తర్ల ముందు కూచుంది. కళ్ళు నొప్పి పుట్టాయి. రమేష్ వస్తాడన్న ఆశతో ఎదురు చూస్తూ నిలుచుంది. చెట్టు మీదినుండి పోటుగాలికి రెక్కలురాని పక్షి క్రిందపడింది. కాకులు తన్నుకుపోయి చీల్చేశాయి. రాణెమ్మ హృదయం కలుక్కుమంది.

సాయంకాలం పక్షులు గూళ్ళు చేరుతున్నాయి. రెక్కలు విప్పి నోరు తెరచి ఎదురుచూచే కూనలకు ఆహారం నోటిలోపెట్టి రెక్కలతో కప్పిన పక్షుల వింత శబ్దంతో పోటుమిట్ట ప్రతిధ్వనిస్తూంది. పోలీసుల పిల్లలు ఇళ్ల వాకిళ్ల ముందు దీనంగా చూస్తూ నిలుచున్నారు—ఆటలతో విసిగిపోయి, నాన్నల కోసం.

రకరకాల రంగురంగుల బెలూన్లు తెచ్చాడు వ్యాపారి. పిల్లలు బిలబిల అతని చుట్టూ మూగారు. బెలూన్లు కొన్నారు, తమవద్ద దాచుకున్న పైసలతో. వ్యాపారి జేబు నింపుక పోయాడు. బెలూన్లు కొద్ది క్షణాల్లో పగిలిపోయాయి. గాలి గాలిలో చేరిపోయింది. చీకటి పడింది. మరో వ్యాపారి "కాశీపట్నం

చూడరబాబూ!" అంటూ వచ్చాడు. స్టాండుమీద చిన్నపెట్టె—వివిధ పట్టణాలున్న ఫిలిం చూపెట్టడానికి అనువుగా అమర్చాడు. పిల్లలు పైసలకు తల్లుల్ని వేధించారు. పైసలు వున్నవారు కాశీపట్నం చూశారు. మిగతావారికి చెంపదెబ్బలు తప్పలేదు, తల్లులదగ్గర. బేరం సరిగా జరిగినట్లు లేదు, కాశీపట్నం వ్యాపారి వెళ్ళిపోయాడు. అతని అరుపులకు రాణెమ్మ ఎనుము లేచి నిల్చుంది. బెదిరింది.

విస్తర్లు లెక్కపెట్టి, పొత్తర్లు కడుతూంది రాణెమ్మ.

"అత్తా! రాలేదా? ..." అడిగింది పాప, భోజనం చేసివచ్చి.

"ఎవరు?...." ఎరుగనట్లు నవ్వింది రాణెమ్మ. పాపతో మాట్లాడటం ఆమెకు సరదా. పాపను చూస్తే వాత్సల్యం, ఆత్మీయతాభావం పొంగులా వస్తాయి.

"మీ సుపుత్రుడు!"

"లేదు. రా, కూర్చో!" ఇద్దరూ చాపమీద కూర్చున్నారు.

"భోజనం చేశావా, అత్తా?"

"ఊఁ!"

"ఊఁ? నిజంగా? కొడుకుగారు రానిదే, నీకు అన్నం దిగివుంటుందా?"

"సరే గానీ, బాగా చదువుతున్నావా?" ఏదో అడగాలనుకుని, నాందిగా అన్నది రాణెమ్మ.

"ఊఁ!"

"ఎస్సెల్సీ ప్యాసయి ఏం చేస్తావు?"

"ఏం చేయమంటావు?"

"నేను చెప్పాలా?"

"ఊఁ!"

"ఎవరినైనా పెళ్ళి చేసుకుని, హాయిగా కాపరం...."

"ఎవరినైనా చూశావా, పెళ్ళికొడుకుని?"

"చేసుకుంటావా?"

"ఫో, అత్తా!"

"ఏం, ఎందుకంత సిగ్గు?"

"అత్తా, పెళ్ళి అంత అవసరమా?"

"ఏమిటే, ఈ కొత్త మాటలు?"

"ఏం లేదు, ఊరకనే."

"పోనీ, మా రమేష్‌ను చేసుకుంటావా?"

"ఊహూఁ!"

"ఓహో, అదా?....అదే, మీ బావనే చేసుకో!"

"ఊహూఁ! చిన్నప్పట్నుంచి మొట్టికాయలు వేసి తల పట్ట కట్టేలా చేశాడు. ఇక పెళ్ళి చేసుకుంటే...."

"బదులు చెల్లింపవచ్చు!" నవ్వింది రాజెమ్మ.

"అత్తా! నిజంగా బావ భయం లేకపోతే, నే నింతవరకు చదివేదాన్ని కాదేమో!"

"ఇంతకూ రమేష్ అంటే నీ కిష్టమేనటే?"

"నే నంటే వీకు యిష్టమేనా?"

"నా యిష్టాని కేముంది? వాడు యిష్టపడాలిగాని!"

"ఆయన ఇష్ట మేమిటీ, మహా!"

"ఆహాఁ! ఏమిటే అంత తేలిగ్గా మాట్లాడేస్తున్నావ్? అప్పుడే వాడు నీకు సొంతమైపోయినట్లు?"

"ఏం, కాదా?" నవ్వింది ముఖం చేతుల్తో కప్పుకొని.

"అయితే ముహూర్తం పెట్టించమని చెప్పేదా, మీ నాన్నతో, మీ మామయ్యతో?"

"పెళ్ళా! అప్పుడే?....ఆయన పరీక్షలయి, డిగ్రీ రావాలి. ఉద్యోగం రావాలి!...."

"అయితే, అంతా ముందుగానే ప్లాను వేసి పెట్టుకున్నావన్నమాట!"

"ఎన్ని ప్లాన్లు పెట్టుకున్నా, నిన్ను మాత్రం పువ్వుల్లో పెట్టి పూజిస్తాంలే అత్తయ్యా, భయపడకు!"

"ఎన్ని ఆశలే మీకు!"

"మా ఆశలే, ఆశయాలు!"

"మీ ప్లాను నెరవేరకపోతే?"

"అందుకే అడిగానుగా, పెళ్ళి అంత అవసరమా అని? ఆయనకు సైన్యంలో ఉద్యోగం వుంటుంది. నాకు తెల్లని గౌను వేసుకోవాలని వుంది."

"పాపా, ఇలారా!"

ఎందుకు అన్నట్లు చూసింది పాప.

"నా కోడలు ఎంత అందంగా వుందో, ఈ వెన్నెలలో చూడాలి."

"మీ అబ్బాయికంటే తీసిపోనులే!"

"ఇలా రావే!"

సిగ్గుతో పాప రాణెమ్మ దగ్గరగా జరిగింది. రాణెమ్మ పాప ముఖం పైకెత్తి కళ్ళలోకి చూసి, హృదయానికి హత్తుకొంది. వీపు మెల్లగా నిమిరి శిరస్సు మూర్కొంది. వేయి దీవనల సేసలు చల్లింది. పాప కోడలైనట్లు మురిసిపోయింది.

పాప మనసు ఆనందంతో నిండిపోయింది. హృదయం పరవశంతో ఊయల లూగింది. "అత్తా, వస్తాను...." అంటూ లేచి వెళ్ళింది. ఇక అక్కడుంటే రమేష్ రావచ్చు. రమేష్ ముఖం చూడాలంటేనే కొత్తగా వుంది. తగని సిగ్గనిపించింది. ఇంటి కెళ్ళి పుస్తకం చేత పట్టుకొని కూర్చుంది. అవ్వ చలికి ముసుగు తన్ని పడుకొంది. నాన్న రాలేదు. చదువు సాగలేదు. రమేష్ అందమైన ముఖం కళ్ళు మూసుకున్నా కన్పడుతూంది. వద్దన్నా అతని చిలిపి చూపులు పలకరిస్తున్నాయి....అత్త ఎంత మంచిది!....ఎటూ చదువు సాగటం లేదు. తెల్లవారుజామున లేచి చదవవచ్చు అని దీపం ఆర్పి పడుకొంది. కలవర పెట్టే కోరికలు! అందమైన ఆశలు! మధురమైన ఊహలు! వాస్తవికతను మరపించే కలలు!

రాణెమ్మ రమేష్ వస్తాడని ఎదురు చూసింది. పోటుమిట్ట నిశ్శబ్దంగా వుంది. గూళ్ళలో పక్షుల కువకువలు సన్నగా విన్పడుతూన్నాయి. జాము రాత్రి దాటింది. అన్నం తినాలంటే బద్ధకంగా తోచింది. రమేష్ రాలేదు. గోడకానుకుని కునుకు తీసింది రాణెమ్మ.

రాత్రి నడిజాము దాటింది. చలిగాలి రివ్వున వీస్తూంది. ముసుగులేని శరీరాలకు కోతపెట్టు .చలిగాలి. పోటు మిట్ట దీర్ఘనిద్రలో వుంది. దోమలు

జోలపాటలు పాడుతున్నాయి. చీకటి విరబోసుకొన్నట్లు చెట్ల చాటున కళ్ళు పొడుచుకున్నా కన్పడని అంధకారం. వాకిటి తలుపు తట్టిన శబ్దం విని రాణెమ్మ చివాలున లేచి తలుపు తీసింది. వాకిట నిలబడిన ఇద్దరు వ్యక్తులను చూచి భర్త, కొడుకు వచ్చారని సంబర పడింది. కాని, మరుక్షణంలో వచ్చిన వారు క్రొత్తవారని గ్రహించి నిరుత్సాహ పడింది.

"ఎవరు మీరు?"

"రమేష్ ఇలు ఇదేనా?" కొత్తగా వుందా మాట.

"మేము కాలేజీ విద్యార్థులం."

"రండి నాయనా, లోపలికి రండి.

విద్యార్థులు భయపడుతూ లోపలికి వచ్చి తలుపు మూశారు. గ్రుడ్డిగా వెలుగుతున్న కిరోసిన్ బుడ్డీ వెలుగులో రాణెమ్మ ముఖం చూసి చటుక్కున తలలు వంచుకొన్నారు. ఈతాకు చాప చూపి "కూర్చోండి బాబూ!" అంది. ఈతముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చున్నారు విద్యార్థులు.

"ఏం నాయనా! ఏం పనిమీద వచ్చారు, ఇంత రాత్రి పూట? మజ్జిగ తాగుతారా?"

"వద్దమ్మా!" రాణెమ్మ రమేష్ తల్లి అని గ్రహించారు వాళ్ళు. వాళ్ళ ఆలోచనలు భయంతో సుళ్ళు తిరుగుతున్నట్లున్నాయి.

"మేం రమేష్ స్నేహితులం."

"ఏం బాబూ, రమేష్ రాలేదు? మీతో ఏమైనా చెప్పిపంపాడా?"

"ఏం బాబూ, మాట్లాడరు?"

"సాయంకాలం మేం స్ట్రైకు చేస్తుంటే, మాకు అడ్డం వచ్చారు పోలీసులు....ఘర్షణ జరిగింది."

"రమేష్ కూడా అందులో పాల్గొన్నాడా?"

"...................."

"రమేష్ కేమయినా గాయాలు తగిలాయా? చెప్పండి బాబూ! రమేష్ ఎక్కడున్నాడు?....హాస్పిటల్లో వున్నాడా?"

"ఏం బాబూ! ఎందుకు మాట్లాడరు?....ఫరవాలేదు, చెప్పండి."

"అమ్మా!....క్షమించాలి!....రమేష్ వెళ్ళిపోయాడు."

"ఎక్కడికి?"

"మనల్ని వదిలి వెళ్ళిపోయాడు....రమేష్...."

"ఆఁ!"

అంతవరకు మాట్లాడిన విద్యార్థికి మాటలు పెగల్లేదు. రెండవ విద్యార్థి ధైర్యం చిక్కబట్టుకొని "అమ్మా, మీరు బాధపడకండి. రమేష్ మరణం వీర మరణం...." అంటూంటే రాజెమ్మకు కొండ విరిగి నెత్తిన పడినట్లయింది.

ఆగకుండా చెప్పుకుపోతున్నాడు విద్యార్థి...."క్షమించాలమ్మా! ఇలా జరుగుతుందని ఏ మాత్రం వూహించలేకపోయాం. ఉదయం తప్పక ఇంటి కెళ్ళాలన్న రమేష్ని విద్యార్థులందరం కట్టుగా కలిపి ఆపాము. పోలీసులు వెంటబడితే ఎదురు తిరిగి తుపాకులు లాక్కున్నాం, రమేష్ ఎన్. సీ. సీ. ఆఫీసరు. అతనికి కాల్పుల్లో నేర్పుంది. అతన్ని బలవంతంగా ఒప్పించాము. రైఫిల్ చేతికిచ్చాము....అమ్మా, మీరు చింతించకండి....రమేష్ వీరుడు....అతనిది వీరమరణం....మీరు వీరమాత!...."

"బాబూ! మీరన్న మాటలకు అర్థం తెలుసా?" సహనాన్ని కోల్పోయి, పేగులు తెంపే బాధను భరించలేక కటువుగా అంది రాజెమ్మ.

'ఎన్నో పుస్తకాలు చదివాం, ఉద్గ్రంథాలు వల్లించి జీర్ణం చేసుకున్నాం' అనుకొన్న విద్యార్థులు, ఎంత చిక్కు ప్రశ్నకైనా ఏదో జవాబు వ్రాయగలిగిన వారు, అనర్గళంగా గంటల తరబడి ఉపన్యాసాలు యివ్వగలిగినవారు, రొమ్ము విరుచుక మేమే నాయకులమని స్ట్రైకులు నడిపినవారు తలెత్తి ఊఁ అనలేక పోయారు, ఆఁ అనలేకపోయారు.

"అమ్మా! మీరు బాధపడకండి. రమేష్ను మహాఘనంగా వూరేగింపు చేశాము. రమేష్ స్మారకనిధిని నిర్వహిస్తాం. రమేష్ను చిరంజీవిగా నిలుపుతాం. మీ జీవితానికి సరిపడే డబ్బు వసూలుచేసి యిస్తాం...."

మూగ హృదయం మూలిగే బాధ తాలూకు ధ్వని నిట్టూర్పులా వచ్చింది.

"....'అమ్మా! నిన్ను, నాన్నను పువ్వుల్లో పెట్టి పూజిస్తాను'.... బాబూ! ఇది రమేష్ కడపటిసారిగా నాతో అన్నమాట. ఆ మాట నిలుపుతారా మీరు? ఎవరు నిలుపుతారా మాట?"

రెండో విద్యార్థి మరచిపోలేని విషయాన్ని చెప్పాలనుకొని తన దగ్గరున్న పోలీసు నెంబరు చూపిస్తూ, "పోరాటంలో ఈ పోలీసు కూడా చచ్చాడు. కాని రమేష్ ఆదర్శం కోసం పోరాడాడు. పోలీసు కడుపు కూటికి కటికవాడై అమానుషంగా ప్రవర్తించాడు....ఏమయితేనేం, రమేష్‌ను ఊరేగించాము. పోలీసు సారాయి బుడ్డీ వుంచుకున్నాడేమో, అతని చొక్కా తడిసిపోయింది. చచ్చాడు. అతని టోపీ నంబరుతో దక్కింది." ....ఆ నంబరు తీసుకుని చూసిన రాజెమ్మ గుండె బ్రద్దలయింది. ఆమె కళ్ల మూతలు పడ్డాయి.

విద్యార్థులు మననం చేసుకొన్న మాటలు అవకతవకగా చెప్పారు. అంతకన్న మరీ బాగా చెప్పలేమన్న నమ్మకం కుదిరింది వాళ్ళకు. రాజెమ్మ ఎదురుగా కూర్చోలేకపోయారు వాళ్ళు. "అమ్మా, క్షమించండి...." అంటూ లేచారు.

వాకిలిగుండా వీచిన గాలికి గ్రుడ్డిదీపం ఆరిపోయింది. రాజెమ్మ మరి లేవలేదు.

చలికాలం. మంచు బాగా పడింది. ఇంకా పడుతూనే ఉంది. మంచుకు తడిసిన కచేరీగంట అయిదు కొట్టింది-అపస్వరంలో.

కొయ్యపెట్టెల నడుమ కంతలబొంత కింద ముడుచుకొని పడివున్న కిష్టిగాడు చివాల్న లేచి గొంతుకూచున్నాడు. ఛళ్ళున చలిగాలి చెంపలకు తగిలింది. టపటపా చెవులు విదిలించుకుని తిరిగీ పట్టకంతల్లోకి తల దూర్చాడు.

పక్కనే బజారువీధి. జట్లు జట్లుగా మేకపోతులు తడిసి ముప్పందుమై కసాయి కొట్టుకు పోతున్నాయి. చావు తెలిసిగాక, చలికి జడిసి అవి దోవంటా అరుస్తూన్నట్లుంది. సందులో పాలడిపోకు దూడలతో ఆవుల్ని తోలుకపోతున్న సవ్వడి.

పొయ్యిలో పిల్లిగాడు, పెట్టెల సందున కిష్టిగాడు, మాసిన బిన్నీ బ్లాంకెట్టు మడతల్లో కాంతమ్మ యుద్ధరంగంలో సిపాయీలు గోతుల్లో దాక్కున్నట్లు మూలకొకరు ముసుగుపెట్టి పడుకున్నారు.

పట్టణం కాబట్టి పుంజుకోడి కుయ్యకపోయినా, పించన్ పుచ్చుకున్న తిరుమలశాస్త్రి పక్షవాతం కొట్టినందున భజగోవింద శ్లోకాలు పాడకపోయినా, జెమినీ హోటలు గ్రామఫోను రికార్డూ, మిట్టవీధి మసీదులో ముల్లానూ అదే పనిగా గొంతెత్తి కేకలేస్తుంటే గోవిందయ్య పడకపై లేచి కూచున్నాడు.

అప్పుడు కొయ్యపెట్టెల నడమ గోనెపట్ట కంతల్లోంచి గొంతుచాచి తొంగిచూస్తూన్న కిష్టిగాణికి ఒంటిలో ఉల్లాసమూ ఉడుకుతనమూ ఉరకలెత్తినట్లనిపించింది.

కూచున్న గోవిందయ్య తలకు యేమీ చుట్టుకోలేదు. ఆయన చెంపల దగ్గరికిగానీ చెవుల దగ్గరికిగానీ చలిగాడు వచ్చి చాలా యేండ్లయింది. పెనం వంటి బుర్రకింద అవి యెప్పుడూ వేడిగానే వుంటాయి.

అట్లా కూచున్న గోవిందయ్య తల పైకెత్తి గోడ పటానికి దండం పెట్టుకున్నాడు. ఆపైన కాంతమ్మను లేపి, తాను గిన్నె పట్టుకొని పాలడిపోకు బయలుదేరాడు.

పాల డిపో నాలుగ్గంటలకే తెరుస్తారు. ఆవులూ—యెనుములూ రాక

ముందే మనుషులు రావడం కద్దు. ఆ చలి పొద్దులో అన్నీ ఒకసారిగా రావు. ఒకటీ-అరా ఆవూ గేదె వస్తూంటుంది. పిండిన పాలు వచ్చీరాగానే పోయించు కొని ఒకరిద్దరుగా వెళ్ళిపోతుంటారు. అప్పటికే ఆడా మగా అర డజనుకు పైగా పోగయ్యారు. చలికి యేదో బాతాఖానీ సాగుతూంది వారి మధ్య—

"దేశంలో కాఫీ పిచ్చి జనానికి బాగా తల కెక్కిపోయింది" అన్నాడు బ్యాంకు శేషాద్రి, వేదాంతిలా చలికి వణుకుతూ.

"అవును. అడుక్కునే బిచ్చగాడూ అందల మెక్కే స్వాములవారూ అందరూ కాఫీకి దాసులే" అంటూ జుట్టునాయుడు సమర్థించాడు.

మూలగా గోడకు నడుము ఆన్చి చార్మినార్ సిగరెట్టు తెగ పీలుస్తూ పాలకు వచ్చిన ఒక పెద్దింటి పనికత్తెను అదేపనిగా చూస్తున్న వెంకటేశుడు-

"అయ్యా, కాలం మారింది. కుక్కలు గూడా కాఫీ తాగుతున్నా యిప్పుడు" అని అప్పుడే డిపోలో అడుగు పెడుతున్న గోవిందయ్యను గురి చేసి అన్నాడు ఆ మాట.

"యేందీ, కుక్కలు కాఫీ తాగుతాయా? చోద్యంగా వుందే!" సుబ్బయ్య శెట్టి ఆశ్చర్యం వ్యక్తం చేశాడు, ఒట్టి గిన్నె ఒడిలో పెట్టుకొని.

"సిటీల్లో షావుకార్ల కుక్కలు ఇంకా యేవో డ్రింకులు కూడా తాగుతా యంట!" ఒక గొంతు గుంపులో గొణిగింది.

"కడకు దేశంలో షావుకార్ల డబ్బు తినే అదృష్టం సీమకుక్కలకే దక్కింది." అయ్యవారు విశ్లేషించాడు గూఢంగా తలకు మఫ్లర్ బిగిస్తూ.

"యేం గోవిందయ్యా, యెనుం పాలు పోయమంటావా!" డిపో రామస్వామి గోవిందయ్య వస్తూనే పలుకరించాడు.

"ఆవు పాలు రానీ తీసుకుంటాను. యెనుం పాలు వద్దులే" అంటూ ప్రక్కగా గోడదగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు గోవిందయ్య.

"మా కాంతమ్మత్త చిక్కని ఆవుపాలుతో ఘాటుగా కాఫీచేసి పోస్తే గానీ పొద్దున్నే కిష్టిగాడు ముట్టుకోడేమో! పోనీ, యెనుం పాలు నాకేయబ్బా!" అంటూ వెంకటేశుడు ముందుకువచ్చి పాత్ర పట్టాడు, పక్కనవ్వుతో.

ఆ మాటకు నలుగురైదుగురు కిసుక్కున గొంతులో నవ్వుకున్నారు. వెంకటేశుని యెత్తిపొడుపు గోవిందయ్యకు యెక్కడో తాకినట్లయింది.

"పొద్దున్నే నీవూ తాగి వచ్చావుగదరా ఘాటుగా. అదీ అట్లే అనుకో రాదూ?" సూటిగానే అంటించాడు గోవిందయ్య.

"నాకేం ఖర్మ, పొద్దున్నే ఆ కంపునీళ్ళు గొంతులో పోసుకునేందుకు. అప్పటం అరురూపాయలిద్ది అరగించి వచ్చాను మామయ్యా!"

"అరగించితే సరీ వూరోళ్ళ....సిగ్గులేక అదీ ఒక బడాయిగా చెప్పుకుంటున్నావ్. ఛీ, నీదీ ఒక బతుకేనా?"

"నా బతుక్కేం మామా, రాజా బతుకు. యేదీ, జన్మలో అందుకో చూస్తాం ఆ యంతస్తు" అంటూ ఠీవిగా వెళ్లాడు వెంకటేశుడు పాలు తీసుకొని.

గోవిందయ్య తమాయించుకున్నాడు. అట్లా నిగ్రహం తెచ్చుకోవడం ఈలోగా అయనకు అప్రయత్నంగానే అలవడుతూంది. ఇంతలో ఆవు పాలు వచ్చాయి.

"ఏం గోవిందయ్యా, ఇంకా రెండు నెలల బాకీ అట్లేవుంది." పాలు పోస్తూ మెల్లిగ బాకీ సంగతి యెత్తాడు డిపో రామస్వామి.

"రెండు మూడు దినాల్లో యేదో కొంత సర్దడానికి ప్రయత్నిస్తాను-రామస్వామీ!" అని మెల్లగ సమాధానమిస్తూ గోవిందయ్య డిపోనుండీ బైటికి వచ్చాడు.

వెంకటేశుడు డిపో వెలుపల గోవిందయ్యకై కాచుకొని వున్నాడు.

"మామా, ఒక మాట" అని పోతున్న గోవిందయ్యను పలుకరించాడు.

కానీ, ఆయన వినిపించుకోనట్లు ముందుకు సాగాడు.

"యేం మామా, కోపమా నా మీద?" వినయం వొలికిస్తూ గోవిందయ్యకు అడ్డువచ్చాడు.

వెంకటేశుని కన్నుల్లో యెప్పటిలాగే యెర్రజీర-నోటిలో దుర్వాసనా. అయినా చూపుల్లో, భంగిమలో లౌక్యం తొంగిచూ స్తున్నది.

"నీపై నాకు కోపమెందుకురా! కానీ,నీ బతుకూ-పద్ధతీ చూస్తూంటే..."

"ఆఁ- చూస్తూంటే మొగలాయి బతుగ్గా కనపడుతూంది కదూ!" అంటూ వెంకటేశుడు ఆయన వాక్యం పూర్తిచేశాడు.

కోపం రావలసినచోట నవ్వు వచ్చింది గోవిందయ్యకు.

"గాడిదకు గాడిదపిల్ల ముద్దు. సరే,ఇపుడెందుకు వచ్చిన మాటల్లే ఇవి" అంటూ గోవిందయ్య తప్పుకొని ముందుకు నడిచాడు.

"అది సరే మామా, మొన్న నేను అడిగిన సంగతి ఆలోచిస్తివా! అదే- ఇంటి సంగతి. మళ్ళీ ఒకసారి జ్ఞప్తికి చేస్తామని ఇక్కడ నిలబడ్డా."

గోవిందయ్య ఒక్క అడుగు ఆగి అరనిమిషం ఆలోచించి ముందుకు సాగిపొయ్యాడు మౌనంగా.

వెంకటేశుడు బొమ్మల వ్యాపారంలో ఘటికుడనిపించుకున్నాడు. హై రోడ్డులో అంత స్తులున్న భవనం అద్దెకు తీసుకొని, దానికొక బోర్డు కట్టి, మామ గాళ్ళను మేపుకుంటూ పబ్లిగ్గా బిజినెస్ చేయడం కంటే అక్కడక్కడా, అంటే- బస్టాండు ప్రక్కగా బజారు సందులో, మార్కెట్టు దగ్గరా, గుడి వెనుకా, మారు మూలల్లో చిన్న చిన్న ఇరుకిండ్లు తీసుకొని అందులో ఒకో రంగు పిట్టను పెట్టి గుట్టుగా బేరం సాగించడంలో సుఖానికి సుఖం, లాభానికి లాభం యెక్కువగా ఉంటుందని అతని అంచనా.

తొలుత రెండు తావుల్లో అంచనా అమల్లో పెట్టాడు. అది పెద్దోళ్ళను గూడా బాగా ఆకట్టుకొని పదిరోజుల్లోనే పుంజుకున్నది. రెండు చోట్లా దుడ్డు రస్తు కురుస్తూంది. దాంతో వెంకటేశుకు ఉత్సాహ మెక్కువై గోవిందయ్య ఇంటిపై కన్ను వేశాడు.

ఆ యింటి భాగంగా పడమటి తట్టు ఒక అర ఖాళీగా పడివుంది. బిజినెస్సుకు మంచి అనువైన చోటు. ఒకప్పుడు గోవిందయ్య దానిలో షోడా మిషను పెట్టి వుండె. ఇప్పుడది నిరుపయోగంగా వుంది. ఆ భాగాన్ని బాడుగ కిమ్మని వెంకటేశుడు పదేపదే అడుగుతున్నాడు. గొంతులో ప్రాణముండగా అట్లా నీచప్పనికి గది ఇవ్వనని గోవిందయ్య తెగవేసి చెప్పినాడు. దాన్ని గురించే వెంకటేశుడు మళీ ఒకసారి జ్ఞప్తికి చేసింది.

పాలు పట్టుకొని గోవిందయ్య ఇంటి కొచ్చాడు. కాంతమ్మ పొయ్యి దగ్గర డికాక్షన్ దించుతూ ఉంది. వెనుకనుండీ కిష్టిగాడు ఆమె వీపుమీద కాళ్ళేపి తొందర చేస్తున్నాడు. గోవిందయ్య రావడం చూచి కిష్టిగాడు కాంతమ్మ వీపు దిగి కాస్త వెనక్కు జగ్గి, తోక ఆడిస్తూ గొంతు కూచున్నాడు. కొంతకాలంగా ఆయన ముందు కాంతమ్మతో చనువు చెయ్యటానికి కిష్టిగాడు జగ్గుతుంటాడు.

ఆయన పాలగిన్నె పొయి దగ్గర పెట్టి పెరటిలోనికి వెళ్ళాడు. మొగం కడుక్కొని తిరిగి వచ్చేటప్పటికి కాంతమ్మ కాఫీ కలిపింది. కిష్టిగాడు తన ముందున్న కప్పు గిన్నెలో పొగలు పోతున్న వేడివేడి కాఫీ జుర్రుకుంటున్నాడు.

కాంతమ్మ కాఫీ గ్లాసు గోవిందయ్యకు అందించి వెనక్కు తిరిగి పైట సర్దుకో బోయింది. గోవిందయ్య గుండె గుభేలు మంది. వళ్ళుమండే కోపంతో-

"యేమేవ్, కిష్టిగాణిచేత మళ్ళీ రవిక చింపించుకుంటివా!" అని అర బాడు గద్దించినట్లు.

"కాదులే, నిన్న ఉతికి ఆరేసేటపుడు కొయ్యపట్టుకొని చినిగింది. కుట్టు కోను తీరిక లేక అట్లే వేసుకున్నా."

దూడకు గడ్డిగాను టెంకాయ చెట్టెక్కినట్లు సమాధాన మిచ్చింది ఆమె.

"పైగా అపద్ధాలు గూడానా పొద్దున్నే! ఇంతకు ముందు నా కండ్లతో చూచానే వాణ్ణి నువ్వు వీపు కెక్కించుకోవడం...."

"అవునూ. నిజమే. ఎక్కించుకున్నా. చింపేశాడు. ఇప్పుడు నన్నేం చెయ్యమంటావ్?" నిర్భయంగా ఒప్పేసుకుంది కాంతమ్మ కుండ కొట్టినట్లు.

"యేం చెయ్యమంటావా! నిన్నూ వాణ్ణీ కాళ్ళుకట్టి ఆ మండే పొయ్యిలో కుక్కేద్దా మనిపిస్తూంది."

గోవిందయ్య కోపం ఆమెకు బాధ కలిగించింది.

"చూస్తున్నా, ఈలోగా కిష్టిగాణ్ణి చూస్తే యెందుకట్లా మండి పోతుం టావ్? గుటికెడు కాఫీ నీళ్ళు తాగినా చూళ్ళేకున్నావ్. నోరులేని బిడ్డను మంటలో కుక్కుతా ననటానికి పొద్దున్నే నీకు నోరెట్లా ఆడుతుందీ! అందుకే గొడ్డు కొట్టుకొని కొంప ఇట్లా గొడ్డుతనం తెచ్చుకున్నది. మన భోగాలు అది యేమంతగా భోం చేస్తూందని- అట్లా ఆడిపోసుకుంటావు!" అంటూ కస్సు మని లేచింది కాంతమ్మ. ఆ కోపంతో పొయ్యి గడ్డపై పడుకొనివున్న పిల్లిని ఒక దెబ్బ కొట్టి లేపింది. దాని ముందు సగం పాలు నేల దొర్లించింది. మట్ల పిల్లి అమాంతంగా ముందుకు ఒంగి ఉడుకుడుకు నురుగు పాలు తంపుగా జుర్రుకుంది. ఆ పైన మూతి నాక్కుంటూ తాపీగా కూర్చుంది కిష్టిగాణికి యెడంగా- కాంతమ్మకు యెదురుగా.

కాఫీలూ పాలూ ఆరగించి తన ముందు ముచ్చటగా కూచొని- 'అమ్మా,

అమ్మా! మా ఇద్దరిలో నీకు యెవరు మంచోళ్ళో చెప్పమ్మా!' అని ఆ పసి కందులు తన్ను అడుగుతున్నవా! అన్నట్లు కాంతమ్మ తల్లి ఆ బిడ్డల్ని చూసు కుంటూ మురిసిపోయింది-మొగుణ్ణే మరచిపోయింది ఆ క్షణంలో.

'మింగను మెతుకులేదు మీసాలకు సంపెగ నూనె' అన్న సామెత గోవిందయ్య నోట్లోకి తెచ్చుకొని నొసలు గుద్దుకున్నాడు. నొసలు గుద్దుకోనీ, నోరు చించుకోనీ-ఇవేమీ కాబట్టవు కాంతమ్మకు. ఆమె లోకమే ఆమెది. గోవిందయ్య కానీ-గోవిందయ్య భాషగానీ-బాధలుగానీ-బతుకుగానీ ఆ లోకం దరిదాపులకు కూడా రాలేవు.

గోవిందయ్యకు రాక్షసునికి వచ్చేటంత కోప మొచ్చింది. ఒక పెద్ద బండ యెత్తి కిష్టిగాడూ పిల్లిగాడూ కాంతమ్మల లోకంపై వేసి పచ్చడి చేస్తామా అన్నంత కోపమది. కోపమైతే రాక్షసునిది. శరీరం గోవిందయ్యది కదా! కోపాన్ని గుటగుట మింగుతూ క్రియాశూన్యంగా ఉండిపొయ్యాడు.

గోవిందయ్య ఆస్తులు పోగొట్టుకున్నాడు. తంటాలుపడి వాటి తాల్లూకూ అలవాట్లూ తగ్గించుకున్నాడు. కానీ ఒక్క కాఫీ అలవాటు ఇప్పటికీ ఆయన్ను అంటిపెట్టుకొని వుంది. వికటించిన జీవిత క్రమంలో యెదురు తిరిగిన ఆ ఒక్క ఖర్చుకూడా నిండు బండికి పేడ చాటంత బరువుగానే వుంది. రాను రానూ కాంతమ్మ ఆ చాటంత కాఫీ ఖర్చునూ పిల్లినీ కుక్కనూ కలుపుకొని గంపంతగా చేసి నెత్తిని పెడుతూంది. తెలతెలవారు జామున, అందునా చలి కాలంలో వేడివేడి కాఫీ తాగే ప్రాప్తిగూడా ఇక మీదట తను దక్కించుకో లేనేమో అనుకున్నాడు.

పొద్దు మొలిచి బారడెక్కింది.

గోవిందయ్య బజారుకు వచ్చి బంకు తెరిచాడు.

అయినా బంకులో యేముందనీ! గొడ్డు పోయినట్లు శూన్యంగా ఉంది. ఖాళీ సీసాలూ, డబ్బాలూ, అరలూ అన్నీ ఈగలు లేచిపోయిన తేనె తుట్టెను జ్ఞప్తికి చేస్తున్నాయి. బంకుకు పంచ ప్రాణాలు అనదగిన బీడీలు, సిగరెట్లు, అగ్గి పెట్టెలు, వక్కపొట్లాలు, సోడా బుడ్లూ రెక్కలు కట్టుకొని యెప్పుడో లేచి

పొయ్యాయి. కనీసం అయిదు వందలుంటే బంకుకు ప్రాణం పోయవచ్చు. అయిదు వందల సంగతి దేవుడెరుగు—ఆ రోజుకు అయిదు రూపాయలిచ్చే ఆసామిని చూపెట్టమని బంకు తెరుస్తూ దేవునికి దండం పెట్టుకున్నాడు గోవిందయ్య. పెట్టుకొని రోడ్డు వైపు ముఖం తిప్పాడు. ఎదురుగా టీ దుకాణంలో వెంకటేశుడు కనబడ్డాడు.

"ఛీ-పొద్దున్నే దేవుణ్ణి చూచిన ముఖంతో ఈ పాడు వెధవను చూస్తినే" అనుకుంటూ ముఖం చిట్లించి దక్షిణం దిక్కుగా తిరిగాడు. అదే వేళకు అయ్యవారు అక్కడికి రావడం జరిగింది. అయ్యవారు తరచు బంకుకువచ్చి పత్రికలూ అవీ తిరుగేస్తూ కాలం గడుపుతుంటాడు.

"ఇంకా పేపరు అబ్బాయి రాలేదా?" అడిగాడు అయ్యవారు.

"వచ్చే వేళయింది. రండి కూచుందురు." గోవిందయ్య ఖాళీ చెక్కపెట్టె ఒకటి ప్రక్కన వేశాడు.

అప్పు డంటూనే పేపర్లు వేసే కుర్రాడు సైకిలుపై వచ్చి, రోడ్డుపై అరనిమిషం ఆగి చక్కా వెళ్ళిపోయాడు.

"మూడువారాల పత్రికల బాబతు యాభై రూపాయలు బాకీ వుంది. రెండు రోజులుగా పేపర్లు వేయడం మానివేశాడు. తెచ్చుకున్న ఆసామికి తిరిగి ఇచ్చే స్తోమత పోగొట్టుకున్నాను మాస్టారూ!" అని ఒక నిశ్వాసం వదిలాడు గోవిందయ్య.

ఆ పైన జెమినీ హోటలునుండీ పేపరు ఒకటి తెచ్చి- "చూడండి మాస్టారూ-"అంటూ అయ్యవారి కందించాడు. అంతలో—

"యేం గోవిందయ్యా, రమ్మంటావా మరి!" నడిరోడ్డులో బండి నిలబెట్టి తేయాకు అమ్మే ఖాకీదుస్తులాయన అడిగాడు గోవిందయ్యను.

"ఒకటి రెండు రోజులు ఓపిక పట్టండి సార్, మొత్తం ఒకేసారి సుకాయించేస్తాను. ఇదిగో యెల్లుండి...." గోవిందయ్య వాక్యం పూర్తికాక మునుపే సేల్సుమెన్ యేదో వదురుకుంటూ ముందుకు సాగిపోయాడు.

"యేం గోవిందయ్యా, ఒక శుభవార్త!" పేపరు చూస్తున్న అయ్యవారు మధ్యలో పలుకరించి—

"టాక్సీలు నడుపుకునే డ్రైయివర్లకు బ్యాంకులు అప్పులిస్తున్నాయట. కాబట్టి మీలాంటి బంకుల వాండ్లకు కూడా సహాయం చెయ్యవచ్చు" అన్నాడు.

యమున తరలివచ్చి యెడారిని తాకినట్లు ఆ వార్త గోవిందయ్య చెవులకు చల్లగ సోకింది. ఆయన ఆత్రంతో పత్రిక మీదికి వంగాడు చూద్దామని.

"మామా–మాస్టారూ పొద్దున్నే యేదో బలే ఆలోచిస్తున్నట్లుందే!" అంటూ వెంకటేశ్వరుడు వచ్చాడు అక్కడికి.

"యేముందిరా, మామధ్య అంతగా ఆలోచించడానికి?" తలపైకెత్తి చప్పగ పలికాడు గోవిందయ్య, వెంకటేశుడు రావడం ఇష్టం లేనట్లుగా.

"అదీ నిజమేలే, జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలిందట" అంటూ ఒక వెకిలినవ్వు నవ్వాడు వెంకటేశ్వరుడు.

తనకు ఇచ్చిన నిర్వచనానికి లోలోన నవ్వుకున్నాడు అయ్యవారు. కానీ గోవిందయ్యకు వాడి మాట తీరు కోపం తెప్పించింది.

"ఒరే వెంకటేశూ, పెద్దా చిన్నా పరిజ్ఞానం లేకుండా మరీ యేందిరా అట్లా బరి తెగించి మాట్లాడుతున్నావ్!"

"యేందీ? పెద్దా చిన్నా పరిజ్ఞానమా? నాకు లేదంటావా!" ఒక సిగరెట్టు ముట్టించి గట్టిగా ఒక దమ్ము లాగి—

"పైసాలున్నోడు పెద్దోడు. అవి లేనోడు చిన్నోడు, అంతే. దీనికి పెద్ద చదువులు చదవాలా తెలుసుకునేందుకు?" పొడుగ్గా పొగ వదులుతూ అగ్గిపుల్ల పారేసి—

"యేం మాస్టారూ, యేమైనా కొత్త సంగతులా పేపర్లో?" అడిగాడు వెంకటేశుడు అయ్యవార్ని.

"బ్యాంకులు బీదవాళ్ళకు అప్పులిస్తాయని పత్రికల్లో వుంది. ఆ విషయమే ఇందాకా గోవిందయ్యకు చెపుతున్నా."

"బీదోళ్ళంటేనో!" కొయ్యపెట్టెపై కుడికాలు మోపుతో ఆసక్తి వ్యక్తం చేస్తున్న వాడిలా ప్రశ్నించాడు వెంకటేశుడు.

"అంటే, టాక్సీలు నడుపుకునే డ్రైయివర్లూ,ఇట్లా బంకులు పెట్టుకున్న చిన్నతరహా వ్యాపారస్థులూ అనుకుంటాను" అన్నాడు అయ్యవారు.

"అదా సంగతి! అయితే బ్యాంకులు మా గోవిందయ్య మామలాంటి వాళ్ళకు అప్పులిచ్చి యేకదమ్మున దివాలా తీస్తాయన్నమాట! ఇంకేం? మా అత్తమ్మా, కిష్టిగాడూ మళ్ళీ ఒక వెలుగు వెలిగినట్లే...." అంటూ కండ్లు మూసుకొని గట్టిగా ఒక దమ్ము లాగాడు.

కానీ అయ్యవారు అతని వ్యంగ్యాన్ని పట్టించుకోకుండా—

"పోనీ, బంకు చాలించి టాక్సీ పెట్టుకుంటేనో! యెటూ గోవిందయ్యా డ్రయివింగు తెలిసినవాడాయె!" ఆలోచిస్తూ సూచించాడు.

"బంకుగానీ, బండిగానీ—" వెంకటేశుడు ముఖం కాస్త గంభీరంగా మార్చి— "అసలుకు నన్నడిగితే ఒకేమాట మాస్టారూ, బతుకు బాగుపడా లంటే మొదట బాట మార్చుకోవాలె. అందాకా యెన్నిచేసినా లాభంలేదు" అన్నాడు.

"అంటే?" అర్థంకానట్లు అయ్యగారు వెంకటేశు తట్టు చూచాడు.

"చూడు మాస్టారూ!" వెంకటేశుడు ఒక అగ్గిపెట్టె చేతులోకి తీసుకొని దాన్ని చూపెడుతూ—

"ఈ మార్కు అగ్గిపెట్టె వుంది చూశారూ! దీన్ని వేరేచోట యెనిమిది పైసాలకు తక్కువ అమ్మరు. మామయ్య అయితే అసలు ధర ఆరు పైసలకే అమ్మి చస్తానంటాడు. ఇట్లా ధర్మరాజుల్ని యే వ్యాపారమైనా ఎంత కాలమని మోస్తుంది! లారీతో మొదలుపెట్టిన మామ ఈ అయిదేండ్లలో ఈ బంకు కాడికి దిగివచ్చాడు. ఇంకా యెంతకాడికి...."

"ఇంతకూ నువ్వు చెపుతుందేది యేమిట్రా! నీ పద్ధతికి నన్నూ దిగి రమ్మంటావు- అంతేనా?" గోవిందయ్యకు వళ్ళు వుడుకెత్తింది. ఒకసారి మొగం విదిల్చి—

"ఒరేయ్ వెంకటేశూ! నువ్వు నూరు చెప్పు. నీతీ నిజాయతీ లేని వెధవ డబ్బుకు చచ్చినా నేను దిగజారనురా. అంతకంటే వస్తుంది బిచ్చమైనా యెత్తుకుంటాను. అంతే!" అన్నాడు ఆవేశంతో.

"యేమన్నావ్ మామా, నీతీ నిజాయతీనా!"

వెంకటేశుడు పకపక విరగబడి నవ్వి—"చేవలేని చచ్చు నాయాండ్లు వుంటారే, వాండ్లు చెప్పేమాటలు ఇవ్వి—"

"చూడు మాస్టారూ- -" అయ్యవారి బుజం పట్టుకొని వూగిస్తూ—

"నేను తప్పటోణ్ణనీ, తాగేవాణ్ణనీ మామకు నాపై గురి తక్కువ. ఇంతకూ నేను తాగి చెడిందిలేదు, మామ తాగక బాగుపడిందీ లేదు. అనుభవంతో చెపుతున్నా మాస్టారూ! ఈ నీతీ నిజాయతీ-ధర్మంఅనేటివి వున్నాయే-ఆ నల్లుల్ని యెంతదూరంలో ఉంచితే అంత మంచిది. దగ్గరికి చేరదీశామా, మనిషిని ఇట్టే పీల్చి పిప్పిచేశేస్తాయి. ఆ పైన వాడు అంతే, హతమై పోవాలసిందే—"

కొంతసేపాగి మళ్ళీ అన్నాడు-

"పోతే, ఇక నా సంగతి చెప్పమంటావా! ఇదుగో, కాలుమీద కాలేసుకొని ఈ రాత్రి యాభై రూపాయలు సంపాదించాను—"

అంటూ జోబీలోనుండి నోట్లు తీసి చూపించబోయాడు వెంకటేశుడు. అప్పుడు అక్కడికి ఒక పోలీసు వ్యాను వచ్చి ఆగింది. ఇద్దరు పోలీసువాళ్లు దిగివచ్చి వెంకటేశుని వ్యానులో యెక్కించుకొని, వచ్చిన దారిన వెళ్ళిపోయారు.

"చూశారా మాస్టారూ!" వ్యానువైపు చూస్తూ గోవిందయ్య అన్నాడు-

"ఈ దొర బతుకునే ఇందాకా మావాడు తెగ మెచ్చుకుంటూ వాగింది."

మాస్టారు నోరు మెదపలేదు. మూతిపై వేలు పెట్టుకొని చూస్తూ ఉండిపోయాడు.

గోవిందయ్య సరుకులుగ్గాను మండీ బజారుకు వెళ్లాడు.

పొద్దు ముదిరి నెత్తిపైకొచ్చింది.

బజారంతా చుట్టి కడకు ఇంటిముఖం పట్టాడు గోవిందయ్య. ఒక కట్ట బీడీలు, అధవా ఒక డజను అగ్గిపెట్టెలు, ఆఖరికి అరకట్ట తమలపాకులు కూడా యెక్కడా అప్పు పుట్టలేదు. ఒట్టి చేతులతో నకనకలాడే కడుపుతో నిస్పృహతో తిరిగి వస్తున్న గోవిందయ్య అపుడే మైసూరుకేఫ్ మెట్లు దిగుతున్న వెంకటేశ్వర్లుణ్ణి చూచి విస్తుపొయ్యాడు.

రెండు నెయ్యి మసాలా దోసెలు తిన్ననోటికి ఒక నేవీకట్ సిగరెట్టు అందిస్తూ వెంకటేశుడు గోవిందయ్య దగ్గరికి వచ్చి అన్నాడు-

"ఈపాటికి జైల్లో పడి వుంటాడనుకున్న వెంకటేశుడు ఇక్కడ

హోటల్లో మజా చేసుకొని వస్తున్నాడేమా అని ఆశ్చర్యపోతున్నావు కదూ మామా! అవున్లే, తెలీక నీలాగే శానామంది అనుకుంటూంటారు...."

గోవిందయ్యకు ఇంకొంచెంగా దగ్గరికి జరిగి గొంతు తగ్గించి—

"నేను బంగారు గుడ్లు పెట్టే బాతును మామా! అపుడపుడూ మామ గాళ్ళొచ్చి నన్ను మంటపానికి తీసుకుపోతుంటారు. నా మంచీ చెడ్డా విచారిస్తుంటారు, బాగా మేస్తూ ఉండు- ఇంకొంచెం కండబెట్టు- మరింత పెద్ద సైజు గుడ్లు పెట్టి పంపుతూ ఉండూ- అని. ఆ పాపయ్య వున్నాడు చూడు. ఆయన ఈ బాతును మరింతగా దువ్వి, ఈ దినం ముద్దు పెట్టుకొని పంపాడు. సరే అది పోనీ. ఈ బాబతు బాస నీ తలకెక్కి చావదులే. ఆఁ- యెక్కడ ఇంకా సరుకూ అదీ తీసినట్టులేదే!"

"బజారంతా తిరిగాను. పది రూపాయల సరుకు అప్పిచ్చిన పుణ్యాత్ముడు కనపడలేదు. ఒట్టి చేతులతో వెళ్ళి ఖాళీ బంకులో యెట్లా కూచోనురా వెంకటేశూ!" అన్నాడు గోవిందయ్య. గొంతు జీరబోయిందా సమయంలో ఆయనకు.

"మామా!" వెంకటేశుడు మెడ వారగబెట్టి అప్పటంగా సొంత నవ్వు నవ్వుతూ అన్నాడు—

"పిచ్చి కాకపోతే, బజార్లోకి వచ్చి నీ మాదిరీ పుణ్యాత్ము లెందుకుంటారు మామా! ఇక్కడ వుండే వాళ్ళందరూ నా రకం పవిత్ర పాపాత్ములే!" సిగరెట్టు పారేసి కాలి బూటుతో రాస్తూ అన్నాడు—

"నువ్వేమో నన్ను గబ్బోడూ గట్రా అనుకుంటుంటావు. అయినా ఫరవాలేదు. కానీ, నిన్ను చూస్తుంటే మటుకు నాకు ఒకప్పుడు జాలీ, మరొకప్పుడు నవ్వూ వస్తూంటుంది. మచ్చుకు ఒక మాట తీసుకో. పదికి పదింతల డబ్బు పూలల్లో పెట్టిస్తాను అని పదిరోజుల్నుంచి పదే పదే అడుగుతున్నానా! అయినా నువ్వు పెడ మొగం పెట్టి, యేరోజు కా రోజు బిచ్చ మెత్తడానికి బజారుకు వస్తున్నావ్. పైగా బజార్లో పుణ్యాత్ముల్లేర్రా- అని వాపోతున్నావ్. ఇది యెట్లా వుందంటే, పిల్లప్పుడు చదివిన పద్యం ఒకటి గుర్తుకొస్తూంది- శివుడు బిచ్చమెత్తగ వలసె- అని. నిజమే, నీ శాస్త్రీ శివుళ్ళు ఇంకా వుండబట్టే నానాటికీ దేశ మిట్లా దిగజారిపోతూంది. సరే, పొద్దెక్కింది.

ఈ సందులో నాకు అర్జంటుగా పనొకటుంది. మళ్ళీ వచ్చి కలుసుకుంటా" అంటూ వెంకటేశుడు గబగబా పక్క సందులోకి వెళ్ళిపొయ్యాడు.

అప్పూ-ఆకలీ-ఎండా-తిప్పటా- అప్పటికే యెంతో అలిసిపోయి వున్న గోవిందయ్యకు వెంకటేశుడు కనబడిన తీరూ, 'మాట్లాడిన వైనం మిరప కాయలు నలిచినట్లుగా వుండింది. గోవిందయ్య చిరాగ్గా ఒకసారి మూతి విదిల్చి పెద్ద పెద్ద అంగలతో పొగలు పోతూ వచ్చి బంకు చేరాడు.

బంకులో కాంతమ్మ కూచొని వుంది. టిన్నులోనుండీ ఒకో బిస్కట్టే తీసి కిష్టిగాణి ముందు వేస్తూ ఉంది. కిష్టిగాడు గంతేసి ఆమె చేతిలోని బిస్కట్టు అందుకుంటూన్నాడు. ఆ దృశ్యం చూడగానే గోవిందయ్యకు వళ్ళు మండింది.

"రాక్షసులు నన్ను నిజువునా నమలక తింటున్నారు. పాతి పెట్టినా పాపం లేదు" అని కసురుకొని, అక్కడ మరొక క్షణమైనా ఆగక గిరుక్కున తిరిగి చరచరా ఇంటి వైపు వెళ్ళాడు.

కిష్టిగాడు పనసతొనలంటే పడి చస్తాడు. ఎండకాలం రోజుల్లో బజా రంతా వెదికి కిష్టిగాణికి పనసతొనలు తినిపించిగానీ తృప్తి పడని గోవింద య్యేనా ఇప్పు డిట్లా కసురుకుంటున్నది!

అన్న ఆలోచనతో కాంతమ్మ ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయింది.

మరు దినం ఉదయం.

మంచూ మసకా వీడి చురుకెండ వీధుల్లో విస్తరించుకుంటూ ఉంది. గోవిందయ్య బంకులో ఉన్నాడు. ప్రక్కనే అయ్యవారు కొయ్య పెట్టెపై కూచొని వారపత్రిక తిరగేస్తున్నారు.

బంకుకు పది గజాల దూరంలో రోడ్డువార మున్సిపాల్టీవారి పెట్టె బండి వుంది. బండికి చుట్టూ మూత. ఈ వైపూ ఆ వైపూ గాలి పోవటానికి వరుసగా రంధ్రాలున్నాయి. నలుగురు నల్ల మనుషులు బజారుకు వచ్చి కలు స్తున్న సందు వీధిలో తచ్చాడుతున్నారు. యమకింకరుల్లాంటి ఆ నలుగురిలో ఒకనిచేత పొడుగాటి ఉరితాడు, మరొకని వద్ద దుడ్డుకర్రా వుంది.

మూడవ సందు మొగదల చిన్న భజన గుడి. గుడి ముందు సిమెంటు అరుగు. అరుగుమీద ఒక పుల్ల కుక్క. అది గొంతు కూచొని కండ్లు మూస్తూ తెరుస్తూ మగతగా నీరెండ కాచుకుంటూ వుంది.

కింకరులు ముందు తట్టుగా ఇద్దరూ వెనుకతట్టుగా ఇద్దరూ దాని వైపు నడిచారు. ముందున్నవాడు ఉచ్చుతాడు దాని తల పైకి విసిరి చివుక్కున లాగాడు. అది 'కుఁయ్' మనబోయింది. తటాల్న ఇంకోడు వెనుక కాళ్ళ జవిరి పట్టుకొని ఈడిగల పడ్డడు. మూడోవాడు దుడ్డు కఱ్ఱతో బలంగా దాని మెడపై ఒకటి అంటించాడు. పుల్ల కుక్క మెడ వాలేసి ముంచు కొరిగింది. ఆ దెబ్బకు పది నిమిషాలకుగానీ అది మూర్ఛనుండే తేరుకోలేదు. భటులు బర బరా దాన్ని ఈడ్చుకుంటూ వెళ్ళి పెట్టె బండిలోకి విసరివేశారు. పుల్ల కుక్క భటులకు పారితోషికంగా రెండున్నర రూపాయ లిచ్చి బండిలో పడుకుంది. ఆపై నల్లమనుష్యులు తృప్తిగా చేతులు దులుపుకొని, పెట్టెబండి లాక్కుంటూ మరో సందువైపుగా కదలిపోయ్యారు.

ఆ వేట అట్లా చిటికెలో జరిగిపోయింది.

ఒక కుక్కను పడితే రెండున్నర రూపాయలు. బండెలో పంద్రెండు కుక్కలకు చోటుంది. బండి నిండితే ముప్ఫయి రూపాయల వరమానం. అంటే రోజుకు మనిషి కొక్కంటికి యేడున్నర చేతికి ముడుతుంది. అది వారి బదుకు తెరువు.

"బతుక్కు ఇదీ ఒక తెరువే!"

అని గొణిగాడు ఇందాకా ఆ దృశ్యం చూస్తున్న అయ్యవారు.

కుక్కలు జనానికి అడ్డు వస్తున్నాయి. ముఖ్యంగా బస్తీ జనానికి నాటు కుక్కల బెడద మరీ ఇబ్బందిగా వుంది. కాబట్టి మునిసిపాలిటీలు కుక్కల్ని చంపడానికి పూనుకున్నాయి. నాలు తాళ్ళ దుడ్డు కఱ్ఱలు పెట్టెబండ్లూ అంద జేసి, అదనంగా కుక్కకు రెండున్నర వంతున ముట్టచెపుతూంది మున్సిపాల్టీ.

ఆలోచించగా ఆ కాండ అంత ఔచిత్యంగా కనబడలేదు అయ్య వారికి-

"—మన వూరి జనాభా యెంత, అరవై వేలు. కుక్కలు యెన్ని వుంటాయ్? యెక్కువగా చెప్పుకున్నా మున్నూటికి మించవు. మరి మున్నూరు కుక్కలు అరవై వేలమందికి అడ్డు వస్తున్నాయా లేక, అరవై వేలమంది ఈ మూగ జీవాలకు అడ్డు వస్తున్నారా! నల్లి అయినా మనిషికి అపకారం చేస్తుంది; కుక్క చెయ్యదే. పిలిచి నాలుగు మెతుకులు దాని ముందు పడేస్తే చచ్చేదాకా నిన్ను నమ్ముతుంది. నీ బతుక్కు అది యెక్కడ అడ్డు వచ్చిందనీ? ఒక ప్రక్క సీమ కుక్కలపై బోలెడంత డబ్బు తగలేస్తూ, మరో ప్రక్క నాటు కుక్కల్ని ఇలా హతమార్చడం మరీ ఘోరంగా ఉంది. ఇంతకూ ఈ గడ్డపై పుట్టడమే ఇవి చేసుకున్న అపరాధమా!"

"చూస్తున్నావా గోవిందయ్యా, కుక్కల్ని యెట్లా చంపుతున్నారో?"

"చంపితే చంపారు. మనుషులకే తిండి లేదు, వీటి కెక్కడ తెచ్చి పెట్టేది?" అలక్ష్యంగా జవా బిచ్చాడు గోవిందయ్య యెక్కడో మనసు పెట్టి.

నిజానికి ఇందాకా తన యెదుట యేమి జరిగిందీ గోవిందయ్య గమనించనే లేదు. ఆయన మొగం బజారు దిక్కుగా ఉన్నా, మనసు మాత్రం ఇక్కడ లేదు. రోజులు మరీ బిగదీస్తున్నాయి ఆయన్ను. మనిషి బాగా నలిగిపోతున్నాడు. ఇరుకు బతుకు యెంత వాణ్ణయినా ఇట్టే నలిపివేస్తుంది. వేగిరపాటూ, విసుగూ ఆయనలో అంతకంతకూ యెక్కువవుతున్నాయి. ఆ ఉదయం ఆయన వైఖరి మరీ విచారకరంగా ఉంది.

సరిగా ఆవేళకు గునగున పరుగుతో ముడ్డి ఆడిస్తూ కిష్టిగాడు గోవిందయ్య వద్దకు వచ్చాడు. 'అమ్మ పంపించింది' అని చెప్పటానికి ఆయన ఒడిలో మూతి పెట్టి తోక ఆడించాడు. చేతి వ్రేళ్ళతో గోవిందయ్య ఛెళ్ళున చెంపపై కొట్టి, 'సబ్బూ లేదు గిబ్బూ లేదు ఫో అవతలకు' అంటూ కసురుకొని నెట్టేశాడు వెనక్కు.

"అవతల వాణ్ణి పంపుతాను, ఒక మురికి సబ్బు పంపించు!" అని పొద్దుట వచ్చేటపుడు కాంతమ్మ చెప్పి వుండింది.

ఆ దెబ్బతో కిష్టిగాడు రోడ్డుపై వెల్లకిల దొర్లుకొని గభాలున పైకిలేచి ఇంటి వైపు దౌడు తీశాడు. అప్పుడే యెదురు వస్తున్న వెంకటేశుడు రెండు చేతులూ అడ్డంగా బార సాచి, "పదరా కిష్టా వెనక్కి మీ నాయన చేత బిస్కోతు ఇప్పిస్తా" అంటూ దారి కడ్డంగా వచ్చాడు. కిష్టిగాడు గబుక్కున ప్రక్కకు మళ్లి దగ్గర్లో ఉన్న సందు వీధిలోకి జారుకున్నాడు.

*

ప్రొద్దున బంకు దగ్గరికి వెళ్ళిన కిష్టిగాడు తిరిగీ ఇంటికి రాలేదు. మధ్యాహ్నం గోవిందయ్య ఇంటికి వచ్చినపుడు "కిష్టిగా డెక్కడా!" అని అడిగింది కాంతమ్మ అన్నం వడ్డిస్తూ.

"చెయ్యాడక నేను చస్తుంటే చీటికీ మాటికీ యెందకట్లా పంపుతావ్? ఇది కావాల అది కావాలంటుంటే ఎక్కడ ఉరి పోసుకోను?" తన దుస్థితి భార్యకు తెల్లం చేసే ధోరణిలో అన్నాడు గోవిందయ్య.

"సరుకుల సంగతి యెవరెత్తారు? నేను అడిగేది కిష్టిగాణ్ణి గురించి ఇంకా వాడు ఇంటికే రాలేదూ అంటున్నా."

"ఎక్కడ చచ్చాడో వెళ్ళి వెతుక్కో. కొంపకు వచ్చి ఇంత కూడైనా గతకనివ్వరు." గోవిందయ్య కంచంలో నీళ్ళు పోసి, చెయ్యి పంచెకు తుడుచు కుంటూ వెళ్ళిపొయ్యాడు ఇల్లు విడిచి.

కాంతమ్మకు అన్నం సయించలేదు.

ఆమె గడపలో కిష్టిగాడికై యెదురు చూస్తూ నిలబడింది.

మూడయింది నాలుగయింది గంట. అయినా కిష్టిగాడు రాలేదు.

ఇంటికీ బంకుకూ అర ఫర్లాంగు యెడముంటుంది. కిష్టిగాడు యెరిగిన లోకానికి ఈ రెండే అంచులు.బంకు వదిలితే ఇంటికీ, ఇల్లు వదిలితే బంకుకూ, ఈ రెండు ధృవాల మధ్య ఆసుపోసినట్లు అరగంట కొకసారయినా తిరుగు తుంటాడు. ఆ దినం పది గంటల నుండీ కిష్టిగాణి, తొక్కిడి లేక ఆ బాటే

బోసిపోయినట్లగపడింది కాంతమ్మ కళ్ళకు. కన్న బిడ్డ కనపడని తల్లిలా ఆమె కిష్టిగాణ్ణి వెతుక్కుంటూ ఊర్లోకి వెళ్ళింది.

పొద్దు గూటో పడుతూంది.

సందులూ గొందులూ అన్నీ గాలించి దిగులు మొగంతో తిరిగి వస్తున్న కాంతమ్మకు దారిలో వెంకటేశుడు యెదురయ్యాడు—

"ఇంకా యేం వెతుకుతావ్ కాంతమ్మత్తా! మద్యాణం మన కిష్టన్న మున్సిపాల్టీ పెట్టె బండిలో మజాగా వెళ్ళిపొయ్యాడు. ఈ పాటికి దానమయ్యుంటాడు. ఇంటి కెళ్ళి తలమీద ఇన్ని మట్టినీళ్ళు చల్లుకో" అంటూ చావు కబురు చల్లగ జారవేసి ఆమెను దాటి వెళ్ళిపొయ్యాడు.

గుండెల్ని గునపంతో గుద్దినట్లు ఆ విషవార్త ఆమె చెవుల బడింది. కండ్లు బైర్లు క్రమ్మి బజార్లో కుప్పగా కూలిపోవలసిన కాంతమ్మను కష్టం మీద కాళ్ళు ఇంటికి చేర్చాయి.

కాంతమ్మ గుండెల్లో పొంగిన కారుచీకట్లో ఆ వూరినే ముంచెత్తి క్రమంగా లోకమంతా కమ్ముకున్నవా అన్నట్లు జగమంతా చీకటైపోయింది. ఆ చీకట్లోనే బాగా పొద్దుపోయి ఇంటికి వచ్చాడు గోవిందయ్య. వచ్చి ఉలుకూ పలుకూ లేకుండా ఒదిగి ఒక మూల కూచున్నాడు. ఆయన్ను చూచిన మట్ల పిల్లి బెదిరి కిటికీగుండా పారిపోయింది.

రాత్రి పదైంది—పంద్రెం డయింది.

గజగజ వణుకుతున్న ఊరిపై మంచు మామూలుకంటే యెక్కువగానే పడుతూంది. చలిగాలి జివ్వుమంటూన్నా మట్లపిల్లి మాత్రం మళ్ళీ పొయి గడ్డపై పడుకోటానికి రాలేదు. నేస్తం నల్లకుక్క రాకకై వేయి కండ్లతో కంతల బొంత చెక్కపెట్టెల నడుమ దీనంగా పడివుంది. చలి పిడుగు తాకిడికి గురైన వారిలా కాంతమ్మ' గోవిందయ్యలు చెరొక మూల గోడలకు హత్తుక పోయినట్లు పడివున్నారు. మబ్బుటింట్లో మొగాలు కనబడకపోవడం కూడా మంచిదయింది వారికి. చీకటి దయ్యం తిరుగుతున్నట్లు కాలం భయం భయంగా గడుస్తూంది వారిద్దరి మధ్య.

కిష్టిగాణి జ్ఞాపకాలు కాంతమ్మ యెదలో పొరలు పొరలుగా దుఃఖాన్ని పెళ్ళగిస్తున్నాయి. పెంచుకున్న బిడ్డను గొంతుపిసికి చంపింది పాడు లోకం. ఆమె గుండెల్లో చిచ్చుపడి కన్నుల్లో జలధార కట్టింది.

ఆ రాత్రి పెద్ద పొద్దు ఆమె కుములుతూనే ఉంది.

చలికి ఊరు చచ్చినట్లు నిశ్శబ్దంగా పడివుంది.

ఆ నిశిరాత్రి నిశ్శబ్దంలో మూలగా చెక్కపెట్టెలవద్ద—ఖుంయ్ ఖుంయ్—మంటున్నట్లు చప్పుడయింది కాంతమ్మ చెవులకు. కంతల బొంతలో ముడుక్కొని కిష్టిగాడు ముక్కుతో శబ్దంచేస్తూ రాత్రుల్లో అమ్మను అట్లా కలవరిస్తుంటాడు. పోయిన ప్రాణం లేచి వచ్చిందా అన్న ఆదుర్దాలో కాంతమ్మ గుండె వేగంగా కొట్టుకుంది. గబగబా నడిచింది ఆ మూలకు. చీకట్లో తడిమి చూచింది. గోవిందయ్యా తల తగిలింది ఆమె చేతులకు. ఆశ్చర్యంతో రెప్పపాటు స్తంభించి పోయింది. చెక్క పెట్టెలపై తల మోపి వెక్కి వెక్కి రోదిస్తున్నాడు గోవిందయ్యా అక్కడ. కిష్టిగాడు పడుకునే కంతల బొంత వద్దకు వచ్చి ఆయన యెప్పటి నుంచీ అట్లా వాపోతున్నాడో! ఆ దృశ్యం ఆమెను కదలించి వేసింది. మెల్లిగా ప్రక్కన కూర్చుంటూ ఆయన తలను తన చేతుల్లోకి తీసుకున్నది. కణతలు కాలుతూ కండ్లు యెర్ర బడ్డట్లుగా తోచింది.

కాంతమ్మ స్పర్శలో గోవిందయ్యా దుఃఖం కట్టలు తెంచుకున్నది.

"కాంతం, నేనే కిష్టిగాణ్ణి చంపానే," అంటూ వలవలా యేడ్చేశాడు ఆమె భుజంపై వ్రాలి—ఆ యర్ధరాత్రి.

కాంతమ్మకు గుండె ఝల్లుమంది.

"మధ్యాహ్నం మనసు బాగాలేక కిష్టిగాణ్ణి కసురుకున్నాను. చెంపమీద ఛెళ్ళున కొట్టాను కూడ. మనసు విరిగి వాడు మనల్ని శాశ్వతంగా విడిచి వెళ్ళాడు. కిష్టిగాడు ఇంకరాడు. నేటితో నేలపై తన నూకల్ని చెల్లించుకున్నాడు. కడకు ఆ సుఖం కూడా నీకు దక్కకుండా చేశాను. నికృష్టుణ్ణి

కాంతం, నేను నికృష్టుణ్ణి" అని వాపోతూ జుత్తు పీక్కొని నొసలు గుద్దుకున్నాడు.

పశ్చాత్తాపమనేది ఆయనలో దాగిన పరితాపాన్ని వెలికి కక్కుతూ పోయింది__ఆ నడిరేయి దాటిన వేళ.

"సాయంత్రం మిట్ట వీధినుండీ వస్తున్నా. హైస్కూలుముందు పెట్టె బండి వుంది. పట్టి పడేసిన మూగ జీవాలు సన్నటి కన్నాల్లోగుండా మూతులు ముందుకు చాపి వున్నాయి. నల్లటి కోలమూతి__కిష్టిగాడిదే__వాటిల్లో వున్నట్లు గుర్తు. కృష్టుడు వాసనబట్టి నన్ను గుర్తించి వుంటాడు....గుర్తించి కన్నంలోగుండా__ఖుంయ్ ఖుంయ్ మంటూ నన్ను పిలిచి వుంటాడు. ఆ యిరుకు బండిలోనే__అడుగో నాయన అంటూ గంతు లేసింటాడు. అయినా కాంతం, గబగబా నేను వచ్చేశానే. చూడనట్టుగా__యెరగనట్టుగా మనసుకు మోసం చేసుకొని వచ్చేశాను....

"బీదరికం బలంగా కాటేసింది కాంతం, నన్ను. ఒళ్ళంతా విషమే అయింది. భార్యా__బిడ్డా__ప్రేమా__అన్నీ యెండబెట్టుకొని కడకిట్లా కట్టెగా మిగిలాను. రాయిగా మారాను...."

ఆ పైన ఆయన గొంతు అరగంట మూగబోయింది.

గుడి గోపురంపై గుడ్డి చుక్క మొలిచింది. తడిగాలి జోరు కూడా తగ్గింది. పరుగెత్తిపోయిన మట్లపిల్లి మళ్ళీ తిరిగొచ్చి పొయ్యిలో కుదురుగా పడుకుంది.

అంతవరకు కాంతమ్మ భుజంపై వున్న తలను గోవిందయ్య వెనక్కు తీసుకున్నాడు. తల అడ్డంగా యూడించాడు గట్టిగా. నిటారుగా మెడ పైకెత్తాడు__

"మన యింటి పడమటి గదిని వెంకటేశునికి అద్దె కిచ్చేస్తాను. తెల్లవారుతూనే వెళ్ళి బాడుగ పుచ్చుకుంటాను" అన్నాడు.

ఆ మాటలు ఆయన తూచినట్లు పలికాడు దృఢంగా.

పట్నవాసమైనా పుంజుకోడి కూత పెట్టింది యెక్కడో.

అయోమయంగా కాంతమ్మ నోరు తెరచి ఆయన తట్టు చూచింది.

గోవిందయ్య చివాల్న పైకిలేస్తూ అన్నాడు—

"అవునే కాంతం, నిజమే నే నంటున్నది. వెంకటేశానికే ఇస్తాను. మనకు డబ్బు కావాల. మనమూ మనుషులుగా మారాల...."

అప్పుడాయన కండ్లు నిశ్చలంగానూ, మనస్సు నిర్మలంగానూ, గొంతు గంభీరంగానూ ఉండింది.

తెల్లవారటానికి కోడికూత దూరమే మిగిలింది.

ప్రొద్దు పడమటికి వ్రాలినవేళ. ఎండను జల్లెడలో పట్టి జల్లించినట్టున్న వేపచెట్టు నీడ. చేతికి దొరికిన గడ్డిపోసను నములుతుంటూ ఆ నీడలో చెట్టు మొదలు కానుకుని పడుకున్నాడు వెంకటేసు. అతడి పాలిటి కది నమల డానికి గడ్డిపరకలు తప్పితే మరేమీ దొరకని దుర్దినమై పోయింది మరి!

ఇప్పుడైతే యిలా గడ్డిపోసలు చప్పరించే దౌర్భాగ్యం పట్టింది గాని, యిటీవలివరకూ- అంటే, మొన్నటి సాయంకాలందాకా రకరకాల పిండివంట లతో నాలుకకు పదను పెట్టుకున్నవాడే వెంకటేసు. గారెలూ, బూరెలూ నమి లినవాడే. సుగీలు స్వాహా చేసినవాడే. పోళీలు ఉంగలుగా చుట్టి మెసవినవాడే. కమ్మని కజ్జాలు దిగమ్రింగినవాడే. కరకరలాడే మురుకుల రుచి అతడు బాగా ఎరుగును. కానీ ఆ గత వైభవాలను తలచుకుంటే యిప్పుడేమి ఒరుగును?

ఐనా ఎంతటి దిక్కుమాలిన కక్కుర్తి యంత్రమయ్యా ఈ మానవ శరీరం! మూడునెలల పొడుగునా దీనికి రాజనాలే వండించి పెట్టు, కడుపు నిండుకూ పాయసాలే పోయించు, పదహారు కూరగాయలతో, ముప్పైరెండు పిండివంటలతో తెగమేపు. ఈ మృష్టాన్నాలతో చర్మం ఒక వరస నిగనిగ లాడిపోయిన తర్వాత, ఆ మూడు మాసాల చివర ఒక రెండు రోజులు, రెండంటే రెండేరోజులు తిండిరంధి లేకుండా, రెస్టు తీసుకుంటూ ఈ శరీర యంత్రం హాయిగా వుండిపోవచ్చుగదా! ఉండదే! పట్టు పట్టుమని ఒక పూట కిక్కురు మనకుండా ఊరుకోగలిగితే బ్రహ్మాండం! రెండోపూట మొదలయ్యే సరికి కడుపులో కాకిగోల. ఆ రోజు రాత్రి నిద్రపట్టడం గూడా అనుమానమే! చన్నీళ్ళు పోయకపోతే వేడెక్కిపోయే యింజనులా మరునాటి వుదయం కడు పులో మంటలు బయల్దేరకపోతే ఒట్టు! అప్పుడిక నీరెండ గూడా నిప్పుల వానలాగే వుంటుంది. రైల్లో కూచోకపోయినా కళ్ళయెదుట లోకం గిర్రున తిరుగుతున్నట్టే వుంటుంది. నడిచే ఓపికమాట దేవుడెరుగు. లేచి నిల్చుంటే ఒళ్ళు దూదిపింజెలా గాలి కెగిరిపోతుంది. బాబూ పట్టెడన్నం! లేదా గ్రుక్కెడు గంజినీళ్ళు....ఆ తపనగూడా యిలా ఎంతోసేపు కొనసాగదు. అవయవాలతో బాటుగా బుద్ధిగూడా మొద్దుబారిపోతుంది. పెరికి పారవేసిన తోటకూర కాడలా శరీరం నేల కంటుకపోతుంది. ఒకరు చెబితే అర్థమయ్యేదిగాదు. ఆ పరిస్థితి

అనుభవైకవేద్యం. అలాంటివాళ్ళని చూచినప్పుడే మనం "అయ్యో పాపం! ఆకలిదెబ్బకు శోషిల్లిపోయినట్టున్నాడు" అనుకుంటాము.

ఆకాడికి వెంకటేసు ఎంతో నయం! తిండికీ తనకూ వియోగం ప్రాప్తించి రెండురోజులు కావస్తున్నా అతడింకా సొమ్మసిల్లిపోలేదు. చేయి సాచి దగ్గర్లోవున్న గడ్డిపరకలు పెరుక్కునేపాటి చైతన్యం అతడిలో యింకా మిగిలేవుంది.

కానీ అతడి పేగులు నకనకలాడిపోతున్నాయి. నాలుక పిడచగట్టుక పోతోంది. కళ్ళు లోతుకుపోయి కొడిగట్టిన దీపాల్లా గుడ్డిగా జోగుతున్నాయి.

వెంకటేసు పడుకున్నచోటికి ఒక మైలుదూరం పరిధిలో అయిదారు పల్లెటూళ్ళున్నాయి. కచ్చితంగా ఆరు పల్లెలని లెక్కచెప్పకుండా అయిదారన డంలో ఒక ఆంతర్య ముంది. ఆరో పల్లె వుంది చూచారూ, దానికి పేరు లేదు. గూడెం అంటారు ముక్తసరిగా. పేరేగాదు, గూడెంలో వీధులుగూడా లేవు. చుట్టూరా పంటపొలా లుండడంవల్ల ఆ వూరి వైశాల్యం విస్తరించే అవకాశం లేదు. జనాభా సంగతి అలా కాదుగా. అందువల్ల కుండలో నారు పోసినట్టుగా ఆ వూరు వూరంతా గుడిసెల మయం. పొదుపును గురించి ప్రత్యేకంగా అక్కడెవరూ పాఠాలు చెప్పివుండరు. గూడెంలోని జనం ఇత రులు చెప్పకపోయినా ఉత్తమ జీవిత విధానాలను అమల్లోపెట్టే బుద్ధిమంతులు. మట్టితోనే గోడలు. తాటాకులతో పైకప్పు. వెదురు తడికలతో తలుపులు. గోడలకు సున్నం వుండదు. బయటి నేలకు, గుడిసెలోపలి నేలకు తేడా వుండదు. గూడెంలో అడుగు పెట్టగానే ముకుపుటాలకు యింపితంగాని చెమ్మవాసన. కోళ్ళు, కుక్కలు, వంటకట్టెలు, మట్టికుండలు, గోనెసంచుల్లా మాసిపోయిన గుడ్డలు, చింపిరితలలు- ఈ హంగులవల్ల పదివేల యేండ్ల మానవ నాగరికత తీవ్రమైన సవాలుకు గురిగావడం ఆ పల్లెలో చూడవచ్చు. శిలాయుగంనాటి మానవ జీవనాన్ని గురించి సినిమా తీయదలచుకున్నవాళ్ళు చక్కా తమ అవుట్‌డోర్ షూటింగును గూడెంలో పెట్టుకోవచ్చు. ప్రత్యే కించి సెటింగు వేయనక్కరలేదు.

వేపచెట్టు నీడక్రింద పడుకున్న వెంకటేసుడు ఎండిపోయిన పెదవు

లను నాలుకతో తడిచేసుకున్నాడు. ఆహారం దొరికిన సంబరమేమో, చెట్టు కొమ్మల్లో ఉడతలు రెండు కిచకిచమంటున్నాయి. ఎక్కడో ఆకాశంలో తెల్లటి చక్కలా ఎగురుతున్న గ్రద్ద ఒకటి ఒక్కపెట్టున క్రిందికి దిగివచ్చి కాలిగ్రేళ్ళతో ఎరను లంకించుకుని రివ్వున పైకెగిరిపోయింది. దూరంగా మల్లేశ్వరుడి గుట్టపైన కడుపునిండుకూ పచ్చిక మేసిన ఆవులు మెల్లమెల్లగా క్రిందికి దిగివస్తున్నాయి. "అడవిపక్షుల కెవ్వ డాహారమిచ్చెను, మృగజాతి కెవ్వడు మేతబెట్టె" అంటూ చిన్నప్పుడు చదువుకున్నవాడు వెంకటేసు. ఇన్ని ప్రాణుల కిన్నివిధాలుగా ఆహారం సప్లయిచేస్తున్న భగవంతుడు రెండు రోజులుగా తననుమాత్రం లిస్టులోనుంచి తొలగించాడు! భగవంతుడిదాకా ఎందుకు? వెంకటేసుకు గూడెంలో ఒక గుడిసె వుంది. రంగి అంటూ ఒక పెళ్ళాం వుంది. రోజుల తరబడి తా నింటిముఖం చూడకపోయినా "నాన్నా, నాన్నా" అంటూ తన వెంటబడి తిరిగే ఎనిమిదేళ్ళ కుర్రకుంక ఒకడున్నాడు. రంగి తప్పకుండా మధ్యానం అన్నం వండేవుంటుంది. రెండుపూటలకు ఒక్కసారే చేసుకోడం గనుక తినింది పోగా కుండలో కొంత అన్నం యింకా మిగిలే వుంటుంది. అన్నంగాకపోతే సంగటి. అదీగాకపోతే అంబలి. ప్రాణం నిలుపుకోడానికే గదండీ తిండి! మొన్నటివరకూ రాజభోజనం దొరికింది. వెంకటేసేం వద్దన్నాడా? నిన్నటినించీ నిప్పచ్చరంగా వుంది. అలాగని యిప్పుడుగూడా అలాంటి రాజభోజనమే కావాలని వెంకటేసుకేమైనా పట్టింపుగా వుందా? లేదు. ఆకలిగా వున్నప్పుడు తనకు రంగి చేతివంట కూడా అమృతంలా ఉంటుంది. కానీ ఏ ముఖంపెట్టుకుని తనీ రోజున గూడెంవైపు వెళ్ళగలడు? గూడెంలో అడుగుపెట్టడమంటే తనకిప్పుడు తలకొట్టి మొలకేసినట్టే వుండదూ?

ఉంటుంది, అంతకంటే అవమానంగాకూడా వుంటుంది. ఎందుకుండదు? వెంకటేసు గూడెంవైపు తిరిగిచూచి మూడునెలలైంది. ఈ మూడు మాసాలకాలంలో అతడికి గూడెం వల్లకాటి దిబ్బకు మల్లే పోరానిచోటుగా పరిణమించింది. అక్కడి మనుషులు సజీవులైన నడపీనుగుల్లా కానవచ్చారు. అది పెళ్ళాంగాదు- తనకు చుట్టుకున్న పీడ. వాడు కొడుకు కాదు- వదలకుండా తనకు తగులుకున్న జంజాటం!

మరైతే ఈ మూడు మాసాల సంధికాలంలో ఒక మానవుడి బుద్ధి యిలా ఎందుకు మారింది?

కారణం లేకపోలేదు.

పండగ అనవచ్చు దాన్ని! "ఓట్ల పండగ" అనడం మరీ బాగుంటుంది. అది పీర్ల పండగలా వచ్చింది. పోలేరమ్మ జాతరలా వచ్చింది. "కాశీపట్నం చూడర బాబూ, గంగాఘట్టం చూడర బాబూ" అన్నట్టుగా చిన్న ఓటులోనుంచీ గంపెడు ఆశలు చూపెడుతూ వచ్చింది. "భామనే, ఒయ్యారి సత్యభామనే" అంటూ బయల్దేరి దుమ్మెదిరేటట్లుగా రంగస్థలంలో చిందులు ద్రొక్కే ఆడవేషంలా దేశమంతా గగ్గోలయిపోయేటట్టుగా వచ్చింది. తినబోతే దొరకని తియ్యటి మామిడి పండులా కొన్ని వందలమంది కొకటే కుర్చీ. అందులో ఎవరైనా ఒకరుమాత్రమే కూచోవాలి. ఇందుకు కావలసింది ఓటర్ల బలమే! అదెలా లభ్యమౌతుంది? యోగ్యతనుబట్టి లభ్యంగావడం న్యాయం. కానీ యోగ్యత నంతగా పట్టించుకొనేవాళ్ళే లేకపోయారు. ఇంతకంటే గత్యంతరం లేదని నచ్చజెపుతూ సామం బయల్దేరింది. "మీవి ఓట్లు. నావి నోట్లు. అవసరాన్నిబట్టి వేలంపాటను పెంచేదేగానీ దించేది లే"దంటూ రవి తేజంతో దానం ముందుకు నడిచింది. కలంపేరు, మతంపేరు చెప్పుకుంటూ భేదం విజృంభించింది. ఈ మూడు పద్ధతులూ వమ్మయిపోతే చివరకు నేనున్నాను లెమ్మని దండోపాయం హెచ్చరిక చేసింది.

పింగవరంలో ఎలా వుంది బాబూ? మంగిపాడులో ఏమైంది? నూకవరం సంగతి ఏమైనా తెలిసిందా?—ఓ యాభై యేళ్ళ క్రితం గనుక యిలాంటి ప్రశ్నలు పొడసూపివుంటే ఆయా వూళ్ళల్లో అప్పుడు మశూచిలాంటి తీవ్రమైన జబ్బు ఏదో విశృంఖల విహారం చేస్తుండే దన్నమాట! ఇప్పుడిలాంటి ప్రశ్నలన్నీ ఆయా వూళ్ళల్లో ఓట్లజాతర తాలూకు సంరంభం ఎలావుందన్న కుతూహలానికి మారువేషాలుగా పరిణమించాయి.

ఓట్ల తిరణాల ఒక విధంగా వీధి నాటకం లాంటిది గూడా! నటీనటుల సంఖ్య కొద్దిపాటిదైనప్పటికీ మిగిలిన ఓటర్లందరూ హంగుదారులే! ఈ నటీనటుల్లో మళ్ళీ రెండు రకాలు. తమకుతామే రంగు పూసుకునేవాళ్ళ

కొందరైతే, పరిస్థితుల ప్రోద్బలంవల్ల రంగు పూయించుకొనేవాళ్ళు కొందరు. ఈ వర్గీకరణలో రెండోరకం క్రిందకే వస్తాడు వెంకటేసు.

చిలక సముద్రం చిన్న పంచాయితీ గ్రామం. ఆ పేరుగలిగిన ఊరు గాకుండా గ్రామంలో వున్న పల్లెలు అయిదే. ఒకటి గుండ్లూరు. అది చిలక సముద్రానికి కూతవేటు దూరంలో వున్న పల్లె. పేరుకు వేరే వూరయినా అది చిలక సముద్రంలో కలిసివున్నట్టే లెక్క. మిగిలిన నాలుగింటిలోనూ మూడూళ్ళు దూరంగా విసిరివేయబడ్డట్టుగా ముఖ్య గ్రామానికి ఒకటి రెండు మైళ్ళ దూరంలో ఉన్నాయి. ఈ మూడింటిలో నాయకస్థానం బూరగపాడుది. గ్రామం ఒక త్రాసయితే దానికొకవైపున చిలకసముద్రమున్నూ, మరొకవైపున బూరగపాడున్నూ! కారణం దొరకడమే ఆలస్యం, ఉభయపక్షాలు దొమ్మీకి సిద్ధం. ఆ కారణం ఎంత చిన్నదైనా పరవాలేదు. కోడిపుంజుల జగడాలను రాజ్యాల మధ్య యుద్ధాల స్థాయికి డెవలప్ చేసిన శౌర్యాభిలిప్స జాతిలో యింకా చనిపోలేదు! ఇందుకు చిలసముద్రం, బూరగపాడు రగడలే ప్రత్యక్ష తార్కాణం!

ఎన్నికల సందర్భంలో చిలక సముద్రం చెంచు నారాయణప్పకు ప్రాణగొడ్డంలాంటి విషమసమస్య ఒకటివచ్చి పడింది. నిస్సందేహంగా మూడు వార్డులు తనవి. కానీ ప్రత్యర్థి బూరగపాడు హనుమంతప్ప గూడా యింతే బలాన్ని చేజిక్కించుకుని రంగంలో మోహరించి వున్నాడు. ఇప్పుడు జయాపజయాలు రెండూ ఒక ఏడో వార్డు పైన్నే ఆధారపడి వున్నాయి. ఆ ఏడో వార్డే గూడెం!

ఒకనాటి సాయంకాలం పొందికగా తలగుడ్డ చుట్టి, మెత్తటి చెడావులు తొడిగి, విలాసంగా చేతికర్ర వూపుకుంటూ చెంచు నారాయణప్ప గూడెంలో ప్రవేశించి వేపచెట్టు క్రింద రచ్చపైన కూచున్నాడు.

ఏలినవాడే పాలితుల దగ్గరికి నడచి రావడమన్నది భారతీయులకింకా క్రొత్తగానే వుంది. పుట్టి భూమిపైన పడింది మొదలు గూడెంలోని జనం యిలాంటి వింతను చూచి ఎరుగరు.

చెంచు నారాయణప్పగారి హితోపదేశం నల్లేరుపైన బండిలా సాగిపోయింది.

"అబ్బాయిలూ! జాగ్రత్తగా యినండి! ఒరే కోటిగా! నారిగా! గురు లింగం! అందరూ యినండి. ఈరో జెన్నికలొచ్చాయి. రేపెల్లిపోతాయి. ఎల్ల కాలమూ వుండేది గ్రామం. దాని బాగు మనసులో పెట్టుకుని తరవాత మనం మిగిలిన విషయాల్ని గురించి ఆలోచించాలి. పెద్దలొక మాటన్నారు. ఏమని? పోరు నష్టమనిన్నీ, పొందు లాభమనిన్నీ! ఎంత మంచి మాటన్నారో చూశావా గవరయ్యా? ఈ రోజు ఎలక్షను పేరు చెప్పి దేశం దేశమంతా గొంతుబంటి దాకా పోటీల వూబిలో దిగబడిపోయింది. పోతే పోయింది. మన వరకు మనం కలిసి కట్టుగా వుందామంటే ఆ బూరగపాడు అనుమంతప్పైనా నా మాట యిన్నాడా? నువు సెప్పడమేమిటి, నే యినడ మేమిటి? ఈ గ్రామానికి నువ్వెంతో నేనూ అంతేను! పో పోమ్మన్నాడు. ఇన్నావా శీతారాముడూ?"

"ఎంతమా టెంతమాట! తమ రెక్కడ, ఆయనెక్కడ? తమరు దరమ రాజులు గదండీ...."

"అబ్బే, దరమరాజుని గాకపోవచ్చు. కానీ యమదరమరాజుని కాదు గదా! అదీ, ఆ విషయం మీరు గ్నాప్తిలో వుంచుకోవాల. అలాగని నేనేదో మీపైన జులుం చెలాయిస్తున్నాననుకోవద్దు. మీ కందరికీ నేను తలా కొంచెం అప్పుపెట్టి వుండొచ్చు. మేమూ, మా పొలాలు లేకపోతే మీకు బ్రతుకు లేక పోవచ్చు. కానీ దీనికి దానికీ సంబంధం లేదు. చిల్కసముద్రమూ, గూడెమూ ఓబికాలంనుంచీ ఒక తల్లిబిడ్డల్లాగా వున్న సంగతి ఈ పాయకట్టులో అంద రికీ తెలుసు. నేను సెప్పేదేమిటంటే, యికపైన గూడా అలాగే జరిగిపోవాల. మనందరం ఒక తాటిపైన నడవాల! ఒక మాటపైన వుండాల!...."

"ఎవరికోసం వుంటామండీ బాబుగోరూ! మీ సొత్తే తిని మీకేదు రోహం సేత్తామా? సేత్తే కళ్ళుంటాయా? తమరు మమ్మల్ని కంటికి రెప్పగా చూచు కునే దీన్నీ, మేము మీరు గీసే గీటు దాటేదీనా? మా బొందిలో వూపిరుండగా అలా జరుగదు! ఎటువంటి ప్రెమాణకం సేయమన్నా సరే, మీ మాట జవ దాటేది లేదు...."

చెంచునారాయణప్పగారు వెళ్ళిపోయిన తర్వాత ఆ రోజు రాత్రి గూడెంలోని పిన్నపెద్దలందరూ కలిసి మళ్ళీ ఒక సభ ఏర్పాటు చేశారు. అందులో వెంకటేసుని తమ ఏకైన ప్రతినిధిగా ఎన్నుకున్నారు. మరేంలేదు,

వెంకటేసు చిన్నప్పుడు తన అమ్మమ్మగారింట్లో వుండి అయిదో తరగతి దాకా చదువుకున్నాడు. కళ్ళు మూసుకుని సంతకం పెట్టేయగలడు. తోమిన దుస్తులు గనుక తొడుక్కుని తల సుబ్బరంగా దువ్వుకుంటే మనిషి పంచాయితీ బోర్డు మెంబరనుకోడానికి తగినట్టుంటాడు.

నామినేషన్లదాకా అంతా సవ్యంగానే గడిపోయింది. తీరా ఆ మరునాడు తెల్లవారేసరికి వెంకటేసు గూడెంలో లేడు. చిలక సముద్రంలో లేడు. గుండ్లూరులోనైనా కానరాలేదు. తోటలు, దొడ్లూ, పొలాలూ, ఎక్కడా కానరాలేదు!

ఇక్కడ చెంచునారాయణప్పగారిలా వెంకటేసుకోసం అన్వేషణ సాగిస్తున్న సమయానికి సరిగ్గా అక్కడ వెంకటేసును తన ఎదుట కూర్చోబెట్టుకుని బూరగపాడు హనుమంతప్ప శుక్రనీతి బోధిస్తున్నాడు.

“ఒరే ఎంకటేసూ! గూడెం గూడెం అంటావు. గూడెం తవ్వి నీ తలకెత్తిందేమిటో సెప్పరా? మీ ఖామందు, అదే పిల్కాసముద్రం నారప్ప నీ తలపైన పెట్టిన కుచ్చులకుళ్ళా యెక్కడుందో సూపించరా! ఎందుకురా నీకీ లేనిపోని ఆశలు? మాశేమిత్రా నీ తలకాయ! మహామహావాళ్ళు మాటకే నిలబడి వున్నారా! ఎప్పుడైతే నువు నా చేతిలో పడ్డావో అప్పుడే నీ అదురుష్టం పండిందనుకో! అడ్డూ, ఆపూ లేకుండా నువ్విక్కడే వుండిపోరా ఎంకటేసూ! మస్తుగా తిను. మాయని బట్ట కట్టుకో. కంటినిండుకూ నిద్రపో. నువ్వు నాకు వేసేదల్లా ఒక ఓటు. అయిదేళ్ళపాటు నిన్ను దొరబిడ్డలా చూచుకునే పూచీ నాది. ఆ తరువాతి సంగతంటావా? అప్పటికి ఏ రాజు ఏ రాజ్యమేలతాడో ఎవరు చూచారు? ఎంతగా గూడెంవాళ్ళు తన సెప్పుసేతల్లో వుంటే మటుకు వుత్తుత్తి మాటలతో ఓటు కొట్టేయాలని చూస్తాడా సెంచు నారణప్ప! ఏం, మనిషి మనిషికీ ఓ పదిరూపాయల నోటు పారెయ్యగూడదూ? నేనైతే ఆదేపని చేసేవాణ్ణి. ఏం జెయ్యమంటావు? వాళ్ళు నా మాటలో లేరు. నువ్వుంటావని నాకు నమ్మకం వుంది. చూస్కో, నిన్నేం చేస్తానో....”

హనుమంతప్ప మాటలతో బాటుగా కొత్త దుస్తులు, కొత్తరకం భోజనం, సరిక్రొత్తదైన మన్నన- యివన్నీ వెంకటేసుమీద బాగా పనిచేశాయి. కొత్తగా మద్యం రుచి చూచేవాడికి ఒక గ్రుక్క మ్రింగుడు పడేసరికి బ్రహ్మ

నందం కనిపిస్తుంది. కానీ ఎంతగా అయోమయంలో వున్నప్పటికీ వెంకటేసు పూర్వాపరాలను గురించి ఆలోచించక పోలేదు. చిల్కసముద్రం చెంచు నారాయణప్ప సంగతి తనకు బాగా తెలిసిందే! చచ్చి గీ పెట్టినా ఆయన తన పైన పైసా ఖర్చు పెట్టడు. పోగా తానిలా హనుమంతప్పవైపు రావడంలో గూడెంవాళ్ళ ప్రమేయమేమీ లేదు. అందువల్ల చెంచునారాయణప్ప గూడెం వాళ్ళపైన అక్కస్సు వెళ్ళగ్రక్కవలసిన పనిలేదు. ఐనా ఒక రోజు గూడెం పలక్కపోతే చిలకసముద్రంలో ఎక్కడి పనులక్కడే బందు. చెంచు నారాయణప్ప దొంగకు తేలుకుట్టినట్టు వూరుకోవలసిందే. ఆ యనగారి కలాగే కావాలి! మాదర్చేద్ దేవుడికి గోదర్చేద్ పత్రి!

ఎన్నికలు ముగిశాయి.

జానపద చిత్రంలో కథానాయకుణ్ణి చెరొకవైపున నిలబడి వరించే నాయిక ద్వయంలా అదృష్టం ఒకటికి రెండు రూపాలతో హనుమంతప్పను వరించింది. చిలకసముద్రం పంచాతీబోర్డుకు ప్రెసిడెంటు కావడంతో బాటుగా ఆయన సమితికి ఉపాధ్యక్షుడుగా గూడా తయారై కూర్చున్నాడు.

చిలకసముద్రం చెంచు నారాయణప్పకు గడిచిన నెల రోజుల్లో ఎదురైన పరాభవం యింతలో మరిచిపోవడానికి వీలయ్యేది కాదు. "కంటికి నిద్ర వచ్చునే, సుఖంబగునే...." ఇత్యాది బాధలన్నీ ఆయన అనుభవించాడు. కానీ విశేషమేమిటంటే- ఈ అవమానం వల్ల ఆయన బుద్ధి మొద్దుబారిపోలేదు. పైపెచ్చు అదింకా చురుగ్గానే పనిచేసింది. ఇందుకు నిదర్శనం రెండు నెలల దీర్ఘాలోచన తర్వాత ఆయన తీసుకున్న నిర్ణయం.

ఆకులు, వక్కలు, పసుపు కొమ్ములు, కొబ్బరి కాయలు మొదలైన మంగళ ద్రవ్యాలను తట్టల కమరించుకుని, నలుగురు సాటి బంధువులను వెంటబెట్టుకుని, పురోహితుడు ముందు నడవగా చెంచు నారాయణప్ప హఠాత్తుగా బూరగపాడులో ప్రత్యక్షమై సూటిగా హనుమంతప్పగారి లోగిట్లోకి విజయం చేసేశాడు.

వాలుకుర్చీలో సుఖాసీనుడై, పొగచుట్ట కాల్చుకుంటూ అక్కడి పెత్తం దారును పిలిచి "ఒరే చెన్నకేశవులూ! వియ్యాల వాళ్లొచ్చారని మీ అయ్య వారితో సెప్పరా" అన్నాడు.

"కయ్యాలవాళ్ళు వియ్యాల వాళ్ళయిం దెప్పుడు?" అంటూ ముసి ముసి నవ్వులతో హాల్లోకి వచ్చాడు హనుమంతప్ప.

"అయ్యా, హనుమంతప్పా! కయ్యానికి మేము మీతో దీటుగాదని తేలి పోయింది. పోతే మిగిలిన విషయాల్లో మనం మనం సరిసమానమేనని నేననుకుంటున్నాను. పోట్లాడుకున్నన్ని దినాలు పోట్లాడుకున్నాము. కోర్టుల చుట్టూ తిరిగాము. దీనివల్ల మేలుపడిందేమీలేదు. ఎందుకొచ్చిన బెడద? అందువల్ల నాకొక మంచిపని చేయాలన్న బుద్ధి పుట్టింది. నీ కూతుర్ని మా అబ్బాయికి అడగడాని కొచ్చాను. ఇష్టమైతే ఈ పళ్ళాల్ని తీయించి లోపల పెట్టించు. ఇష్టంలేదూ- ఆ మాట తేల్చి చెప్పు...."

పది పదిహేను నిమిషాల వరకు హాల్లో స్తబ్దతే రాజ్యమేలింది.

ఆలోగా లోపలికి వెళ్ళి జనానావారితో సంప్రదించి వచ్చిన హనుమం తప్ప "ఒరేయ్ చెన్నకేశవులూ! తట్టలు తీసుకెళ్ళి లోపలపెట్టించరా! అలాగే చుట్టాలకు కాఫీలు పట్టుకరారా" అన్నాడు.

పైపైకి ఈ పెళ్ళిసంబంధం ఒక సవ్యమైన పరిణామంగానే గోచ రించింది. కానీ యిందులో లోగుట్లు కొన్ని వున్నాయి. హనుమంతప్పగారి అమ్మాయికి కాస్త చెముడుంది. కాస్తా కూస్తా ఏమిటి, బ్రహ్మాండమైన చెముడేనని కొందరంటారు. ఆ పిల్లకింతకంటే భారీ సంబంధాలు రావడం కష్టం. చెంచు నారాయణప్ప ఉద్దేశం వేరు. ఆడవాళ్లు ఎంత తక్కువగా వినగలిగితే అంత మంచిదని ఆయన ఉద్దేశం. ఇందువల్ల తన కుమారుడికి తానెంతో భారం తగ్గించినవాడవుతాడు. కానీ అదేమంత ముఖ్యంకాదు. ఈకాలమనేదుందే- యిది గూటం గొట్టుకుని యిక్కడే స్థిరంగా వుండిపోదు. గిర్రున తిరిగిపోతుంది. వచ్చే ఎన్నికల్లో తాను అబ్బాయిని ఎన్నికల్లో నిలబెడ

తాడు. అప్పుడు హనుమంతప్ప తగుదునమ్మా అని అల్లుడితో ఎలా పోటీ చేస్తాడో, అదీ తన కళ్ళతో తానే చూస్తాడు.

ఆట కట్టయిపోయిన తరువాత చదరంగపు బలాన్నంతా ఒక కుప్పగా తోసి బుట్టలో పడవేశారు .అలా చేయడంలో ఆ వేళ్ల సందుల్లోనుంచీ నేలపైకి రాలిపోయిన ఒక బంటును గురించి ఎవరు పట్టించుకుంటారు?

ఆ బంటే వెంకటేసు.

"ఇంక నీ జాగ్రత్తలో నువ్వుండవచ్చురా వెంకటేసూ! నీ ఆకు బయటపడిపోయింది" అని ఎవరో చెబుతే, వాళ్ళు చెప్పేదేమిటో వెంకటేసు కర్థంకాలేదు.

పిలిచి పిలిచి భోజనం పెట్టే మర్యాద గూడా ఆనాటితో ఆఖరై పోయింది. విస్తరి చేతబట్టుకుని తనంతట తానే వెళ్ళినా భోజనం పెట్టాలన్న ధ్యాస ఎవ్వరిలోనూ కనిపించడం లేదు.

పూర్తిగా విడమరిచి చెబుతేగానీ అర్థం చేసుకోలేని మూర్ఖత్వానికి ఎవరో ఒకరు విరుగుడుమందు యివ్వవలసి వచ్చింది. ఆ పనికి పూనుకున్న వ్యక్తి సక్కూబాయమ్మ. ఆమె హనుమంతప్ప తల్లి.

"నీపనేదో నువ్వు చూచుకోగూడదట్రా వెంకటేసూ! దంచినమ్మకు బొక్కిందే కూలీ అనుకోవాలి మరి! పోనీలే,ఈ పూట భోజనం చేసే వెళ్ళు...."

తెర తీయగానే మూలవిరాట్టు కనిపించినట్టుగా, సక్కూబాయమ్మ వీడ్కోలు మాటతో వెంకటేసుకు అప్పటి తన స్థితీ, గతీ బాగా అవగతమై పోయింది.

మరునాటి ఉదాయం తెల్లవారక మునుపే వెంకటేసు బూరగపాడు వదిలి పెట్టేశాడు. ఊతకొమ్మ పోతే పోయింది, తనకిప్పుడు పట్టుగొమ్మ మాత్రం ఎక్కడుంది? బూరగపాడుకు తనతో పని తీరిపోయింది. చిలక సముద్రానికి తనను నమలి మ్రింగేయాలన్నంత కోపంగా వుంది. స్వంతవూరికి తాను తీరనిద్రోహం చేశాడు. తనతో ముఖమిచ్చి మాట్లాడే వాళ్ళెవరున్నారు?

మనిషైన వాడికంటపడకుండా వుండడంకోసం ఆ రోజంతా వెంకటేసు విశ్వప్రయత్నం చేశాడు. మామిడితోపుల్లోనూ, చిట్టడివి పొదల్లోనూ కాలక్షేపం చేశాడు. చీకటిపడిన తర్వాత నరసంచారంలేని ప్రదేశంలో వుండలేక చిలకసముద్రానికి దగ్గరగా వచ్చి గ్రామశక్తి దేవళం ఎదుట మంటపంలో పడుకున్నాడు. ఎప్పుడు నిద్రపట్టిందో ఏమిటో? మళ్ళీ తెల్లవారబోతున్నదన్న భీకరసత్యం కొరడాతో కొట్టినట్టుగా నిద్రలేపింది. రైతులు పొలాలకు బయల్దేరకముందే తాను కనుమరుగై పోవాలి. కానీ నడిచే ఓపికను తన కాళ్ళిప్పుడు కోల్పోయినట్టున్నాయి. కాటమరాజు గుట్ట మొగదలలో వున్న వేపచెట్టుక్రిందికి రాగానే అవింక ముందుకు సాగడానికి మొరాయించాయి. పై గుడ్డ విదిలించి నేలపైన వేసుకుని అక్కడే కూలబడిపోయాడు వెంకటేసు.

ఏడుగుర్రాల రథంలో మండే దేవర ఒక్క బిర్రున పైకి వచ్చేశాడు. మహానుభావుడు; తన దొరతనం క్రింద కంఠ దఘ్నంగా తిన్నవాళ్ళెందరు, కడుపు మాడుతుండగా విలవిల లాడిపోతున్న వాళ్ళెందరు అని లెక్కచూచుకోకుండా ముందుకు సాగిపోతున్నాడు. పడమటి కొండమజిలీ యింకొక పది గడియల ప్రయాణంలో వుంది....

చల్లగా చెంపకేదో సోకినట్టయింది. కనురెప్పలపైనగూడా అలాంటిదే చల్లటి స్పర్శ. కళ్ళు తెరిచాడు వెంకటేసు. బూసులు క్రమ్ముకపోయినట్టున్న కళ్ళకు మసక మసకగా ఏదో ఆకారం గోచరించింది.

"నేనయ్యా దొర్సామిని! ఇదేంటయ్యా యీడ తొంగుతున్నావు? రాయ్యా, యింటికెళ్దాం గానీ...."

వెంకటేసు కళ్ళల్లో నీళ్ళు క్రమ్ముకున్నాయి. కుర్రవాడి భుజంపైన చేయివేసి గాఢంగా గుండెలకు హత్తుకుంటూ "దొర్సామీ! నేనిక్కడున్నానని నీకెలా తెల్సింది?" అన్నాడు.

"ఎవురో పేడకొచ్చినోళ్ళు సెప్పినారు. లగెత్తుకొచ్చేసినాను. అమ్మ యింట్లోలేదు. బల్రామయ్యగోరిది మడి కలుపు తీయడానికెళ్ళింది. చేసిపెట్టిన

అన్నం కుండలో వుంది. రాయ్యా, అన్నం తిని యింట్లోనే పడుకుందువు, గానీ....''

''ఒద్దురా దొర్సామీ! నేను అన్నం తిన్నానురా! నిన్నొదిలిపెట్టి మూడు నెల్లపాటు ముక్కు దాకా మెక్కినాన్రా! నా కోసం నువ్వెందుకురా ఒచ్చింది? ఒద్దు. వెళ్ళిపోరా దొర్సామీ! నే రాను. రానంటే రాను. ఇక్కడే పడుంటాను....'' చెంపలపైకి జారుతున్న కన్నీరు కొడుక్కు కనిపించకుండా ముఖం అవతలికి త్రిప్పుకుంటూ అన్నాడు వెంకటేసు.

అయిదునిమిషాలవరకూ తండ్రీ కొడుకులిద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. ఒక చిన్న గుడిసె. అందులో తల్లి. ఆమె చేసిపెట్టే తిండి. అందుకోసం ఆమె చేసే కూలీ నాలీ....ఈ విషయాలు తప్పా మరేమీ తెలియని పసివాడు తల వంచుకుని నేలపైన ఏవో పిచ్చిగీతలు గీస్తున్నాడు.

తటాలున లేచి కూర్చున్నాడు వెంకటేసు.

బుగ్గలు పుణుకుతూ ''ఎళ్ళిపోరా నాన్నా! నేను గూడెంలోకి రాలేన్రా! నీకు తెలీదు. నువ్వెళ్ళిపోమ్మా! నా బుజ్జివి గదూ....'' అన్నాడు.

''ఊఁ హూ'' అడ్డంగా తలాడించాడు కుర్రవాడు. ''ఇక్కడుంటే నీకెవు రొండిపెడతారు? అమ్మ యింట్లో లేదుగా! నీ పాటుకు నువు తిని పడుకుంటే పోలా! రాయ్యా, ఎల్లిపోదాం'' గట్టిగా చెయ్యి పట్టుకుని తండ్రిని లేవదియ్య జూస్తున్నాడు దొరసామి.

తండ్రిగా తన పెద్దరికం నిల్పుకోలేని వెంకటేసు కళ్ళకు ఆ క్షణాన పదేళ్ళ కుర్రవాడు తనకంటే పెద్దవాడుగా కనిపించాడు. తన తండ్రి బ్రతికుంటే తన నిలాగే పిలిచేవాడేమో! తప్పుచేసిన బిడ్డను మన్నించడం తండ్రికి మామూలే! పశ్చాత్తాప పడిన కొడుకు తండ్రి పిలవగానే లేచి వెంబడించడంగూడా రివాజే! ఇక్కడందుకు విరుద్ధంగా జరిగినట్టుగా లేదు వెంకటేసుకు___

జనమంతా పనిపాటలకు వెళ్ళిపోయారేమో, గూడెంలో ఏమంత సందడిగా లేదు. గొళ్ళానికి చీలకుతో కలిపి కట్టిపెట్టిన త్రాటిని విప్పేశాడు

దొరస్వామి. వెంకటేసును లోపలికి తీసుకెళ్ళాడు. కంచం తెచ్చిపెట్టి కుండలోవున్న అన్నమంతా అందులోకి కుమ్మరించేశాడు. పిడతలోవున్న కూర నందులోకి వంచేశాడు. సత్తు గళాసులో నీళ్ళు తెచ్చి పెట్టాడు.

"తినయ్యా! ఆకలిగా వుంటేగానీ నువ్వలా పడుకోవని నాకు తెల్సుగా! అమ్మొస్తే నేను చెబుతాన్లే...."

కొడుక్కు తా నన్నం పెట్టవలసింది పోయి వాడు తనకింత అన్నం పెడుతున్నాడు. బోరుబోరున ఏడవాలనిపించింది వెంకటేసుకు.

వెంకటేసు అంతరంగానికిన్నీ, బాహ్యప్రపంచంలో వాతావరణానికిన్నీ ఏదో దగ్గరి సంబంధం వున్నట్టుగా రివ్వురివ్వున గాలి వీచసాగింది. అతడి కడుపులో ఆకలి చల్లారేసరికి జల్లుజల్లుమంటూ ఉబ్బచిలుకులుగూడా రాల సాగాయి. వెంకటేసు వెలుపలికి చూచాడు. మబ్బులు దట్టంగా ముసురుకుంటు న్నాయి. వాన బలం కావచ్చు. కూలీకి వెళ్ళిన జనం తిరిగి వచ్చేస్తారేమో! రంగి కంట పడకుండా తానొక బల్లిగా మారిపోయి గోడ కంటుకపోయినా బాగుండి పోవును....

"వానొస్తోంది. అమ్మ తడిసిపోతుందేమో! గూడ తీసికెళ్తానయ్యా...." తాటాకు గూడ తలపైన బోర్లించుకుని విడిచిపెట్టిన బాణంలా వానలోకి దౌడు తీశాడు దొరసామి.

వచ్చేస్తుంది. రంగి వచ్చేస్తుంది. వెంకటేసు పాదాలు గుమ్మంలో నిలవ లేదు. తలుపు ఓరవాకిలిగా వేసుకుని అతడు గుడిసె వెనకవైపుకు వెళ్ళి చూరు క్రింద నిల్చున్నాడు.

పది పదిహేను నిమిషాల తర్వాత మళ్ళీ తలుపు తెరుచుకుంటున్న చప్పుడు వినిపించింది.

"సమయానికి గూడ తెచ్చావుగానీ లేకుంటే తడిసి ముద్దయిపోయి వుండేదాన్ని. అప్పటికీ సగం తడిసిపోయాను. పొయిసెగన కూచుంటే ఆరిపోతుందిలే. పొయిలో నిప్పుందేమో సూడరా దొర్సామీ!"

"నిప్పున్నట్టులేదు. ఆరిపోయింది...."

"పోతేపోయిందిలే. కాసేపటికదే ఆరిపోతుంది. ఎలాగో తెల్లావారి పూచే యింత వండిపడేశాను కనుక సరిపోయింది. లేకుంటే వానకూ దానికీ పోయి మండక అఘోరించేదాన్ని...."

దొరసామి కిక్కురుమనడంలేదు.

"కిర్సనాయిలు గూడా నిండుకున్నట్టుంది. వెల్తురుండగానే తలా కొంచెం తినేస్తే పోలా. కంచాలు పెట్టరా దొర్సామీ...."

"అన్నం నేను తిన్నానమ్మా! నీకేలేంది...."

"ఏమిట్రా! నువ్వు తిన్నావా?" కుండలు కదలిన చప్పుడు. "అంతన్నం నువ్వెలా తిన్నావురా దొర్సామీ? కూర కూడా లేదే!"

పట్టుబడిన నేరస్తుడిలా చిక్కి బిక్కిరిస్తున్నట్టున్నాడు దొరసామి. ఐనా వాడు తండ్రి గౌరవానికింకా పెట్టని కోటలా నిలబడాలనే చూస్తున్నాడు.

"నిజెం. నేనే తినేశానమ్మా!"

"ఊఁ హూఁ!" తల పంకిస్తూ వుంటుంది రంగి. ఆమె కర్థమయ్యే వుంటుంది. తమకు పెళ్ళయి యిది పన్నెండోయేడు. ఈ పది పన్నెండేళ్ళలో పట్టుగా యింటిపట్టున వుండి తాను కాలాన్ని కష్టాన్నీ కుటుంబం కోసం వెచ్చించింది లేదు. ఆదినుంచీ తాను అల్లాటప్పాగా తిరగడానికే అలవాటు పడ్డాడు. చెప్పకుండా వెళ్ళిపోయి తిరిగి యింటికి వచ్చినప్పుడల్లా యిలా చాటుగా యింట్లో దూరి కుండ ఖాళీచేసేయ్యడం యిక్కడ పాత కథే.

తల్లి ఎదట పడడానికి మనసు చెల్లక తండ్రి బయటుండి పోతున్నాడని దొరసామికి తెలుసు. ఆ సంగతి తల్లికి తెలుసునని గూడా తెలుసు. ఈ పొందని, పొసగని పరిస్థితి సర్దుబాటు కావాలంటే కొంతసేపు తానెక్కడైనా వుండి రావాలని కూడా తెలుసు.

"అమ్మా! నేను భజన కూటానికి పోతున్నా...."

చూరుక్రింద నిల్చున్న వెంకటేసు హైకోర్టుకు అప్పీలుచేసి తీర్పుకోసం

ఎదురుచూస్తున్న జీవిత ఖైదీలా దిగాలు పడిపోయాడు. ఇప్పుడిక ఏ క్షణాన్నయినా రంగి తనపైన విరుచుకపడవచ్చు....

ప్రతిక్షణమూ ఒక యుగంలా గడవడమంటే ఏమిటో యిప్పుడు వెంకటేసుకు తెలిసివస్తోంది.

ఆకాశాన కారుమబ్బు లాడుతుండడంవల్ల గూడెం గాఢాంధకారంలో మునిగిపోవడానికి ఎంతోసేపు పట్టలేదు. పోటెత్తిన సముద్రంలో అలల హోరుగా గాలి జోరు హెచ్చింది. మద్దెలు మ్రోగినట్టుగా దూరంగా ఎక్కడో వాన సవ్వడి.

తాను వానలో తడిసిపోతున్నట్టు తెలిస్తే రంగికి ప్రాణం నిలవదు. ఆ వాన కాస్తా గూడెంలోకి రాగూడదూ?

ఆన్‌చేసి పెట్టిన రేడియో కరెంటు రాగానే గొంతు విప్పుకున్నట్టుగా వుండి ఎప్పుడో ఒక క్షణాన గుడిసెలో నుంచీ మాటలు వెలువడ్డాయి.

"తినేందుకులేని పట్టింపు యింట్లో వుండటాని కొచ్చిందేమో! మరేం పరవాలేదు. లోపలకి రావచ్చు. చేసిన నిరవాకానికి తోడుగా ఈ బింకం ఒకటా? బొట్టూ కాటికా పెట్టి లోపలికి పిలవాల్సిన అక్కర యిక్కడెవురికీ లేదు...."

ఇంతకు మించిన తియ్యటిస్వాగతం వెంకటేసు కక్కర్లేకపోయింది.

"చూడు రంగీ! నాకు బుద్ధొచ్చింది. కట్టుకున్న భార్య. కన్నకొడుకు తప్పితే లోకంలో మనిషికయ్యేవా ళ్ళెవరూ లేరని తెలిసొచ్చింది. వగా తగా లేని మగవాణ్ణి కట్టుకుని నువ్వేమనుభవించావు ? కట్టుకున్న చీర వానకు తడిసిపోతే విప్పిపెట్టడానికి నీకు మారుచీర లేకపోయింది. నా ప్రయోజకత్వం తగలడినట్టే వుంది. నే నన్నీ పనికిమాలిన పనులే చేశాను. తల తిరిగినప్పటికీ కవళం నోటిదగ్గరికి రాకపోతుందా సెప్పు....మాటాడవా రంగీ?"

తాళం బిగించినట్టుగా రంగి పెదవులు విడివడడంలేదు.

"నేను చేసిన పనికి నువ్వు వన్నెలాగైనా తిట్టొచ్చు. తిట్టు రంగీ! బంగారంలాంటి నిన్ను, ముత్తెంలాంటి బిడ్డను వదిలిపెట్టి మూడునెలలుగా నా కడుపే కైలాసమనుకున్నాను. ఆ భోగం శాశ్వతం కాదని తెలిశాక గానీ నా కళ్ళకు గప్పిన పొర తొలగలేదు. చెబుతున్నానుగా! ఇక మీద ఎప్పుడు మిమ్మల్ని వదిలిపెట్టి వెళ్ళను. నీపైన ఒట్టు. కావలిస్తే నీ పాదాలు పట్టుకుని చెబుతాను...."

"ఛాఛా, దూరంగా వుండు. మగాడివై వుండి ఆడవాని పాదాలు పట్టుకుంటావా! బావుందిలే వరస...."

రంగి పొరుగింటికి వెళ్ళి బుడ్డీదీపం నిండుకూ కిరసనాయిలు పోయించు కొచ్చింది. పొయి ముట్టించి అన్నం వండింది. కొడుకును కేకేసు కొచ్చి అన్నం పెట్టింది. గోనెసంచిలో కాళ్ళు దూర్చుకుని కుర్రవాడు నిద్రా దేవత ఒడిలోకి జారిపోయాడు.

"నువ్వన్నం తినలేదా రంగీ?" మళ్ళీ వెంకటేసే పలకరించాడు.

"లేకుంటే లేనిపాడు. ఇంట్లో వున్నావుగా! కలిసే తిందాం. లేచి కూచో...."

"సత్తెం చెబుతున్నాను రంగీ! నే నింక యిల్లు ఒదిలిపెట్టేది లేదు. ఆడపనీ, మగపనీ రెండూ నువ్వే చేసుకుంటూ యింతకాలం సంసారం ఎలనీదుకొచ్చావు. ఇకనైన అలా జరక్కూడదు...."

అన్నం వడ్డిస్తూవున్న రంగి అలాగే భర్తఎదుట కూర్చుని అర్థం కానటు సూటిగా ప్రశ్నించింది.

"ఏంటయ్యా నువు సెప్పేది?"

"అదే, నువ్వెందుకు కూలీకెళ్ళాలి? ఆ పనేదో నేను సెయ్యలేనా? భేషుగా సెయ్యగలను. నువ్వు చూస్తూండు. రోజుకు రెండో మూడో తెచ్చి నీ చేతిలో పడేయకపోను...."

"ఆనందమైపోయింది గానీ వూర్కో—మామా! నీతులు చెప్పొచ్చాడమ్మా

యింతకాలానికి మగ మారాజు! కాకపోతే నువు కూలీకెళ్తావా? అదిగాదు మామా, నువ్వా ఒకరికింద చాకీరీపన్లు చేసేది? పంచాయితీ బోరుడ్డు నెంబరు వై వుండి ఆ మాట సెప్పడానికి నీకు నోరెలా వచ్చింది? చాల్లే వూరుకో! ఎవురైనా నవ్విపోయేరు....''

రాజుల కాలం పోయింది. ప్రజల కాలం వచ్చింది. అందువల్ల ఈ నాడు ప్రజలే రాజులు. ఆ లెక్కన రంగి ఒక రాణి గాకపోదు. ఒక మహారాణిలో కనిపించవలసిన ఔద్ధత్యమున్నూ, ఆత్మాభిమానమున్నూ యిప్పుడు రంగి ముఖంలోనే కానవస్తున్నాయి.

తల దిమ్మదిరిగి పోయినట్టుగా - తెల్లబోయి కూర్చున్న వెంకటేసును మళ్ళీ ఆవిడే స్తబ్ధతలోనుంచీ లేపవలసి వచ్చింది.

''పిచ్చిపిచ్చిగా మాట్లాడకుండా నువ్వన్నం తిను మామా! నేనున్నాను. నా రెక్కల కష్టముంది. నీకెందుకు? వేళకింత తిను. నీపాటుకు నువ్వుండు. నీ సంపాదన నా కక్కర్లేదు. పంచాయితీ బోరుడ్డు నెంబరు పెళ్ళాన్నన్న కితా బొక్కటే చాలు నాకు!''

---

రాచవీడునుండి బయలుదేరుతున్న కారును చూచి అదెక్కడికి బయలు దేరిందో తెలిసినవారు ఆశ్చర్యపోయారు. తరుముకొస్తున్న మంటలాంటి దుమ్ములో అదృశ్యమైంది కారు. కనుమ దిగి ఓడబళ్ళ వంకలో కాస్త మారాం చేసి, తిట్లు తిని, మళ్ళీ మట్టిబాటలో దుమ్ముకు అందకుండా పరుగెత్తింది.

కారు చేరవలసిన చోటు చేరాక, అదెక్కడినుండి వచ్చిందో తెలుసు కున్నవారు ఆశ్చర్యపోయారు.

పడసాలలో గోపాలాచార్యులుతో మాట్లాడుతున్న వెదుళ్ళ బయలు నరసారెడ్డి, ముఖమంతా నవ్వుచేసుకొని గబగబా ముంగిట్లో కొచ్చాడు.

కారు దిగి, ధోవతి కుచ్చెళ్ళు ఎడమచేత్తో పట్టుకొని మెల్లెక్కుతున్న రాచవీడు ఎర్రంరెడ్డి "నమస్కారం" అని గంభీరంగా కుడి చెయ్యి పైకెత్తాడు.

"అయ్యయ్యో! అదేం మాట. మీరు పెద్దవాళ్ళు, గొప్పవాళ్ళు అలా అనకూడదు." గాభరా పడిపోయాడు నరసారెడ్డి.

"నమస్కారం" అన్నాడు చంద్రశేఖరరెడ్డి.

"వీడే నా కొడుకు. అదృష్టంవుంటే మీ అల్లుడు."

"ఎవరికి?"

నరసారెడ్డి చమత్కారానికి, ఎర్రంరెడ్డి నవ్విన నవ్వుకు—అక్కడే రాగులు ఏరుకు తింటూవున్న కోడిపిల్లలు అరుస్తూ పారిపోయాయి........

అందరూ హాల్లో కెళ్ళారు. గోపాలాచార్యులు లేచి నమస్కారం చేశారు.

"మీరు చాలా తరాల తర్వాత వైరాలు మరచి, యిలా వియ్యంకులు కావాలనుకోవటం మన ప్రాంతానికే శుభం," అన్నారు.

"వైరాలు పోయాయి. వాటిని మరచిపోయాము. మళ్ళీ జ్ఞాపకం రాకుండా నా కూతుర్ని వారింటికి పంపుతున్నాను" అన్నాడు నరసారెడ్డి.

"పోనీ, నా కొడుకునే మీ ఇంటికి పంపుతాను" అని నవ్వాడు ఎర్రం రెడ్డి.

గోపాలాచార్యులు కూడా నవ్వు కలిపాడు.

"ఈ రోజు మన రామమందిరంలో సీతాకళ్యాణం జరుగుతుంది. తర్వాత ఊరేగింపు. మీరిద్దరూ దయచేయాలి" అన్నారు ఆచార్యులు.

"ఆ విషయం మా బావగారికి చెప్పండి. మమ్మల్ని తీసుకురావాల్సిన బాధ్యత వారిదే కదండి?" ఎర్రంరెడ్డి అన్నాడు.

"కదండీ! తప్పకుండా తీసుకొస్తాం."

"నేను సెలవు తీసుకుంటాను. తమర్ని ఆహ్వానించటానికే వచ్చాను."

ఆచార్యులుగారిని యింట్లో కెళ్ళమన్నట్టు సైగచేశాడు నరసారెడ్డి.

"అలాగే" అన్నట్టు చూసి యింట్లోకి నడిచాడు ఆచార్యులు.

"ఇదో బావగారూ! పెళ్ళిచూపులూ, వగైరాలూ వద్దు. అబ్బాయి తిరుపతి యూనివర్సిటీలో అమ్మాయిని చూచాడట. తన కిష్టమేనని చెప్పాడు. అమ్మాయి కూడా ఏ తలుపు సందులోనుంచో అబ్బాయిని ఈసరికి చూచే వుంటుంది. అక్కయ్యగార్ని తెలుసుకోమనండి. ఈ పెళ్ళిచూపులున్నాయే.... యివి అబ్బాయిలకు చెలగాటం-అమ్మాయిలకు ప్రాణ సంకటం." మామూలు నవ్వు నవ్వాడు ఎర్రంరెడ్డి.

"అలాగే" అన్నట్లు తలూపాడు నరసారెడ్డి.

"అలాగైతే అతను ఎమ్. ఏ. పూర్తిచేయలేదన్నమాట!" అన్నది ఆశ్చర్యంగా లక్ష్మీదేవమ్మ.

"అతను పూర్తిచేయకపోతేనేం? అమ్మాయి చేసిందిగా? పరీక్షల సమయానికి అతని ఆరోగ్యం సరిగాలేక పరీక్షకు పోలేదట.... రేపు సంవత్సరం పూర్తి చేస్తాడుగా!" అన్నాడు ఆచార్యులు.

తను చెప్పిన సమాధానం తనకే సంతృప్తిగా లేదు ఆచార్యులుగారికి. ఆచార్యులుగారి సమాధానం లక్ష్మీదేవమ్మకూ సంతృప్తికరంగా లేదు. కానీ ఎవరూ ఆ విషయం ప్రస్తావించలేదు. "అది సరే కానీండి - వారికీ మనకూ తరతరాలుగా ద్వేషం వుందికదా....ఇప్పుడు ఇలా కలియాలని...."

"దైవేచ్ఛ." ఆ విషయాన్ని చర్చించటం ఇష్టం లేనట్టు ముఖంపెట్టాడు ఆచార్యులు.

ఇప్పుడే పొద్దు వాటారిపోతున్నది. కానీ ముసలివాడి కోపంలా ఎండ చిరచిరలాడుతోంది. నుదుటిమీద పొంగివస్తున్న చెమట తుడుచుకుంటూ గోపాలాచార్యులు లేచారు. "లేనిపోని అనుమానాలు పెట్టుకోవద్దు లక్ష్మీ దేవమ్మా! పెళ్ళి మానవుల చేతిలో లేదు. జానకి దేవతలాంటి బిడ్డ. ఆమెకు ఎప్పుడూ గాయం తగలదు. వస్తాను" ఆచార్యులు బయలుదేరాడు. లక్ష్మీ దేవమ్మ మనస్సులోని ముల్లు మాత్రం అలాగే వుండిపోయింది.

"కతికితే అతకదట. ఎవరయ్యా అన్నది. ఈ రాత్రికి మీ ఇంట్లోనే మా భోజనం. ఎందుకు అతకదో చూస్తాను." టిఫిన్ తింటూ అంటున్నాడు ఎర్రంరెడ్డి-హాల్లోనుంచి.

"అవును."

"అవునయ్యా! ఇక్కడే మా భోజనాలు. భోజనాల తర్వాత భజన మందిరంలో సీతారామ కళ్యాణం చూచి- ఉదయం ప్రయాణం."

"ఫలహారం చేసుకొని."

"అవును. ఫలహారం చేసుకొని!" నవ్వాడు ఎర్రంరెడ్డి.

కిటికీ రెక్క సందులోంచి చంద్రశేఖరం చెక్కులమీద తళతళ లాడుతున్న ఎండను కన్నార్పకుండా చూస్తున్న జానకి అదిరిపడింది.

"ఇకమీద ఈ నవ్వు రోజుకు ఎన్నిసార్లు వినాలో!" అనుకుంది.

* * *

సుదూరాన సన్నాయి సున్నితంగా వినిపిస్తోంది. పలచ పలచగా వచ్చిన చీకట్లు చిక్కగా అలుముకున్నాయి. వాతావరణం ఉక్కగా, వూపిరాడనట్టుగా వుంది. చీకటిని చూచి భయంగా, నిశ్చలంగా నిలబడ్డాయి చెట్లు.

కనిపించని చెట్లనూ, కనిపించనివ్వని చీకటిని చూస్తూ నిలబడింది జానకి. ఉన్నట్లుండి నరసారెడ్డి గదిలోంచి సీసా నేలపడి పగిలిన చప్పుడు వినిపించింది. "అప్పుడే ప్రారంభమైందన్న మాట!" నిట్టూర్చింది జానకి.

పెరట్లో కొబ్బరిచెట్లలో గూడుకట్టుకొన్న చీకటి గూబలా మూలిగింది.

"ఒరేయ్ నాగడూ!" నరసారెడ్డి వరండాలో కొచ్చి కేకేశాడు. మెట్లమీద నాగడు పరుగెడుతున్న శబ్దం——

"రేయ్, భోజనం తీసుకురా!" అప్పుడే నరసారెడ్డి కంఠం బరువుగా, నాలుక మందంగా వుంది.

జానకికి కడుపులో దేవినట్టయింది. సుమారు పదేళ్ళముందు జరిగిన సంఘటన కళ్ళముందు కదిలింది.........

పాలేరు నాగడి అక్కయ్య-మునెమ్మ నాన్నగారి ప్రవర్తనను గురించి అమ్మతో చెబుతోంది. మేడమెట్లు దిగుతూ విన్నది తాను....

"ఎప్పుడు?" ఆత్రంగా అడిగింది అమ్మ.

"నిన్న నడిజాముకాడ అమ్మగారూ....అయ్యగారు బాగా నిషాలో వుండారు. మా బ్రతుకేముంది అమ్మగారూ, మీ ముంగిట్లో కుక్క బ్రతుకు.... ఏదో సామెత చెప్పినట్టయింది." అవమానం. రోషం మునెమ్మ గొంతులో గుడగుడలాడాయి.

తాను ఆశ్చర్యపోయింది. కానీ అమ్మ ముఖంలో ఆశ్చర్యం లేదు. తన్ను చూడగానే అమ్మ కళ్ళు చింతనిప్పు లయ్యాయి.

"జానకీ! నువ్వు లోపలికెళ్ళు." కసిరికొట్టింది అమ్మ.

రెండోరోజు అమ్మముందు నాన్న ఎంత దీనంగా - దేవుని ముందు పాపిలా- నిలబడ్డాడో అనుకోకుండానే చూచింది తాను. అంతే. ఆనాటినుంచీ తాగుడంటే అసహ్యం తనకు.

నాగడు నరసారెడ్డి గదిలోకి భోజనం తీసుకెళ్ళుతూ 'చిన్నమ్మా!' అని పిలిచాడు.

"ఏం రా?" అన్నది జానకి.

"ఆచార్లసామి వచ్చినాడు. నిన్ను రమ్మంటా వుండాడు," అన్నాడు.

"నాన్నగారితో కూడా చెప్పు."

నాగడు వెళ్ళాడు. జానకి మేడ దిగి వచ్చింది. జానకిని చూస్తూనే—

"ఏమిటమ్మా అదోలా వున్నావు?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు ఆచార్యులు.

"ఏమీలేదండీ— యింకా భోజనం చేయలేదు. గుడికెళ్ళి వచ్చి చేదామని...."

ఆచార్యుల కనుబొమల ముడి క్రమంగా విడిపోయింది. నాగడు మేడ దిగి వచ్చాడు.

"వారు కూడా వస్తున్నారా?" ప్రశ్నించారు ఆచార్యులు.

"అయ్యగారికి పని ఉండాదంట. పెద్దమ్మనూ, చిన్నమ్మనూ పోయి రమ్మన్నారు" అన్నాడు నాగడు.

"పెద్దరెడ్డిద్దరూ ఏదో పెద్దపనిలోనే వుంటారు. మీరు పదండమ్మా!" వ్యంగ్యంగా అన్నాడు ఆచార్యులు.

తల్లీకూతుళ్ళు ఒకరి మొఖం మరొకరు చూచుకున్నారు.

* * *

మామిడాకుల తోరణాలు, పచ్చి పసుపు కొమ్ములు, మంచిగంధపు వాసనలు, పడుచు కోరికలు కుప్పపోసినట్లుగా వుంది కళ్యాణ మండపం. జడలో పూలు, లేత నీలపు కాంతుల రవ్వల కమ్మలు, బుగ్గన చాదుచుక్క, సీతమ్మవారు పెళ్ళికూతురులాగే వున్నారు. సీతమ్మవారి విగ్రహం సిగ్గుతో ఒదిగి కూర్చున్నట్టుగా, బరువైన కనురెప్పలు పైకెత్తి రాములవారి కళ్ళలోకి చూడాలని తహతహలాడుతున్నట్టుగా, బుగ్గలలో వెచ్చని సిగ్గులు విరుస్తున్నట్టుగా—అనిపించింది జానకికి. ఎదలోపలి ఎద చెమర్చింది!

"ఏమిటే, సిగ్గుపడి పోతున్నావు?" ప్రశ్నించింది లక్ష్మీదేవమ్మ.

"ఏమీలేదు." మరింత సిగ్గుపడి పోయింది జానకి.

"పిచ్చిపిల్ల!" అనుకుంది లక్ష్మీదేవమ్మ.

ఆచార్యులు పెళ్ళి చేయిస్తున్నారు....తన పెళ్ళికూడా యిలానే చేయిస్తారు గాబోలు - అనుకుంది జానకి.

కళ్యాణోత్సవం పూర్తయి యిల్లు చేరేసరికి పది గంటలు దాటింది. భోజనంచేసి తన గదికి వెళ్ళింది జానకి. మనస్సు దూది పింజలా ఆలోచనల్లో తేలిపోతూంది. పెరట్లో గూబ, నరసారెడ్డి గదిలో ఎర్రం రెడ్డి- వాళ్ళ నవ్వులు నవ్వుతూనే వున్నారు.

అద్దంముందు నిలబడ్డ జానకి కళ్ళు కళ్యాణోత్సవంలోని సీతమ్మవారి మీదే వున్నాయి. ఆమెకు ఎంత సిగ్గు! ఆమె రవ్వల కమ్మలకంటె ఎక్కువగా

ఆమె కళ్ళే తళతళ లాడాయి. అకస్మాత్తుగా తన పేరు, సీతమ్మవారిపేరూ ఒకటేనని స్ఫురించింది జానకికి. లీలగా, హేలనగా తనలోతానే నవ్వుకుంది.

"చిన్నయ్యగారూ!" ఎవరో తలుపు తట్టినట్లనిపించి, వులిక్కిపడ్డది జానకి.

వెళ్ళి తలుపు తీపింది. నాగడు తలుపు తడుతున్నాడు. కానీ తన గది తలుపు కాదు. ప్రక్కగది తలుపు - రాములవారు - చంద్రశేఖరంగారు - వుంటున్న గది తలుపు. తన పోలికకు తానే నవ్వుకుంటూ ఓర వాకిట్లో నిలబడింది జానకి. చంద్రశేఖరం తలుపు తీశాడు.

"ఏమిటి నాగన్నా?" అన్నాడు.

"ఇది మా అయ్యగారూ నీ కియ్యమన్నారు." ఈ వైపూ ఆ వైపూ చూచి, టవల్‌లో చుట్టిన బ్రాందీ బాటిల్ అందిచ్చాడు నాగడు.

భజన .మందిరంవద్ద పెద్ద ఔటు పేలింది. అది తన గుండెలో పేలిందనిపించింది జానకికి.

బ్రాందీ బాటిల్!

నాన్నగారు చంద్రానికి - తనకు కాబోయే అల్లుడికి - పంపించాడా? నాన్నగారంటే అసహ్యం పొంగి వచ్చింది జానకికి.

నాగడు క్రిందకు దిగి వెళ్ళుతూ జానకిని చూచి గతుక్కుమన్నాడు.

"నాగడూ! ఇలా రా."

గదిలో కొచ్చాడు నాగడు.

"....ఆయన కేమిట్రా ఇచ్చావ్?"

"మామూలే చిన్నమ్మా!"

"ఎవరిమ్మన్నారు?"

"మన అయ్యగారు."

"వాళ్ళ నాన్నగారు అక్కడే వున్నారా?"

జానకి ఆశ్చర్యపోయింది.

"పెద్దోళ్ళు కదేం తప్పుకాదు చిన్నమ్మా!" పెద్దోళ్ళ పెద్దరికాన్ని తేల్చి చెప్పాడు నాగడు. జానకి నిలువునా కొయ్యబారిపోయింది. క్షణం తటపటా

యించి నాగడు మెల్లిగా జారుకున్నాడు. జానకి పరధ్యానంగా వచ్చి పరుపు మీద కూర్చుంది.

తలుపు తెరిచే వుంది!!!

జానకి గుండె దడదడలాడిపోయింది. ఒక్క పరుగున వెళ్ళి గట్టిగా గడియవేసి వచ్చి మళ్ళీ కూర్చుంది. మనసు ఎంత ప్రయత్నించినా కుదుట పళ్ళేదు. భయంకరమైన సుడిగాలి రేగుతూ వుంది ఆవిడ మనస్సులో—

"ఠంగ్" గడియారం పదకొండున్నర కొట్టింది.

అదిరిపడింది జానకి. ఆవిడ దృష్టి గడియారం క్రిందనే వున్న తాతగారి ఫొటోమీద పడింది....తాతగారు నవ్వుతున్నారు. తన బ్రతుకు యిలా తెల్ల వారటాన్ని చూచి నవ్వుతున్నారు....చెంపకు చల్లగా దిండు తగిలింది. తను ఏడుస్తున్నదా? ఎందుకు? ఎందుకు ఏడవాలి తాను? తాతగారితో కలసి నవ్వాలి తాను....చంద్రశేఖరం ఎం. ఏ. పాస్ కాలేదట. తనయింది....ఎందుకు? పాపం, వారికి కట్నం అక్కరలేదట! ఎందుకు? ఎందుకో! తను ఈ పెళ్ళికి అంగీకరిస్తే సుమారు వెయ్యి కుటుంబాలు గుండెమీద చేయి వేసుకొని హాయిగా నిద్రపోతాయి.

త్యాగం! ఎందుకు చేయాలి తాను త్యాగం?

ఇది త్యాగం కాదు—బలి! నరబలి!

ఇంతకు ముందు ఈ రెండు కుటుంబాల మధ్య హత్యలు మాత్రమే జరుగుతుండేవి. తన పెళ్ళితో హత్యలు ఆగిపోయి నరబలులు ప్రారంభ మౌతాయి కాబోలు.

తాతగారు నవ్వుతున్నారు. పాపం! ఎర్రంరెడ్డిగారి అన్న మాదిరెడ్డి తన గుండెల్లో దించిన బాకును చూచి నవ్వుతున్నారు. ఇప్పుడు తన మనుమ రాలి గుండెల్లో చల్లగా దిగుతున్న బాకును చూచి నవ్వుతున్నారు! తన కొడుకు పాతికవేలు ఖర్చుపెట్టి మాదిరెడ్డిని జైలుకు పంపిన సామర్థ్యానికి చూచి నవ్వు తున్నారు. నవ్వు తాతయ్యా! నవ్వు!........నవ్వు!........జానకి కలత నిద్ర లాంటి నిజంలోంచి నిద్రలాంటి కలతలోకి నెమ్మదిగా జారుకుంది........

వైభవంగా పెళ్ళయిపోయింది. అందరూ రాచవీడుకు బయలుదేరారు. తాను కారుదిగి తలపైకెత్తి చూచి అదిరిపోయింది. చేతిలో పెద్ద కొరడాతో మాదిరెడ్డి నిలబడి వున్నాడు.

"ఇదిగో అన్నయ్యా! నువ్వు చెప్పినట్లే చేశాను" అన్నాడు ఎర్రం రెడ్డి తన్ను చూపుతూ.

"పెభాష్! దూరం జరుగు. దీన్ని ముక్కలుగా నరికి నా కసి తీర్చు కుంటాను" అన్నాడు మాదిరెడ్డి. అతని కళ్ళలో కాలాగ్నులు, ఊపిరిలో నాగులు!

తాను వలలో చిక్కుకున్న పావురంలా గిలగిలలాడిపోతూ దీనంగా చంద్రశేఖరం వైపు చూచింది.

చంద్రశేఖరం బండమీద కత్తిని రాచినట్లుగా నవ్వాడు.

"ఆ శ్రమ నీకెందుకు పెదనాన్నా! దీని కన్నీళ్ళు-కాదు-రక్తం దీని చేత తాగిస్తాను."

మాదిరెడ్డి భళ్ళున నవ్వాడు....

కెవ్వుమని లేచింది జానకి. ఊపిరాడటంలేదు. ఇది కలా? నిజమా?

ఇది నిజం కాబోయే కలా?

ఛీ ఛీ—ఎంత పిరికిది తాను!

ఇదంతా తన కల్పన!

తన పిరికితనం చేసిన కల్పన!

చంద్రశేఖరం అలాంటివాడు కాడు. తనను మల్లెపువ్వులా చూసు కుంటాడు. తన పెదవులమీద చిరునవ్వు జారనివ్వడు. కానీ....

అతనికి చెడ్డ అలవాట్లున్నాయి. అతను తాగుతాడు....అని తనకు ఎలా తెలుసు?

అది నాన్నగారి తప్పుడు అభిప్రాయం కావచ్చును.

కావచ్చు. కాకపోవచ్చు. తనమీద తనకు విశ్వాసం వుండాలి. తన సహచర్యంలో రాయి పులకిస్తుంది. కత్తి కుసుమిస్తుంది. తలుపు తీసుకొని వరండాలోకి వచ్చింది.

హాయిగా నవ్వుకుంది జానకి. భజనమందిరంవద్ద రంగురంగుల చిచ్చు బుడ్డి వెలిగింది....

"ఈ విషయం పెళ్ళయి పోయేవరకూ రహస్యంగా వుంచాలి." నరసా రెడ్డి గదిలోంచి ఎర్రంరెడ్డి గొంతు బరువుగా వినిపించింది.

"ఏమిటో అంత రహస్యం?" ఆశ్చర్యపోయింది జానకి.

"ఔను. ఈ కాలం ఆడపిల్లలు అదో రకం. అందులోనూ ఎక్కువ చదువుకున్న ఆడపిల్లలు!"

"కానీ ఈ విషయంలో పొరపాటు నాదే. ఈ విషయం ఈలోగానే నాకూ తెలిసింది. వెంటనే వుత్తరం వ్రాద్దామనుకున్నాను. కానీ యిలాంటి విషయాలు ఉత్తరాల్లో వ్రాయటం అంతమంచిది కాదని మానేశాను." ఎర్రం రెడ్డి అంటున్నాడు.

తనకు తెలియకుండానే కిటికీ వద్దకు చేరుకుంది జానకి.

"ఆ సంగతి అలా వుండ నీయండి. దాని సంగతి నేను చూసు కుంటాను. అసలు విషయం తేల్చండి" అన్నాడు నరసారెడ్డి. అతని గొంతులో విసుగు స్పష్టంగా వినిపించింది.

"ఆ విషయం మళ్ళీ ఎత్తకండి. నా మాటే ఖాయం." ఖండితంగా అన్నాడు ఎర్రంరెడ్డి.

"అలాగైతే ఈ సంబంధం కుదరదు."

"మీరు ఎమ్.ఎల్.ఏ, పదవంటే చాలా తక్కువ అంచనా వేస్తున్నారు. అది రాష్ట్ర స్థాయి పదవి. పెద్ద పెద్దవారితో పరిచయాలు. మీ పరపతి ఎంతో పెరుగుతుంది. సమితి ప్రెసిడెంట్ పదవేం పదవి, బోడి పదవి!"

"ఆ బోడి పదవే నాకు కావాలంటున్నాను." నరసారెడ్డి అన్నాడు.

"ఇలా మాట్లాడుకుంటూవుంటే పదిహేనేళ్ళుగా జరుగుతున్నదే యిక

ముందు కూడా జరుగుతుంది. అన్నిటికీ మనమిద్దరం పోటీ చేయటం. ఎవరో ఊరూపేరూలేని వెధవలు గెలవటం—మనం ఓడిపోవటం! నా మాట వినండి. మనం కలియాల్సిన అవసరం వుంది. కలియకపోతే యిద్దరికీ రాజకీయంగా భవిష్యత్తు లేదు. అంతే!'' అనునయంగా అన్నాడు ఎర్రంరెడ్డి.

నరసారెడ్డి జవాబు చెప్పలేదు.

చంద్రశేఖరం పడుకున్న గది తలుపు తెరుచుకుంది. చంద్రశేఖరం బయటికొచ్చాడు. గుండెలు అరచేత పట్టుకుని నీడలో ఒదిగి నిలబడింది జానకి. చేతిలోవున్న సీసా విసిరి పెరట్లోకి పారేసి లోపలికెళ్ళిపోయాడు చంద్రశేరం. జానకి ప్రాణం కుదుటపడింది.

''ఏమిటది?'' ఎర్రంరెడ్డి అడిగాడు.

''ఆఁ.........ఏమీలేదు.''

''కాదు. సీసా పగిలిన శబ్దం వినిపించింది.''

''ఆ....పశువుల కొట్టంలో....ఏదో శబ్దం.'' నరసారెడ్డి సర్ది చెప్పాడు.

క్షణం నిశ్శబ్దం.

''మరి నా మాటకు మీరు జవాబు చెప్పనేలేదు.'' మళ్ళీ అన్నాడు ఎర్రంరెడ్డి.

''మీ మాట నాకు సమ్మతంగా లేదు. నాకు సమితిని వదిలేయండి. మా అమ్మాయి ఎమ్. ఏ. పాసయింది. అందులోనూ ఫస్ట్‌క్లాస్‌లో పాసయింది. మీ అబ్బాయి ఇంకా బి. ఏ. దాటలేదు. నేను ఎంత త్యాగం చేస్తున్నానో మీరు సరిగ్గా అర్థం చేసుకోవటంలేదు.'' నిష్ఠూరంగా అన్నాడు నరసారెడ్డి.

కాళ్ళకింద భూమి కదలిపోతున్నట్టనిపించింది జానకికి. ఇదా ఈ నాటకం యొక్క అంతరార్థం! ఈ రాజకీయ చదరంగంలో తా నొక పావు. కాదు- ఈ రాజకీయ క్షుద్ర దేవతోపాసనలో తానొక బలిపశువు!

''ఎంత చెప్పినా మీ మాటే మీది! అసలు ఈ పెళ్ళి మా గ్రామంలో ఎవరికీ యిష్టంలేదు.'' ఎర్రంరెడ్డి కంఠంలో కోపపుజీర కీలగా ధ్వనించింది.

''మా గ్రామంలోనూ మీతో వియ్యమందటాన్ని ఎవరూ ఒప్పుకోవటం

లేదు. ఇదేదో మీరు చేస్తున్న కుట్ర అంటున్నారు అందరూ.'' రెండు క్షణాలు నిశ్శబ్దం....తన గుండె చప్పుడు వింటూ నిలబడింది జానకి.

"అలాగైతే మీ మాటే మాకు సమ్మతం. సరేనా! ఎలాగైనా బావ గారు మాట నెగ్గించుకొన్నారు.'' ఎర్రంరెడ్డి తన నవ్వు నవ్వాడు.

అలంకరించిన మేకపిల్లను నరికేముందు వేసే పొలికేకలా వినిపించిందా నవ్వు జానకికి. తా నిప్పుడేం చేయాలి? గదిలోకెళ్ళి తనకి పెళ్ళి ఇష్టం లేదని చెప్పటమా లేక మూగగా బలై పోవటమా?

ఎవరో మేడ మెట్లెక్కుతున్న శబ్దం వినిపించింది. త్వరత్వరగా తన గదివైపు నడిచింది జానకి. నాగడు మేడమీద కొచ్చాడు.

"ఏంరా నాగడూ?'' పలకరించింది జానకి.

నాగడు ఆశ్చర్యపోయి "ఇంకా నిద్రపోలా చిన్నమ్మా!'' అన్నాడు.

"నిద్ర రాలేదురా!'' అంది జానకి.

"ఊరేగింపు ఊరి మొగదల వుంది. పెద్దమ్మగారు నిన్నూ, అయ్యగార్లనూ లేపమన్నారు."

"వాళ్ళనెందుకు లేపుతావురా........'' జానకి మాట పూర్తికాక ముందే తలుపు తెరుచుకొని నరసారెడ్డి బయటకొచ్చాడు.

"నేనూ వస్తున్నాను పదండీ!'' అన్నాడు.

నాన్నగారి ముఖం చూట్టమే అసహ్యమనిపించింది జానకికి.

అందరూ వీధిలో కొచ్చారు. ఆ సరికి సీతారాముల ఊరేగింపు ముంగిట ఆగింది. ఆచార్యులు ముందుకొచ్చి పళ్ళెం యివ్వమన్నారు. లక్ష్మీదేవమ్మ ఇవ్వబోయింది.

"నువ్వు ఇవ్వు జానకమ్మా!'' అన్నారు ఆచార్యులు.

పళ్ళెం అందించింది జానకి అన్యమనస్కంగా.

ఆచార్లవారు హారతి ఇస్తున్నారు. జానకి సీతమ్మ వారిని చూచింది. ఆవిడ ముఖంలో కళ్యాణ కళ లేదు. రాబోయే అరణ్య వాసాన్ని గురించి

ముందే తెలిసిన దానిలా భయం భయంగా కూర్చుంది. సీతమ్మవారు అద్దం లోని తన ప్రతిబింబంలా వుంది—అనుకుంది జానకి.

ఆచార్యులు పూజచేసి హారతి పళ్ళెం అందిస్తూ, "కళ్యాణమస్తూ" అన్నారు. బాధగా నిట్టూర్చింది జానకి. హారతి అందుకొని అందరూ లోపలికి నడిచారు.

"జానకీ! ఈ సంబంధం నీ కిష్టమేనని అమ్మ చెప్పింది. అంతా నిర్ణయం చేసేశాను" అన్నారు నరసారెడ్డి మేడమెట్లెక్కుతూ. "మీరేమీ అనుకోకపోతే నాదొక మాట నాన్నా!" అంది జానకి.

ఆశ్చర్యంగా చూచాడు నరసారెడ్డి.

"ఏమిటి?" అన్నాడు.

"ఈ పెళ్ళి నాకిష్టం లేదు నాన్నా!" తెగింపుగా అంది జానకి.

వీధి తలుపులేస్తున్న నాగడూ, తన గదిలోకెళ్తున్న లక్ష్మీదేవమ్మ కొయ్యబారిపోయారు.

"ఎందుకూ?"

"నాకిష్టంలేదు నాన్నా!" మళ్ళీ అంది జానకి.

"నోరుముయ్! నువ్వూ, నీ బోడి యిష్టం."

వీధిలోంచి చాలామంది ఒక్కసారిగా గట్టిగా అరచిన శబ్దం వినిపించింది.

"నా పెళ్ళి నా యిష్టం కాకపోతే మరెవరికి యిష్టం కావాలి? మీ రాజకీయాల కోసం...." జానకి చెంప చెళ్ళుమంది.

ఆ దెబ్బకు తూలిపోయిన జానకి మేడ మెట్లమీదపడి దొర్లిపోయింది. లక్ష్మీదేవమ్మ, నాగడూ పరిగెత్తుకొచ్చి జానకిని లేవనెత్తారు.

"ఈ పెళ్ళి జరిగి తీరాలి. కాదు కూడదన్నారంటే జాగ్రత్త!పాతేస్తాను."

జానకి చాలా కష్టంమీద నాగడి సాయంతో నిలబడింది. చెంప భగ భగలాడి పోతూంది. అవమానం, రోషం, అసమర్థత ఆవిడ మనస్సులో బుసలు కొడుతున్నాయి. కానీ అలాగే కన్నీళ్ళతో నిలబడిపోయింది.

తలుపు తోసుకొని సుడిగాలిలా పరుగెత్తుకు వచ్చారు ఆచార్యులు. వారి జుట్టు ముడి వీడిపోయింది. కన్నీళ్ళు చెంపలమీద జారుతున్నాయి.

"రెడ్డిగారూ! రెడ్డిగారూ! ఘోరం జరిగిపోయింది. చాలా ఘోరం జరిగి పోయింది." దుఃఖంతో వారి కంఠం బొంగురు పోయింది.

"ఏమిటి?" అన్నాడు నరసారెడ్డి.

"ఊరేగింపు పల్లకీ పడదోశారు. విగ్రహాలు పడిపోయాయి...."

"ఎందుకూ?"

"పల్లకీమోసేవాళ్ళు వెధవలు,తాగున్నారు."బాధగా అన్నారు ఆచార్యులు.

"ఆ!...."

"ఔను. అమ్మవారి ముఖం పగిలి పోయింది."

ఉన్నట్టుండి ఆచార్యులు దృష్టి జానకిమీద నిలిచింది.

"అదేమిటమ్మా. అలా వున్నావు? అరే! చెంపమీద అంత దెబ్బ ఎలా తగిలింది?" ఆశ్చర్యంగా అన్నారు ఆచార్యులు.

"పై నుంచి పడ్డాను. గాయం తగిలింది." జానకి కంఠంలో ఏ భావమూ లేదు.

"నీకూ—డానా?"

ఆచార్యుల మనస్సులో ఒక విచిత్రమైన పోలిక తళుక్కుమంది.

"ఏమండీ అనూరాధ ఇక్కడేనా ఉన్నది!" అంది ఐ స్త్రీపిల్ల సరోజ.

ఆ కళ్ళద్దాలు, ఆ వేషం చూసి అనూరాధ వదినె కనకం శిలలా నిల బడిపోయింది. "ఎవరూ?" అంటూ వాకిట్లోకి వచ్చింది అనూరాధ.

"రైలు వద్దకి ఎవరినన్నా పంపిస్తామంటే నువ్వు వాళ్ళకి గుర్తు తెలీదు. నేను రావాలంటే ఇంట్లో పంపరు. నీవేమో దారి తెలుసుకొని చక్కా ఇంటికే వచ్చేసావు" అంది రాధ.

"అబ్బ....ఫరవాలేదు లేవే! అయినా ఏమిటే నువ్వు అలా చిక్కి పోయావు?"

"అబ్బే....ఏం లేదే....నాకు....నాకేం లేదే....! బాగానే ఉన్నాను. అయినా నీకు పిచ్చి కాకపోతే నాకేమిటే నిక్షేపంలా ఉన్నాను" అంది అనూ రాధ.

"పోవే నీవు మరీను, నాకు తెలియదేమిటి? నేనేమిటి చిన్నపిల్లనా! ఏదో ఉందిలే" అంది సరోజ.

"అది కాదే, నిన్ను చూడాలనిపించింది. నేను రాలేక ఉత్తరం వ్రాశా. నీవు నేను వ్రాసిన వెంటనే వచ్చావు. థాంక్స్" అంది రాధ.

"మీ శ్రీవారు మంచివారేనా?" అంది సరోజ.

తన బాధను కనబడనీయకుండా "మంచివారే" అని మాత్రం చెప్పి తల దించుకొంది రాధ. ఆ ముఖ కవలికలను సరోజ గమనిస్తూనే వుంది.

"అరే....అదేమిటే అలా మాట్లాడుతున్నావు?" అంది.

"నే....నే....నా....నాకా....ఏంలేదే" అని సవరిస్తూ, "అసలు సంగతి మరచిపోయాను" అంటూ లోపలికి వెళ్ళింది. కాఫీ పట్టుకొచ్చి అందిస్తూ, "మద్రాసు ఎలాగుంది? మీ క్రొత్త సంసారం, భర్తగారు, అంతా బాగుందా?" అన్నది.

"మద్రాసు జీవితం బాగానే వుంది. మా శ్రీవారు ఆదివారం రావడం ఆలస్యం, అలా షికారు పోవాలంటారు. నాకేదో ఒక విధంగా ఉంటుందే! నేను అలా రానప్పుడల్లా, ఛీ- అసలు అడగటం, పిలవటమే తప్పు. ఒక్క రవ్వన్నా 'సోషియల్ బిహేవియర్' ఉంటేగా, అంటుంటారు" అంది.

ఆ సాయంత్రం ఇద్దరూ చేలగట్టు దాటుతూ, మాట్లాడుతూ, నడుస్తున్నారు. ఉన్నట్టుండి సరోజ "నువ్వెప్పుడు బయటకే రానట్టుందే" అంది.

"నీ కెలాగ తెలుసే?" అంది రాధ.

"అదా! అదంతా ఒక మంత్రశక్తిలే. చూడు నీ నోటితో నిజం పలికించా, ఇలాగ ఎన్నయినా నిజాలు పలికించగలను" అంది.

"ఆఁ ఆ. మరచాను, నీ పెండ్లికి రాలేదని కోపంలేదు కదూ!" అంది రాధ.

"ఆ....ఆ....నీవు రాలేదని పెండ్లి ఆగిందా ఏమిటి? మా పెండ్లి ఎలాగూ అయ్యింది, ఎంతసేపు నా సంసారం, నేను, నా భర్తను గూర్చి నీవు అడగడం, నేను చెప్పడం తప్పితే, ఒక్క మాటన్నా నీవు, నీ భర్త, నీ సంసారం గూర్చి చెప్పావా?" అంది సరోజ.

ఆమాటతో ఎక్కడో దాగిఉన్న ఆవేదన వెల్లువలాపొంగి హృదయముపై ప్రవహించింది. ఆ కన్నీరు చూచిన సరోజకు ఏమీ అర్థం కాలేదు. "ఏం జరిగింది? నాకు చెప్పవూ?" అని బ్రతిమలాడింది.

"ఏమీ లేదే" అని వారించబోయింది రాధ. కాని సరోజ వదలలేదు. అసలు విషయం చెప్పేవరకు పట్టు వదలలేదు. చివరికి రాధకి చెప్పక తప్ప లేదు.

"నేను నీ అంత సంతోషానికి నోచుకోలేదు సరోజా, నోచుకోలేదు."

"అంటే?"

"భర్త కౌగిట్లో ఒదిగి హాయిగా కబుర్లు చెప్పుకునే పాటి భాగ్యంలేదు సరూ! నా ఆనందానికి ఆ భగవంతుడు ఓర్చుకోలేకపోయాడు" అంది.

"మరి నీ వివాహం అయ్యింది మొదలు ఇక్కడే ఉన్నావా? ఆ విషయం మాటవరసకైనా చెప్పలేదు. కోపమా ఇలా అడిగినందులకు?" అంది.

"నాకు నీమీద కోపమా? ఏమిటే, నీ మాటలు నువ్వూ? అంతా పిచ్చి కాకపోతే" అంది.

"మరో విధంగా భావించకుంటే నేనోమాట అడగనా రాధా!" అంది సరోజ.

"నిరభ్యంతరంగా అడుగు."

"ఎందుకు మీమధ్య వివాదం సంభవించింది? ఏమిటి కారణం?" అంది సరోజ.

"మామధ్య వివాదం విడాకులు మాత్రం" అంది. సరోజకు ఆ మాటలతో ఒక్కసారి కండ్లు గిఱ్ఱున తిరిగినంత పనయ్యింది. ఆ 'షాక్' నుండి తేరుకుని "నిజంగా దేవుడు లేడు అనూ, ఉంటే ఇలా సంభవించేనా?"

"నీ పిచ్చిగాని దేవుడేం చేశాడే! మనకు మేలు జరిగితే దేవుడు మంచివాడని, కీడు జరిగితే చెడ్డవాడా?" అని వేదాంతం పలికింది.

"నిజంగా నాకు పిచ్చి పట్టలేదుకాని, యిప్పుడు నీకు తీరా పట్టేటట్లుగా ఉంది" అంది సరోజ.

"నా బ్రతుకు చీకటయిపోయింది సరూ! ఇపుడు 'నా' అనే వాళ్ళ గూడా నాకు దూరమవుతారేమో నని భయంగా ఉంది" అంది సరోజ.

"ఎవరు?"

"ఇంకెవరు, మా అన్నగారు."

"ఏమిటి విశేషం?"

"ఆ మాత్రం తెలియదా! వాళ్లు మాత్రం ఎన్ని రోజులని చూడగలరు? ఉన్న ఆస్తి అమ్మి నా పెండ్లికి ఉన్న డబ్బు కాస్త హారతి కర్పూరంలా కరిగిపోయింది. అందులో ఈసారి పంటలుగూడ ఆ మాత్రంగానే ఉన్నాయి" అంది.

"ఇంతకీ అసలు సంగతి చెప్పనే లేదు. ఎందుకు? ఎలా వచ్చింది మీమధ్య తగాదా?" అంది సరోజ.

"అదే నాకూ అర్థంకాలేదు."

"ఏమిటి నీ కర్థంగానిది? ఎలా చెప్పాలనేగా (లేక) చెప్పుదునా, వద్దా? అని నీ సందేహం కదూ!" అంది సరోజ.

"నీవద్ద నాకెందుకే దాపరికం, నీకు చెప్పి నా తప్పు ఏమిటో తెలుసుకోవాలనేగా ఉత్తరం వ్రాసింది" అంది.

"అయితే చెప్పు"మంది సరోజ.

* * *

"నాకు చిన్నప్పటి సంఘటన ఇంకా జ్ఞప్తికి ఉంది. ఆ దినం నాగుల చవితి. అందరూ శ్రద్ధగా ఉపవాసాలతో మ్రొక్కుతున్నారు. అది మా గ్రామంలో పెద్ద పండుగ. ఊరిబయట పెద్ద పుట్ట ఉంది. ఆ పుట్ట ప్రక్కనే నాగులేరు పారుతుంది. అదిగో, అక్కడ కనపడుతుందే– అదే నాగులేరు. ఆ ఏటి ప్రక్కనే ఉంది పుట్ట. దాని ముందుభాగమంతా బాగుగా దట్టంగా అలుము కొన్న చెట్ల పొదలు, ఆ పొదలగుండా పుట్టవద్దకు సన్నని మార్గం.

"పుట్ట చుట్టు గోడలు, దాని వెనుక కొద్దిగా మైదానం, దాని ప్రక్కన వేపచెట్లు, అక్కడ ఊరి దేవతల శిలలు చిన్న చిన్నవి శిథిలావస్థలో ఉన్నవి. ఎప్పుడూ ప్రతి సం॥ ఉత్సవాలు బాగా జరిగేదట. క్రమక్రమంగా ఆ శిలలు పూడిపోయాయి. ఆ బొమ్మలు విరిగిపోయి పిల్లలు ఆడుకునే వస్తువులుగా తయారయ్యాయి.

"ఆ రోజు అందరూ పుట్టకు పూజించడానికి వచ్చారు. నేను వదిన కొంగు పట్టుకొని వచ్చాను. పిల్లలంతా క్రొత్త క్రొత్త బట్టలతో అందంగా మెరిసిపోతున్నారు. నాగేశ్వరుణ్ణి గూర్చి 'నాగు కక్ష కట్టిందంటే కాటువేసే దాకా వదలదు' అంటారు. పిల్లలందరం ఆడుకోడానికని మైదానం వైపు వెళ్ళాము. పెద్దలంతా వేడుకలో పడి పిల్లల్ని మరచారు. అందరం అక్కడున్న శిలలపై ఎక్కి ఆడుకుంటున్నాము.

"ఏమని చెప్పను? పచ్చని పచ్చికలోనుండి ఎక్కడ నుండి వచ్చిందో నాగుబాము మా జట్టులోని శంకరాన్ని కాటేసింది. భయపడుతూ ఎక్కడి పిల్లలం అక్కడ చెల్లాచెదరై పారిపోయాము."

"ఏమిటి... శంకరం చనిపోయాడా!?" అంటూ ఆత్రుత ఆవేదనతో ప్రశ్నించింది సరోజ.

"నాకు శంకరం కేకలు ఇప్పటికీ వినబడుతున్నాయి. శంకరం జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా ఆవేదన నన్ను కృంగదీస్తుంది. 'రాధా....రాధా' అంటున్నా, నేను నా ప్రాణంకోసం భయపడుతూ పారిపోయాను. మిగతా పిల్లలు ఎవరి మటుకు వాళ్ళు భయంతో అతన్ని పాము కరచింది అని చెప్పిన వాళ్ళము కాము. కనీసం నేను ఆ వార్త అప్పట్లో అందజేసుంటే ఆతను బ్రతికి ఉండే వాడు. కాని ఏమి ప్రయోజనం? నేను పరుగెత్తాను.

"శంకరం హాయిగా బిస్తీలో జీపుల్లో తిరగవలసినవాడు. ఆ రోజు నాతో ఆడుకోడానికి వచ్చాడు. మా మామకి ఒకడే కొడుకు. అందులో తాసిల్దారుగారి అబ్బాయి. నాకు శంకరంకి చిన్నప్పటి నుండి పోటీ. మా తగవులు చూచి మా అత్త 'మీకు ఆ మూడు ముళ్ళు పడందే చక్కబడరు' అనేది. ఆ మాటకు నా కెంతో సిగ్గనిపించేది.

"నా వివాహం అయిన ఏడాదికి చవితికి అన్నయ్య నన్ను తీసుకు వచ్చాడు. మా ఆయన రాలేదు. నేను ఆయన వస్తారని చెప్పాను. పిండి వంటలు అవి ఎక్కువ చేసింది వదినె. మా అన్నయ్యకు అసంతృప్తి. మేము ఇద్దరం కలిసి వచ్చివుంటే ఎంత ఆనందించేవారు. కాని అది వారి కోరికకు విరుద్ధంగా తయారయ్యింది.

"ఆయన పండుగకని రాలేదు. అన్నయ్య రెచ్చిపోయి, "ఏదో బుద్ధున్నవాడు, చదువుకున్నవాడు, ఇద్దరు హాయిగా జీవించగలరు అని కట్నమిచ్చి పెండ్లి చేస్తే ఇలా ఆఘోరిస్తాడా!' అంటూ పచార్లు సాగించాడు. నన్ను స్వంత కూతురు కన్న ఎక్కువగా పెంచారు."

"మీ అన్నగారికి సంతానం లేదా?" అంది సరోజ.

"ఒక పాప పుట్టి, శోకంలో ముంచి తనదారిన తాను పోయింది. గోరు చుట్టుపై రోకలిపోటన్నట్లు తరువాత నా గొడవ ఒకటి.....నన్ను కన్న మా అమ్మ కడుపు ఆరకమునుపే ఆమెను చంపిన దౌర్భాగ్యురాలను" అంటూ ఏడ్వసాగింది రాధ.

"ఏడవకు అనూ! విధి బలీయం" అంది సరోజ.

"ఏమో, నాకు మాత్రం అట్లా అనిపించదు సరోజా! నా దౌర్భాగ్యం కారణంగా మా నాన్న నన్ను పెంచలేక వేరే వివాహం చేసుకున్నాడు. అప్పటికి మా అన్నగూడ చిన్నవాడు. మా పిన్ని మా నాన్న పోరు పడలేక ఇల్లు వదలి వెళ్ళిపోయింది. అప్పటినుంచి అన్నయ్యకు నేను పెద్ద సమస్యగా తయారయ్యాను.

"తల్లి పోయిందని బెంగతో నాన్నకి ఎప్పుడూ నా గురించే ఆలోచన. తరువాత కొద్ది రోజులకు ఓ మంచి ముహూర్తమున మా అన్నకు ఓ మంచి

సంబంధం చూచి మూడు ముళ్ళు వేసి తన బాధ్యత తీర్చుకొని ఆయన దారిన ఆయన వెళ్ళిపోయాడు.

"నిజంగా నా సుఖంకోసమే మా అన్నయ్య పెళ్ళి చేసుకున్నాడు. మా అదృష్టంకొద్దీ ఆమె మా ఇంటిదేవతయ్యింది. అప్పటి వరకు నా బాధ్యత స్వీక రించిన మా అత్తమ్మ కూడా పని పూర్తయినట్లు నన్ను వదలిపోయింది. అప్పటినుండి మా వదినే పెంచింది నన్ను.

"ఆ రోజు ఇంట్లో అన్న, నేను ఉన్నాము. ఇంతలో బయటనుండి కేక వినబడింది. ఎవరా అని తొంగి చూస్తే పోస్టు సుందరం. నీవేమన్నా ఉత్తరం వ్రాశావేమో నని బయటికి వచ్చాను. కాని అది అన్నయ్య పేరులో వచ్చింది. సుందరం నన్ను కాదని అన్నను కేక వేసాడు.

'అవును. పండుగ పూట కూడ ఉత్తరాలు పట్టుకొచ్చా వేమిటి విశేషం' అన్నాడు అన్నయ్య.

'పండగయినా తప్పుతుందంటారా! అందులో గొప్పవారి ఉత్తరాలు ఇవ్వకుంటే ఊరుకొంటారా? ఎంత తొందరో ఏమో అని పట్టుకొచ్చా' అన్నాడు సుందరం.

"సుందరం మాటలకు నవ్వు వచ్చింది. ఇంతలో మా అన్న 'ఇంతకీ ఏమిట్రా ఉత్తరం?' అన్నాడు.

'ఏదో రిజిష్టరు పోస్టుగా ఉంది. అమ్మాయి చదివి చెపుతుంది' అంటూ వెళ్ళిపోయాడు.

"నాకు ఆశ్చర్యం వేసింది. ఎప్పుడైనా ఉత్తరాలు వస్తే కనీసం ఒక వారం అయినా కాపురం చెయ్యాలి వాడింట్లో. ఒకవేళ తెలిసి ఇంటికి పోయామా, ఎక్కడో కయ్యల్లో ఉంటాడు. వెతికి పట్టాలి. ఒక్కొక్క సారి స్కూలు పిల్లలచేత పంపుతాడు. అట్లా వీలుకాదంటే చింపివేయబడేవి. అటువంటిది ఈ ఉత్తరం వెంటనే వచ్చిందంటే ఆశ్చర్యం వేసింది."

"అది రిజిష్టరు పోస్టు. అందుకే తెచ్చాడు" అంది సరోజ.

తిరిగి అనూరాధ ప్రారంభించినది. "పోతూ, పోతూ, వాడు ఈ ప్రాణం లేని ఈ జీవిపై ఒక విసరు విసిరి వెళ్ళాడు. ఏమయితేనేమి, నా రాతను నేను చదువక తప్పలేదు. ఒక వేపు ఆశ్చర్యం, ఇంకొక వైపు అసహ్యం

కలుగుతున్నది. ఆ ఉత్తరం చదువుతున్నంతసేపు అరుగుమీద జారగిలిపడి కూర్చుని వింటున్న మా అన్న ఉత్తరం ఆపడంతో భగ్గున లేచాడు.

"ఓహో ఇంతదాకా వచ్చిందా అయ్యగారి వ్యవహారం! నాకు నోటీసు పంపిస్తాడా? ఈ తెగతెంపులకు మళ్ళీ వాళ్ళ పెద్దలు వస్తారా?! ఏదో మాట వరసకు వచ్చిన తగాదా ఇలా పరిణమించిందా? పెండ్లి అంటే పవిత్రబంధ మనుకున్నాడా! ఇంకేమన్నా అనుకున్నాడా? ఏ డిష్టమొస్తే అంగీకరించటం, లేకపోతే విడాకు లివ్వడం ఎంత దారుణ్యం! అసలు పెండ్లంటే ఏమిటి? పెండ్లి ఎందుకు చేసుకోవాలి? అనే ఆలోచన! ఆవేశం ఎక్కువయ్యింది. వాటికి సమాధానం చెప్పాలని ఆవేశపడ్డాడు. కాని ప్రక్కన ఎవరూ లేరు. నేను కన పడ్డాను. ముఖాన్ని చేతుల మధ్య దాచుకొని 'వెళ్ళమ్మా, వెళ్ళు' అని మాత్రం అనగలిగాడు.

"అప్పుడే వచ్చిన వదిన అన్న అరపులు చూచి 'ఏమండీ! ఏమిటా అరపులు, మీరూను? కొంప లంటుకపోయేటట్లు అరుస్తున్నారే? ఏం జరిగిం దని?' అంటూ సముదాయించపోయింది కాని, ఆయన ఏ మాత్రము లక్ష్య పెట్ట లేదు. వదినకు ఏమీ అర్థంగాక నన్ను అడగబోయి నా ముఖాన్ని చూచి అలాగే రాయిలా నిలబడింది."

"ఏమిటే? ఆ మాత్రం నువ్వయినా జవాబు జరిగింది చెప్పలేక పోయావా?" అంది సరోజ.

"చెప్పాలనే కాని, ఎలా చెప్పాలి? ఏమని చెప్పాలి? అసలు ఈనాటి మా అన్నయ్య ముఖాన్ని, నా పెండ్లినాటి అన్నయ్య ముఖాన్ని తలచుకుంటే ఎంత బాధ వేస్తుంది! పెండ్లినాటి ముఖము ఆనందంతో జ్యోతిలా వెలిగింది. కాని ఈ నాటి అన్నయ్య ముఖము గాలిలోన దీపంలా, చమురు అంతా అయి పోయాక కునుకుతున్న జ్యోతిలా ఉంది" అంది రాధ.

"అసలు నీకు ఈ పెండ్లి మొదటే ఇష్టం లేదంటావా?"అంది సరోజ.

"ఇష్టం లేదు, కాని ఒక్కసారి ఆయన పేరు నా చిన్ననాటి బావను జ్ఞాపకం తెచ్చి ఆకర్షించింది. ఆ ముఖాన్ని ఈయనలో చూచుకుంటూ కల కాలం కబుర్లు చెప్పుకోవాలని కలలు కన్నాను. అందుకే ఒప్పుకొన్నాను. ఆ విధంగానైనా నేను చేసిన పాపానికి నిష్కృతి అనీ, ఆవేదన తీరి నాకు

మనశ్శాంతి ఉంటుందని అభిప్రాయపడ్డాను. కాని దేవుడు నన్ను క్షమించ లేదు. నా పాపం నన్ను వెంటాడింది.''

''కాని చెప్పు అనూ!'' అంది సరోజ.

''చెప్తున్నా'' నంటూ మౌనంగా నిలిపింది.

''పోయినదాని గూర్చి బాధ పడక, గడిచేది ఆలోచించు'' అంటూ కదిపింది సరోజ. అనూరాధ తిరిగి ప్రారంభించినది:

''పెండ్లి ఘనంగా మా ఇంటివద్దనే జరిగింది. పెండ్లి జరిగిన మూడవ రోజు మా అత్తగారింటికి బయలుదేరాము. సాయంత్రం బాగుండదని కొంచెం చీకటి పడ్డాక బయలుదేరాము. అప్పటికి దీపములు పెట్టేవేళ. కొంచెం మసక, మసకగా చీకటి ఉంది. కొద్ది దూరం నడిచేలోగా చీకటి కన్నులు పొడిచేలా తయారయింది. వర్షం వస్తుందేమోనని భయపడ్డారంతా. కాని బండిజాడల మధ్య నడుస్తూ 'స్టేషన్ లైట్ల' కాంతి చూచి గమ్యం చేరుకున్నాము. కాని వర్షం రాలేదు.

''ఊర్లో జనమంతా నన్ను సాగనంపడానికి 'స్టేషన్' దాకా వచ్చారు. అందరూ ఏదో బోధిస్తున్నారు.

'ఏమిటే? మీ మాటలు, మీరూ! ఆ మాత్రం తెలియదూ! చదువుకొన్నది. మనం వేరే చెప్పాలా? రెండు రోజులు పోతే మనకే నేర్పుతుంది పాఠాలు' అంది గుంపులో నరసక్క. వారేమి చెబుతున్నారో నా కేమి అర్థం కాలేదు. నా ఊహాలోకంలో నేను విహరిస్తూ ఉండాను.

''ఉన్నట్టుండి మా శ్రీ వారి వంక చూచాను. ఆయన తనకేం పట్టనట్లు కూర్చునియున్నారు. ఆయనకి మా అన్నయ్య ఏదో బోధిస్తున్నారు. ఆయన అన్నిటికి తల ఊగిస్తున్నారు. ఎవరో ఇక రెండు గం.కు గాని బండి రాదని వార్త తెచ్చారు.

'ఇదేమిటి ఈ అన్యాయం? ఉదయంనించి ఊర్లు మండిపోయేలా ఎండ కాసింది. ప్రొద్దు కుంకి గంటయినా కాలేదు. అపుడే చంపుకతింటుంది' అన్నారు ఇంకెవరో గుంపులో. అందరూ నెమ్మదిగా సెలవు తీసుకొని జట్లు, జట్లుగా వెళ్ళిపోయారు. అంతలో బెల్ మ్రోగింది.

'ఇంకొద్దిసేపట్లో బండి వస్తుంది. జాగ్రత్తగా సర్దుకొండి సామానం' అన్నాడు అన్నయ్య. అన్నయ్య అన్నట్లుగానే కొద్దిసేపటికి పొగలుగ్రక్కుతూ రాక్షసిలా శబ్దం చేసుకుంటూ ప్లాట్‌ఫారం చేరింది రైలు. బండి కొద్దిసేపే ఆగటం మూలాన సామానం సర్ది అందరు ఎక్కాము. మా వదిన నాకు తోడు వచ్చింది. ఉన్నది కొద్ది స్థలమైనా అందరూ సర్ది కూర్చున్నాము. తరువాత అన్నయ్య వచ్చి 'ఇదేంటి, ఇక్కడ కూర్చున్నారే! మీరు దిగి ఫస్టుక్లాసు పోండి' అన్నాడు. ఎలాగో ఇద్దరం ఫస్టుక్లాస్ చేరాము. మా ఊరు వదలి వెళ్ళుతున్నందుకు బాధవేసింది.

"రైలు కదలింది. ప్లాట్‌ఫారంపై అన్నయ్య చెయ్యి ఊపటం, దివిటి వెలుగులో పచ్చని దీపం ఊపడం ఒకేసారి జరిగాయి. రైలు వేగం కన్న ముందు నా ఆలోచనలు దూసుకుపోతుంది. ఒక్కసారి అందరి మాటలు జ్ఞప్తికి వచ్చాయి. అలా వారి మాటలు నెమరువేయడంతో నిద్రలోకి ఒదిగాను.

"పుష్య, మాఘ మాసములు చలి వేస్తుంది. బయట మల్లెలు విరబూసిన వెన్నెలలో మంచుచినుకులు కురుస్తున్నాయి. నన్ను నిద్రలేపి 'అక్కడ చలివేస్తుంది ఇలారా!' అన్నాడు. ఆ మాటలతో నా శరీరం పులకించింది. మరొకసారి 'అనూ' అని పిలిస్తే బాగుండుననిపించింది. ఆ పిలుపుతో నిద్ర దూరమయ్యింది. అదే మా మొదట కలయిక. మరలా ఉన్నట్లుండి 'నీకే చెప్పేది- ఆ గాలి తగిలిందంటే జ్వరం వస్తుంది' అంటూ అలాగ్గా తనవైపుకు లాగుకున్నాడు.

'అబ్బో....అబ్బాయిగారికి ఎంత చనువూ? అవతలవాడు మీ చేష్టలు చూసి మేలుకోబోతారు' అన్నాను.

'ఏం, చనువు లేదంటావా? నాకుకాక మరెవరికి చనువు? అయినా ఇటువంటప్పుడు కాకపోతే ఇంకెప్పుడు? వాళ్ళు నిద్రలేస్తే కండ్లు మూసుకొని అవతలపోతారు' అన్నాడు.

"అక్కడ ఆ చనువు, అనురాగం, ప్రేమ, ఆ కొంటెచూపులు నన్ను సిగ్గు పరచాయి. అతని చేష్టలు అసహ్యమనిపించింది.

'ఆ చలిలో అంత ఆనందం ఉందా?' అన్నాడు. 'ఎంత హాయని

ఆ చల్లని వెన్నెల, ఆ చల్లని గాలికి మంచులో తడిచామంటే అలాగే ఉండి పోవాలనిపిస్తుంది' అన్నాను.

'కొంపదీసి దేవిగారు రైలునుండి దూకేరు?' అన్నాడు.

'ఎందుకో, ఇంత మాత్రానికే రైలు దూకాలా?' అన్నాను.

'మనసుకు మరపించే ఆ వాతావరణం మరలా వస్తుందా? అందుకని' అని అన్నాడు.

"తన్మయత్వములో అతని కౌగిట్లో ఒదిగిపోయాను. తిరిగి రైలు 'స్టేషన్'లో ఆగేసరికి మా వైపు ఎవరో చూస్తున్నట్లు ఊహించి సర్దుకుని కూర్చున్నాము. అది చిన్న 'స్టేషన్' కావడంచేత ఎవరూ ఎక్కలేదు. తిరిగి రైలు కదిలింది. ఆయన మాటలు ప్రారంభించారు.

"కిటికీగుండా చల్లని కిరణాలు పడుతున్నాయి. 'అనూ! పండు వెన్నెల, మల్లెల కాంతి, తెల్లటి చీర, అదేరంగు జాకెట్టు, అబ్బ....ఎంతందంగా ఉన్నా వని! మత్తెక్కించే ఆ చిలిపి కండ్లు, ఆ పెదాలపై చిరునవ్వు, అబ్బ....నన్ను పిచ్చివాడిని చేస్తున్నాయి-అనూ!' అన్నాడు.

'సరే! అయ్యగారికి కవిత్వం కూడ వచ్చునే?'

'అవును. నీ లాంటి అప్సరస ముందు నిలబడితే ఆ కవిత్వం దానం తట అదే వస్తుంది.అందుకేగా అల్లసాని పెద్దన అన్నాడు '....యూరక కృతుల్ రచయింపుమటన్న శక్యమె' అని. అవన్నీ కలిగితేగాని కవిత్వం వ్రాయలే నన్నాడు పెద్దన. జయదేవుడు భార్య నృత్యం చేస్తుంటే శృంగార కావ్యం రచించాడు. అసలు సృష్టికే కర్త స్త్రీ. ఈ కవిత్వము యొక్క సృష్టికి వీరి అందచందాలే మూలం' అన్నాడు.

'నిజంగానా! అంత అందంగా ఉన్నానా? అయితే మీరు పిచ్చి వారయ్యారు.' అన్నాను.

"ఆయన మాటల తీరు, కవిత్వం చూచి ఆనందించాను. అలా మాట్లా డుతూ ఆ చలని చలికి ఆ వెచ్చని కౌగిట్లో ఒదిగి నిద్రపోయాను. తిరిగి ఆయనే 'స్టేషన్' వచ్చాక అందరిని లేపాడు.

"ఇంటిలో అడుగుపెట్టేసరికి అందరూ హారతి పళ్లెములో కనబడ్డారు. ఆ తరువాత మా వదిన మూడు రోజులుండి ఇంటికి ప్రయాణం అయింది.

ఆమెకు బట్టలుపెట్టి మర్యాదచేసి పంపించారు. వెళ్ళేటప్పుడు ఆమె నా వైపు ఆప్యాయతతో చూచి కంట తడిపెట్టింది. నేనూ కన్నీటితోనే సాగనంపాను. ఆయన మాత్రం 'వెళ్ళిరండి' అని క్లుప్తంగా అన్నారు. నేను ఎప్పటికప్పుడు ఉత్తరాలు వ్రాయడం మూలాన అన్ని సంగతులు తెలుస్తుండేవి. వీరి ఆప్యాయతకి, అనురాగానికి అన్నయ్య ఎంతో సంతోషించేవాడు.

"కొద్ది రోజులకు సెలవులు అయిపోయాయి. 'డ్యూటీ'లో 'జాయిన్' కావలసిన తారీఖు రెండు రోజులు మాత్రం ఉంది. రెండు రోజులు ముందు పోయి సర్దుకోవాలని మా మామయ్య ఆ దినం సాగనంపారు. క్రొత్త సంసారం ఖర్చులవి ఎక్కువని అన్నయ్య డబ్బులు పంపుతూ వచ్చారు. కొద్ది రోజులకు పంపడం నిలచిపోయింది. ఒక నెలపాటు ఆనందంతో గడచి పోయింది.

"మరుసటి నెలనుంచి పరిస్థితులు తారుమారయ్యాయి. వేళకు వారు ఇంటికి వచ్చేది లేదు. భోజనం చేసేది లేదు. ఎప్పుడూ విచారముగా వుంటారు. కారణం అడిగితే పైకి ఎగబడేవారు. ఆయన అలా తయారుకావడానికి నేను ఎంతవఱకు కారకురాలినో తెలియలేదు. ఇంటివద్ద సంతోషం లేదు. ఎప్పుడూ ఏదో వేదన, అలా ఆహారంలేక మనిషి దిగజారిపోయాడు.

"ఆయనకు ఉన్న ఉద్యోగం కాస్త తన అశ్రద్ధవల్ల ఊడిపోయింది. దీనికంతా కారకురాలు నేనని, త్రాగడం, ఇంటికివచ్చి తిట్టడం, కొట్టడం ప్రారంభించాడు."

"ఛ....ఏమిటే. అలా ప్రవర్తించాడా?!" అంది ఆశ్చర్యంగా సరోజ.

"జీతం రాక, ఉద్యోగం ఎక్కడా దొరకనందువల్ల సంసారం గడపటం కష్టమయ్యింది. ఎలాగో ఉన్న నగలన్నీ అమ్ముడు పోయాయి. చివరకు ఇంటిలోని సామానంతా ఖాళీ అయిపోయాయి. నా వద్ద మంగళసూత్రం మాత్రము మిగిలింది. దానిని ఎంతో పవిత్రంగా, భద్రంగా దాచుకున్నాను. కాని ఇంటిలో పాత్ర సామాను పోయిన తరువాత అతనికి నా మంగళసూత్రం మీద కన్ను బడింది. నేను ఎంత బ్రతిమాలినా, బలవంతాన తీసికెళ్ళిపోయాడు. ఇంటి బాడుగకూడ కట్టలేదు. చివరకు ఆ ఇంటివారు నా బాధ చూచి జాలిచెంది ఇక్కడకు చేర్చారు.

"అంతే. నేను పండుగకని చెప్పి ఇంటికి రావడం, తర్వాత ఆయన ఉత్తరం వ్రాయడం, అన్నయ్య కేకలు వేయడం ఒకటి తరువాత ఒకటి జరిగిపోయాయి.

"పండుగ పోయిన రెండు మూడు నెలలకు మాకు దగ్గఱ బంధువులు తాతయ్య ఒకాయన అన్నయ్యతో ప్రస్తావించాడు.

'ఏమిట్రా! జానకిరాం, మేం విన్నది నిజమేనా!' అన్నాడు ఆ తాతయ్య.

'ఏమిటి తాతయ్యా?' అని, తనకేమి అర్థంగాని వాడిలా అడిగాడు అన్నయ్య.

'అహోనోయ్. అనూరాధ నిచ్చిన అబ్బాయి శంకరానికి పెండ్లటగా!' అన్నాడు.

'ఏమిటో అర్థంకావడంలేదు' అన్నాడు అన్నయ్య.

'అయితే మీ కిది తెలియదన్నమాట' అన్నాడు వేదాంతి తాతయ్య.

'తెలియదు.'

'ఏమిట్రా! నిక్షేపంలాంటి దాని బ్రతుకు బండలు చేస్తావా?' అన్నాడు.

'ఈ గొడవలు ఉండనే ఉన్నాయి, కాని ఇప్పుడు మీ రెందుకొచ్చినట్లు?' అన్నాడు అన్నయ్య.

'ఇదిగో చెప్తున్నాగ. ఎందుకొచ్చిన గొడవలు? ఏదో సర్దుకుపోవాలి, కక్షలు సాధించడం మంచిదికాదు. అందులో ఆడబిడ్డగలవారం, రచ్చకెక్కితే మనకే అవమానం' అన్నాడు.

'ఇపుడు ఎవరు ఏమి చేస్తున్నారని, మీ పిచ్చికాకపోతే, అసలు అమ్మాయిని ఎందుకు అలా హింసించాలి, అవమానించాలి, ప్రవర్తించాలి? ఏమి తప్పు చేసిందని? వాడికి అగౌరవమైన పని ఏమైనా చేసిందా! చెప్పు. నేను నీ ముందరే ముక్కలు ముక్కలుగా చేస్తాను' అని ఉగ్రుడయ్యాడు అన్నయ్య.

'ఏదో ఆలుమగలు అన్న తరువాత ఏవో తప్పులు, పోట్లాటలు వస్తూ పోతుంటాయి, అవి చివరకు వారే సర్దుకుపోతుంటారు' అంటూ అన్నయ్య ఆవేశాన్ని సర్దిచెప్పాడు తాతయ్య.

'ఇంతకీ, నేను వచ్చింది చెప్పనే లేదుగా! శంకరం తండ్రి వెళ్ళి రమ్మంటే వచ్చాను. ఏదో సర్దుకుపోండి'' అన్నాడు వేదాంతి తాతాయ్య చివరకు.

'అబ్బాయిని పంపిస్తాము, అనూరాధని పంపండి' అని వెళ్ళిపోయారు.

''అప్పటినుంచి ఆయన రాకకోసం ఎదురుచూస్తునే ఉన్నాము. మా మామగారు వచ్చి తీసుకపోతానని ఉత్తరం వ్రాశారు. కాని ఆయన తండ్రిమాట వినక ఎదిరించి వెళ్ళిపోయారట. ఇక వాళ్ళు మాత్రం ఏం చేయగలరు? వాళ్ళు ఇదంతా ఉత్తరంద్వారా తెలిపారు. అలానే క్రమంగా రోజులు, వారాలు, నెలలు, దొర్లుతుంటే ఒకనాడు ఆయననుండి ఉత్తరం వచ్చింది:

'అనూరాధకి,

నేను రెండవ వివాహం చేసుకున్నాను. నీవు నా జీవితములో ప్రవేశించవద్దు. నీకు నా హృదయములో స్థానము లేదు. ఆ స్థానాన్ని మరొకరు ఆక్రమించుకున్నారు. నీవు నా తల్లి దండ్రులతో కలసి నన్ను చేరడానికి ప్రయత్నించావా, అవమానం పాలవుతావు. నీవు అంత వరకు తెగించవని నాకు తెలుసు. అట్లు ప్రయత్నించి దగ్గరకు చేరా లనేది మరచిపోయి, నీ కిష్టమయితే ఇంకొక పెండ్లి చేసుకొని హాయిగా జీవితం గడుపు. అందుకే నీ సుఖం కోరి, 'నీవు ఇంకొక పెండ్లి చేసుకో డానికి అంగీకరిస్తున్నాను,' అని వ్రాసి పంపుతున్నాను. నీవు అలాగే ఒక కాగితంపై వ్రాసి సంతకముపెట్టి పంపు. నీవు తప్పక పెడతావు. నాకు తెలుసు. చేవ్రాలు చేసి పంపుతావు కదూ!....

ఇట్లు,
శంకరం.'

''ఆ ఉత్తరం నేను అన్నయ్యకు చూపలేదు. కాని నాకు ఆ కడపట వాక్యాల్లో నన్ను వివాహం చేసుకోమనటంలో ఎంత తేలికగా ఉందో అర్థం కాలేదు. తరువాత అన్నీ జరిగిపోయాయి.''

* * *

ఇల్లు రావడంతో ఇద్దరూ సంభాషణ ఆపి ఇంటిలోకి ప్రవేశించారు.

"అమ్మాయ్ రాధా! ఎక్కడికి వెళ్లారు, స్నానం, గీనం అక్కర్లేదా! అయినా చీకటిపడేదాక ఎక్కడున్నారే? అంది అనూరాధ వదినె కనకం.

"సరదాకి అలా పొలాలవైపు వెళ్లామండి! మాటల్లో పడి కాలాన్నే మరచాము" అంది సరోజ కలుపుగోలుగా.

"అవున్లే! చాలాకాలంకి కలిసారుగా, అన్నీ అయిపోయాయా, ఇంకా ఏమన్నా శేషాలు మిగిలున్నాయా?" అంది కనకం.

సరోజ మరుసటిరోజు ఉదయం ప్రయాణానికి సిద్ధమయింది.

"ఏమిటమ్మాయ్! అప్పుడే ప్రయాణమయ్యావు?" అన్నాడు రామయ్య.

"ఏం లేదండీ, ఇంటివద్ద ఆయన ఒక్కరే ఉన్నారు. రాధని చూడాలనిపించింది, అలా మా ఊరు పోతూ ఇలా వచ్చాను" అంది సరోజ.

సరోజకు తోడుగా అనూరాధ రైల్వేస్టేషన్ వరకు వెళ్ళింది. ఇద్దరూ ఏదో సరదాగా మాట్లాడుకుంటున్నారు. రామయ్య పాలేరుతో కలిసి 'టికట్' కొలకు వెళ్ళాడు. వాళ్ళిద్దరి సంభాషణ మధ్య "అనూ, ఒక్కసారి మద్రాసు రావే; అక్కడ మనశ్శాంతి లభిస్తుంది. ఈ ఊర్లో, ఈ ఇంట్లో నీకెక్కడిదే మనశ్శాంతి? అక్కడయితే 'బీచ్', 'సినిమాలు' అలా హాయిగా కాలం గడపవచ్చు" అంది సరోజ.

"అలాగే లేవే" అంది రాధ.

"మీ అన్నయ్య పర్మిషన్ కూడా తీసుకుంటాను" అంది.

"వద్దు సరూ, వద్దు" అని వారించింది రాధ.

"అయితే నీవు తప్పక రావాలి" అంది సరోజ.

"అలాగే లేవే, వీలు చూచుకుని తప్పకుండా వస్తాను" అంది అనూ.

"వస్తావుగా, మా ఆయనగూడా నిన్ను పిల్చుకు రమ్మని పదే, పదే చెప్పారు. మన స్నేహం ఆయనకు తెలుసు" అంది సరోజ.

"కొంపతీసి నా కథంతా చెప్తావా?" అంది రాధ.

"చెప్పనా! ఇంత అన్యాయం జరుగుతుంటే చూస్తూ ఉండమంటావా?" అంది సరోజ.

"చెప్పి ఏం చేస్తావు?" అంది రాధ.

"చూస్తుండు. అతన్ని వెవకి నిన్ను అంగీకరించేటట్లు చేస్తాను. నీది తప్పు కాదని నిరూపిస్తాను. నిజంగా నీ లోపం ఏమీలేదు అనూ, నీవు నిర్దోషివి" అంటూ కంట తడిపెట్టింది సరోజ.

"దయచేసి ఆ ప్రయత్నం మాత్రము చేయవద్దు సహ, నీకు పుణ్యముంటుంది. ఒకవేళ ఆయన కనిపించినా అంగీకరించడు. నాకు తెలుసు ఆయన తత్వం" అంది రాధ కంట తడితో.

ఇంతలో "ఏమిటె, ఇద్దరూ ఏడుస్తున్నారే? నాకు తెలుసమ్మా! ఇద్దరి బాధ. కాని ఎవరూ ఏం చెయ్యగలము తల్లీ!" అన్నాడు రామయ్య.

అలా 'స్టేషన్' అన్న విషయం మరచి ముగ్గురు ముఖాలలో దుఃఖంతో నిండుకుంది. రైలు వచ్చి ఆగింది. పాలేరు సామాను సర్దాడు. సరోజ వెళ్ళిపోయింది.

* * *

"కనకం, నిన్నొకమాట అడగనా?" అన్నాడు రామయ్య.

"ఏమిటో ఆ రహస్యం?" అంది కనకం.

"అదికాదే, అవతల వినబడుతుంది" అంటూ చెవులో చెప్పాడు రామయ్య, అనూరాధ మళ్ళీ పెళ్ళి విషయం.

"ఏంటండీ, మీ రనేది? మీ చాదస్తకం కాకపోతే ఇదెక్కడన్నా లోకముందుగద్దా!" అంది కనకం.

"అవన్నీ అనవసరం. తీరా చూస్తుంటే పెండ్లి నీకు చెయ్యాలన్నట్లు నీవు ఊఁహూ ...ఆహాఁ.... అనటం" అన్నాడు రామయ్య.

"పోనీ, అమ్మాయి ఒప్పుకోవద్దా!" అంది కనకం.

"ఒప్పుకోక ఏంచేస్తుందే?దానికి మాత్రం జీవితంమీద ఆశలు, కోరికలు లేవంటావా?" అన్నాడు రామయ్య.

"ఏమిటో ఈ ఆడ పిల్లలు, వీరి తీరు ఏం బోధపడడం లేదు. అయినా కాలం మారుతుంది. అభిప్రాయాలు, అనుసరణలు, సిద్ధాంతాలు మారుతున్నాయి. అయినా ఒకసారి రాధనే అడగటం మంచిది" అంది కనకం.

ఆ మాటలు ప్రక్క గదిలో ఉన్న రాధ వినసాగింది. వారి ఆలోచనకి రాధకి నవ్వు వచ్చింది. "ఎంత అమాయకులు కాకపోతే, ఒకరి స్వాధీన

మయిన జీవితాన్ని తిరిగి ఇంకొకరి వశం చేయాలనేది కేవలం అవివేకం. ఇది జీవం లేని వస్తువు కాదు మార్చడానికి" అనుకొన్నది రాధ తనలో తాను.

"అమ్మాయ్, అనూ! ఏమిటి ఆలోచిస్తున్నట్లున్నావు. లేచి కాస్త 'కాఫీ' పెట్టివ్వు. తల భారంగా వుంది" అన్నాడు రామయ్య.

అనూరాధకి అన్నయ్యని అడిగేయాలనిపించింది కాని, పెంచిన గౌరవం ముందుకు వచ్చి ఆపింది. అన్న బాధపడితే తను బాధపడినట్లేనని విరమించు కుంది. కాని తెలియని ఆవేదన ముందుకు ఉరక లేస్తుంది. ఎట్లయితేనేం, సరోజకి ఉత్తరం వ్రాయాలనిపించింది.

"రేపు బంధువులు వస్తారు, కాస్త శుభ్రంగా ఉండండి" అంటూ జరీ కండువా వేసుకొని వెళ్ళిపోయాడు రామయ్య.

*　　　　*　　　　*

మరుసటి రోజు బంధువులు వచ్చారు. అందరూ క్రొత్తవారే, అంద రికి కాఫీ, టిఫిన్ అందించి కనకం, వాళ్ళు ఏవో మాట్లాడుతున్నారు. "కనకం, అనూని ఇలా రమ్మను" అన్నాడు రామయ్య.

కనకం రాధ గదివైపు వెళ్ళింది. రాధ బోరుమని ఏడుస్తూంది. "ఏమిటే, చిన్న పిల్లలా ఏడుస్తున్నావు?" అంది కనకం.

కాని రాధనుండి సమాధానం శూన్యం.........కనకం తిరిగి "రా! అనూ, మీ అన్నయ్య పిలుస్తున్నారు" అంది.

"ఎందుకు వదినా?" అంది అనూరాధ.

"ఎందుకో!"

"నన్నెందు కిలా బాధిస్తారు?" అని గొంతుదాకవచ్చి, నిలచిపోయింది. కనకం ఓదార్చి తీసుకొచ్చింది. జానకిరామయ్యకు ఎక్కడలేని సంతోషం ముంచు కొచ్చింది. ఆనందముతో రెండు కన్నీటి బొట్లు రాలాయి.

"ఏం చదివా వమ్మాయ్?" అన్నాడు ఎవరో నడి వయస్కుడు.

రామయ్య కలుగ చేసుకొని "ఇంటర్ చదివించానండి" అన్నాడు.

రాధకు నిజ జీవితం చెప్పేయాలనిపించింది కాని, గొంతు పెగలలేదు.

"కట్నం విషయం?" అన్నారెవరో. రామయ్యకి ఒక్కసారి కండ్లు

గిఱ్ఱున తిరిగి నట్లయ్యింది. ఆ మాటల్లో ఆవేశం, కోపం అంకురించాయి.

"కట్నాలంటే మా అబ్బాయికి అసలు గిట్టదు. అన్ని గుణగణాలు బాగుంటే చాల"న్నాడు అబ్బాయి తండ్రి.

సాయంత్రం కావచ్చింది. అందరూ లేచి "వెళ్ళొస్తామండి" అని చెప్పి బయలుదేరారు. రాధ అసలు ఆ వచ్చిన అబ్బాయి నయినా చూడలేదు. అతని మాటలు వింటుంటే మెత్తగా ఉన్నాయి. ఇలాంటి సంఘ సంస్కరణ కర్తలే రేపు గొంతులు కోసేది. అసలు ఇరువురు అర్థం చేసుకొని జీవిస్తేనే సంసార రథం సాగుతుంది. లేకపోతే గతుకులున్న మార్గంమీద పోయినట్లే.

తలయెత్తి చూచేసరికి తెల్లటి సూట్‌లో ఆ వరుడు అందరికి వెనుక నడుస్తున్నాడు. అన్నయ్య వాళ్ళని సాగనంపడానికి వెళ్ళాడు. కనకం లోపల పనిలో నిమగ్నురాలయింది. తనని వేరొకరి జీవితంలో ప్రవేశ పెట్టాలని వీరి అభిప్రాయం. ప్రయత్నం. మనస్సు పరిపరి విధాల పరుగులు తీసింది అనూరాధకి.

ఒక్కసారి మనసులో సరోజ మెదలింది. తన బాధని అర్థం చేసుకొనేది ఒక్క సరోజే ననిపించింది.

మిగతా వారికి తాను ముఖ్యంకాదు. తను నిర్దోషినని నిరూపించుకోవాలి. వీరికి నిజం చెప్పి వివాహం మాన్పించాలి. అసలు పురుష జాతికే నీతి నేర్పాలి! ఈ రీతిగ ఈ దేశంలో ఎంతమంది స్త్రీలు బలి అవుతున్నారో, నాశనమయ్యారో! ఈ దురన్యాయం లోకానికి తెలియాలి. అందుకే తన కథ అంతా చెప్పాలి....చెప్పాలి అని ఆవేశం ఎక్కువయ్యింది. ఆ ఆవేశమే ఉత్తరం వ్రాయడానికి కారణం. ఉత్తర మొదలెట్టింది.

"ప్రియమైన సరూ,

జీవితంలో స్త్రీ ఆనందంగా ఉండాలంటే దానికి కర్త భర్త. అతని అనురాగం స్త్రీని ఆనందింప జేస్తుంది. అలాంటి ఆనందాన్ని మీ రిద్దరూ మద్రాసులో మీరు అనుభవించాలని కోరుతున్నాను. ఇక నీ ఉత్తరాలు అందులోని ప్రియోక్తులు నన్ను ముగ్ధురాల్ని చేస్తాయంటే నమ్ము. నీవు క్రిందటిసారి యిక్కడికి వచ్చినప్పుడు నా కథ అంతా నీకు విని

పించలేదు. అసలు విషయము దాచి పెట్టాను. కాని ఇపుడు ఈ శరీరంతోపాటు ఆ కథ నాతో అంతం కావటం ఇష్టంలేదు. అందుకే ఇలా వ్రాస్తున్నా. ఇలా వ్రాస్తున్నందుకు ఆశ్చర్యపోవలసిందేమీ లేదు. నిజం నీ ముందు పెడుతున్నా. నేను అసలు కథ నీ ముందు చెప్పనందుకు క్షమించాలి.

"నేను ఉత్తరాలు పుట్టింటికి వ్రాస్తుండే దాన్ని. ఒకరోజు 'ఏమిటీ ఉత్తరాలు ప్రతి దినం వ్రాస్తుంటావు' ఎవరున్నారక్కడ?' అన్నారు ఆయన. నేను ఏమి మాట్లాడలేదు. తిరిగి వారే అన్నారు 'ఎవరన్నా ఉంటే అక్కడే పులకక పోయావా? నన్ను పెండ్లి ఎందుకు చేసుకున్నావు? నా కన్నా వాడే బాగుంటాడా?' అన్నారు.

"ఆ మాటతో నేను రెచ్చిపోయాను. కాని రెచ్చిపోయిందానివలన ప్రయోజనంలేదు. పేదవాని కోపం పెదవికి చేటు అన్నట్లు అయ్యింది నా పరిస్థితి. అందువలన నేనే సర్దుకు పోవలసి వచ్చింది. కాని ఎంత సర్దుకున్నా ఆయనన్న మాటలు ఉంపపు కోతలా బాధించేయి.

"పురుషులంటే అసహ్యామేసింది. ప్రతి దానికి అనుమానం. ఆ మాత్రం ఇంగిత జ్ఞానం ఉండక్కర్లా. చదివితేనే సరా! అంతమాత్రం అర్థం చేసుకో లేకపోయారని బాధపడ్డాను. అందుకే పురుషుల్ని అర్థం చేసుకోవడం సులభం, కాని స్త్రీని అర్థం చేసుకోవడం చాలా కాలం పట్టుతుందన్న మాటలు జ్ఞప్తికి వచ్చాయి.

"అప్పటినుండి ఉత్తరాలు వ్రాయడం మానేశాను. ఒక రోజు అన్నయ్యనుండి జాబు వచ్చింది. నేను ఉత్తరాలు వ్రాయలేను, కారణం వెంటనే తెలుపవలయును అని క్లుప్తంగా వ్రాశాడు.

"ఏమి? ఉత్తరాలు వ్రాయడం మానుకున్నావని ఉత్తరం వ్రాశాడు మీ అన్నయ్య. ఇన్నిరోజులు వ్రాసిన ఉత్తరాలు అందలేదా! అవన్నే వారికెందు కందుతాయి' అవి చేరవలసిన చోటుకే సక్రమంగా వరుసగా చేరుంటాయి అంటూ తిరిగి తనే 'దీనికన్నా బదులువ్రాయి' అన్నాడు. అప్రయత్నంగా 'మానుకున్నాను' అన్నాను. 'ఎందుకో! తెలిపి

పోయిందనా? ఫరవాలేదులే' అన్నాడు. ఆయన మాటలు ఎంతగుండెలు పిండేవో గ్రహించు.

"అలా కొద్ది రోజులు జరిగింది. ఆయన మనిషి పూర్తిగా మారారు. ప్రతి దినం ఇంటికి ఆలస్యంగా వచ్చేవారు. కారణం తరువాత తెలిసింది- పేక ముక్కలలో రాత్రులు పగలు తెలిసేది కాదని. వాళ్ళ నాన్న మాత్రం అప్పుడప్పుడు డబ్బు పంపమని వ్రాస్తుండేవారు. అదే విధంగా ఒక రోజు ఉత్తరం చూపించి హెచ్చరించాను. 'ఉన్నావుగా పెద్ద పెత్తందారుగా, పంపించు' అనేవారు. ఆ మాటలు నాకు అర్థమయ్యేవి కావు. భర్త ఉద్యోగం చేస్తున్నాడని మాటేగాని, ఒక్కనయా పైసా చూచిన పాపాన పోలేదు. భార్యకు కావలసినవి షికార్లు, సినిమాల ఆశలేదు. ఇంటి సామానుగూడ అంత అంతగానే తెచ్చి మితంగా వాడమనేవారు.

"ఖర్చుకేమయినా అడిగితే 'ఉందిగా నీ డబ్బు, ఇక నా డబ్బెందుకు?' అనేవారు. నా డబ్బంటే మా అన్నయ్య ఇంటి ఖర్చులకని అప్పుడప్పుడు కొంత పంపేవాడు. అది ఇంటికి ఖర్చయ్యేది. అలా సాగేది మా సంసారం.

"ఒకసారి మా అన్నయ్య ఉత్తరాలు చేరకుండా పోవడంచేత ఏమి జరిగిందోనని బెంగతో హఠాత్తుగా వచ్చాడు. అన్నయ్య వచ్చే వేళకి ఆఫీసుకు 'టైమ్' అయ్యింది. క్షేమ సమాచారాలు గూడ అడుగకుండా చూచి చూడనట్లు గడప దాటాడు.

"ఏమండీ, అన్నయ్య వచ్చాడు' అన్నాను.

'వస్తే రాని, నాకోసం రాలేదుగా! తన చెల్లెలి కోసం వచ్చాడు' అంటూ పోయారు. తిరిగి వెనకాలే వెళ్ళి 'మన క్రొత్త సంసారం చూడవచ్చాడు. క్రొత్త సంసారం గదా ఎలా గడుపుతున్నారో అనే ఆతృతతో వచ్చాడు. ఈ ఒక్కరోజు శెలవుపెట్టి ఇంటివద్ద హాయిగా ఉందాం' అని ప్రాధేయబడ్డాను.

"మీ అన్నయ్య వచ్చాడని ఆఫీసుకు సెలవు పెట్టమంటావా? రేపు

నాతో ముచ్చట లాడాలి, సెలవు పెట్టండి అంటావు. ఆఫీసా? లేక అంగడి బజారా?' అన్నాడు.

"ఏమిటమ్మా! మీరేదో రచ్చలాడుతున్నారే' అన్నాడు అన్నయ్య. నా నోరు ఆడలేదు. నేనేది దాచి పెట్టాలని ప్రయత్నించానో అది కాస్త అన్నయ్యకు తెలిసిపోయింది. అప్రయత్నంగా 'అదే నన్నయ్యా, ఆయన ఆఫీసుకు లీవు పెట్టి వస్తాను, మీ రింతలో కబుర్లు మాట్లాడు కోండి అన్నాడు' అన్నాను.

"ఏమిటమ్మాయ్, ఆఫీసుకు లీవు పెట్టమంటావా! ఎన్ని పనులుంటాయో, ఏమో? ఎందుకు అనవసరంగా లీవు, వద్దని చెప్పవే! అంతగా ఉంటే సాయంత్రం మాటలాడుకోవచ్చుగా' అన్నాడు అన్నయ్య.

"అదే అన్నయ్యా, నేను చెప్పింది లీవులు వ్యథాగా పెట్టితే రేపు అవసరం వచ్చినపుడు ఎలాగ అని చెప్పాను' అన్నాను.

"మంచి పనే చేశావు, లేకపోతే మొన్ననేగా పెండ్లికి లీవులు వాడు కున్నది' అన్నాడు.

"ఎలాగో మధ్యాహ్నం కబుర్లతో గడిపాం. ఆయన మాత్రం ఆఫీసునుండి రాలేదు. 'ఏమిటమ్మాయ్! లీవు పెట్టి వస్తానన్నాడు, ఇంతకీ రాలేదు అబ్బాయి' అన్నాడు. 'ఏదో అర్జంటు పనులుంటాయి, అందుకే రాలేక పోయారేమో' అన్నాను.

"మంచి పనే జరిగింది' అంటూ మరల కబుర్లలోకి జొరబడ్డాడు అన్నయ్య. ఉన్నట్టుండి 'ఏమమ్మా! ఈ మధ్య ఉత్తరాలు వ్రాయడం మానేశావు' అన్నాడు అన్నయ్య.

"అవు నన్నయ్యా! అనవసరంగా ఎందుకని నేనే విరమించు కున్నాను' అన్నాను.

"అవున్లే! నీవేమో నిమ్మదిగా ఉన్నావు. అవతల మీ వదిన నేను ఎంత గాబరా పడ్డామని' అన్నాడు.

"అలా సాయంత్రంవరకు కల్లిబొల్లి కబుర్లతో కాలం గడిపాం. సాయంత్రం అయిదయి నప్పటికి ఆయన ఇంటికి రాలేదు. ఎలాగో

కాఫీ తయారుచేసి ఇద్దరం త్రాగాము. ఆయన కోసం అలాగే కుంపటిపై పెట్టాను. రాత్రి భోజనాలకు కూరగాయలు తరుగుతున్నాను 'ఏమిటమ్మాయ్ అలాగున్నావు ఒంట్లో బాగుండ లేదా?' అన్నాడు అన్నయ్య.

"బాగుందే' అన్నాను. అన్నీ తెలుసుకున్నవాడిలా 'అన్నీ తెలుసులే అమ్మాయ్, మీ సంసారం క్రొత్త గవా, లోటుపాట్లు జరుగుతూ ఉంటాయి. అవి సర్దుకు పోవాలి. అఁ....మాటల్లోపడి అసలు విషయం మరచాను. మీ వదిన బట్టలు తీసిమ్మని డబ్బులిచ్చింది' అన్నాడు అన్నయ్య.

"ఎందుకులే అన్నయ్యా! ఉన్నాయిగా పెట్టె నిండికి' అన్నాను. అయినా వినే తత్వం కాదు. కాదనలేక వెళ్ళి తీసుకొచ్చాము. మేము వచ్చిన కొద్ది సేపటికి ఆయన ఇంటికి వచ్చారు. ఆయనకు తెచ్చిన బట్టల్ని చూపించాను.

"ఎవరు తెమ్మన్నారు? ఏమిటంత అహంభావం! ఏం, నా కంత గతిలేక బ్రతుకున్నానా?' అంటూ అరపులు సాగించారు. మా అన్నయ్య ఆదుర్దాగా, ఏమిటని వచ్చాడు.

"అదే అన్నయ్యా, ముందే వాళ్ళు బాధపడుతుంటే మళ్ళీ మధ్య బట్టలెందుకు అని మండలిస్తున్నారు' అన్నాను.

"పర్వాలేదు బావా, మేము మీకు గాక ఇంకెవరికి పెట్టగలము' అన్నాడు అన్నయ్య. ఆ రాత్రి ఏదో ఒక విధంగా గడిచింది. ఉదయాన్నే అన్నయ్య ఊరికి బయలుదేరాడు. నన్ను పిల్చుక పోదామని వచ్చాడట. మొదట నన్ను అడిగాడు. నేను ఆయన్ని అడగమన్నాను.

"ఏం, శంకరం, అమ్మాయిని పండుగకు పిల్చుక పోదామని వచ్చాను' అన్నాడు అన్నయ్య. 'అలాగే తీసుక పోండి' అని పేలవంగా నవ్వి, తనకేం పట్టనట్లు అన్నాడు. ఆ మాటలు ఎవర్నో అన్నట్లుంది. నేను అతని భార్యగ, ఆ ప్రశ్నకు సమాధానం రాలేదు. నన్ను మళ్ళీ అడిగాడు అన్నయ్య. కాని నేను 'ఒక్క దినం వంట

చెయ్యకుండ నిలిపితే ఆ రోజు హోటల్ తిండిని తెగతిడుతుంటారు," అన్నాను.

"సరే, మీ ఇష్టం' అని వెళ్ళిపోయాడు. వెళ్ళే ముందు 'ఉత్తరాలు అవి వ్రాస్తుండాలి. లేకపోతే అమాంతం మేమిద్దరం వచ్చి పడతాం మీ ఇంటిమీద' అంటూ వెళ్ళాడు. కనీసం ఆయన వెళ్ళేటప్పుడు గూడ పలుకరించలేదు. అప్పటినుండి మా మధ్య పనికి మాలిన మాటలతో వైమనస్యం కలిగింది. మా మధ్య మాటలు అరుదు. అర్ధరాత్రివరకు ఇంటికిరాడు. అంతవరకు నేను భోంచేసేవాన్నికాదు.

"ఎప్పుడో మెలకువచ్చి చూస్తే క్రింద పొర్లుతుంటారు. నేను సహాయపడబోతే వారించేవారు. మనిషి చాలా మారిపోయారు. శరీరంపై శ్రద్ధలేదు. శరీరమంతా వాసనగా ఉండేది. మాట్లాడితే నోరు గుప్పుమని వాసనగా ఉండేది. భోంచెయ్యమని లేపితే 'నీ వింక భోంచేయలేదూ? ఎవడుండమన్నాడు ఇంతవరకు? ఓహో, పతివ్రతా శిరోమణి కదూ!' ఇలా సూటిగా గుండెల్ని పిండేవి ఆయన మాటలు.

"భర్త నాశనానికి భార్య కారకురాలు అంటారు. అందువలన ఆయన్ని ఎంతగానో బాగా దారికి తేవాలని ప్రయత్నించాను. కాని ప్రయత్నం విఫలమయ్యింది. నేను ఎంత దగ్గఱ చేరాలన్నా తను అంత దూరం అవుతూ వచ్చాడు. అదేమంటే- స్త్రీలకు గర్వమనో, అందులో చదువుకున్న వారికి మరీ గర్వమని వాదిస్తుండేవారు. భార్య గుణవతిగా ఉందంటే ఆనందించలేని అసూయాపరుడు.

"ఈ శిక్షకు నేను ఏమి చేసాను? ఇందులో నా గర్వం ఏమిటో అర్థం కావటంలేదు. కనీసం నేను చేసిన తప్పు ఏమిటి? అది తెలిసినా సరిదిద్దుకునేదాన్ని. ఇలాగే ఆఫీసులో గూడ తన పని సక్రమంగా నిర్వర్తించక పోవడం వలన ఆయన్ని ఉద్యోగంలో నుంచి వారు 'సస్పెండ్' చేసారు.

"అదే సమయంలో వాళ్ళ నాన్ననుండి ఉత్తరం వచ్చింది. చిన్నమ్మాయికి పెండ్లి నిశ్చయమయింది, తొందర్లో కొంత డబ్బు సర్దమని. అప్పటికే డబ్బుకు బాధపడుతున్న మా సంసారంలో బాణంలా

దూకింది ఆ వార్త. ఆయన ఏమిచేసేది లేక నన్ను బాధించారు. అంత వరకు అవసరం లేని దాన్ని ఆ డబ్బుతో ఆయనికి నేను అవసరం అనిపించింది. ఇంటికిపోయి డబ్బులు తెమ్మన్నాడు. నేను పోనన్నాను. ఇప్పటికే బాధలు అనుభవిస్తున్న అన్నను ఎలా అడగను? అందుకని 'మా ఇంట్లో అడిగినప్పుడు ఇవ్వడానికి బ్యాంకు కాదు. ఉన్న డబ్బు కాస్త మీకే చెల్లించారు. ఇంకెక్కడిది? అలాగయితే బాగా డబ్బున్న వారినే పెండ్లాడ లేకపోయారా? మేము సంపన్నులం కాదని అపుడే తెలుసుగా! మీలో నిజాయితికి స్థానం లేదు' అన్నాను.

"ఆ మాటలు అనీ అనక ముందే నా శరీరంపై దెబ్బలు పడ్డాయి. ఆ దెబ్బలతో అంతవరకు తిండిలేక కృశించుతున్న నేను స్పృహ తప్పేను. తరువాత లేచి చూస్తే నా మెడ మొండిగా ఉంది. ఒక్కసారి గుండె నిలచి పోయినంత పని అయ్యింది. ప్రక్కన చీటి నన్ను పిలుస్తున్నట్లు గాలికి రెప రెప లాడుతుంది. దానిలో ఇలా ఉంది: 'నీకు నా జీవితంలో ప్రవేశం లేదు. ఇక నన్ను సర్వదా మరచుపో!' అని స్పష్టంగా రెండే రెండు వాక్యాలు వ్రాసి ఉన్నవి.

"మా ప్రక్కింటివారు నా పరిస్థితి చూచి మా అన్నయ్యకు వ్రాశారు. వెంటనే మా అన్నయ్యవచ్చి తీసుక వచ్చాడు. కొద్ది రోజులకు అసలు సంగతి మెల్లగా బయటపడింది.

"ఆయన కాలేజిలో చదివేటప్పుడు ఒకమ్మాయితో పరిచయముండేదట. ఆమె మంచి సంపన్నుల కుటుంబంలో పుట్టింది. ఆమె ఒక్కటే కుమార్తె. మంచి అందకత్తెట. ఆమెను ఏదో ఒక విధంగా మోసంచేసి తన వశం చేసుకున్నారు.

"ఆవిడ ఎవర్ని లెక్కచేయక తన ప్రాణముపైన ఇవ్వడానికి సిద్ధపడింది. ఇద్దరు వివాహం చేసుకోడానికి ఇష్టపడ్డారట. కాని ఈ విషయం ఇంటిలో తెలిసి ఈయన తండ్రి సంబంధాలు వెదికారు. నేను నా రాత కొద్ది ఇతనికి చిక్కాను. తనకు ఇష్టంలేని వివాహం చేయడంతో కొంత అసంతృప్తి ఆయన్ని బాధించి ఉండవచ్చు.

"అలా మా సంసారం, అతుకుల బొంతగా గడిపే సమయంలో ఒకనాడు ఆమె కనబడిందట. ఆయనే మొదట ఆమెను పలుకరించారట. కాని ఆమె తనకు చేసిన మోసానికి బాగా ఆయన్ని అవమాన పరచిందట. అప్పటినుండి అలా తయారయ్యారు. తను ఇంకా వివాహం చేసుకోలేదని అబద్ధ మాడారట. మొదట ఆమె నమ్మలేదు. ఆయన ఏమి బోధించాడో ఏమో కాని, ఆమె ఆయన మాటల్ని నమ్మి అందరిని విడచి 'రిజిష్టర్' పెండ్లికి ఒప్పుకొన్నదట.

"ఇప్పుడాయన హాయిగా కాలం గడుపుతున్నారనుకుంటాను. ఆయనైనా సుఖపడితే అదే తృప్తి అని అనుకున్నాను. ఆమె వద్ద ఉన్న డబ్బుతో వాళ్ళ చెల్లెలి వివాహానికి డబ్బు కూడా పంపించారట. మా మామ ఈ విషయం ఆలోచించలేదు. తరువాత అంతా తెలిసింది. నన్ను తీసుకవెళ్ళి ఎలాగో ఆయన్ను సరిదిద్ది నన్ను ఆయనతో కలపాలని ప్రయత్నించారు. కాని ఆ ప్రయత్నం విఫలమయ్యింది.

"నాకు ఆయనపై విశ్వాసం చావలేదు. కాని అవి ఆయన వ్రాసిన ఉత్తరంలో విడాకుల పత్రంపై సంతకం కోరడంతో పూర్తిగా చచ్చి పోయింది. నేను మా అన్నకు తెలియకుండా విడాకుల పత్రంపై సంతకం చేసి పంపాను.

"మా అన్నయ్య ఇక ప్రయోజనంలేదని రెండవ పెండ్లికి ప్రయత్నించాడు. అందులో నా పెండ్లి జరిగిన ఏడాదికే విడాకులు జరిగాయి.

"నేను నా జీవితంలో ఇప్పటివఱకు ఏ మాధుర్యాన్నీ అనుభవించ లేదు. కాని నా మెడలో మొదట తాళి కట్టిన అతనే నా భర్త. మరొకరికి నా జీవితంలో స్థానం లేదు. నాకు ఉన్నదల్లా ఒకే ప్రేమ, ఒకే ఆత్మ. ఆ ప్రేమను, ఆత్మను, అనురాగాన్ని మరొకరికి అంకితం ఇవ్వలేను. మళ్ళీ వివాహం నాకే మాత్రం ఇష్టంలేదు. పరిస్థితులు యిలా బాధిస్తున్నాయి. ఇంతలో ఒక వార్త తెలిసింది. అది వారి రెండో వివాహం కూడ విడాకుల వరకు వచ్చిందని.

"ఆయన త్రాగుడు మానుకోలేక పోయారట. ప్రతిరోజు ఇంటికి

త్రాగివచ్చి చాలా విచిత్రంగా ప్రవర్తించే వారట. ఒకనాడు ఆమె తండ్రినుండి ఉత్తరం వచ్చిందట. అప్పటికే ఆమెను మొండిగా చేసి శరీరాన్ని మాత్రం జీవంతో వదిలారట. ఆ నగలన్ని అయ్య పేకాటలో ధారపోశారట. ఇక ఆమె ఏమిచెయ్యలేని పరిస్థితిలో ఆయన్ను దూరం చేసుకుంది.

"నిజంగా నాకు బాధ వేసింది. కనీసం ఆమె జీవితమన్నా చిగురించి ఉంటే సంతోషించే దాన్ని. కాని ఆవిడ కూడా దూరమయ్యింది. ఇపుడు ఎక్కడ, ఏమి చేస్తున్నారో? మా మామగారు చాలా ప్రయత్నించారట కాని, ఆచూకీ మాత్రం ఎక్కడా తెలియలేదు. మా మామగారే ఇంకొక పెండ్లి నాకు చేయడానికి ముందుకు వచ్చారు. నాకు ఆశ్చర్యం వేసింది.

"నన్ను చిన్నప్పటినుండి పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు నేర్పించి, అన్నావదినెలు వారి బాధ్యత నెరవేరినట్లు ఒక అయ్య చేతిలో పెట్టారు. తరువాత సుఖపడినా, కష్టపడినా నా ఖర్మ!

"ఆఖరికి నిజం నీకు చెప్పాలని నిశ్చయించుకున్నాను. మన స్నేహం, కలయిక, ఏనాటి అనుబంధమో!

"నిన్ను కడసారి చూడాలని ఉంది కాని, చూస్తానో చూడనో దృఢంగా మాత్రం ఏ విషయం చెప్పలేను. ఒకవేళ మీ అందరికి దూరమవుతానేమో! మీ భార్యాభర్తలు మాత్రం ఒకరి మనసు ఒకరు అర్థం చేసుకుని ఆదర్శవంతులుగా నిలచి ఉండాలి.

"అందరకు కృతజ్ఞురాలను. నా గురించి ఏ బెంగా లేకుండా నా వాళ్ళు వుండాలి. అదే నా తుదికోరిక ఈ జన్మకి.

ఇట్లు
నీ అభాగ్య సోదరి
అనూరాధ."

*　　*　　*

శంకరం ఏదో శాపగ్రస్తుడిలా, పిచ్చివాడి వేషంలో మద్రాసు చేరుకున్నాడు. జీవించడానికి ఆధారం లేదు మనిషిని చూడగానే ఉద్యోగం ఎవరు

గాని యివ్వడానికి నిరాకరిస్తారు. విడాకుల పత్రాలు మాత్రం అతని చేతిలో ఉన్నాయి. అదే అతని ఆస్తి. అలా దిక్కుతోచక బజార్లలో తిరుగుతూ, ఎక్కడ ఆకలయితే అక్కడే తిని, ఎక్కడ నిద్రవస్తే అక్కడే పడి నిద్ర పోయేవాడు.

ఆ రోజు ఆదివారం. నీలకంఠం, సరోజ కాలక్షేపానికి అలా షికార్లు తిరుగుతూ ఉండే అలవాటు. అలాగే ఆ రోజు ఉరకలు వేస్తున్న సముద్రం వైపు వెళ్ళారు. అందరూ ఎక్కడివారక్కడ కబుర్లు చెప్పుకుంటున్నారు.

సరదాగా ఇసుకలో నడుస్తున్నారు నీలకంఠం, సరోజ. ఉన్నట్టుండి వారి చూపు ఒక మనిషిపై బడింది. అతను ఇసుకలో 'అనూరాధ' అని వ్రాస్తున్నాడు, చెరుపుతున్నాడు. సరోజ ఆశ్చర్యంగా చూసింది. అతను నిజంగా శంకరే అని అనుమానంతో భర్తను హెచ్చరించింది.

"ఏమండీ! మీ పేరు?"

"శంకరం" అన్నాడు.

నచ్చచెప్పి ఎలాగో ఇంటికి తీసుకెళ్ళారు. అతని విషయం అంతా తెలుసుకున్నారు. రాధ చెప్పిన శంకరానికి, ఇప్పటి శంకరానికి భేదం ఉంది. సరోజ అనూరాధ ఆవేదన అతనితో చెప్పి, ఆమెను తప్పక నీ వశం చేస్తానని మాట యిచ్చింది. అందుకు శంకరం అంగీకరించాడు.

నీలకంఠం శంకరానికి ఉద్యోగం యిప్పించాడు. అందరూ ఒకటిగానే యున్నారు. సరోజ అనూరాధకి ఉత్తరం వ్రాసింది. ఉత్తరంలో అంతా వివరంగా వ్రాసింది. "నా కోరిక నెరవేరింది. మీ ఇద్దరు హాయిగ జీవించటమే కావలసింది" అంటూ ఉత్తరం వ్రాసి పోస్టు చేసింది.

సరోజ ఉత్తరం వ్రాసిన రోజే అనూరాధ కూడా తన ఉత్తరం వ్రాసి యిల్లు వదిలిపెట్టింది.

మూడవ రోజు ఆఫీసునుండి వస్తూ శంకరం సాయంకాలం కావడంతో బీచికి వెళ్ళాడు. చల్లని గాలిలో సముద్రాన్ని చేరాడు. ఊహలు పిచ్చి పిచ్చిగా రేగుతున్నాయి మనసులో. రాధ వస్తుందా? తనను క్షమిస్తుందా? అనే ఆలోచనలు రేగాయి. ఉన్నట్టుండి పెద్ద పర్వతంలా వస్తున్న అల భారంగా ఒక

శరీరాన్ని మోసుకొచ్చి ఒడ్డున చేర్చింది. శంకరం చూస్తుండి పోయాడు. నోటనుండి మాట రాలేదు. జనం మూగారు. శంకరం శవాన్ని గుర్తించాడు.

సరోజ భోరున ఏడ్వసాగింది. ఆరోజే వచ్చిన అనూరాధ ఉత్తరం చూసి కీడు శంకిస్తున్న సరోజ దుఃఖం అనూరాధ శవాన్ని చూడగానే అతిశయించింది. ఆమె స్పృహ తప్పి పడిపోయింది.

మరునటి రోజుకంతా రామయ్య, కనకం, బంధువులతో ఇల్లు నిండింది. అందరూ కూర్చుని ఏడుస్తున్నారు.

"మమ్మల్ని క్షమించు తల్లీ, క్షమించు. నీకు మళ్ళీ పెళ్ళి తలపెట్టి తీరని అన్యాయం చేసాము. నీ బ్రతుకు నాశనం చేసాను" అంటూ బోరున ఏడుస్తున్నాడు రామయ్య.

"నీకు తీరని అన్యాయం చేసాను అనూ! నిన్ను దేవుడయినా రక్షించ రాదా! అందాల రాశి దేవుడు నా చేతికిస్తే దానిని నాశనం చేసిన దుర్మార్గుడిని' అంటూ ఏడుస్తూ శంకరం—

"మీ చెల్లెలికి తీరని ద్రోహం చేసాను, నిజం తెలుసుకోలేక. క్షమించండి" అంటూ రామయ్య చేతులు పట్టుకొన్నాడు.

"స్త్రీ హృదయాన్నీ, వ్యక్తిత్వాన్నీ అర్థం చేసుకోలేదు ఈ లోకం ఆనాటినుండి ఇప్పటికీ! ఆనాడు ద్రౌపదిని పది మందిలో మానభంగం చేస్తుంటే అంతమంది యోధానయోధులు భర్తలుండి, ధర్మవిదులుండి ఏమి చేసారు? ఒక స్త్రీ మానాభిమానాలు కాపాడ లేకపోయారు! ఇక భార్యమీద నమ్మకము లేక భార్యని అగ్నిలో దూకించి స్వీకరించిన అవతారమూర్తుల్ని ఏమనాలి! నిజపత్నిని అర్థం చేసుకోలేని పురుషులు ఎందుకో? అనూరాధ చరిత్రా అటువంటిదే! స్త్రీ జీవితం సంఘంలో బాగుపడాలంటే అనూరాధ ఒక పునాదిరాయి. ఆమె త్యాగం భవిష్యత్తులో స్త్రీల జీవితాల్ని బాగుచేస్తుంది. అందరి కండ్లు తెరిపించి స్త్రీ పురుషులు సుఖపడాలనే అనూరాధ ఈ త్యాగానికి పూనుకుంది" అన్నది సరోజ.

---

# దుఃఖభాగుడు

జెట్టిగుండ్ల రఘునాధరెడ్డి

దాదాపు అర్ధరాత్రి సమయం. నిద్రామతల్లి లోకాన్నంతా తన వొడిలోకి చేర్చుకొని జోకొడుతుంది. నిశ్శబ్దం నిద్రబోయే లోకం మీది మేలి ముసుగులా ఆవరించి వుంది. నీలాకాశంలో నల్లని మేఘమాలికలు దట్టంగా వ్యాపించి వున్నాయి. తళతళ లాడే చుక్కలు వాని మాటున వెలవెల బోతున్నాయి.

ఉన్నట్లుండి ఎక్కడినుంచో గొల్లున ఏడ్పులు వివ్పించేసరికి డాబామీద పడుకొని వున్న నేను దిగ్గున లేచాను. ఆ ఏడ్పులు మా వీధి కొసలో ఉన్న జీరయ్య పంతులు ఇంటినుంచి వస్తున్నాయి. ఏదో జరగరాని ఘోరం జరిగిపోయిందని ఆ ఏడ్పులే చెప్పలేక చెబుతున్నాయి. ఆదుర్దాగా క్రిందికి దిగి వచ్చాను. అప్పుడే అమ్మ అక్కణ్నించి వస్తోంది కాబోలు, కళ్ళనీళ్ళు వొత్తుకుంటూ లోనికొచ్చింది. "ఏమిటమ్మా, అక్కడ ఏడ్పులు?" ఆత్రుతగా అడిగేను.

"ఆ కమలమ్మ చచ్చిపోయింది రా, పాపం!" అంది సానుభూతి కనబరుస్తూ.

కమలమ్మ జీరయ్య పంతులు భార్య. మా వీధివాళ్ళేను. మా ఇంటి కారేడిండ్ల అవతల వారిల్లు. చాలా మంచి ఆవిడ. నిన్న సాయంకాలం ఆమె ఐస్ వాణ్ని పిలిచి, తన పిల్లలకు ఐస్ కొనివ్వడం చూశాను. అప్పుడు ఆమె ఏ జబ్బూ లేక బాగానే ఉన్నట్లు అగుపించింది. పాపం, ఇంతలో ఏ పాడు రోగం వచ్చిందో ఆమెని పొట్టబెట్టుకోడానికి!

"ఎన్నాళ్ళని ఆమె మాత్రం ఆత్మాభిమానాన్ని చంపుకొని నిరవాకం చేస్తుంది? ఆ తిట్లూ, కొట్లూ భరిస్తుంది? ఆ నరకయాతనలు పడలేకనే పాపం, ఉరిపోసుకొని చచ్చిపోయింది." అమ్మ మళ్ళీ అంది- చివరి మాటల్ని కాస్త ఆవేశంగా వొత్తి పలుకుతూ.

వింటున్నవాడినల్లా కరెంటు షాక్ తిన్నట్లై- "ఆఁ! ఉరిపోసుకొందా?" అని ఆశ్చర్యపోయి అడిగాను.

"ఔన్రా. ఉరి పోసుకునే! నిన్న సాయంకాలం ఎదురింటి రాజమ్మతో ఏదో పనిబడి ఆవిడ ఇంటి కెళ్ళిందట. ఖర్మ కాలి అప్పుడు ఆవిడ ఇంట్లో లేదట. వాళ్ళాయన భూషణయ్య ఉన్నాట్ట. వెంటనే ఇంటికి మళ్ళబోయేసరికి ఆయనే

పలకరించాడట- తమ పిల్లవాడికి ట్యూషన్ పెట్టించాలని వుందని, అందుకోసం పంతులుతో మాట్లాడాలి అని. కమలమ్మ- 'అల్లాగే మాట్లాడి పెట్టించండి' అనేసి తొందరగా ఇంటికి మళ్ళిందట. బకినుండి ఎప్పుడు వచ్చాడో పంతులు, ఇంటి గుమ్మంలో నిలబడి ఇదంతా గమనిస్తున్నాట్ట. పంతుల్ని చూడటంతోటి కమలమ్మకు సగం ప్రాణం దార్లోనే పోయింది. ఏమంటాడో అని ఆవిడ గుండెలు భయంతో గుబగుబ లాడేయి. ఒళ్ళంతా కంపించ సాగింది. మృగ రాజు గుహలోకి నడిచే భీతహరిణిలా లోనికొచ్చింది. జీరయ్య పంతులు కళ్ళు నిప్పులు చెరుగుతున్నాయి. కోపాతిరేకంతో ఊగిపోతున్నాడు. ముఖమంతా జేవురించింది. పళ్ళు పటపట కొరుకుతూ- 'వాళ్ళింటి కెందుకెళ్లావ్?' అని గద్దించి అడిగేడు.

"కమలమ్మ కారణం చెప్పింది.

"అయినా పంతులు ఆ మాటలేవీ విన్పించుకొనే స్థితిలో లేడు. ఎన్నో అనుమానపరంపరలతో అతని హృదయం కుతకుత లాడుతోంది. 'ఆమె లేదుగా- ఆ భూషణంగారితో సరసాలాడి వచ్చేవుగదూ? ఛీ....సిగ్గులేదూ, పరాయి మగవాడితో మాట్లాడటానికి? అసలు నీవు పోయినది అతగాడితో మాట్లాడటానికే కదూ? నిజం చెప్పు- నా కంతా తెలుసు! అబద్ధం చెప్పావా- తోలు వొలిచేస్తాను- గొంతు పిసికేస్తాను- చిత్రవధ చేసేస్తాను. చెప్పు- వాడి పెళ్ళాం లేనిసమయంలో వా డింట్లో నీకేం పని? వాడితో ముచ్చటించడానికి మోజుపడిపోయావు కదూ? తనివితీరా ముచ్చటించావు గదూ? ఇప్పుడు మోజంతా తీరిపోయిందికదూ? ఊఁ....చెప్పు' ఇలాంటి కారు కూతలతో ఆడి పోసుకుంటుంటే- కమలమ్మ అచేతనంగా నిలబడి కన్నీరు మున్నీరుగా విల పించడం మినహాయించి మరేమీ చేయలేకపోయింది. అంతకంటే ఆమె మాత్రం ఏం చేస్తుంది? ఎదిరించి కాస్త గట్టిగా మాట్లాడే ఆశది గాకపోయె!

"జీరయ్యా! పంతులుగారూ!"- బయటనుంచి ఎవరిదో పిలుపు వినిపించే సరికి 'ఎవర్రా వీ డొకడు, పానకంలో పుడకలా' అనుకొంటూ కమలమ్మను అలాగే వొదిలేసి బయటికొచ్చాడు. ఎదురుగా రాజమ్మ భర్త భూషణం! స్వయంగా ఇంటికే రావడంతో అగ్నికి ఆజ్యం తోడైనట్లు జీరయ్య పంతులు

అనుమానం మరింత దృఢపడింది. ఏదో ఒక మిషతో తన భార్యను చూడ టానికే వచ్చాడనుకొన్నాడు. భూషణయ్యా మీద పుట్టెడు కోపం, ఈర్ష్య పుట్టుకురాగా- నిలువునా పొడిచి పారెయ్యా లన్నంతటి ఆవేశం పెల్లుబికి వచ్చింది. అయినా సంబాళించుకొన్నాడు. దానికి కారణం లేకపోలేదు. భూష ణయ్య పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు. పైగా- రొక్కబలంతోబాటు పరువు బలం కూడా బాగా కలిగినవాడు. ఏమాత్రం అతగాడితో పేచీ పెట్టుకొన్నా తన్ను దూరంగా ట్రాన్స్ఫర్ చేయించగలడు. సమితి ప్రెసిడెంటుకూ, ఇతనికీ మధ్య బలమైన స్నేహం కూడా వుంది. అందుకనే జీరయ్యా పంతులు తన్ను తానే సంబాళించుకొన్నాడు. తన భావాలేవీ బైటకి పొక్కనీయలేదు. లేని నవ్వుని పెదిమల మీదికి బలవంతంగా తెచ్చిపెట్టుకొంటూ, సాదరంగా లోని కాహ్వానించి వసారాలో కుర్చీమీద ఆసీనుణ్ని చేయించి, 'ఏం పనిగా వచ్చా రండీ?' అని విధేయత వొలకబోస్తూ అడిగాడు.

"భూషణయ్య- తన కొడుక్కి ట్యూషన్ పెట్టించాలని వుందని, ఆ పెట్టించడమేదో జీరయ్యా పంతులు దగ్గర పెట్టిస్తే బావుంటుందనే ఉద్దేశ్యంతో వచ్చాననని చెప్పేడు.

"మొదట- పిల్లలు యిప్పటికే అధిక సంఖ్యలో ఉన్నారని కాస్త యిబ్బంది ధోరణిలో చెప్పినా, తుదకు ఆయన బలవంతంమీద ఒప్పుకోక తప్పిందికాదు పంతులుకు. తర్వాత భూషణయ్యా ఫీజు తాలూకు వివరాలు మాట్లాడి నిష్క్రమించేడు. జీరయ్యా పంతులు తిరిగి లోనికొచ్చి పెళ్లాన్ని దుయ్యబట్టడం ప్రారంభించేడు. ఈ మారు తిట్టడమే గాదు బాబూ, చేతులు నొప్పి పుట్టేవరకూ కొట్టి, నానా హింసలు పెట్టాడట. అందుకే పాపం, ఆ కమలమ్మ ఉరి పోసుకుంది!" అమ్మ ఇంకా మాట్లాడుతుండగానే పక్కింటి కాంతమ్మ రావడంతో ఆవిడతో సంభాషణకు దిగింది.

నా కెందుకో కమలమ్మను చూడాలనిపించింది. వెంటనే వాళ్ళింటి కేసి గబగబా నడిచేను. అప్పటికే అక్కడ చాలామంది జన ప్రోగయి ఉన్నారు. అందరూ కన్నీళ్ళు పెట్టుకొంటున్నారు. ఏలాగో త్రోవ చేసుకొని శవానికి కాస్త దగ్గరగా పోయాను. పిల్లలు "అమ్మా" అంటూ తల్లి శవంమీద పడి రోదిస్తున్నారు. వాళ్ళ ఏడుపుల్లో "ఇంక మాకు దిక్కెవరమ్మా! మమ్మల్ని

నీలా ఎవరాదరిస్తారమ్మా! మే మింక 'అమ్మా' అని ఎవర్ని పిలవమమ్మా!" యిలాంటి దీనాలాపాలు మిళితమై ధ్వనిస్తున్నాయి.

జీరయ్య పంతులు ఓ మూల ముడుచుకు కూర్చొని, నెత్తిమీద పై గుడ్డ వేసికొని ఏడుస్తున్నాడు. ఆయన్ను చూడగానే నాకు అసహ్యంతోబాటు కోపం చిర్రెత్తుకొచ్చింది. "నీ పచ్చని సంసారంలో నీ చేజేతుల్తోనే నిప్పంటించుకున్న మూర్ఖుడివి! అమాయకమైన పసికందులకు మాతృమూర్తిని కరువు చేసిన పాపాత్ముడివి! పైశాచిక ప్రవృత్తితో ఒక నిండు ప్రాణాన్ని బలిగైకొన్న కిరాతకుడివి!" నాలోని మానవత్వం యిలా ఆక్రోశించింది.

కమలమ్మ శవాన్ని మంచంపై పడుకోబెట్టేరు. తల మినహాయించి వంటినిండుకు గుడ్డ కప్పేరు. తలవద్ద చమురుదీపం పెట్టేరు. ఆవిడ మొహం కేసి చూశాను. నాలుక బయటికొచ్చి వుంది. కనుగ్రుడ్లు మిటకరించివున్నై. మొత్తంమీద మనిషి చూడటానికి కాస్త భయంకరంగానూ, జుగుప్సాకరంగానూ వుంది. అయినా పిల్లలు మాత్రం మాతృ వక్షస్థలంమీద పడి శోకిస్తున్నారు. వాళ్ళది గమనించే స్థితిలో లేరు. గమనించినా భయపడే స్థితిలోగానీ, అసహ్యించుకొనే ధోరణిలోగానీ లేరు! వాళ్ళకు తల్లిపై గల ప్రేమ అలాంటిది కాబోలు. అవును- వాళ్ళకే గాదు, ప్రతి ఒక్కాళ్ళకూ ఆ పరిస్థితిలో అంతటి ప్రేమ ఆవిర్భవించడం సహజం. నవ మాసాలు మోసి, కని, దాసీదానిలా చాకిరీ చేసి- పెంచి పెద్ద జేసేది "అమ్మ!" ఆమె జన్మనిస్తుంది. ఇవ్వడమేగాదు; బిడ్డ కష్టసుఖాల్లో పాలు పంచుకొంటూ అనవరతం కంటిని కాచే రెప్పలా కాపాడుతుంది. బిడ్డకు ఏ చిన్న ఆపద కల్గినా పెద్దగా హంగామా పడిపోతుంది. బిడ్డ బాధే తన బాధగా- బిడ్డ సుఖమే తన సౌఖ్యంగా భావించుకొంటుంది. అందుకే అమ్మ ఆరాధ్య దేవత! కనిపించే దైవం! ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోజాలనిది ఆమె ఋణం!

నా కళ్ళలో అశ్రు ప్రవాహం ఆగడం లేదు. అనిర్వచనీయమైన ఆవేదన పెల్లుబికి వచ్చింది. కొద్దిసేపు ఏడ్చాను. ఆ పిల్లల్ని చూస్తుంటే హృదయం తరుక్కుపోతోంది. బుద్ధి వచ్చీరాని పసికందులు, అమాయకులు. లోకం అంటే ఏమిటో యింకా అర్థం కానివారు.

ఈ హృదయ విదారకమైన దృశ్యాన్ని చూస్తూ, అట్టే ఎంతోకాలం ఉండలేకపోయాను. వెనక్కి మళ్ళాను—ఆవిడ మరణంపట్ల సానుభూతిగా ఓ గాఢ నిశ్వాసం విడచి.

పడకమీద వాలానేగాని నిద్రపట్టడంలేదు. వీధి చివరన ఎక్కడో కుక్కలు కూని రాగాలు తీస్తూ ఏడుస్తున్నాయి. చుట్టుపక్కల చెట్లన్నీ ఉత్తబ్ధంతో నిశ్శబ్దంగా నిల్చుని వున్నాయి. నింగిలోని మేఘాలు యీ ఘోరం చూడలేక కాబోలు, వేగంగా ఒకదాన్ని వొకటి త్రోసుకొంటూ దూర ప్రదేశాలకు పరుగెత్తి పోతున్నాయి. చుక్కలన్నీ కమలమ్మ బిడ్డల్లా వెలవెల బోతున్నాయి. మసక చీకటి! ఏడ్పులు తప్ప మరేం విన్పించడంలేదు. మునుపే వికలమైన నా మనస్సును యీ నిశీథపు వాతావరణం మరెంత వైకల్యాన్ని చేకూర్చి పెడుతోంది. నా బుర్రలో ఆవిడని గురించిన ఆలోచనా స్రవంతి నిరామయంగా సాగిపోతూంది....

పాపం, పసిపిల్లలు! ఇకమీదట ఆ పిల్లల్ని కన్న తల్లిలా ఎవరాదరిస్తారు? పంతులు రెండో పెళ్ళి చేసుకుంటాడేమో మరి! చేసుకొంటే ఆ పిల్లల్ని ఆవిడ కన్నతల్లిలా చూసుకొంటుందా? ప్చ్.... చూడదు. ఒకవేళ చూసినా ఆమెకి సంతానం కలిగేంతవరకే! ఆపైన వాళ్ళకి నరకయాతనలే! ఆమె, మొగుణ్ని తన చెప్పుచేతల్లో ఉంచుకొంటుంది; కీలుబొమ్మలా ఆడిస్తుంది. ఆ పిల్లలచేత గాడిద చాకిరీ చేయించు కొంటుంది. చీటికీ మాటికీ చేయి చేసుకొంటుంది. ఇది నిజం! మరి, అక్కడక్కడా చూస్తుండటం లేదూ? సవతి తల్లుల ఆర్భాటమూ, పిల్లలు పడే బాధలూ—ఇవన్నీ చూస్తూ ఊర్కొనే తండ్రుల నిస్సహాయస్థితి! కమలమ్మ నిజంగా తొందరపడింది. ఇన్నినాళ్ళు ఎలాగో బ్రతుకు నెట్టుకు వచ్చింది—ఇంకొన్నాళ్ళు వోపిక పట్టలేకపోయింది. పిల్లలు కాస్త లౌకిక జ్ఞానం తెలుసుకునే అంతవరకైనా ఉండలేకపోయింది.

....నిద్ర పట్టడంలేదు. వెల్లకిలా పడుకొన్న వాడినల్లా పక్కకు తిరిగి పడుకొన్నాను. మళ్ళీ ఆ ఆలోచనా పరంపరలే....

జీరయ్యపంతులు వెలగబెట్టేది పంతులు గిరీ. స్వగ్రామం మా వూరే కావడంచేత నాలుగైదేళ్ళుగా పనిచేస్తున్నాడు—మా ఊళ్ళోనే. ఉద్యోగ రీత్యా చూశామంటే ఆయనకన్నీ ఆదర్శప్రాయమైన ఉత్తమ గుణాలే వుండాలి. ఎంతో

మంది అమాయక పిల్లలు ఆయన క్రింద వివేకవంతులుగా కావల్సివుంది. వారి లోని అజ్ఞానంధకారాన్ని తొలగించి విజ్ఞానజ్యోతుల్ని వెలిగింపజేసి, వారిని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్ది దేశాని కందించే బాధ్యత ఆయనమీద వుంది. ఇలాంటి ఉత్తమ పదవిలో అలరారే యీయన నిజజీవిత వ్యవహారం తలచు కొంటే, ఎవరికైనా ఏహ్యభావం కలక్కపోదు. కాకపోతే, కమలమ్మ నిలా ఆరూపోరూ పెడ్తాడా? పసికందులకు తల్లిని కరువు చేస్తాడా? పాపం, ఆవిడ తన గొంతుకు తానే తాడు బిగించుకొందంటే—జీవితంపై ఎంత విరక్తి జనించి వుండాలి? అందులో- కన్ను తెరచీ తెరవని, పాలైనా మరిచిపోని చంటిపిల్లని విడిచి అంతటి అఘాయిత్యం చేసుకొందంటే ఆయన ఎంతటి క్రూరత్వంతో ప్రవర్తించి వుండాలి? పైగా - ఏడుస్తున్నాడు సిగ్గులేకుండా, "నాకు దిక్కెవరు కమలా! నా పిల్లల్నిక ఎవరాదరిస్తారు కమలా!" అని. నీచుడు!

జీరయ్యది ఉత్కృష్టమైన ఉద్యోగమైనా ఉన్నవన్నీ కసాయి గుణాలు. ఆ గుణాలన్నీ దాదాపు భార్యమీదే ప్రయోగింపబడుతుండటం చేత, అది ఆవిడ ఖర్మ ఫలమో- ఏమో మరి! కమలమ్మ పుట్టింది పేద కుటుంబంలో. ధనానికి పేదైనా, అందానికి మాత్రంకాదు. గుణాలకు అంతకన్నా కాదు. బంగారుకు తావి అబ్బినట్లు వినయ విధేయతలు కమలమ్మకు మరింత వన్నెచిన్నెలు చేకూర్చి పెట్టాయి. పదిహేడు సంవత్సరాలైనా నిండని తనను, మూడు పదులు పైబడిన జీరయ్య పంతులుకిచ్చి ముడి బెడ్తొంటే, ఏమీ అనలేదు. అప్పటికే పంతులుకు ముందర బట్టతల వుండటం చూసి, కడుపు కుండలా ముందుకువచ్చి- చూడటానికి కేమంత నాజుగ్గా లేకుండటం చూసి, రవ్వంత పెడసరిగానైనా అనుకోలేదు. కాపురాని కొచ్చాక భర్త ఎన్ని అన్నా ఒకళ్ళకు "ఇట్లా" అని మాటవరసకైనా చెప్పేదికాదు. భర్త కెదురుగా మాట్లాడటం గానీ, ఆయన్ని లోకువగా చూడటంగానీ ఎరగదు. ఇట్లాంటి సాధ్వీమణిని సహధర్మచారిణిగా పొందటం జీరయ్యపంతుల పూర్వజన్మ సుకృత ఫలమని చెప్పక తప్పదు.

తన భార్య ఎంతో సౌందర్యవతి అని, అంతటి అందం ఊరంతా గాలించినా ఏ ఆడదానికి లేదని, ఎంతోమంది మగవాళ్ళకన్ను తన భార్య మీద

పడి వుంటుందని- పంతులుకు తెగని అనుమానం. కొంపదీసి తన భార్య తన కంటే అందమైనవాడు కన్పిస్తే ఎక్కడ ప్రేమించేస్తుందోనన్న అనుమానం ఆయన్ని అనవరతం వెంటాడకపోలేదు. అందుకే ఆయన శరీరం బళ్ళోవున్నా మనస్సు మాత్రం పెళ్ళాంచుట్టూ పరిభ్రమిస్తూంటుంది. "ఏం చేస్తోందో" అని అతని మనస్సుకి ఒకటే శంకతోకూడిన తహతహ. అందుకే అప్పుడప్పుడూ బడిపిల్లల్ని పంపించి, తన పెళ్ళాం ఏం చేస్తోందో, ఇంటికి ఎవరు వచ్చారో ఎవరు పోయారో, యీ విషయాల్ని ఆలస్యం అయినా సరే పసికట్టి కనుక్కొ రమ్మంటుంటాడు. ఖర్మకాలి కమలమ్మ, పిల్లలలా చెకింగ్ చేసి పోడానికి వచ్చినపుడు గుమ్మంలో నిలబడి ఎటో చూస్తూండాలి. అంతే!- ఆవిడకు సగం ప్రాణం పోయినట్లే! దానికేమాత్రం సందేహంలేదు. లక్షబూతుమాటలు- దెబ్బలతోపాటు. కాబట్టే ఆవిడ చచ్చినా బయటికిరాదు. వచ్చినా ఒకరికి కనిపించదు. ఒకవేళ ఏదైనా పనివుండి బయటికి రావడం జరిగితే- తొందరగా పనిముగించుకుని లోనికెళ్ళేది. ఎవరైనా పిల్లలు వస్తుంటారేమో అని అవిడ భయం. ఇలా ఎన్నాళ్ళని కూపస్థమండూకంలా సంసారం చేస్తుంది? నికృష్టపు యాతనలు పడుతుంది?

జీరయ్యా పంతులుకు వయస్సు మళ్ళేకొలది సరదాలు పడుచువానికి మల్లే కలుగుతుండేవి. తలచుకొన్నప్పుడల్లా పెళ్ళాన్ని వెంటేసుకొని సినిమాలకి పోవడం ఆయనకో సరదా. అలా సినిమాలకి వెళ్ళేటప్పుడు ఆమె అతిగాని పక్కల్ని రాసుకొంటూ నడవాలి. ఎదుటివాళ్ళు యీర్ష్యపడేలా కులాసాగా నవ్వుతూ కబుర్లాడుతుండాలి. అయితే ఆమె ఎలాంటి సందర్భంలోనూ, ఏ మగవాణ్నిగానీ కన్నెత్తి చూడకూడదు. ఆమె చూపులన్నీ తనమీదో లేక భూమిమీదో మాత్రం కేంద్రీకరింపబడి వుండాలి. ఇది పెద్ద నియమం- ఆవిడ సినిమాలకి వెళ్తున్న సమయంలో పాటించవలసిన నియమావళిలో. ఈ బాధకే, సినిమాలందరికీ సరదాని కల్గిస్తే కమలమ్మకు మాత్రం చికాకెత్తించేవి. ఎంత అయిష్టంగావున్నా భర్తమాటని కాదనలేక బయల్దేరేది. దారిలో ఏ రౌడీ వెధవైనా ఆమెవేపు తదేక దృక్కులతో చూడటం తటస్థిస్తే పంతులు కస్సుమనేవాడు. వాడిమీదకాదు- భార్యమీద. నానా చీవాట్లేసేవాడు. నిప్పులు త్రొక్కిన కోతిలా గంతులేసేవాడు-నడి వీధన్న జ్ఞానం లేకుండా. కమలమ్మ ఏం తప్పు

చేసిందని అలా దూషించటం? త్రోవనవెళ్ళే ఏ ఆకతాయి వెధవో అలా చూస్తే అది ఆవిడ తప్పా? ఆవిడేమైనా తనవైపే చూడమని చెప్తోందా? పాపం! వంచిన తల ఎత్తకుండా నడుస్తోందే- ఆ మాత్రం యింగిత జ్ఞానం పంతులుకు ఉండక్కర్లా? ఎవడో చూశాడే పో. అంత మాత్రంచేత ఏం నష్టం కల్గింది? అప్పుడే కమలమ్మ అతగాణ్ని ప్రేమించేస్తుందా? బుద్ధిలేని పంతులు!

సృష్టిలోగల అందమైన దృశాల్ని చూసి ఆనందించడం ప్రతి వాళ్ళకు సహజ సిద్ధమైన స్వభావం. ప్రకృతి సిద్ధంగా కమలమ్మ అందమైన స్త్రీ. అంచేత ఎంతో మందికి నయనానందకరంగా కనబడవచ్చు. కాబట్టి వాళ్ళ పని గట్టుకుని చూడవచ్చు. ఆనందించవచ్చు. అంత మాత్రంచేత ఎవర్లో ఏం తప్పుందని పంతు లంతగా మండిపడటం? విద్యావంతుడు. పైగా బడిపంతులు. ఆయన కుండాల్సింది యిలాంటి భావాలేనా? విద్య మానవునిలోని సంకుచితత్వాన్ని తొలగించి విశాలత్వాన్ని కలగచేస్తుందంటారు. ఎన్నో ఉత్తమ గుణాల్ని అలవడజేస్తుందంటారు. విద్యావంతుడైన పంతులుకు విద్య యీ గుణాలేనా కలగజేసింది? యీ చీకటి భావాలేనా అలవడజేసింది? ఎప్పుడో వాకప్పుడు మానవునికి యీలాంటి అవకతవక ప్రశ్నలు ఆవిర్భవిస్తాయనే సుమతి కవి సమాధానంగా ఓ పద్యం చెప్పాడు—

ఉత్తమ గుణములు నీచున
కెత్తెఱగున కలుగనేర్చు ఎయ్యెడలందా
నెత్తిచ్చి కరగి పోసిన
ఇత్తడి బంగారమగునె ఇలలో సుమతీ!

నిజమే మరి! జీరయ్య పంతుల్లాంటి నీచునకు ఉత్తమ గుణాలు ఏ విధంగానూ, ఎక్కడనూ కలగవు; కలగబోవు. దానికి ఉపమానం కవి ఎంత బాగా ఉదహరించాడు! ఆయన ఆ నాడు చెప్పిన పద్యం—యీనాడు మన జీరయ్య పంతులుపట్ల అక్షరాలా నిజమైంది. ఎంతో అనుభవాన్ని సంతరించుకొన్నాకగానీ కవులు ఓ మాట చెప్పరు.

వీథిలో పోయే ఏ యువకుడుగానీ పంతుల ఇంటివేపు చూడగూడదు. విధివశాత్తు చూశాడనుకోండి—వెంటనే పెళ్ళాన్ని పిలిచేవాడు. "ఓసేవ్ కమలా! ఎవరో పరిచయస్తుడిలా వున్నాడు, నీ కోసం చూస్తున్నాడే! త్వరగా

రా మరి!" అని. ఏదో పనిచేసుకొంటున్న ఆవిడ వచ్చిందనుకోండి- "వాడు నీకు తెలుసా ఏంటి? ఎవరేఁవిటి? ఎప్పుడయ్యాడే నీకు పరిచయం?" ఇలాంటి యక్ష ప్రశ్నలతో ఆవిడ్ని వేపుకుతినేవాడు. పాపం, ఆమె బాధాతప్త హృదయంతో కళ్ళనీళ్ళు పెట్టుకోవడం తప్పితే ఎన్నడూ పన్నెత్తి బదులు పలికేది కాదు. "ఛీ....సిగ్గులేదూ- పైగా నా ముందు దెయ్యంలా నిల్చోడానికి? ఫో-అవతలికి!" అని కర్కశంగా- బడి పిల్లల్ని గదమాయించినట్లు గదమాయించేవాడు. కమలమ్మ ఉసూరున లోనికెళ్ళి తన పనిలో నిమగ్నమయ్యేది.

ప్రతి రోజూ సాయంవేళ జీరయ్య పంతులు భార్యా బిడ్డల సమేతంగా అలా డాబా మీదికి రావడం రివాజు. అలా వచ్చినప్పుడల్లా పంతులు చలాకీగా కులాసాగా - కొంటెగా - భార్యతో పరాచకాలాడుతుండటం గనక చూస్తే, ఎవ్వరికైనా అట్టే తప్పకుండా నవ్వొస్తుంది. పంతులుకు నాలుగు పదుల వయస్సు ఎప్పుడో దాటిపోయి వుంటుంది. అనుభవానికి నాందిగా వెనకవైపు కొద్దిగా మినహాయిస్తే పూర్తిగా బట్టతల. పైగా - ముగ్గురు బిడ్డల తండ్రి కూడాను. అయినా పంతుల్లో యిసుమంతైనా తగ్గని హుషారు, ఖుషీ చూస్తుంటే ఏదో సినిమాలోని "వయసుతో పనియేముంది - మనసులోనే అంతా వుంది" అన్న గీతం జ్ఞాపకం వస్తుంది. అవును మరి. వయస్సుకు శృంగారానికి ఏలాంటి సామ్యమే లేదు. వయస్సు మీరుతోన్నా, జవసత్త్వాలు ఉడుగుతోన్నా - చాలామంది వయోవృద్ధులు వివాహం చేసుకొందామని ఉబలాటపడుతుంటారు. "ఇదేంబుద్ధి? పాడుబుద్ధి! వయస్సుడిగిన కాలంలో!" అని మనం కనక వేళాకోళం పట్టిస్తే, "పోరా, చింతచెట్టు ముదిరినా, పులుపు పోతుందా?" అని, అడిగినవాళ్ళ నోళ్ళు కట్టిస్తుంటారు.

జీరయ్య పంతులు - నిరతం నిరపరాధి అయిన తన భార్యను శంకిస్తూ నానాతిప్పలు పెట్టూ వచ్చాడు. ఆఖరికి ఆవిడ అసువుల్నే తనలోని శంకకు ఆహూతి చేశాడు. తన చేజేతులా తన ఇంటి జీవన జ్యోతిని ఆర్పేసుకొన్నాడు. కళామయమైన తన జీవితాన్ని కటిక చీకటిమయం చేసుకొన్నాడు. దుఃఖ పూరితమైన నరకంగా మార్చుకొన్నాడు....దుఃఖ భాగుడై దురపిల్లుతూ నిలిచాడు!

---

అమ్మమ్మ హృదయం ఒక అమృత భాండం! కోటి మాతృ హృదయాల కూడలి స్థలం! సుతిమెత్తని మనసూ-ఎముకలేని చేయీ అమ్మమ్మది!

మండు వేసంగిలో పయనించే పాంథులు, చల్లని నీడ నిచ్చే కానుగ క్రింద మార్గాయాసాన్ని బాపుకొన్నట్లు బంధు ప్రీతి గల అమ్మమ్మచే పోషింప బడి, ఆమె అమృత హస్తాల్లో పెరిగి, రెక్కలు వచ్చిన తరువాత తల్లిని వదలి వెళ్లిపోయే పక్షి పిల్లల్లాగా, నిష్క్రమించినవారు లేకపోలేదు.

అమ్మమ్మ చల్లని చూపు లేకుంటే—తనింతటి వాడయేవాడు కాదు కృష్ణమూర్తి! ఈ భావన కలిగినపుడు అతని హృదయం గాలి తాకిడికి అల్లల్లాడిపోయే మాధవీ లతికలా చలించి పోతోంది. అమ్మమ్మకు దిక్కెవ్వరు? అమ్మమ్మ దేవతలాంటి మనిషి....యీ ఆలోచనలతో అమ్మమ్మని పూవుల్లో పెట్టి పూజించాలని, ఆమెకే కొరత లేకుండా చూడాలని, ఏమేమిటో ఘోషి స్తుంది కృష్ణమూర్తి హృదయం.

అది అర్ధరాత్రి, దాదాపు రెండు గంటల సమయమైనా అయి ఉండ వచ్చు. బహుశః తానప్పుడు నిద్రాదేవి బాహువులతా పంజరంలో ఒదిగి, తన కేమీ యీ లోకంలో ప్రసక్తి లేనట్టు విశ్రాంతి పొందుతూ ఉండవచ్చు.

నిశ్శబ్దాన్ని చీల్చుకొని, అమ్మమ్మ కంఠంలో నుండి యీ మాటలు వెలువడినై : "పొండర్రా! ఏ నుయ్యో గొయ్యో చూచుకొనుంటుంది. వెదకండి, చిట్టితల్లి ఏమైందో!" తల బాదుకుంటూ రోదిస్తోంది. నిద్రమత్తు పీడింది. అయినా అయిదేండ్ల వయస్సులో అంతంత మాత్రమేమి అర్థంకాలేదు తనకు.

అమ్మమ్మ దేనికి రోదిస్తుంది? వెదకడం దేన్ని? ఇన్నగు ప్రశ్నలు కృష్ణమూర్తి హృదయంలో ప్రభవించక పోలేదు. వూరిలోని వారందరు గుమి గూడారు. తలోవిధంగా అమ్మమ్మను ఓదారుస్తున్నారు. తాతయ్య నిర్లిప్తంగా కండువా భుజంపైన వేసుకొని పంచ అరుగుపై కూర్చొని, వెతకడానికి అను చరులను పురమాయిస్తున్నాడు.

తెల్లవారుజాము నాలుగు గంటలు....ఐదారుగురు మనుష్యులు అమ్మను చేతులపైన వేసుకొని వచ్చి పరుండబెట్టారు. ఒక్క మాటుగా అమ్మమ్మ, తాతయ్య అందరూ బావురుమన్నారు. ఎందుకో తనకప్పుడు అర్థంకాలేదు కృష్ణమూర్తికి! అమ్మ కొంచెం పొడగరి. ఆమె నిర్వికారంగా, ప్రసన్న వదనంతో శయ్యపై నిద్రిస్తున్నట్లనిపించింది తనకు. ఆ రాత్రే ఏడు గంట లప్పుడు వెండి గిన్నెలో పాలుపోసి పంచదార కలిపి అన్నం తినిపించింది తనకు. సాయంకాలం మట్టి ప్రమిదలలో ఆముదం పోసి ప్రత్తితో వత్తులు చేసి, గుమ్మానికి రెండు వైపులా దీపాలు వెలిగించింది అమ్మ. తనలో కారు చీకట్లు పోకార్చి, జ్ఞాన లతలను ప్రవేశింప జేసినట్లు స్ఫురణకు వస్తూంటుంది అమ్మ వెలిగించిన రెండు జ్యోతులు. అమ్మను వదిలి పరుండడం తనకట్టే అలవాటు లేకపోయినా, అమ్మమ్మ ప్రక్క పరుండడం అనేది ఒక్కొక్క రోజు జరుగుతూంటుంది. ఆనాడు అమ్మమ్మ దగ్గర తన్ను పరుండబెట్టి నిద్ర పోయే వరకు చేతితో తట్టుతూ ఉంటుంది అమ్మ. ప్రస్తుతం పరిస్థితి యేమిటో? అర్థంకాక, కృష్ణమూర్తి మోము వెలవెల పోయింది.

తాతయ్య గ్రామకరణం కావటం మూలాన గ్రామంలో మేటి రైతు లందరూ ఆ రాత్రికి రాత్రే తన యింటికి హాజరైనారు. ఒక హరికెన్ లాంతరుతో....నలుగురైదుగురు రైతులతో హాజరైన రెడ్డిగారు 'కరణం గారూ, కన్న కుమార్తెను వంచనచేసి, యేం పుణ్యం కట్టుకుంటారు? మీ ముఖ మైనా చూడకూడదు" అని మందలించారు వంచన ఏమిటో అర్థమైనది కాదు ఆనాడు కృష్ణమూర్తికి!

పోలీసులు ఉదయం ఏడింటికే హాజరై అమ్మ పొడవు, గుర్తులు అవీ అన్నీ వ్రాసుకొని- ఆమె ఎలా మరణించిందని ప్రశ్నించారు. అదివరకే తాతయ్యవద్ద ఉపదేశం పొందిన కుమ్మర మునెప్ప "ఆమె, చిన్న బిడ్డకు బావిగట్టున గలమందాకు కోసుకుంటూ ఉండడం క్రితం సాయంత్రము తాను చూచానని, పరధ్యానంలో ఆమె కాలు జారి నూతిలో పడడం గమనించి కేకేశానని, తనకు యీత రాకపోవడం మూలాన జనంచేరి ఆమెను నూతిలో నుండి తీయగా అదివరకే ఆమె మరణించిందని" వాఙ్మూలం యిచ్చాడు. ఏదో కొంచెం లంచం రాళ్ళతో తప్పుడు సాక్ష్యాలని తమ డైరీల

కెక్కించి నిష్క్రమించారు పోలీసులు. తన యింటి ఆచారం మేరకు చని పోయిన వారిని భూస్థాపితం చేస్తారు గాని, అగ్ని సంస్కారము చేయరు. కానీ, ఏ కారణంచేతో అమ్మకు అగ్ని సంస్కారం జరిగింది. కారణం తన కప్పట్లో అర్థంకాలేదు.

అమ్మమ్మ అమ్మను తలపోస్తూ వేడివేడి కన్నీటి కణాలు రాలుస్తూ నిశల్లో రోదిస్తూండేది. తాతయ్య అప్పుడప్పుడూ నిర్లిప్తంగా శూన్యంలోకి చూస్తూ- దీర్ఘ విశ్వాసాలు వదల్తూండేవాడు.

తాతయ్యకు, అమ్మ అంటే పంచప్రాణాలు—అమ్మ తాతయ్యకు ఏకైక పుత్రిక. ఆమాట కొస్తే "అమ్మమ్మకు నలుగు రైదుగురు మగ సంతానం కలిగినట్టు, అందరూ, సంవత్సరం....రెండేళ్ళూ....పూర్తిగాక పూర్వమే మరణించినట్టూ, తుదకు, అమ్మమ్మ తాతయ్యల దాంపత్య నందన వనంలో పారిజాత పుష్పంలా భాసించింది అమ్మ" అని అమ్మమ్మ అంటూండేది.

తాతయ్య పాతకాలపు మనిషి—రామాయణ, భారత, భాగవతాలు వీధిబడిలో బాగా అభ్యసించినవాడు. ఎవరికి ఏ ఉత్తరం వ్రాసినా, ఏమైనా సలహాలిచ్చినా ఉద్గ్రంథాల్లోని పద్యాలను, సంస్కృత శ్లోకాలను ఉదహరిస్తూ ఉండేవాడు.

లేకలేక పుట్టిన కూతుర్ని కంటికి రెప్పలా కాపాడాడు తాతయ్య- సీత, సావిత్రి, అనసూయల్లాగా తన కుమార్తె ఆదర్శనారి కావాలని ఉవ్విళ్ళూరాడు. ఆమెను పాఠశాలకు పంపక పోయినా తానే తెనుగు చక్కగా వ్రాయను, చదువను, కొంత పరిజ్ఞానము కలిగించాడు తాతయ్య.

ఆస్తికత్వంలో జీర్ణించుకుపోయిన భావాలపుట్ట తాతయ్య. తదను గుణంగా రూపొందించాడు అమ్మని. ఒక అమ్మ నేమిటి? తాతయ్య పోషణలో పెరిగిన తను ఓ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడైనా, ముమ్ముందు కళాశాలల్లో అధ్యాపక వృత్తి నెరపడానికి తనకు అర్హతలు, అవకాశాలున్నా, తాతయ్య సంప్రదాయికమైన ఆస్తికత్వపు భావాలు యీ నవీన యుగంలోను తన ఒంటిలోనుండి వదలిపోలేదు. ఉగ్గుపాలతో రంగరించి పోసిన భావాలు

కదూ? ఏలా పోతాయి! ఓ దీర్ఘ విశ్వాసం విడిచి కృష్ణమూర్తి మరలా ఆలోచనలో పడ్డాడు.

భ్రాతృవత్సలతలో తాతయ్య భరతునికి సాటి! తన కున్న అరుగురు తమ్ముళ్ళ బిడ్డలలో కనీసం ఐదారు మంది బిడ్డలను తానే పోషిస్తూండేవాడు తాతయ్య. తాతయ్య కడపటి తమ్ముడు సుదూర ప్రాంతాల్లో కరిణీకం చేస్తూ బాగా రెండు చేతులా గడిస్తూండేవాడు. మాటకు, మూటకు, ఆ సంసారానికంతకూ ఆయనదే మాటగా ఉండేది!

అమ్మకు సంబంధం - ఆ చిన్న తాతయ్య తీసుకొని వచ్చిందే! ఓ ప్రాథమిక పాఠశాలోపాధ్యాయునికి తన అన్న కుమార్తెను (అమ్మను) ఇప్పించి, ఆ పంతులు చెల్లెలిని వివాహ మాడాడు, చినతాతయ్య!

నాన్నగారికీ, పెదనాన్నగారికి వచ్చిన తగాదాల మూలంగా నాన్న అమ్మతో సహా తన అత్తారిల్లు చేరారు. ఆ దరిదాపుల్లో పంతులు ఉద్యోగం నెరపుతూ ఉండే నాన్నను సుదూర ప్రాంతాల్లో ఒక పల్లెటూరులో సింగిల్ టీచరుగా మార్పు చేశారు. ఆ క్రొత్త పరిసరాలలో అమ్మతో కాపురం ప్రారంభించి, కొన్ని సంవత్సరాలు ఆ కుగ్రామంలో గడిపారట నాన్న. బడిపంతుళ్ళంటే దేవుళ్ళలా ప్రజలు చూచుకొనే రోజు లవి. పూర్వపు తాలూకా బోర్డుల కాలం! గ్రామస్థుల సహకారంతో ఏ లోటూ లేకుండా జీవనం గడుస్తూ, జీతం రాళ్ళు అట్టే మిగిలిపోయేవట.

నాన్న జీవితంలో పెను తుఫానులా వచ్చింది ట్రాన్స్‌ఫర్, చినతాతయ్యగారి వూరికి. ఆ వూరికి ట్రాన్స్‌ఫరై నాలుగు మాసాలు గడిచింది. నాన్న తన చెల్లాయి యింట్లో అవిభక్తంగా ఉండడం తనకు నచ్చక మార్పుకు అర్జీ పెట్టుకొన్నాడు. దేవరకొండకు ట్రాన్స్‌ఫర్ ఆర్డరు వచ్చింది.

డ్యూటీలో చేరి వారమైనా తిరుగలేదు. అమ్మను చిన తాతయ్య గృహంలో వదలి వెళ్ళాడట - జ్వరంతో తిరిగి వచ్చిన నాన్న గట్టిగా మంచం పట్టి ఎనిమిది రోజుల్లోనే ఈ ప్రపంచాన్ని శాశ్వతంగా వదలాడట!

చినతాతయ్య మాత్రం నాన్నగారికి జబ్బు నయం చేయడానికి ఓ డాక్టర్ని యింటిలోనే ఉంచి, ఎనిమిది రోజులుగా చికిత్స చేయించి తన ముద్దుల మరిదిని జీవింప చేయడానికి, ఎంతో ప్రయత్నం చేశాడు.

"రిలాప్స్ ఫీవర్. ఇది మరీ సీరియస్" అని డాక్టరు తెలుతనే పెదాలు విరచారట. ఈనాడులాగా మంచి ఔషధాలు లేని రోజు లవి. ఏమైతే నేం! పుట్టించినవాడు రమ్మన్నప్పుడు ఔషధాలేం జేస్తాయి గనుక! ఏమైతే నేం, నాన్న యికలేడు....అమ్మ ఆక్రందనాలకు అంతమే లేదు.

తాతయ్య ప్రాచీన భావలహరిలో ప్రభవించిన అమ్మ యీ యిరవయ్యో శతాబ్దం ప్రథమ పాదంలో సైతం సహగమనానికి....తాతయ్య నర్థించింది. తాతయ్యయితే అందుకు అంగీకరించేవాడే! పైగా అగ్నిగుండం పైన్నే విమానంలో అదృశ్య రూపంలో తన అల్లుడు తన కుమార్తె కోసం ఎదురు చూస్తుంటాడని, కుమార్తె సహగమనం చేయగానే ఆమె ఆత్మ అతనిని చేరి, వారి విమానం నేరుగా వైకుంఠధామం చేరుతుందని ఆయన ప్రగాఢ విశ్వాసము అయి ఉండవచ్చు।

అదివరకే పతిత మానవోద్ధరణకై యిలాతలంలో రాజా రామ మోహన్‌రాయ్ ప్రభవించి, సహగమన దురాచారాన్ని రూపుమాపి ఎన్నో ఏండ్లు గడిచినది! తాతయ్య అమ్మ కోరికను మన్నించాడా, తాను కుటుంబంతోపాటు శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరించడమో లేక, అంతకంటే కఠిన శిక్షో ప్రభుత్వంచేత విధింపబడుతోంది. అందుకే సహగమనానికి మద్దతు నిచ్చే ధైర్యం ఎవరికుంటుంది గనుక!

చిన్నతనంలో పురాణాలు ఉగ్గుబాలతో రంగరించి పోసినాడు తాతయ్య....! తన జీవితం దేనికి! తన తనువు, మనసూ ఎవరికి? వైధవ్యంతో ఉన్న స్త్రీలంటే సంఘానికి బహు చుల్కన. వారి మోము చూచినా పాపం అని తలచే రోజు లవి.

తనెందుకు జీవించాలి? ఏదో పరధ్యానంగా ఉంటూంది అమ్మ. ఏదో ఆలోచిస్తూ కంటిలో నుండి తన చెక్కిళ్ళ మీదుగా కారే కన్నీటి ధారలను తన చేత్తో అప్పుడప్పుడూ తుడుచుకొంటూంది. పినతండ్రి మందలించినా, తండ్రి ఓదార్చినా ఆమె దుఃఖం ద్విగుణీకృతమయ్యేది.

తాతయ్య రెండెద్దుల బండిలో అమ్మను తన వూరికి తీసుకొని వెళ్లాడు. నాన్న పోగా అమ్మ పోషణ భారం అంతా తాతయ్యపై బడింది. ఆ మాటకొస్తే అమ్మ అతనికి ఏకైక పుత్రిక. తనకు మగ సంతతి లేకపోవడం మూలాన

అమ్మ పోషణ భారం అతను వహించవలసినందుకు తాతయ్య భయపడ్డం లేదు. కానీ తాతయ్య బంధు ప్రియుడు.

అన్న కుమారులైనా, తన కుమారులైనా ఒకటే నన్న భావన తాతయ్య మదిలో అలుముకొని పోయింది. తన అన్న కుమారుడు ఆనందరావు పాతికేళ్ళవానికి ఓ మంచి సంబంధం అని ఎంచి, ఓ చక్కని చుక్కలాంటి కన్నెను తెచ్చి వివాహం చేశాడు తాతయ్య. అన్నగారన్నా, ఒదినగారన్నా ఎంతో భక్తి గౌరవాలు- అమ్మకు. ఆనందం కూడా అమ్మంటే చాలా సానుభూతితో ఉండేవాడు. అదేం చిత్రమో గాని, లోకంలో అత్తకు కోడళ్ళకు, ఆడబడుచులకు ఒదినగార్లకు- ఎలుకకూ పిల్లికి, ఉప్పుకు నిప్పుకు ఉన్నంత సంబంధం ఉంటుంది.

"నీకూ యీ యింటి కేం సంబంధం? యీ యింటికి నేను గృహలక్ష్మిని" అన్నట్లున్నవి ఆమె చూపులు, భావాలు- నిర్హేతుకంగానే. దానితో బాటు తాతయ్య తదనంతరం కరిణీకం వగైరాలు, ఆస్తి అంతా తమకే దక్కాలని, యీ యింటికి, అమ్మకు ఏలాంటి సంబంధం ఉండగూడదని, ఆమె ఉండడంచేత ఆ హక్కులు కాస్త గృహమేధియైన తాతయ్య ఏం చేస్తాడోనని ఆనందంగారి భార్య ఆరాట పడేవి. తనకు పుట్టబోయే భావి సంతానానికి ఆ గృహం, స్థిర చరాస్తులు సంక్రమించాలి. అందుకు అమ్మ ఆ యింటిలో ఉంటే ఏం సంభవిస్తుందో? ఏకైక పుత్రిక అని తాతయ్య తన ఆస్తిలో అర్ధం వ్రాసి యిచ్చినా యీయవచ్చునన్న తలంపు ఆనందంగారి భార్య మెదడులో మెదలడంతో అమ్మను ఆంతరంగికంగా ద్వేషించడం ద్విగుణీకృతం అయింది.

ఆనందంగారి భార్య నీళ్ళకన్నా తేలిగ్గా చూస్తూంది అమ్మని. తాతయ్యకు తాను ఏకైక పుత్రిక అయినా పరాయివాండ్ల యింటిలో ఉన్నట్లు మధన పడ సాగింది అమ్మ. తన వదిన చిన్న చూపుల గురించి అన్నగారితో కాని, తన తండ్రితోగాని చెప్తే తన వదినకు తగిన శాస్తి జరుగుతుంది! కాని తనవల్ల అన్నగారి కాపురంలో రవరవలు లేవడం అమ్మకు సుతరామూ యిష్టం లేక పోయింది.

నాన్న మరణించడంతో ఆయన బడిపంతులుగా పనిచేసి సంపాదించిన రెండువేల రూపాయలూ తాతయ్య స్వాధీనంలోనే ఉంది. ఆ గ్రామంలోనే మంచి మాగాణి భూమి ఆ సెలయేటి కాలువ క్రింద మూడెకరాలు రెండువేల

రూపాయలకు కొనదలచుకొన్నాడు తాతయ్య. తాతయ్య చేయదలచుకొన్న పనిలో, అతని దృక్పథంలో తప్పుకూడ యేమీ లేదు. అమ్మ పేరుతో భూమి కొన్నచో పెద్దనాన్నగారు, అతని సుపుత్రులు భాగానికి వచ్చినా రావచ్చు. తొలుత తన పేరుతో చేసుకొంటే కాలక్రమాన ఆ భూస్థితి తప్పక దౌహిత్రునకు చెందకపోదని ఆయన విశ్వాసం. ఈ కారణాలచేత అమ్మ పేరుతో పొలం ఉండడం మంచిపని కాదని అతని ఉద్దేశం.

తన కుమార్తె జీవనభారమంతా పూర్తిగా వహించదలచుకున్న తాతయ్య తన పేరుతో ఆ పొలం చేసుకోడానికి నిశ్చయించాడు. తన తదనంతరం తన స్వార్జితమైన ఆస్తిలో కొంత, కరిణీకం తన అన్న కుమారుడైన ఆనందాని కిచ్చే మనోనిశ్చయం ఆతనిలో లేకపోలేదు. ఈ నిశ్చయం ఆయన పలుకులవల్ల అందరికీ విదితమైనదే.

ఒకవేళ తాతయ్య మరణించినట్లయితే నాన్న సొత్తుతో కొన్న భూమి ఆనందానికి సంక్రమిస్తుంది. అది మామూలు. కాని ఆనందం అంతకు పాల్పడుతాడా? ఎన్నటికీ పాల్పడడు. కానీ, ఆయన భార్య నల్లతంగ ఒదినె. "మూళి అలంకారి—మూదేవి శాండాళి" లాంటిది. భర్త ఆమె చేతిలోని కీలుబొమ్మ. ఆమె ఎట్లాడించిన అట్లాడగలడు. ఆనందం భార్య స్వాధీనపతిక. ఈలాంటి ఆలోచనలతో అమ్మ ఉక్కిరిబిక్కిరి అయ్యేది.

తన్నింకా దేవుడెందుకు జీవింపజెయ్యాలి? అన్నగారి సంసారంలో అగ్నిభాండం తన కారణంగా లేవగూడదు కదా! తాతయ్య అనంతరం ఆస్తి వంశానుగతంగా అన్నయ్యకు చెందుతుంది. అన్నయ్య తనకివ్వాలన్నా యివ్వనియ్యదు ఒదినె. ఆమె నిస్పృహతో కృశించిపోయింది.

తండ్రిని సమీపించి తన పేరుతో ఆ పొలం రిజిష్టరు చేసి యిమ్మని కోరింది అమ్మ తాతయ్య అపార్థం చేసుకొన్నాడు. భావి జీవితంలో అమ్మ వూహలు శిలాక్షరాలు అవుతాయని అతనికేం తెలుసు? 'ఎవరి పేరుతో నుంటే యేం? నీ క్కావలసిం దింత గుడ్డ, అంత అన్నం, యిదేనా? నన్ను నమ్మలేవా అమ్మా?' అని ఆక్రోశించాడు తాతయ్య. మరి యెదురుగా నిలువలేకపోయింది అమ్మ.

ఆ మరుదినం రిజిష్టర్లు పూర్తిఅయి వచ్చిన పత్రాలు పెట్టెలో పది

లంగా దాచి పెడుతూండడం చూచింది అమ్మ. ఎవరి పేరుతో రిజిష్టరైంది పొలం అని అమ్మ అడిగిందానికి తాతయ్య "కస్సు" మంటూ లేచిపోయాడు బయటికి.

'ఎవరి పేరుతో అయితేనేం?' అని ఒదినెగారన్నది. "రిజిష్టరు నా భర్త పేరుతో అయినది. నీ తండ్రి మరణానంతరం నీకో చిల్లిగవ్వకూడా దక్కదీ యింట్లో. ఎప్పుడూ కన్నీటితో మా యిల్లే ఏడ్పుల కొంపగా చేశావు. ఏ నూతిలో, గోతిలోనైనా పడి చావరాదూ?" అన్నది ఒదినె.

ఇన్ని సంగతులు, వదినెగారన్న మాటలూ తాతయ్యకు నిజంగా తెలీదు. వృద్ధాప్యం మూలాన అమ్మమ్మకు ఆ పలుకులు స్పష్టంగా వినిపించినవి కావు. ఎంత పేచీ పెట్టినా, అమ్మ తాతయ్యతో చెప్పదన్న ధీమాతో గామాలు యిన్ని మాటలు అన్నది ఆనందంగారి భార్య!

అవును, నిజం. ఆనాడే సహగమనానికి అంగీకరించలేదు తాతయ్య. ఆనాటినుండి తనకు జీవితంపైన విరక్తి. ఎప్పుడూ దీర్ఘాలోచనలతో వేడివేడి కన్నీటి కణాలు అప్రయత్నంగా చెక్కిళ్ళపైన కారుస్తూ తన్ను చూచుకొని జీవించేది అమ్మ. వేసగి బీరెండచేత శుష్కమైన గడ్డిపోచలను రవంత అగ్ని కణమే ప్రజ్వరిల్లజేసినట్లు శోకమూర్తియై, విరాగిణియై, జీవచ్ఛవంలా జీవిస్తూండే అమ్మకు ఒదినె అన్న మాటలు మంత్రాల్లా పనిచేసినై.

తా నెందుకు నుయ్యో గొయ్యో చూచుకోగూడదు? నిజానికి నాన్న ధనంతో కొన్న ఆస్తి తన కుమారుడైన కృష్ణమూర్తికి అందదు. చెవి నిల్లు పెట్టుకొని ఘోషించినా, యీ విషయం తాతయ్యకు అర్థంకాదు. మొత్తానికి వైధవ్యభారంతో, వదినగారి అనాదరంతో, తండ్రిగారి అమాయకత్వంతో అమ్మ ఆ అర్ధరాత్రం ఒదినెగారి సలహా మేరకే - వో నుయ్యి చూచుకొనింది, అని లోకం కోడై కూసింది. ఆ కూతతో అమ్మ మరణించినందుకు కారణం ఆనాడు తెలిపింది కృష్ణమూర్తికి!

అమ్మ మరణానికి తనూ కొంతవరకు కారణభూతుడన్న తాతయ్య ఆ చింతతోనే అచిరకాలంలోనే స్వర్గధామా న్నలంకరించాడు.

నాలుగోయేట తండ్రిని, ఐదోయేట తల్లి ని పరలోకానికి పంపిన తనకు అమ్మమ్మ అండయై పోషించింది. అత్తయ్యకు తనంటే ఏమిటో జుగుప్స, అమ్మ మరణించినా, తాతయ్య అంతరించినా, ఆనందంగారి భార్యకు హృదయంలోని ఆరాటం ఆగింది కాదు. అమ్మమ్మ అసలు భర్తృమరణంతో.

పుత్రికా శోకంతో కృంగి, కృశించి తన్ను చూచుకొని రోజులు గడుపు తున్నది. అత్తయ్య చేసే అల్లరికి ఆ యింటిలో ఉండడం దుర్భరమై, అమ్మమ్మ తన్ను తీసుకొని తన తమ్ముని వూరు చేరుకొంది. తన పరిదీన దశను తన తమ్ముడు పద్మనాభరావుతో వెళ్ళబోసుకుని, తల్లీ, తండ్రికి దూరమైన, నా- యీ దౌహిత్రుణ్ణి పైకి తేవలసిన భారం నీదని కాళ్లా, వ్రేళ్లాబడి బ్రతిమలాడింది.

తన అక్కయ్య ఆవేదనను అర్థం చేసుకొన్న పద్మనాభరావుగారు ఆర్ద్రహృదయందో కరిగిపోయాడు. సమీపమందలి బస్తీలో ఉన్నత పాఠ శాలలో తన్ను చేర్పించి, అమ్మమ్మను తనకు అండగా నియమించి, అన్ని ఖర్చులూ ఆయనే భరిస్తూండేవాడు.

రోజులు, వారాలు, నెలలు దొర్లి, సంవత్సరాలుగా కాలచక్రం దొర్లుతూ శరవేగంతో అప్పుడే పదేండ్లు కావచ్చింది తన బస్తీ జీవితం. తనప్పుడు ఎస్. ఎస్. ఎల్. సి. చదివే రోజులు. టైఫాయిడ్ ఫీవర్ రావడంచేత పాఠ శాలకు ఆగవలసివచ్చింది తను. అమ్మమ్మ చెవిలోని కమ్మలు, మెడలోని కంటె అమ్మి డాక్టరుకు ఫీజు చెల్లించిందట. పద్మనాభరావుగారు అప్పు డప్పుడూ వచ్చి పరామర్శించి పోతూండేవాడు. సుమారు ఒకటిన్నర నెల పర్యంతం దివారాత్రముల తేడా తనకట్టే తెలిసి రాలేదు. నయమైనకొద్దీ, డాక్టరు "కృష్ణమూర్తీ! యమధర్మరాజునే జయించావయ్యా!" అనేవాడు. అమ్మమ్మ చిక్కి శల్యమైపోయింది. లోతైన కన్నుల్తో, బరువైన హృద యంతో ఆ మాతృహృదయం కంపించేది. ఆమె ఆ పరిస్థితిలో ఒంటరిగా రోగిష్టి అయిన తనతో యేలా గడిపిందో నని తలంచుకొన్న కొద్ది గుండె చెరువై పోయేది.

ఇంత జబ్బు పడ్డా, తాను యథాతథంగా పరీక్షల్లో ఉత్తీర్ణుడయ్యాడు. కళాశాలలో ప్రవేశించి కళాశాల విద్యాపూర్తి గావించి ట్రెయినింగ్ కాలేజీలో చేరాడు తను. ఒక్క సంవత్సర కాలం అట్టే దొర్లి పరీక్షలు ముగిసినై.

అదివరకే తను ఉద్యోగానికి అప్లయి చేశాడు. పెబ్రిగ్రాం ఆర్డరు వచ్చింది ట్రెయినింగ్ కాలేజినుండి రిలీవైన దినమే! సుదూరప్రాంతాల్లో బస్తీలో తన్నో ఉన్నత పాఠశాలలో సైన్సు అసిస్టెంటుగా పోస్టుచేశారు. అమ్మమ్మ యీ వార్త విన్నప్పుడు ఆమె కన్నులు ఆర్ద్రాలైనాయి. ఆనందాశ్రువులు రెండు అమ్మమ్మ చెక్కిళ్లపై చింది జారిపోయినై. "బాబూ, యిదంతా ఏడు

కొండలవాని దయ నాయనా!" అన్నది అమ్మమ్మ. పద్మనాభరావుగారికీ శుభవార్తను వెంటనే టెలిగ్రాం మూలంగా అందజేసి మొదటి తరగతి రైలు పెట్టెలో అమ్మమ్మను ఎక్కించుకొని ఉద్యోగానికి బస్తీకి వెడుతున్నాడు తను. మందమందంగా రైలుబండి కిటికీలతోనుండి సమీరుడు లోని ప్రయాణికులకు పంకా వేస్తున్నాడు. అమ్మమ్మ దేవతలాంటి మనిషి. అమ్మమ్మ లేకుంటే తనింతటివా డయ్యేవాడు కాడు, అన్న భావన తన కానాడే కలిగింది. అందుకే అమ్మమ్మను పూవుల్లో పెట్టి పూజించాలని తనప్పుడప్పుడూ అనుకునేవాడు.

బస్తీలో ఉన్నత పాఠశాలలో ఉద్యోగం బాగానే ఉంది. తోడి పంతుళ్ళ సౌభ్రాతృత్వంతో, ప్రధానోపాధ్యాయుల ప్రసన్న హృదయంతో తన నిరంతర దీక్షాబద్ధమైన బోధనాపటిమతో ఖ్యాతి సంపాదించడానికి ఎంతో కాలం పట్టలేదు తనకు. ఎస్. ఎస్. ఎల్. సి. లో దాదాపు ముప్పైరెండుమంది విద్యార్థులు, ఎనమండ్రుగురు విద్యార్థినులు ఉన్నారు. అందు నీరజ అనే అమ్మాయి సైన్సు పాఠాల్లో వీక్‌గా ఉండడం తను గమనించాడు. ఏలనో తన హృదాంతరాళంలో తనకు తెలీకనే మమత ప్రభవించి తాను ఆమెపట్ల ఆప్యాయతతో నడుచుకొనేవాడు. సైన్సు పాఠాల్లో తాను స్పెషల్ కోచింగ్ యిస్తానని, యింటికి వచ్చి నేర్చుకోమని చెప్పాడు నీరజకు. సమీపించే పరీక్షా సంద్రంలో తెప్పలా దొరికాడు కృష్ణమూర్తి అనుకొన్నది నీరజ!

నీరజ వదనము వేయిరేకులు విరియించిన, మిత్రునివైపు నిరీక్షించే నీరజమే!....శరీరంలోని దేహకాంతి....నిగ్గు లీని, ఆమె అవయవాలలో ప్రతిఫలించి సౌదామినీగాత్రిగా ఆమె తనువును మార్చివేసింది. ఆమెకు విజ్ఞాన శాస్త్రంలో పాఠాలిస్తూ, ప్రేమ పాఠాలు ఆమెకి వల్లించాలనుకొన్నాడు తను. నీరజ అప్పుడప్పుడూ అమ్మమ్మకు తాను వలదన్నా, విరామం కలిగినప్పుడల్లా పనిపాటల్లో సాయపడి వెళుతూండేది. పరీక్షలు ముగిసినై. బాగా వ్రాశానని తృప్తిపడింది నీరజ.

ఆనాడు తన్ను సమీపించి "మీ ఋణం ఎలా తీర్చుకోగలను పంతులుగారూ!" అంటుంటే తను ఆమె చేలాంచలాన్ని పట్టుకొని చేరువకు తీసుకొన్నాడు.

"నీ—ర—జా! నిన్ను ప్రేమిస్తున్నాను.నా జీవితం అంధకారబంధురం చేయకు"అన్నాడు డగ్గుత్తికతో తను. నిశ్శబ్దం తాండవించింది యిరువురి మధ్య.

తనో మాతృవిహీన, దీన అయిన ఒక అభాగిని. ఏకైక పుత్రిక ఐన తనకై తన తండ్రి వేయికండ్లతో నిరీక్షిస్తూంటాడని, అతని సంకల్పానికి వ్యతిరేకంగా నడచుకోడం తన కిష్టంలేదని, కానీ, తన మాటను నిరాదరించే కఠినుడు మాత్రం తన తండ్రి కాదని ఆమె చెప్పింది.

ఆ మాటల్నిబట్టి ఆమె హృదయం తనతో లంకె పడ్డదని తా నానాడు గ్రహించాడు. పరీక్షలు ముగిసినా, రోజూ సాయంత్రం నీరజ తన గృహానికి రావడం తనకూ ఉల్లాసాన్ని కలిగించేది. ఒకనాటి సాయంకాలం నీరజతో తాను యింటి వెనుక వరండాలో ఉండగా వీధి గుమ్మంలోనుండి ఒకతను లోపల ప్రవేశించడం లీలామాత్రంగా కిటికీ వూచలలోనుండి కనిపించింది. ఆ ఆగంతకుడు అమ్మమ్మను జూచి బావురుమన్నాడు. తన భార్య మరణించిందని, తన పుత్రిక నీరజ యిక్కడ చదువుతూందని, అమ్మమ్మతో యేమేమో చెబుతూన్నాడు. నీరజ ఆతురతతో లోనికి పోబోవ తాను వారించాడు.

"ఏరా ఆనందం! గడచిందేవో గడచింది. అబ్బాయి కృష్ణుడు ఉన్నత పాఠశాలలో పంతులుగా ఉంటున్నాడు. నీ కుమార్తె నీరజను....''అని అర్ధాంతరంలో ఆగింది అమ్మమ్మ. "అంతకంటే కావలసిం దేమిటమ్మా, నాకు. అపుత్రకుడైన నా యావదాస్తీ ఆమె కరణంగా యిచ్చి కృష్ణమూర్తికి వివాహం చేస్తాను.కానీ కృష్ణమూర్తి తన్ను క్షమిస్తాడా?''అని అమ్మమ్మతో అంటున్నాడు.

సాయంకాలం తూర్పుకొండపై నిండు చంద్రుడు ప్రభవించాడు. శరజ్యోత్స్నలో నీరజ మెరిసిపోతోంది. కృష్ణమూర్తి అమె చేతిని సున్నితంగా లాగి, మృదువుగా అమె చెక్కిళ్ళపై చుంబించాడు.

హాలాహలంలాంటి అత్తయ్యలోనుండి ఎలా ప్రభవించిందీ నీరజ అనే అమృత భాండం! అత్తయ్య పోలికలు గుణాల్లో గాని, రూపంలోగాని మచ్చుకైనా లే వీ నీరజలో అనుకొన్నాడు తను. మామయ్య వరాండాలోనికి రావడంతో స్తబ్ధులై నిలుచున్న నీరజను, తనను చూచిన మామయ్య ముఖారవిందంలో వో మందహాసరేఖ కందళించింది.

ప్రక్కయింటి గదిలో విద్యార్థి కాబోలు ''ఎంగిలి చోట సువర్ణ మబ్బినన్ తక్కక పెన్విషంబున సుధారస ముండిన గ్రాహ్యమంద్రు'' అని కంఠస్థ పద్యం కలకంఠంతో వల్లించుకపోతూన్న సవ్వడి గాలిలో లీలామాత్రంగా వినిపిస్తోంది. ఆనాటి మధుర సంఘటన లెన్నో యింకా కృష్ణమూర్తిగారి భావాంబర వీధిలో లీలామాత్రంగా యిలా మెదిలిపోతూంటాయ్.

ఆకలిగొని వచ్చిన శంకరం ఆకుముందు కూర్చోబోయి ఆగిపోయాడు. పీటమీద అడుగువేసిన అతనికి ఎదురుగా పరచిన అరిటాకు తెరచిన విషాద గహ్వరంలా కనిపించింది. భయంకర బీభత్స విచార భావ కెరట మొక్కటి అతని హృదయ సముద్రంలో ఉవ్వెత్తున లేచింది. అంతే! నిర్విణ్ణుడై అలాగే నిల్చుండిపోయాడు.

వంట గదిలోంచి కూరలతో వచ్చిన అన్నపూర్ణ భర్త భంగిమను చూస్తూ గతుక్కుమంది. భర్తను సమీపించింది మెల్లగా. కాని అతడు గమనించలేదు.

"ఏమండీ, ఏం జరిగింది?"- ఆప్యాయంగా అడిగిందామె. ఆ కంఠ స్వరం విని ఈ లోకానికి దిగివచ్చాడు శంకరం.

"అన్నపూర్ణా!"- బరువైన నిట్టూర్పుతో పెనవేసుకొని బయటికొచ్చిన ఆ పిలుపు అనంతమైన అగాధాలనుండి పైకి వచ్చినట్లుంది. అలాంటి పిలుపు ఆమె భర్తనుండి వినటం అదే మొదటిసారి, ఆందోళనను అణచుకోటానికి విశ్వప్రయత్నం చేస్తూ అన్నపూర్ణ అన్నది—

"భోజనం కానివ్వండి."- లాలింపు వినిపించాలనుకొన్న మాటలో ఆమె ఆవేదన చూచాయగా తెలియవచ్చింది.

"అరిటాకు వద్దు....అన్నపూర్ణా!"- మరేమీ చెప్పలేక పోయాడు శంకరం. అంతకంటే అక్కడ ఆగలేక పోయాడు. చరచరా బయటికి వెళ్ళిపోయాడు.

అన్నపూర్ణకు అతని ప్రవర్తన అర్థం కాలేదు. ఆమె కాపురానికొచ్చి ఏడాది కావస్తోంది. ఏనాడు మగని మొగములో విచారరేఖ తాను చూడలేదు. ఎప్పుడు నవ్వుతూ నవ్విస్తూ ఉండే భర్తలో ఈ మార్పు! దీనికి కారణమేమో ఆమెకు అంతు చిక్కలేదు. గదంతా పరికించి చూచింది. ఎప్పటిలాగే ఉంది. గదిలోనికి మరెవ్వరు వచ్చిన జాడకూడా లేదు. తినడానికి కాలుసేతులు కడుక్కొనివచ్చి - ఇంతలోనే ఇలా వెళ్ళిపోవడానికి కారణ మేమిటో?....

పీటముందు అరిటాకు బోసిపోయి నవ్వినట్లుంది. గ్లాసులోని నీళ్ళు నిర్మలత్వానికి ప్రతిబింబంగా ఉన్నాయి. అన్నపూర్ణ అన్నంమీద, కూరలమీద మూతలుంచి భర్తవెంటనే వెళ్ళింది.

ఇంటిముందు మానుమల్లె చెట్టు. చెట్టుకింద పచ్చని పచ్చిక. పచ్చికమీద కూర్చుని శంకరం! రెండు మోకాళ్ళమీద తలవాల్చి, చేతులతో రెండు కాళ్ళను చుట్టి, ముద్దగా ముడుచుకుపోయి కూర్చున్నాడు. తన ముఖంలోని విషాద మేఘాలు నవనవలాడే నవమి చంద్రుని ఆవరించకూడ దన్నట్లుగా అతడు ముఖాన్ని మరీ మోకాళ్ళమధ్య యిరికించుకున్నాడు. అన్నపూర్ణ భర్త దగ్గరగా వచ్చింది.

లోకుల హృదయ భారాన్నంతటినీ మోస్తున్నదేమో గాలి కదల లేకుండా వుంది. తన సరసనే వున్న అందాల చందమామ సందిట్లోకి చేరుకో లేక తార మినుకు మినుకుమంటూ చింతపడుతోంది. ప్రియురాలి దైన్యాన్ని చూచి జాబిల్లి ముఖంకూడా చిన్నబుచ్చుకున్నాడు.

కొద్దిపాటి ఆ వెలుగులో అన్నపూర్ణకు భర్త ముద్దకట్టిన దుఃఖంలా కనిపించాడు. నిలువలేక అతనిప్రక్కనే కూర్చుంది. ఆమె మాట్లాడలేదు. తన మాటలతో భర్త మనసు మరింత మధన పడునేమో అని ఆమె భయ పడింది. అందుకే ఆమెకు మాటలు రాలేదు.

భయంకరమైన నిశ్శబ్దము ప్రకృతిపై పెత్తనం చేస్తున్నది. దీనినామె భరించలేక పోయింది. తామరతూండ్లవంటి తన చేతివ్రేళ్ళతో మృదువుగా భర్త పాదాలను తాకింది. చల్లని ఆ స్పర్శకు శంకరానికి చలనం కల్గింది. తల పైకెత్తి చూచాడు. భర్త కనుగొలకుల్లో కన్నీటికణాలు! కపోలాలపై అశ్రుధారల చారలు!

చలించింది అన్నపూర్ణ! మూగగా, ప్రేమగా, లాలనగా భర్త ముఖాన్ని తన రెండుచేతులతో పట్టుకొని, వంగి, అతని కన్నులలోకి క్షణంసేపు చూసింది. ఆ అగాధాలలో ఏ గాధల బాధలు చదువుకొందో - విలవిలలాడి పోయిందామె. భర్త ఒడిలోనికి మౌనంగా ఒదిగిపోయింది.

"అన్నపూర్ణా!" - అదే బాధ....అదే వేదన....అదే కంఠస్వరం!.... ఆమె గుండె భయంతో, బాధతో వేగంగా కొట్టుకుంది. భర్త యింత యిదిగా బాధ పడటానికి ఆస్కార మేమిటో ఆవగింజంతయినా ఆమెకు బోధపడలేదు. అతని కింత వ్యధను కల్గించిన దుస్సంఘటన యేదో?....అతన్ని అనునయించడం ఎలాగో?....తనకు మాటలు పెగలటం లేదు. గుండె గొంతులో కొట్లాడుతూంది.

"ఏమండి....ఏడుస్తున్నారా?"....చివరికి సాహసించింది.

"లేదు....లేదు పూర్ణా!"....

ఆమె ప్రక్కకు జరిగింది. భర్తముఖం చూచింది. అదే వేదన! సుకుమారమైన చేతులోకి కోమలంగా భర్త చేతులను తీసుకొంటూ అందామె—"మీ రెందుకో బాధపడుతున్నారు. నే నేమయినా తప్పు చేశానా?"

"లేదు....లేదు....నీవుకాదు పూర్ణా....నేనే చేశాను తప్పు; ఇన్నాళ్లు నీకు చెప్పకుండా...." ఆగిపోయాడు శంకరం.

"ఏమిటండీ,....నాతో చెప్పకూడదా ?"....ఆ స్వరంలో లాలన.

"కాదు....నీతో చెప్పకూడనిది కాదు....కానీ, ఎలా చెప్పాలో తెలియక...." ఆ స్వరంలో వేదన!

"పోనీండి....మీ బాధను మరచిపొండి...."

"మరువలే నన్నపూర్ణా .... మరచిపోలేను. పశ్చాత్తాపంతో నలిగిపోతున్న నా హృదయాన్ని ఆత్మీయులకైనా విప్పి చూపితే ఆవేదన కొంత అయినా తగ్గునేమో....కాని....ఎలా....ఎలా విప్పి చూపగలను?....నా ఆవేదనను అర్థం చేసుకోగల వా ళ్కెంద రుంటారు?...." శంకరం మూగబోయాడు మరి మాట్లాడలేక.

"వద్దు....మీరేమీ చెప్పవద్దండి....మరచిపొండి. లేచి పదండి, భోంచేద్దురుగాని. వేసిన ఆకు వేసినట్లే...."

"అన్నపూర్ణా!...." ఆమె మాటలను మింగేస్తున్నట్లుగా అరచాడు శంకరం. గాఢంగా గాలి పీల్చి వదలాడు.

"అదిగో....ఆ మాట ఆ సంఘటనను నా కన్నులముందు నాట్యం చేయిస్తుంది. అది గుర్తుకువస్తే నా మదిలో విషాదాగ్ని రగులుకొని పొగలు చిమ్ముతుంది. నా హృదయ మొక కుంపటియై పోతుంది."....శంకరం గాలి గాఢంగా పీల్చి బరువుగా వదిలాడు. మళ్ళీ ప్రారంభించాడు...."అన్నపూర్ణా! నీవు కాపురానికి రాకముందు...."

"వద్దండి. మీరేమి చెప్పకండి. మీరు మరచిపొండి—" ఆమె గొంతు ఆత్రుతతో, ఆందోళనతో అదోలా ధ్వనించింది. ఆమె సుడిగాలికి అల్లాడిన మామిడి చిగురే అయింది. అదిరే గుండెతో, తడబడే కాళ్ళతో ఆమె అక్కడ నుండి తప్పుకోవాలని లేవబోయింది.

శంకరం ఆమెను లేవనీయలేదు. గట్టిగా భుజాలనుపట్టి దగ్గరకు లాక్కున్నాడు. పట్టుదప్పిన ఆమె అతని గుండెపై వాలిపోయింది. ఆమె గుండెతో అతనిగుండె కలిసిపోయింది. ఎదలోని వేదన పంచుకొనే మరొక యెద దగ్గరుంది. బరువు దింపినట్లయింది శంకరానికి.

"అన్నపూర్ణా! నా హృదయ భారాన్ని పంచుకొనే ఆత్మీయులు నీకంటే నా కెవ్వరు?....కడుపులోని ఆరాటాన్ని నీ ముందు నివేదిస్తాను. నీ సానుభూతితో కొంతయినా ఊరట పొందుతాను—" అంటూంటే అతని మనస్సు రెండేళ్ళు వెనక్కి పరుగెత్తింది.

"అప్పుడు నేను ప్రాథమిక పాఠశాలలో ఏకోపాధ్యాయుణ్ని. బడి ఇంటిప్రక్కనే. వేళకు బడి - పిల్లలతో రాపిడి - అదే నా రాబడి! సుమారు నలభై అమాయిక శిశుహృదయాలతో ఆడుకుంటూ, పలుక నేర్వని పసివారి పసిడి హృదయతంత్రులు మీటి పాడుకుంటూ, విభిన్నమైన మనస్సులకు క్రమశిక్షణను నేర్పటానికి ప్రయత్నిస్తూ పనిచేస్తున్నాను. మొగ్గవంటి హృదయాలతో - ముద్దు ముద్దు మాటలతో - మురిపాల సిరులతో ముగ్ధుల్నిచేసే మోహనమూర్తులమధ్య ప్రొద్దుపోవడమే తెలిసేది కాదు. ఆ జీవిత మెంత ధన్యమైంది!...." లిప్తకాలం విశ్రాంతికో అన్నట్లు ఆగి ఊపిరి పీల్చుకున్నాడు

శంకరం. ఆనాటి మధుర స్మృతు లేవో అతని శరీరాన్ని పులకింపచేసిన లక్ష ణాలు ఆమె దేహానిక్కూడా ప్రాకాయి. మౌనంగా వింటూంది ఆమె.

'కిష్టుడు ఐదవ తరగతిలో చదువుతూండేవాడు. ఎంత తెలివైన వాడో అంత మంచివాడు. చదువులో చురుగ్గా, క్రమశిక్షణలో మెరుగ్గా వుండే వాడు. వాడిమీద నాకు ప్రత్యేకమైన మక్కువ ఏర్పడటానికి అది కారణ మైంది. వాడంటే నా కొక అప్యాయత. అవ్యక్తమైన అనురాగము. క్రమంగా అది ఒక బంధమైంది. కిష్టుడుకూడా అందుకు తగట్టే మసలుకొనేవాడు. ఆ ప్రేమబంధాన్ని మరింత దృఢం చేశాడు. నన్ను విడిచి ఒక్క క్షణం వాడు గడపలేడు. బడి వదిలినా వాడు నన్ను వదలడు. నాతోనే ఇంటికి వచ్చేవాడు. పాఠాలు చదువుకొనేవాడు. తెలియని పాఠాలు అడిగి చెప్పించుకొనేవాడు. మధ్య మధ్య అమ్మకు సాయపడుతుండేవాడు. అంగడి వస్తువులు తేవాలన్నా, అటకనెక్కి ఏ వస్తువునైనా దింపాలన్నా కిష్టుడే! వాడికీ నాకూ మాత్రమే కాకుండా- వాడికి మన యింటికీ కూడా అవినాభావ సంబంధము పెనవేసుకు పోయింది....

"బడికి వస్తూనే కిష్టుడు రిజిష్టరు, సుద్దముక్క, డష్టరు తెచ్చి బల్లమీద పెట్టేవాడు. కుర్చీన్ని, బల్లను బాగా తుడిచి శుభ్రం చేసేవాడు. ఒకనాటికి వాడు బడికి రాకుంటే నా కొక చేయి విరిగిపోయినంత అవస్థ ఫీలయ్యేవాణ్ణి.

"ఒకరోజు కిష్టుడు బడికి రాలేదు. కారణం తెలీదు. ఉదయం బడి విడిచి పెట్టి సరాసరి కిష్టుడి ఇంటికే వెళ్ళాను నేను. అరుగుమీద కూర్చొని పాఠం వ్రాసుకొంటున్నాడు కిష్టుడు. నన్ను చూడగానే పరుగెత్తి లోపలికెళ్ళి చాప తెచ్చి అరుగుమీద వేశాడు. 'ఏరా, ఇవాళ బడికెందుకు రాలేదు.?'- కూర్చుంటూ అడిగాను. వాడు బదులేమీ చెప్పలేదు. చూస్తే బిడియపడ్తూన్నట్లుంది. కను రెప్పలు రెపరెప కొట్టుకున్నాయి. అవి వాని మనసును వ్యక్తం చేస్తున్నాయి. అమాయికమైన వాని కన్నులు- అవే నాకు వాణ్ణి మరీ దగ్గరచేశాయి. 'చొక్కా లేదని బడికి రాకుండా నిల్చిపోయాడు నాయనా! ఉన్నపళంగా ఎక్కడి నుంచొస్తాయి చెప్పు చొక్కాలు?' అప్పుడే బఱ్ఱెను పట్టుకొని ఇంటికొచ్చిన వాళ్ళమ్మ చెప్పింది. నెత్తిమీదున్న పచ్చిక మోపును గాటిలోవేసి గేదెను కట్టి

వేసింది. పెరట్లో కెళ్ళి ముఖము, కాళ్ళు కడుక్కొని పైటచెంగుతో తుడుచు కుంటూ 'దాహం తీసుకొన్నావా నాయనా?' అంటూ లోనికి వెళ్ళిందామె.

"నే నదేమీ వినేస్థితిలో లేను. కిష్టుడికి చొక్కాలు కూడా తగినన్ని లేనంత బీదరికమా! ఆలోచనతో అదిరిపడ్డాను నేను. 'మజ్జిగ తాగు నాయనా! అంటూ ఆమె అరుస్తున్నా లేచి వచ్చేశాను. మరునాడు రెండు చొక్కాలు, నిక్కర్లు తీసుకొని నేనే వెళ్ళి ఇచ్చాను. వద్దనేందుకు ధైర్యంలేక కిష్టుడు తీసుకుంటూంటే- వాడి అమ్మ కన్నులు వర్షించాయి. బిచ్చం పుచ్చుకోవలసి వచ్చిందన్న అవమానంతోనో, కొండంత అండ దొరికిందనే ఆహ్లాదంతోనో నాకు అర్థంకాలేదు పూర్ణా!"—ఆగాడు శంకరం. ఆమె అతని చేతులనుండి జరిగి ప్రక్కగా కూర్చుంది. భర్త ముఖంకేసి చూస్తూండి పోయింది.

"ఒకనాడు బడికి వెళ్ళేటప్పటికి పిల్లల్లో ఏదో ఉత్సాహము పరవళ్ళు తొక్కుతూంది. కారణం నాకు వెంటనే తెలిసింది. కిష్టు డెక్కడివో అరటి పిల్లలు తెచ్చాడు. బడితోటలో అరటిచెట్టు లేని కొరత తీరుస్తున్నాడు వాడు. వాటిని తొందరగా నాటి, మరీ తొందరగా పెంచి పెద్ద చేద్దామనే ఉబలాటమే పిల్లల్నింత ఉత్సాహవంతుల్ని చేసింది. 'మూడు అరటి పిలకలు తెచ్చినాను సార్! మన బడితోటలో నాటుతాము సార్!'- ఆశగా, బిడియంగా, గోముగా అడిగాడు కిష్టుడు. చేరెడేసి కన్నుల్లో ముగ్ధత్వం నన్ను మురిపించింది. వాడి కళ్ళముందు అరటి చెట్లతో కళకళలాడే తోట నందన వనమై నాట్యం చేస్తున్న దేమో—ఆ కన్నుల్లో ఓ విధమైన కాంతి. క్షణంసేపు ఆనందించాను నేను. తర్వాత అన్నాను: 'ఉన్న తోటకే నీళ్ళుతెచ్చి పోయటం కష్టంగా ఉంటే- మళ్ళీ అరటి మొక్క లెందుకురా? వీటికి సంవత్సరమంతా నీళ్ళుండాలి. ఎండ కాలంలో దూరం నుండి నీళ్ళు తేవటం చాలా కష్టం. వద్దులే'—'కష్టమైనా మేం పోస్తాము సార్'- నసిగాడు కిష్టుడు. వాడి గొంతును అనుసరిస్తూ అందరి గొంతులు కలిశాయి. కిష్టుడి తృప్తి వాని కన్నుల్లో ప్రతిఫలించింది. 'సరే' అన్నాను నేను. 'మొక్కలు వాడిపోకుండా ఇప్పుడే నాటేస్తాము సార్' అన్నాడు కిష్టుడు. 'ఊ- కానీండ'న్నాను నేను.

"మెరుపు మెరిసినట్లు గంతేశాడు కిష్టుడు. పెద్ద పిల్లలకంతా తలకొక పనీ పురమాయించి తోటలోకి వెళ్ళిపోయాడు. గంటసేపు చిన్నపిల్లలకు పాఠాలు వ్రాసిచ్చి, వాళ్ళచేత వ్రాయించి చూచి, లెక్కలు చేయమని చెప్పి తోటలోకి వెళ్ళాను. ఆశ్చర్యపోయాను. అప్పటికే మూడు గోతులు లోడి పెట్టారు. ఐదారుగంపల వాలెరువు తెచ్చారు. రెండు మూడు వీశెల శెనగ పిండి సేకరించి పెట్టారు. కొంత యూరియా కూడా తెచ్చారెవరో. నేనీ పని చేశాను, నేనిది తెచ్చాను, వాడది చేశాడంటూ పిల్లలు నాకు వివరిస్తు న్నారు. ఈలోగా నలుగురి పిల్లలతో నీళ్ళు పట్టించుకుని కిష్టుడొచ్చాడు. బాల్యోత్సాహాన్ని, వారిలోని చురుకుదనాన్ని, శక్తిని చూచి గర్విస్తున్నాను. పులకరిస్తున్నాను. పరవశించిపోతున్నాను. ఈ శక్తిని—ఇదే అద్వితీయమైన అనంతమైన అకుంఠితమైన శక్తిని—ఒకే త్రాటిమీద—ఒకే మార్గంలో నడిపిస్తే జాతి సాధించని దేముంటుంది? అట్టి నీతిని వీరిలో తరిగిపోకుండా ఉండేట్లు నేను ఉపాధ్యాయుడుగా బాధ్యత వహించాలి. నేటి పూతలు—రేపటి నేతలు కావాలి. ఈ శక్తి దేశానికి ఉపయోగపడేటట్లు చేయాలి. ఇలా కోటి ఆలోచనలు నాలో రేపిన పిల్లల ఉత్సాహం పెద్దలైన తర్వాత కూడా శాశ్వతం గావాలి.

"సరైన పద్ధతిలో అరటి మొక్కలు నాటించాను. దిన దినానికి మొక్కల్లో పెరుగుదల చూస్తుంటే పిల్లలు పండుగలా భావిస్తున్నారు. వారి ఉత్సాహాన్ని చూసి నాక్కూడా అరటి మొక్కలమీద చెప్పరాని భావమేదో తీయగా కలగనారంభించింది.

"అరటి మొక్కలు మారాకులు వేస్తున్నాయి. కిష్టుడికా చెట్లను కంటికి రెప్పలా కాపాడటమే పని. మొక్కలకు ప్రోది చేసి, సత్తువ పెట్టి నీరు పారించి పెంచటంలో ఎంత ఆనందం! ఆ సంబరంలో పిల్లలు అంబరంలో విహరించేవారు.

"మొక్కలు ఏపుగా పెరుగుతున్నాయి. అంతకు రెట్టింపుగా వాటిపై మమకారం ఎదుగుతూంది మాకు. అది ఎంతవరకు ఎదిగిందంటే- వాటిపై ఈగ వాలితే కూడా చూపి సహించలేనంతగా! 'ఎవ్వరుగాని అరిటాకు కోయ

రాదు. ఎవ్వరికైనా సరే కోసివ్వకూడదు. అసలు ఆకును చింపనుకూడ చింప కూడదు. ఇలాగే కాపాడాలి'- ఇది నేను పిల్లలకు జారీచేసిన సుగ్రీవాజ్ఞ. అందుకందరు ఏకగ్రీవంగా సంతోషించి అలాగే కాపాడుతూ వస్తున్నారు.

"బడికి వెళ్తూనే అరటి మొక్కల పరామర్శించుట మొదటి పని. ప్రతి చెట్టులోను ఎన్ని ఆకులున్నాయో- నాకేకాదు బడిపిల్లలకందరికీ తెలుసు. ప్రత్యేకంగా కిష్టుడు వాటిని పసిబిడ్డల్లా చేసి పదిలంగా సాకుతున్నాడు. చదువుకునే కాలం తప్ప మిగిలిన కాలమంతా వాడికి వాటితోడిదే లోకమైంది.

"అరటి చెట్లపై యింత అనురాగమూ,ఆప్యాయతా ఎందుకనుకోవచ్చు. అలా వుండకపోతే ఊళ్ళో ఎవరుబడితే వాళ్ళు ఆకులు కోసేస్తారు. బడి గ్రామస్థులకు పొదుపైన ఆస్తి అని అందరు భావిస్తారు. అభివృద్ధి విషయంలో అలా అనుకోరుగాని అనుభవించటానికి మాత్రం లేచి కూచుంటారు. అందుకే మాకీ అప్రమత్తత, అత్యంత శ్రద్ధాను!

"సుడి ఆకు విడిగితే చాలు- పిల్లలు గంతులేసేవాళ్ళు. ఎవరికి వారు ముందుకు చొచ్చుకొని వచ్చి నాకావార్త అందజేసేవాళ్ళు. ఒక మనిషి హాయిగా పడుకో గలిగినంత నిడివీ, ఎడమూ గల ఆకులను చూచి ఆనందం అర్ణవమై పొంగిపొర్లేది. మా ప్రేమకెత్తిన విజయధ్వజాల్లా ఉల్లాసంగా గాలిలో విహరిస్తున్న వాటిని చూసి గర్వము, పరవశము పెనగులాడేది.

" 'చూడవోయ్, నాదముని! మా కల్పవృక్షాలను. ఇంత ఏపుగా ఎవరైనా పెంచగలరంటావా?'- బడిలోని కొచ్చిన మిత్రుణ్ణిచూపి చెట్లను చూపుతూ అనేవాణ్ణి. 'ఆహా! చాలా బాగున్నాయి. చుట్టాలొచ్చిననాటికి మాంచి గిరాకీ పెరుగుతాది లేవోయ్'- ఉడికిస్తూ అనేవాడు నాదముని. కవ్వించటాని కంటున్నాడని తెలిసికూడా కసురుకొనేవాణ్ణి నేను. 'మా అరటిచెట్ల చాయలక్కూడా రావాటానికి వీల్లేదోయ్! ఆకులు కోయటం కాదుగదా- వాటిని తాకినా మా పిల్లలూరుకోరు, అంతు తేల్చేస్తారు'....ఉద్రేకం నా మాటల్లో తొంగిచూడటం విని నవ్వుకొనేవాడు. అపరిమితమైన అనురాగాన్ని అర్థంచేసుకోనట్లుగానో, అపహాస్యం చేస్తూన్నట్లుగానో ఉండేదా నవ్వు. ఇలా నవమాసాలు దొర్లిపోయాయి. అన్నపూర్ణా!"....ఆగిపోయి అర్ధాంగి చేతులను మెల్లగా తాకుతూ-

గాలి దీర్ఘంగా వదిలాడు శంకరం. అతని ముఖంలో ముసురుకొంటూన్న విషాద మేఘాలను ఆమె చూచింది. ఆమె ముఖ చంద్ర బింబము భయంతో ముడుచుకు పోయింది.

"చూసినవారంతా యిక ఒక నెలలో అరటిచెట్లు మొగ్గలు వేయ గలవని చెప్తున్నారు. ఆ శుభగడియకోసం అర్రులు చాచుకొని చూస్తు న్నాము. మొగ్గ తొడిగాయో లేదోనని గంటకోసారి చూట్టం అనే ఆత్రుతను అణచుకోలేక పోయాము, నేనూ పిల్లలూ కూడా! ఎందుకో తను పెంచిన వాటిపై మనిషికింత మమత!

"అన్నపూర్ణా!"....ఆగి శక్తిని కూడదీసుకున్నాడు శంకరం.... "ఆ రోజు నా కెప్పటికీ గుర్తుంటుంది....ఆ రోజు మామూలుగా అరటి మొగ్గల దర్శనమవుతుందేమోనన్న ఆతురత నా కంటె ముందు పోగా.... బడికి వెళ్ళాను. వెళ్తూనే తలెత్తి అరటి చెట్లను మార్చి మార్చి చూశాను. నా చూపులు ఒక చెట్టుదగ్గర ఆగిపోయాయి. కన్నుల రెప్పలు కదలలేదు. పెదాలు వణక నారంభించాయి! ఆనందంతో కాదు....ఆవేశంతో అన్నపూర్ణా! విజయ పతాకవంటి ఆ చెట్టు సుడి ఆకు విరిగిపోయింది. మొదటికి కోసుకొని పోబడింది! నా హృదయాన్ని అంపంతో కరకరకోసినట్లయింది. నోటమాట పెగిలిరాలేదు. 'ఎవరీ ఘోరం చేసింది?'- పెదిమలు కదిలాయి. పిల్లలు భయ పడి వెనక్కి వెళ్ళారు. గొణుక్కుంటూన్నట్లుగా అంటున్నాడు- 'ఆకును కిష్టుడు కోశాడు సార్!'....

"నా చెవులను నేనే నమ్మలేదు. ఎదురుగా కిష్టుడు గజగజ వణికి పోతున్నాడు. నా కన్నులు నిప్పుకణిక లయ్యాయి. 'అవునా, నువ్వు కోశావా?'—సింహగర్జనకు లేడిపిల్ల భయపడి సుళ్ళు తిరిగిపోయింది. విపరీత మైన భయంతో వాడి కనురెప్పలు వానకు తడిసిన పిట్ట రెక్కల్లా టపటప కొట్టుకున్నాయి. నా కోపానికి కట్టలు లేకపోయాయి. ప్రక్కనే ఉన్న వెదురు కంప చేతికందింది. నన్ను నేను మరచిపోయాను. శివమెత్తినట్లయింది నాకు. శక్తికొద్దీ వాణ్ణి బాదాను. వాడు క్రిందపడిపోయేవరకు నాకు తెలివి రాలే దన్న పూర్ణా!...." శంకరం కన్నులనుండి జారిన అశ్రుబిందువులు జలజల ఆమె

పాపిటలో పడినాయి. తలయెత్తిన ఆమె భర్త కన్నుల్లో రెండు నయాగరాలను సందర్శించింది. సుకుమారము, కోమలము అయిన తన చేతివేళ్ళతో ఆ జల పాతాలకు ఆనకట్టలు కట్టాలని ప్రయత్నించే సాహసం ఆమె చేయలేక పోయింది.

"కోపమెంత పనియైనా చేయిస్తుం దన్నపూర్ణా! దానికి మంచి చెడ్డలు మనసు కెక్కవు...." అతని కంఠనాళం బొంగురు పోయింది మళ్ళీ. "క్రింద పడిన కిష్టణ్ణి నేనే పైకి లేపాను...."రుద్ధమై పోయిన గొంతు అస్వాధీనము కాగా అతడు బావురుమన్నాడు. విచలిత మానసయై వెర్రిగా భర్తవైపు చూచింది.

"ముళ్ళకంప వాడి శరీరాన్ని చీకివేసింది. రక్తం కారిపోతున్నది. పగ్గాలు విప్పుకొన్న పాశవికత, అదుపు తప్పిన ఆవేశము....లొంగి వచ్చాక నాకు తెలిసివచ్చింది. నేనెంత ఘోరం చేశానో.... నేరం చేశానో!.... కాని....మనిషికి ఏది ప్రధానమో, ఇన్నాళ్ళూ మురిపాల మోహంలో నన్నేది ముంచి తేల్చుతూండేదో....ఆ కన్ను....కిష్టుడి కన్ను పూర్తిగా నలిగిపోయిం దన్నపూర్ణా!...." వెక్కి వెక్కి ఏడుస్తున్న శంకరం అన్నపూర్ణ గుండెలో తలదాచుకొన్నాడు. అనునయించే శక్తి ఆమె జ్ఞానానికి లేదు. భర్త వీపుపై ఒరిగిపోయి కరిగిపోయింది.

"ఆస్పత్రిలో కిష్టుడి కన్ను తీసివేశారు....వాడి గాయాలు మాని పోయాయి. కాని....నా గుండెలో తగిలిన గాయం మానలేదు. దానిని మాన్పే మందులు లేవు....అన్నపూర్ణా! ఎవడు నా కత్యంత ప్రేమపాత్రుడో, ఎవని కన్నుల్లో వేయి వెన్నెలలను చూచి ఆనందించానో....ఆ కిష్టుడిప్పుడు ఏకాక్షి!....పగ నెరుగని పల్లెటూరి ప్రజలు నన్ను క్షమించారు. అమాయికు డైన కిష్టుడి జీవితాన్ని శాశ్వతంగా దుర్భరం చేసి, శాశ్వతంగా పాపినై పోయాను నేను. ఎన్ని గంగలైనా నా పాపాన్ని క్షాళితం చేయలేవు...." అతని స్వరం ఆగిపోయింది. వణకుతున్న చేతులు భార్యపాదాలపై అర్థ రహితంగా తారట్లాడాయి. ఆమె పాదాలు వెనక్కు లాక్కొంది. పైకి తలెత్తి భర్తనడిగింది.

"ఇంతకు కిష్టుడు అరిటాకు నెందుక్కోకాకండి?"

తల లేపి భార్యను చూచి అంతలోనే చూపులు మళ్ళించుకున్నాడు శంకరం.... "మీ అమ్మా,నాన్నా నీ వివాహప్రసంగాలకై మా యింటికొచ్చారు. సమయాని కింటిలో ఆకుల్లేకుంటే ...అమ్మ కిష్టుణ్ని ఆకులు తెమ్మంది. అమ్మ ఆజ్ఞతోను, గురువుకు కాబోయే అత్త మామలకు మర్యాద బాగా చేయాలనే తొందరతోను వాడా ఆకును కోశాడు. కారణం తెలిసికోకుండా-క్రోధంతో కన్నులు మూసుకుపోగా, వాని కన్ను తెరవకుండా మూసివేశాను. అన్నపూర్ణా! ఆనాటినుండి అరిటాకును చూస్తే కిష్టుడు గుర్తుకొస్తాడు. ఒంటికంటితో....జాలిగా....మూగగా....అమాయికంగా....అదో మాదిరిగా నన్ను చూస్తాడు. నేను భరించలేనా స్మృతిని! అందుకే ఆ వుద్యోగం వదిలి పెట్టాను. గుమాస్తాగా చేరాను. అన్నపూర్ణా!....ఒక వస్తువును విపరీతంగా ప్రేమించినందువల్ల, క్షణమాత్రం నిగ్రహం లేనందువల్ల....శాశ్వతమైన నేరం చేశాను. జీవితాంతము పశ్చాత్తాపంతో పరితపిస్తున్నాను. ఈ పరితాపము నా పాలిటి శాపము....అంతే....అంతే అన్నపూర్ణా!...."

విషాదగాధను ముగించాడు శంకరం! ముఖాన్ని ఆమె గుండెలో దూర్చి కన్నీళ్ళు కార్చాడు. భర్త ముఖాన్ని గుండెకు గాఢంగా హత్తుకున్న దన్నపూర్ణ. భర్త కన్నీటితో తడిసిపోయిన తన వక్షస్థలంతో చల్లని ఓదార్పు చూపిందామె.

చందమామ జాలిగా చూస్తూ మబ్బుల మరుగులో మాయమైనాడు!

"వెళ్తావుకదూ!"

క్రిక్కిరిసి ఉన్న కంపార్టుమెంటులో కిందపడడానికి కూడా జాగా లేక, ఊపిరి ఆడక కొట్టుకుపోతున్న సమయంలో కూడా విన్పిస్తున్న స్వరం అది. వెనకనుంచి ఎవరో తోశారు. ఆవెనక మరొకమనిషి కాబోలు అతన్ని తోశాడు. "ఉండవయ్యా, నువ్వొకడివి. మాకే నించోడానికైనా స్థలంలేకుండా ఉంటే!" అన్నాడు టిక్కెట్టుకొని ఇక్కట్లు పడుతున్న ఆసామి.

"మరేంచెయ్యమంటారు? మీకోసం స్పెషల్ బోగీ వేయించమంటారా?" అన్నాడు అడుక్కోడానికివచ్చిన గుడ్డి బిచ్చగాడు, అవహేళనగా.

"ఏమో. నీ ఇష్టం. నీ తరవాత వాళ్ళమే కదా మేమంతా?" అన్నాడు అతను. చుట్టూ ఉన్న జనం అందులోనే సందుచేసుకుని నవ్వారు.

"వెళ్తావుకదూ, అరుంధతి దగ్గరికి?" తృళ్ళిపడ్డాను.

"క్రాసింగట. మరోఅరగంటదాకా కదిలేట్టు లేదు బండి."

నించోలేక మెల్లిగా కిటికీలోంచి దారిచేసుకుని ప్లాట్‌ఫారం మీదికి దిగిపోయాను—కనీసం ఊపిరైనా అందుతుందని.

"కాస్త మంచినీళ్ళు ఇటొస్తే చూడు బాబూ!" కిటికీదగ్గర కూచున్న ఆవిడ మరచెంబు చేత్తో పట్టుకుని ఇటూ అటూ చూస్తూ అంది, నన్నుద్దేశించి. నేనూ అటూ ఇటూ చూసి, కనుచూపుమేరలో మంచినీళ్ళ వాడు కనిపించకపోవడంచేత, నేనే అందుకున్నాను ఆ మరచెంబు మౌనంగా.

మంచినీళ్ళు తీసుకొచ్చేసరికి ఎదురు ట్రైను వచ్చింది. ఇహ రైలు కదుల్తుందని మళ్ళీ కిటికీలోంచే లోపలికిదూరి, నేను ఇందాక నించున్న సందుకోసం చూస్తున్నాను. "కూచో, బాబూ! అన్నకు స్థలమియ్యరా!" అంది ఇందాక మంచినీళ్ళు పుచ్చుకున్న మహా ఇల్లాలు, తన కొడుకును పక్కకుతోసి. ఆ జాగాలో ఒదిగి కూచున్నాను. ఈ కలికాలంలోకూడ ఇంకా ధర్మమూ, మంచివాళ్ళూ ఉన్నారు కాబోలు!

సంచిలోఉన్న చక్కిలాల పొట్లం వెక్కిరించినట్టు తగిలింది వేళ్ళకు-ధర్మపన్నాలు వల్లించుకుంటున్న నేను నాలిక్కొరుక్కున్నాను.

అవి అరుంధతికివ్వాలి.

"ఒక్కమారు వెళ్ళుబాబూ!" అంది ఆవిడ. అది ఆజ్ఞ. పసుపూ ఎరుపూ కలిపి నేసిన పట్టుచీరలో సంధ్యాసమయాన్ని స్ఫురింపజేసే స్వచ్ఛతతో, చాముండేశ్వరీ విగ్రహాన్ని తలపింపజేస్తూ ఆవిడ నవ్విన నవ్వు నా పాలిట సీతకోసం సౌమిత్రి గీసిన గీటు. లోకానికే ఆదర్శమై అనుసరణీయమైన ఒక పుణ్యమూర్తి పెట్టిన ఆంక్ష. అది అధికారరోగపూరిత బధిరాంధక శవం వేసిన ఆర్డరుకాదు. ఒక మాతృమూర్తి తన బిడ్డకు చెందవలసిన అమృతాన్ని పంచి ఇచ్చి ప్రతిగా కోరిన ఒకే ఒక చిన్నికోరిక. పరమ కిరాతుడైనా మృత్యువు సన్నిధికి పంపుతున్న శత్రువును 'నీ చివరి కోరిక ఏమిట'ని ప్రశ్నించే ప్రశ్నకు జవాబు.

"ఒక్కమారు అరుంధతిని చూపిరా—నా కళ్ళు పెట్టుకుని."

ఇలా అలమటించిపోతున్న మాతృశ్రీని క్షోభపెడుతున్న ఆ నింద్యురాలి మొహం ఎలా చూడను? చూడలేనని ఎలా చెప్పను?

"ఆడదాన్లా అంత పగ ఏమిట్రా నీకు?" అనేది మా అమ్మ.

మగవాడికిమటుకు రాగద్వేషా లుండవు కాబోలు!

"ఎక్కడిదాకా?"

ఎవరో ప్రశ్నించారు. చెప్పాను. "అబ్బో, చాలాదూరవేనే!" అని ఆవులించారు. నేను మాటాడలేదు.

"ఒక్కడివే వెళ్తున్నావా? ఏం పనిమీద? మరి మీవాళ్ళను మళ్ళీవచ్చి తీసుకెళ్తావా?" వెయ్యి ప్రశ్నలు.

నవ్వాను. నేనొంటిగాణ్ణి. నేనెక్కడుంటే నేమిటి?

"అరుంధతి మాట!" గుడిగంటలా హెచ్చరింపు. నన్ను పలకరించి నాయన్ను అడిగాను—రాయపూర్‌లో ఫలానా వారిల్లు తెలుసా? అని. నా దగ్గరున్న అడ్రసు చూపించాను.

ఇల్లు తెలీదుకాని ఆ వీధి చూపిస్తానన్నారాయన. వాళ్ళఇంటికి ఆ వీధి దాటి వెళ్ళాలట. కంటాబాంజీ స్టేషన్లో టీ తాగి మళ్ళీ రైల్లో కూచున్నాను.

అరుంధతి ఎలా ఉంటుందో? అదికూడా నేనెప్పుడూ ఆలోచించలేదు. నాకు తెలిసిన అరుంధతి ఒక నరరూప రాక్షసి. అమృతభాండం అందిస్తే మృణ్మయపాత్ర అని విసిరివేసిన మూర్ఖురాలు. కోరి వరించిన ఐశ్వర్యాన్ని

గ్రహించలేని అజ్ఞాని. అర్ధరాత్రి అప్పటికప్పుడు బియ్యం దంపి చుట్టిన ఈ చక్కిలాలు నా మొహంమీద విసిరికొట్టినా కొట్టచ్చు.

ఆవిడ పిచ్చికాకపోతే రసమలాయీ రాజభోగ్ తినే అరుంధతి ఈ పాతకాలపు పిండివంట కోసం మొహం వాచి ఉందా?

రాయపూర్ స్టేషన్‌లో దిగి దిక్కులు చూస్తున్న నాకు—దారి చూపి స్తానన్న తోడి ప్రయాణికుడు తీసుకెళ్ళి అరుంధతి ఇంటిముందు వదిలాడు.

తలుపు మెల్లిగా తట్టాను. పాతివ్రత్యం పరీక్షించడానికి అగ్నిప్రవేశం చేయమన్నపుడు జనకసుత ఎట్టి అనుభూతులకు లోనైందో కాని, సామాన్య మానవుడినైన నేను ఒక వృద్ధమూర్తియందు నాకు గల అభిమానాన్ని రుజువు చేసుకోడానికి- డాంబికంకోసంగాక-నిండుమనసు నొప్పించలేక, వచ్చి నిలబడ్డాను అరుంధతి ఎదుట.

నరక ద్వారాల్లా తెరువబడ్డాయి తలుపులు. ఆ తలుపుల వెనుక తన అయిదవతనానికి చిహ్నంగా గాజులు ఘల్లున మోగుతుండగా, ప్రత్యక్షమైన పార్వతీదేవిలా మందహాసంతో నిలబడింది, ఆ తలుపులు తెరిచిన జవరాలు. ఈ ముగ్ధమోహనమూర్తి అరుంధతి కాజాలదు. బహుశః క్షణక్షణానికి ఇంతింతై మాయావటునిలా పెరుగుతున్న నా కోపాగ్నిని శాంతింప జేయ వచ్చిన దేవదూత అయిఉండవచ్చు. నేను వీలైనంత సంక్షిప్తంగా నా వచ్చిన పని వివరించాను.

"లోపలికిరా" అంది ఆవిడ, నాకోసమే ఎదురు చూస్తున్నట్టు. అత్తవారింటికి వెళ్ళిన కొత్తకోడలు తన అనుంగు తమ్ముని ఆహ్వానించే పిలుపు అది. స్కూలుకు వెళ్ళిన పసివాడు తిరిగి ఎప్పుడు వస్తాడో అని ఎదురు చూసిచూసి విసిగి వెనుదిరిగే అంతలో అతడు పరుగున వచ్చినపుడు ఎదురయ్యే స్వాగతం అది.

"అమ్మ కులాసాగా ఉందా? ఎంతగానో బతిమాలాను. ఒక్కదాన్నీ ఈ దేశంకాని దేశంలో నా అన్నవాళ్ళు లేకుండా పడి ఉన్నాను. వచ్చి ఇక్కడ ఉండమంటే రానుగాక రానంది. ఏనాడు తల్లీబిడ్డల్ని వేరుచేశానో ఈనాడు నాకు అమ్మ ఉండీ లేనిదే అయింది. పోనీలే, తక్కువ నోములు నోచి

ఎక్కువ ఫలమిమ్మంటే ఎలా వస్తుంది?" అంది అరుంధతి కన్నులనీరు తొణుకుతుండగా.

అరుంధతి మాటలు నేను నమ్మలేదు. ఆమె నటనావైదగ్ధ్యానికి ముగ్ధుడైనమాట నిజం.

తను అంతలోనే తేరుకుని, "లేచి స్నానం చెయ్యి, భోజనం చేద్దువుగాని. నిన్న ఎప్పుడనగా తిన్నావో" అంది.

"ఇప్పుడు అనవసరంగా శ్రమ తీసుకోకండి. నేను వెళ్ళిపోతాను. మీ అమ్మ ఇవి మీకు ఇచ్చి చూపిరమ్మనడం చేత వచ్చాను" అన్నాను. సంచిలో పొట్లం తీస్తూ, ఆ ఇంట్లో ప్రవేశించడానికి నాకుగల అభ్యంతరం సువ్యక్తం చేస్తూ.

"అయితే మా అత్తగారు పనిచెప్పకపోతే వచ్చేవాడివే కాదన్న మాట! ఇంకా అలీబాబా కథలోలాగ ఉప్పు తినని నియమం కూడా పెట్టుకున్నావా? నేను క్రైమ్‌బ్రాంచిలో వాణ్ణి. మారుమాటాడకుండా పద" అన్నాడు రమణరావు, రంగంలోకి ప్రవేశిస్తూ. ఈ ఇన్స్‌పెక్టర్‌గారి ముందు నాకు నోరు పెగలలేదు.

తలవంచుకుని భోంచేసినా, అరుంధతి వంటింట్లో చేస్తున్న ఏర్పాట్లను బట్టి వాళ్ళింట్లో ఒక వారాల కుర్రాడు ఉన్నాడనీ, అతడివంతు అన్నం నాకు పెట్టి, అతడికి మళ్ళీ ఎసరు పెట్టిందనీ గ్రహించుకున్నాను.

భోజనం చేస్తున్నంతసేపూ క్రైంబ్రాంచి ఇన్స్‌పెక్టరు నా పక్కనే కూచున్నారు. అరుంధతి ఏవేవో ప్రశ్నలు వేస్తూనే ఉంది. వాటితో పోటీలు పడుతూ ఖాద్యపదార్థాలు నా ఆకులో పడుతూనే ఉన్నాయి. నేను ఉక్కిరి బిక్కిరి అవుతూంటే, "అయ్యయ్యో! అసలు ఏం తినలేదు. అలా అయితే పద. నీ ఇష్టమైన హోటల్లోనే తిందువుగాని" అంది.

భోజనం అయాక నా కథ సూక్ష్మంగా చెప్పాను. పార్వతీపురం దగ్గరే ఒక పల్లెటూళ్ళో ఎస్. ఎస్. ఎల్. సి. వరకు చదివాను. తరవాత పైచదువుకు నాన్నగారు ఒప్పుకోలేదు. కాని నేను మొండిగా పార్వతీపురం వచ్చి, అరుంధతి తల్లిగారింట్లో ఒక చిన్న గది తీసుకుని చదువు సాగించాను. అప్పుడే

నాన్నగారి దయకు అపాత్రుణ్ణిగా గణింపబడ్డాను. అక్కడే నవ్యనవనీత సమానమైన నిండు మనమ్ము ఎటువంటిదో తెలుసుకున్నాను. ఆ గదిలో ఉండగానే గుప్తదానం చేస్తున్న ఒక పుణ్యపురుషుని మూలంగా నెలకు ఏభై రూపాయలు అందుకుంటూ బి. ఎ. డిగ్రీ పుచ్చుకున్నాను.

నేను తన తల్లి ఆస్తికి వారసుణ్ణి కాగలనన్న భయంతో, అరుంధతి అసూయాగ్రస్తురాలై విషంపరిపిస్తే నేను నిశ్చయంగా సంతోషించి ఉండే వాడిని. నన్ను ఏవిధంగా అయినా వంచించడానికి ప్రయత్నిస్తే ఆ మాయా జాలంనుండి తప్పించుకుని అలవోకగా నవ్వి అవనతముఖి అయిన అరుంధతిని చూపి ఆనందించి ఉండేవాడిని.

"అదృష్టవంతుడివి తమ్ముడూ! నేను పరితపించిపోతున్న అమ్మ నీకు అనాయాసంగా లభ్యమైంది" అంది అరుంధతి. కాంప్‌కాట్ వేసింది, కొంచెం సేపు విశ్రాంతి తీసుకోమని. నేను వెంటనే వెళ్ళిపోవాలన్నాను. "అదేం కుదరదు. కనీసం రెండురోజులైనా ఇక్కడ ఉండందే కదలడానికి వీల్లేదు. కాదూ కూడదని నువ్వు బయల్దేరితే మీ బావగారు పోలీసుల్ని పంపించి వెనక్కు లాక్కొస్తానని చెప్పమన్నారు" అంది.

"అమ్మ అక్కడ ఎలా ఉంది? ధాన్యం సరిగ్గా వస్తున్నాయా? రైతులు పేచీలు పెట్టడం లేదుకదా? అన్నీ చూసుకోగల ఓపిక అమ్మకుందా?"— అరుంధతి పదేపదే తల్లిని గురించి ప్రశ్నించసాగింది.

"ఆవిడ కసలు నేను సహాయం చేస్తానన్నా చెయ్యనివ్వదు" అన్నాను.

ఆవిడ నాకు ఒక ఉపదేశం ఇచ్చింది—"నాయనా! పెద్దదాన్నీ, చేసుకో గలదాన్నీ. నాకు దైవ సహాయముంది. మరే సహాయమూ అక్కర్లేదు కూడాను. రేపొద్దున్న నీ పెళ్ళాం వచ్చినపుడు దాన్ని ఏడిపించకు. అదే నే చెప్పగల ముక్క" అంది.

చెప్పేశాక అనుకున్నాను—అరుంధతి కెందుకూ ఈ మాట? రమణా రావు వెంటనే అందుకున్నాడు: "భేషయిన ముక్క సెలవిచ్చారోయ్ మీ అమ్మ. కాని ఈ ఆడజాతి ఉంది చూశావూ, మనం వద్దన్నా వినకుండా వాళ్ళే ఏడుస్తారు. ఉదాహరణకు మీ అక్క ఉందా? చెట్టంత మొగవాణ్ణి నేనున్నానా? అయినా

ఇంట్లో మనుషుల్లేరు, అమ్మ రమ్మంటే రాదు అని ఏడుస్తుంది. తెగించి ఆవిణ్ణి తీసుకొస్తేనేమో...."

"చాల్లెండి" అంది అరుంధతి విప్రలబ్ధవలె, కోపానికీ తాపానికీ మధ్య గల భావ విన్యాసంతో. "మరొకరైతే నిజమనుకుంటారు."

"అయ్యో ఖర్మమా! అసత్యం అనుకోడూ, నువ్వలా అంటే?" అన్నాడు రమణారావు విస్తుపోతూ.

అరుంధతి మారు చెప్పలేదు.

"అదృష్టహీనుడికి నవరత్నాలతో నిండిన కూష్మాండం వట్టి గుమ్మడి కాయగానే కనిపిస్తుంది" అన్నాను కసిగా.

"అలాగనకోయ్! ఆవిడను నువ్వు పూర్తిగా ఎరగవు" అన్నాడు రమణారావు సీరియస్‌గా.

మొదట వాళ్ళు ఇక్కడ కొత్తగా కాపురం పెట్టిన రోజుల్లో ఆవిడ ఇక్కడికి వచ్చింది! అప్పట్లో ఇల్లు చిన్నది తీసుకున్నాడు. అతడి ఉద్యోగమూ చిన్నదే. మార్కుదారులింట పుట్టి జమీందారులింట మెట్టిన అరుంధతి తల్లి ఆ ఇంట్లో ఉండలేకపోవడంలో ఆశ్చర్యం లేదు.

"పెద్ద ఇల్లు ఒకటి చూడు, కొనేద్దాం" అందావిడ.

రమణారావు అంగీకరించలేదు. "నాటకంలో వేషం వేసినట్లు ఇవాళ మీరొక పెద్దఇల్లు కొనేస్తే నాకు దాని పన్ను కట్టుకునే తాహతు కూడా లేదు. లాటరీలో కారొస్తే పెట్రోలొస్తుందా? పుణ్యానికి పిడికెడు బిచ్చం పెడతారు కాని, ఎవరైనా పంచభక్ష్య పరమాన్నాలతో విందులు చేయరు. నాకు చేతనైనంత నేను చేస్తాను. సర్దుకోండి"అన్నాడు. ఈ మాట పౌరుషవంతురాలైన అత్తగారికి రుచించలేదు. పాలకడలిలో పుట్టిన సిరికి చెల్లెలై చెలగిన తనకు సర్దుకోవలసిన ఖర్మమేమిటి? అల్లుడు వాడు కనక ఆ మాట అన్నాడు. ఇవాళ ఈ విషయం అయింది. రేపు మరో విషయం కావచ్చు. ఆవిడ ఆ రోజే ప్రయాణమై జననితో సమానమైన జన్మభూమి చేరుకుంది. పుట్టినగడ్డమీదే మట్టి అయిపోవడానికి నిశ్చయం చేసుకుంది.

నేను ఈ కథనం నమ్మలేకపోయాను. ఆవిడ అంతటి మూర్ఖురాలా—తాహతుకు మించిన పరుగులు తీయమని కోరడానికి? ఆవిడ అటువంటిది కాదు. నేను ఆవిడను అయిదేళ్ళుగా చూస్తున్నాను.

"నేను ఇరవై ఏళ్ళయి చూస్తున్నాను ఆవిడను. నా అన్నవాళ్ళు లేరు నీకు. ఆవిడ పట్టెడన్నం పెడితే దయాసముద్రురా లనుకుంటున్నావు. కూరల సంచీ చేతికిచ్చి నిన్ను బజారుకు తరమలేదు కనక, ఒరుల నొప్పించ నిచ్చ గించని సహృదయ అనుకుంటావు. అంతేనా నీకు తెలిసింది?"

నా హృదయం భగ్గున మండింది. "అన్నమంతా పట్టి చూడక్కర్లేదు లెండి" అన్నాను, రోషంగా.

రమణారావు చిత్రంగా నవ్వాడు. "నేనొక కథ చెబుతాను వింటావా?"

నేను, కథలు చెప్తే వింటూ కూచోడానికి కాదు ఇక్కడికి వచ్చింది. పురాణాలు కోట్ చేసినంతమాత్రాన తప్పులు ఒప్పులై పోవు. అయినా నేను మాటాడలేదు.

రమణారావు నా జవాబుకోసం ఎదురుచూడనూ లేదు. "మా ఊళ్ళో- నలుడికీ, భీముడికీ దీటురాగల వంటవాడొక డుండేవాడు. మా ఇంట్లో అప్పట్లో పూటకు మూడు బంతులు లేచేవి. మొదటిబంతి కుర్రకారంతా కూచునే వాళ్ళు. మాకు మీదవరస అన్నం- గోడనేసికొడితే మేకుల్లా నిలబడేవి మెతుకులు. రెండోవరస మొగవాళ్ళయిన పెద్దవారికి, అంటే మా నాన్నగారికి—మధ్యవరస అన్నం సమపాళంగా ఉండేది. ఆఖరిబంతి ఆడవాళ్ళకు అడుగుపెచ్చులు— దొరకజ్జాయం. భోజనాలయాక అందరం సావిట్లో కూచుని తన్నుకునే వాళ్ళం—అన్నం ఉడకలేదని మేం, ఫస్టుగా ఉందని నాన్నగారూ, మాడిందని అమ్మా! మొత్తమ్మీద అన్నం గిన్నెలో రహస్యం మటుకు మాకొకంతటిగ్గానీ పట్టుబడలేదు."

"మీకు తెలుసు కాబోలు" అన్నాను మృదువుగానే.

"లేదోయ్ భగవాన్లూ! అందుకే ఇంగ్లీషువాడూ ఏ ప్రశ్న కయినా రెండు వేపులుంటాయి అన్నాడు. ఒకే చెట్టుకాసినా ఒక కాయలా మరోకాయ ఉండదు. ఒక తల్లికి పుట్టిన నలుగురు పిల్లలూ నాలుగు రకాలుగా ఉంటారని నీకూ తెలుసు కదా! అమ్మ అయినా, నువ్వైనా, నేనైనా మార్పు సహజం. పట్టూ విడుపూ ఉండాలి దేనికైనా!"

"అయితే నేరస్థుణ్ణి నేరస్థుడు అనకూడదన్నమాట."

రమణారావు వాచీ చూసుకొని పులివేషంలాటి మేకప్ మొదలు పెట్టాడు—స్టేషన్‌కు వెళ్ళడానికి.

"నేరం ఒకమారు చేసినవాడు మనిషైతే మళ్ళీ అదే నేరం చెయ్యడు అంటున్నాను. అందుకే గదా మనపెద్దలంతా అనుభవం అని కొట్టుకుపోవడం."

"సరేలెండి. చిన్నవాణ్ణిచేసి అతని దగ్గరే మీ ప్రతిభ అంతా" అంది అరుంధతి ఎత్తిపొడుపుగా.

"అదీ. చిన్నవాడు కదా అని నాలుగు నీతివాక్యాలు నేర్పబోతే మీ తమ్ముణ్ణి నేనేదో మీదపడి కొట్టేస్తున్నట్లు ఇదయిపోతావేం? నా షూస్ పట్టుకురా, మళ్ళీ సాయంత్రందాకా కనిపించను" అన్నాడు రమణారావు బెల్టు పెట్టుకుంటూ.

నాకిది ఎమ్. ఏ. క్లాస్‌గా, లాజిక్‌చేసే మాజిక్‌గా కనిపించింది. దొంగైనా తన్నుతాను సమర్థించుకోగలడు. నోరుంటే తల కాస్తుంది మరి!

"ఒక్కమాట జ్ఞాపకం ఉంచుకో శ్రీపతీ! ఓల్డ్ ఆర్డర్ మస్ట్ గివ్ ప్లేస్ టు ది న్యూ ఆర్డర్; అండ్ ది న్యూ ఆర్డర్ కెన్ నెవర్ ఎడాప్ట్ ఇట్ సెల్ఫ్ టు ది ఓల్డ్. పాతవాళ్ళను కొత్తతరం గౌరవిస్తుంది కాని, అనుసరించదు."

రమణారావు వెళ్ళినవేపు చూస్తూ పడుకున్నాను. సూర్యుని ఆవరించుకున్న నల్లని మేఘాన్ని అధిగమించి సూర్యకిరణం ఏడురంగుల్లో ప్రతిఫలిస్తోంది.

మనుషుల్లో మార్పు సహజమైతే అమ్మ మారదా? నిజంగా అమ్మకంత పట్టుదలా? అసలు ఇందులో నేరస్థులెవరు? "అమ్మ, అమ్మ" అని పలవరిస్తూంది అరుంధతి ఇక్కడ. అక్కడ అమ్మ, "అరుంధతి, అరుంధతి" అని తపిస్తూంది. రమణారావేమో అక్రమవర్తనుడు కాదు. అయిదేళ్ళనుంచీ చూస్తున్న నేను అమ్మకు అరుంధతికన్నా ఆస్తి ఎక్కువ కాదని నిశ్చయంగా చెప్పగలను. ఈ చిక్కులనే కాబోలు భవబంధాలంటారు. వాళ్లుండమన్న రెండు రోజులూ ఉండికాని నేను అక్కణ్ణించి కదల్లేదు. ఈ దంపతులకు నాయందు కలిగిన అవ్యాజానురాగానికి కారణం నాకు అర్థం కాలేదు. అది అనురాగ మవునా కాదా అన్న సందేహం ఏనాడో అంతరించిపోయింది. అందుకే వారిమాట కొట్టివేయలేకపోయాను. ఉద్యోగార్థినై వెళ్తూకూడా.

అరుంధతి అమ్మ సుగుణాలన్నీ పుణికి పుచ్చుకుందేమో. నేను బయ లేరిన రోజున పండుగంత హడావుడి చేసింది. రెడీమేడ్ డ్రెస్ తెప్పించి నేను తొడుక్కున్నదాకా ఒప్పుకోలేదు. చేతిసంచితో రైలుదిగిన నేను ఇంత భారంతో ఎక్కలేనేమో అనిపించింది.

"వస్తానమ్మా!" అన్నాను, రిక్షా ఎక్కబోతూ తలవంచుకుని.

ఇరవయ్యో శతాబ్దపు నాగరకత వంటబట్టి రెండు చేతులూ జోడించడం కూడా అసభ్యంగా పరిగణింపబడిన కాలేజీలో చదవకపోతే ఆమె పాదాలు స్పృశించి ఉండేవాణ్ణి—తనయందు నేను పెంచుకున్న దురభిప్రాయానికి ప్రతిగా.

"కనీసం నువ్వైనా అప్పుడప్పుడు వచ్చి కనిపిస్తూ ఉండు తమ్ముడూ!" అంటూ కళ్ళనీళ్ళతో సాగనంపిన అరుంధతి ఋణం సప్తజన్మ లెత్తినా తీర్చలేనేమో అనిపించింది.

రైలెక్కుతూంటే రమణారావు ఒక ఉత్తరం ఇచ్చాడు—దానిమీద ఉన్న అడ్రసుకు వెళ్తే, తప్పకుండా ఉద్యోగం దొరుకుతుందని. "నా ఫ్రెండు నా మాట తోసెయ్యడు" అన్నాడు రమణారావు. ఆ ఉత్తరం వ్రాసిన చెయ్యి నాకు సుపరిచితం.

ఏ అజ్ఞాతవ్యక్తి అయితే ప్రిన్స్‌పాల్ పేరున ప్రతినెలా ఏభై రూపా యలు పంపి, దాన్ని ఉపయోగించడంలో తుది నిర్ణయం ప్రిన్స్‌పాల్‌కే వదలి పరోక్షంగా నా చదువుకు సహాయం చేశారో ఆ వ్యక్తిదే ఆ హస్తం! ఆ మాత్రం నేను పోల్చుకోలేకపోతే ఇంతవరకూ నేను చదివిన చదువంతా వృథా.

తీసినకొద్దీ ఊరే నీటిజలవంటిది. అరుంధతీ రమణారావులకూ నాకూ మధ్యగల అనుబంధం అనుకున్నాను, ఉత్తరం మడిచి జేబులో పెట్టుకుంటూ.

సరిగ్గా ఐదేండ్ల క్రితం ఆమెను చూశాడు చిట్టిబాబు. ఐదేండ్ల క్రితం ఆమె వయసు పదిహేనేండ్లు. పదిహేనేండ్లకే పట్టపగ్గాలులేని ప్రాయము ఆమెది. అప్పుడు ఆమె బాలకాని ప్రౌఢ. ప్రౌఢకాని బాల. ఒంటి నిండుకు వంపులు. ఆ వంపుల్లో సొంపులు. ఆ వంపుసొంపులను యిముడ్చుకోలేక నిట్టూర్పుల్లో పడిన దుస్తులు. అంతటికీ యింపు కూర్చుతూ ఒకటీ రెండు సొమ్ములు' అందమైన లేడిపిల్లలా కనుపించేది. హుందాగా రాజహంసలా నడిచేది. ఆమె అలా నడుస్తూవుంటే ఎప్పుడూ ప్రక్కన మరొక ఆవిడ. ఆ మరొక ఆవిడ యిరవై సంవత్సరాల వయస్సుకే ముప్పైఏండ్ల మనిషిగా కనుపిస్తుంది. ఆ ముప్పయియేండ్ల మనిషి ముద్దుగా బొద్దుగా అందమైన పీపాలా ఉంటుంది. ఇద్దరు ప్రక్క-ప్రక్కన్నే నడుస్తారు. ఒకరినొకరు రాచుకొంటూ నడుస్తారు. ఒక లావు కొమ్మ. మరొక సన్న కొమ్మ. రెండు కొమ్మలు ఒకదానినొకటి ఒరుచుకున్నట్లుంటుంది. ఎంతో ఒద్దికగా వున్నట్లు కనుపిస్తారు. 'అమ్మ - కూతురు' అంటారు కొందరు. 'కాదు!' అంటారు కొందరు. అవునో- కాదో అంటారు మరికొందరు. దీనికి కారణం వాళ్ళ చేతుల్లో పుస్తకాలు. అవి ఒకేమోస్తరు కనుపిస్తాయి. అందుకే వాళ్లను చూచి 'ఆవు-దూడ' అంటారు అందరు. ఆ మాట విన్నపుడు 'ముసిముసి'గా నవ్వుతాడు చిట్టిబాబు. నవ్వుతూ ఆలోచిస్తాడు. ఆలోచిస్తూ 'ఆహా! ఓహో!' అంటాడు. ఆపైన తానుకూడ 'ఆవు దూడ!' అంటాడు.

ఆ రోజు సాయంకాలం. అందమైన బజార్లో ఆలోచిస్తూ నడుస్తున్నాడు చిట్టిబాబు. ఆవు దూడను గురించి ఆలోచిస్తూ నడుస్తున్నాడు. ఆవును వదలి దూడ రాదు. దూడను వదలి ఆవు రాదు. దూడ లేకపోతే తాను లేడు. 'దూడ! దూడ!' అని ఆలోచిస్తూ ఉంది మనసు. అసలు చిట్టిబాబు అంటేనే ఆలోచనకు ప్రతిరూపమంటారు కొందరు. 'పుస్తకాల పురుగ్గా వుంటాడు' అంటారు అతనితో అప్పుడప్పుడు మాట్లాడేవాళ్ళు. 'హెచ్చులమారి లచ్చుం గాడు!' అంటారు అతనితో కలిపి పనిచేసేవాళ్ళు. 'పాపం! నిస్వార్థుడు!' అంటారు అతనివద్ద అడపా దడపా చదువుకొనడానికి నవలలు తెప్పించుకొనే అమ్మాయిలు. 'అబ్బే! బ్రదకలేనివాడు!' అంటాడు నాడారు. ఎవరేమన్నా పెడ

చెవిని పెడతాడు చిట్టిబాబు. అసలు యివన్నీ కాకికూతలని అతని నమ్మకము.

అయిదేండ్లకు పూర్వం- అంటే ఆవు దూడను చూడక పూర్వం అరచేతిలో గీతలు చూచుకొనేవాడు చిట్టిబాబు. కుడిచేతి నిండుకు గీతలు. ఆ గీతల నిండుకు భావి జీవితపు బాగోగులు. అన్ని గీతల్లోను ఒక్క గీతంటే మహాయిష్టం అతనికి, ఎందరో వుంటే దూడమీదనే మోజు పడినట్లు. ఆ గీత లోనే తన 'తలరాత' వుందనుకొంటాడు. తలరాతను ఆ గీత తప్పకుండా మారుస్తుందనుకొంటాడు. తలరాతే మారితే....మళ్ళీ ఆలోచిస్తాడు.

ఒకప్పుడు డబ్బు అంటేనే వెగటు చిట్టిబాబుకు. డబ్బులో యేముందిలే అనుకొన్నాడు. తెలివితేటల్లోనే అంతా వుందనుకొన్నాడు. ఆ 'అంతా' సంపాదించడానికి తెగ చదివాడు. తెగ తిరిగాడు. తెగ చదివితే తెలివితేటలు. తెగ తిరిగితే అనుభవాలు. అందులోనే ఆ 'అంతా' వుందని భ్రమపడ్డాడు. తెగ చదివి, తెగ తిరిగితే అలసిపోయేది శరీరం. అలసిపోయిన శరీరం తేరుకోవడానికి యేదో కావలసివచ్చేది. ఆ 'యేదో' కావాలంటే మరేదో కావాలి. ఆ మరో దానికి మారుపేరు డబ్బు. అదే లేదు చిట్టిబాబుకు. అందుకే ఇప్పుడు అంతా డబ్బులోనే ఉందనుకొంటాడు. ఆ డబ్బును తేగలిగేది తన చేతిలో ఆ ఒక్క గీత! అందుకే ఆ గీత అంటే అతనికి మహాయిష్టం.

ఆ గీత ప్రభావమే జరగాలి. తన రాతే మారాలి. ఆలోచిస్తాడు చిట్టిబాబు. సాధారణంగా సామాన్యులైతే ఓ పెద్ద మేడ....హంసతూలికా తల్పాలు.... పంచభక్ష్యపరమాన్నాలు....కారు....దర్పం.... దర్జా....అలా అలా ఆలోచిస్తారు. కానీ అందరిలాంటివాడు కాదు చిట్టిబాబు. అతనికి కొన్ని నిశితమైన అభిప్రాయాలున్నాయి. కొందరిమీద అతనికి చెప్పలేనంత కసి! కొందరిమీద అతనికి ఎనలేని కనికరము.

బజారుబొడ్డులో ఓ పెద్ద బట్టల కొట్టు. దాన్ని ప్రక్కన్నే కిరాణా కొట్టు, ఆ ప్రక్కన్నే దేశంలోని 'ఏజెన్సీ' లన్నీ కూడిన స్థలం. ఆ కూడలి ప్రక్కన 'హోల్‌సేల్' బియ్యపు దుకాణం. దానికి ఎదురుగా బ్రాందీషాపు. వీటన్నిటినీ కలిపితే ఆంగ్లంలో 'గ్రూప్' అంటారట. ఆ 'గ్రూపు'కు అధినేత ఓ గుప్త. ఆ గుప్త నల్లగా వుంటాడు. నల్లగా వున్నా నున్నగా కరిబూజకాయలాగ ఉంటాడు. ఆ నల్లని నున్నటి ఒంటిమీద తెల్లటి మల్లుజుబ్బా ఉటుంది. మల్లు

జాబ్బా మరుగుపరచలేని మసిబానలాంటి పొట్టకూడ ఉంటుంది గుప్తగారికి. ఎప్పుడు కిరాణాకొట్టు ముందు కూర్చుంటాడు. ఆయన ముందర పనిపై సాల పకోడీ పొట్లం ఉంటుంది. కొట్టుకు వచ్చిన వాళ్ళందరికీ ఆ పకోడీ పొట్లం చూపిస్తాడు. చూపిస్తూ అందరినీ తీసుకోమంటాడు. తీసుకోమంటూ మళ్ళీ తానే తీసుకొని వడవేసి నములుతూ ఉంటాడు. ఆ శెట్టిమీద కాదుకానీ, చిట్టిబాబుకు అతని పొట్టమీద తగనిమంట. తన రాతే మారితే, ఆ గీత ప్రభావమే జరిగితే, మొట్టమొదటిసారిగా ఆ శెట్టి పొట్టను తూట్లు తూట్లుగా పొడుద్దామను కొంటాడు.

చిట్టిబాబు ఆఫీసుకు వెళ్ళేదారి ఒకప్పుడు మట్టిబాట. కొంతకాలానికి అది కంకరబాట అయింది. మరలా తారురోడ్డుగా మారింది. ఇప్పుడు సిమ్మెంటు రోడ్డుగా మారుతూ ఉంది. ప్రణాళికల మేరకు ఊపిరిలేని బాట బ్రతుకు మారుతూ వచ్చింది. కానీ మట్టిబాటకోసం నెత్తి తట్టలతో మట్టిమోసిన అదే కూలీలు సిమ్మెంటు రోడ్డు కోసం 'గుల్ల' పగులకొడుతూనే ఉన్నారు. కంకరరోడ్డు వేయిస్తూ అలనాడు అటూ యిటూ తిరుగుతూ ఆ పని ఈ పని చేస్తూ ఉండిన కంట్రాక్టరు సిమెంటు రోడ్డు వేస్తూంటే నింపాదిగా కారు కొను కొని నిలబడి ఉన్నాడు, ఒక కూలీ పట్టిన గొడుగు క్రింద! చిట్టిబాబు ఆ బాట మీద నడుస్తూనే వున్నాడు. నడుస్తూ చూస్తూనే వున్నాడు. చూస్తూ ఆఫీసులో పనిజేస్తూనే వున్నాడు. తనలో మార్పులేదు. గుల్లకొట్టే కూలీలో మార్పులేదు. 'కాంట్రాక్టరు' మాత్రం కారు కొన్నాడు. అందుకే ఆలోచిస్తాడు చిట్టిబాబు. తన రాతేమారితే, ఆ గీత ప్రభావమే జరిగితే, ఆ గొడుగు తీసి గుల్ల పగుల కొట్టే కూలీకి పట్టి, కూలీచేతిలోని సుత్తెను తీసి కాంట్రాక్టరు చేతికివ్వాలను కొంటాడు.

ఆ ఊళ్ళో ఓ నలుగురైదుగురు కనుపిస్తూ వుంటారు చిట్టిబాబుకు. అలా కనుపించేది కూడ సభలు సమావేశాలు జరిగినపుడే!- తనకు తెలిసి వాళ్ళకేమీ పనిపాట ఉన్నట్టులేదు. ఉండినా చేసేటట్టులేదు. కానీ బట్టలు మాత్రం మడత పడవు. అవికూడ ఖద్దరు బట్టలు!....ఏ సభలోనైనా వాళ్ళే ముందర కూర్చుంటారు. కూర్చున్న వాళ్ళు కుదురుగ ఉండరు. ఉండకుండా లేచి వాగుతారు. వాళ్ళు వాగింది వాళ్ళకే తెలియకుండా వాగుతారు. దానికి

మురిసిపోయి వాళ్ళకు పూల మాలలు వేస్తుంటారు ఎవరో తాగుబోతుముండా కొడుకులు. అది చూచి ఆలోచిస్తాడు చిట్టిబాబు. తన 'రాతే' మారితే, ఆ గీత ప్రభావమే జరిగితే ఏ అమెరికానుండి, లేదు రష్యానుండి గుట్టు చప్పుడుగ నాలుగు బాంబులు తెప్పించి ఆ తాగుబోతు ముండా కొడుకులు పూలమాలలు వేసేటప్పుడు వాళ్ళనెత్తిన ఈ బాంబులుకూడ వేయాలను కొంటాడు.

తాను ఆఫీసుకు వెళ్ళే దారిలోనే దాదాపు ఊరి పొలిమేరల్లో గుడిసె ఉంది. ఆ గుడిసెలో ఓ గుడ్డి ముసలిది ఉంది. ఆ ముసలి దానితో ఓ పడుచు పిల్ల ఉంది. ఆ పడుచు పిల్ల గుడిసె ముందు నిలబడుతుంది. నిలబడి వచ్చే పోయే వాళ్ళను చూస్తూ ఉంటుంది. చూస్తూ పైట తీస్తూ వేస్తూ ఉంటుంది. పైట తీస్తూ వేస్తూ కళ్ళతో నవ్వుతుంది. ఆ నవ్వులో పిలుపు ఉంది. ఆ పిలుపును గ్రహించిన కుశాగ్రబుద్ధులు అటు యిటు చూచి ఎవరో ఒకరు వెళుతూనే ఉంటారు. వెళ్ళినవారు నవ్వుతూ తిరిగి వస్తూనే ఉన్నారు. కొందరు వెళ్ళుతూ ఉంటే, కొందరు వస్తున్నారు. కొందరు వస్తుంటే కొందరు వెళ్ళుతున్నారు. ఆ పడుచుపిల్ల గుడిసె ముందు నిలబడి ఎప్పుడు ఎదురు చూస్తూనే ఉంటుంది. దానిమీద ఎనలేని కనికరం చిట్టిబాబుకు. పాపం!....ఆ పిల్ల....కడుపు కూటి కోసం కళ్ళు చింపుకొని ఎదురుచూచే ఆ పడుచు పిల్ల....ప్చ్....పాపం! తన రాతే మారితే, ఆ గీత ప్రభావమే జరిగితే, ఆ గుడిసెను ఓ మిద్దెగా మార్చి, ఆ పడుచు పిల్లను ఎవరి చేతిలోనైనా పెట్టి, వాళ్ళిద్దరు చిలుకా గోరువంకల్లాగ కాపురం చేస్తుంటే చూడవలెనని ముచ్చట పడతాడు.

అన్నిటికీమించి చిట్టిబాబుకు రచయితలంటే మహాప్రీతి. కారణం- తాను కూడ ఓ బుల్లి రచయిత కాబట్టి. అయితే తాను ప్రణయ గీతాలే వ్రాస్తాడు. అది కవిత్వం కాదంటారు కొందరు. ఎవరేమన్నా, ఈ మధ్య వీళ్ళల్లో వీళ్ళు జుట్లు పట్టుకొనిన పిదప వాళ్ళంటే కాస్త నీళ్ళు నమలుతున్నాడే కానీ, అంతకు మునుపు వాళ్ళంటే పడి చచ్చేవాడు. రచయితలంటే దైవాంశ సంభూతులని అతని అభిప్రాయము. వాళ్ళ కవితలు చదివి కన్నీరొలికించేవాడు. కథలు చదివి కరగి నీరైపాయేవాడు. వాళ్ళది జాలిగుండె అని అతడు తలుస్తాడు. వాళ్ళు నీతికి నిజాయికి వారసులని అతని గట్టి నమ్మకము. నీతి నిజాయితీ

కలిగిన వాళ్ళందరూ ఈ లోకంలో బాధపడుతూనే ఉన్నారు. దరిద్రులుగానే ఉన్నారు. కాబట్టి రచయితలందరు కూడ దరిద్రులుగానే ఉంటారు. ఇది ఊహించలేనిది. సహించరానిది. దీనికి కారణము సమాజమే అని అతని అభిప్రాయము. సమాజం బాగుకొరకు పాటుపడే రచయితను సమాజమే బాగు పరచాలంటాడు చిట్టిబాబు. అందుకే ఆలోచిస్తాడు. తన 'రాతే' మారితే, ఆ గీత ప్రభావమే జరిగితే దినమున కొక్క రచయితకు కనకాభిషేకం చేయా లనుకొంటాడు.

ఇలా దేశాన్ని ఉద్ధరించాలనుకొనే చిట్టిబాబు, దేశాన్ని ఉద్ధరించలేని ఓ ఆఫీసు గుమాస్తా. గుమాస్తా అంటే నీకు గుమాస్తానా?—నీ యబ్బకు గుమాస్తానా?? అంటారేమో? ఎందుకు వచ్చిన బాధ?....ముచ్చటగా ఎన్జీవో అందాము. ఈ ఎన్జీవోను జీవ సమాధి చేశారనుకొంటాడు చిట్టిబాబు జీతం పేరుతో! జీవ సమాధిలో ఉండవలసింది జీవిత కాలంలో సగం. పవిత్ర భారతావనిలో సగటు వయస్సును లెక్కగట్టి, ఆ సగ జీవితకాలమంతా జీవ సమాధిలో ఉండ మనకుండా, దినములో సగంకాలం ఉంటే చాలునని సరి పెట్టుకొని సహృదయతను ప్రకటించుకొనింది ప్రభుత్వం. కాబట్టి ఆఫీ సులో అరదినం, బయట అరదినంగా గడుస్తూ ఉంది ఈ ఎన్జీవోలకు. చిట్టిబాబుకు అంతే మరి!

అలా బయటపడ్డప్పుడు చిట్టిబాబు ఆలోచనలు బోలెడు! ఆవేశం జోలెడు!! ఫలితం సోలెడు!!!

రిక్షాతొక్కుతున్న వానిని చూస్తాడు. రిక్షాలో కూర్చున్నవానిని చూస్తాడు. కార్లోపోతున్నవానిని చూస్తాడు. కాలికి కాలు కొట్టుకొంటూ నడిచే వానిని చూస్తాడు. మోసపోయేవానిని గమనిస్తాడు. మోసం చేస్తున్నవానిని గమనిస్తాడు. ఆ పైఅందరిని ఒక వరుసలో నిలబెట్టుతాడు. నిలబెట్టి ఆలో చిస్తాడు.

రిక్షా తొక్కుతున్నది మనిషి!—రిక్షాలో కూర్చున్నది మనిషి!!....కడు పులో చల్ల కదలకుండ కార్లో పయనించేది మనిషి!....కాలుతున్న కడుపులో

మండుతున్న ఎండలో దారిలో పరుగులు తీస్తున్నది మనిషి!!.... మోసపోతున్నది మనిషి!.... మోసం చేస్తున్నది మనిషి!!.... ఒక్క దెబ్బతో చచ్చేటట్లుగ తుపాకీ గుండ్లను పేలుస్తున్నదీ మనిషి!....చస్తున్నదీ మనిషి!!.... అందరు మనుష్యులే! అందరు తల్లిగర్భమునుండే పుట్టుతున్నారు. తల్లి గర్భములో నుండి పుట్టినవారందరు మనుష్యులుగానే పరిగణింపబడుతున్నారు. పుట్టినప్పుడు అందరినీ ఒకే రిజిష్టరులో నమోదు చేస్తున్నారు. గిట్టినప్పుడు కూడ ఒకే మట్టిలో వేస్తున్నారు. అయితే ఈ విడ్డూరమేమి?—

తనకు ఊహ తెలిసిన నాటినుండి ఆలోచిస్తున్నాడు చిట్టిబాబు. ఆలోచిస్తూ ఆవేశపడుతున్నాడు. ఆవేశపడుతూ ఆలోచిస్తున్నాడు. ఆపై అరచేతిలో గీతను చూచుకుంటున్నాడు. తన రాతే మారితే, ఆ గీత ప్రభావమే జరిగితే ఏదో చేయాలనుకొంటాడు. చేయవలెననుకొని చేసినంత సంతృప్తి పడతాడు.

ఓ రోజు సాయంకాలం. అందమైన బజార్లో ఆలోచిస్తూ నడుస్తున్నాడు చిట్టిబాబు. ఏదైనా ఆలోచించి చేయాలనుకుంటాడు. ఆలోచించినది చేయలేకపోతాడు. చేయగలిగింది ఆలోచించలేక పోతాడు. అయినా ఆలోచించకుంటా వుండలేక పోతాడు. అందుకే ఆలోచిస్తాడు. ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

పిచ్చి మానవుడు! తన ఆలోచనలు తనకేగానీ, బజారంతా ఎంతో అందగా ఉంది. సంజవెలుగు బజారుకే బంగారు పూత పూసింది. ఎవరి తాపత్రము వారిదిగా జనము వస్తున్నారు పోతున్నారు. కార్లు మోటార్లు అరుస్తూనే ఉన్నాయి. ఆమె అందంగా ఉంది. అతడుకూడ ఫరవాలేదు. భార్యాభర్తల్లాగ ఉన్నారు. అయితేకూడ 'అంత అందగత్తె తనని వదలి పారిపోతుందేమో?' అని ఆమె రెట్ట పట్టుకొని నడుస్తున్నాడు ఆ యువకుడు. 'పావలా పూలుకొని యివ్వలేనివాడివి. నువ్వూ ఒక మగాడివే బావా?' అని వగలుపడుతూ వయ్యారంగా కులుకుతూ ఉంది పల్లెటూరి పిల్ల. అడిగింది కొని యివ్వలేదని నానా రభస చేస్తున్నాడొక కుఱ్ఱకుంక. సముదాయించడానికి, ఏడ్చేబిడ్డకు వెలగకాయ చూపిస్తూఉంది తల్లి. ఎంతచెప్పిన వినకుండ తల్లి

పైటచెరగుపట్టి లాగుతున్నాడు. 'వదలు వెధవా!' అని రెండు అంటిస్తున్నాడు ఆ పైటకు అధికారి మగమహానుభావుడు. చిన్నెలు వన్నెలుగా సింగారించు కొని బిరబిర చరచర నడుస్తున్నారు కొందరు అతివలు సినిమాకోసమేమో?....

నిట్టూర్చాడు చిట్టిబాబు. లోకపు తీరును ఆలోచిస్తూ నిట్టూర్చాడు. నిట్టూరుస్తూ ముందుకుసాగాడు. ఊరేగింపు ఎదురుపడింది. మొదట గజరాజు. ఆ తరువాత మేళతాళాలు. గరుడవాహనారూఢుడై దేవుడు. ఆ దేవుని కిరు పైపుల దేవునిలాంటి యిద్దరు మనుష్యులు. వీళ్ళను మోస్తూ, మోయలేక త్రొక్కిసలాడుతూ కొందరు సామాన్యమానవులు. దారి కిరుపైపుల హారతి తట్టలు పట్టుకొని నమ్రతగా నిలబడివున్న ముత్తైదువలు. ఆ వెనుక వేద పాఠం వల్లిస్తూ విప్రోత్తములు....చూడ ముచ్చటగా ఉంది దృశ్యం. చూస్తూ నిలబడ్డాడు. నిలబడి చూస్తున్నాడు. దారిన పోతున్నవారు నిలబడుతున్నారు. కొందరు చెప్పులు విడచి దండం పెడుతున్నారు. కొందరు తొందర తొంద రగా పోతూనే ఓ నమస్కారం పడవేస్తున్నారు. కొందరు చేతితో ఏదో 'మ్యాజిక్' చేసినట్లు అరచేతిని మూతిముందు ఆడిస్తున్నారు. కొందరు చెంపలు ఫళఫళ వేసుకుంటున్నారు. కొందరు సున్నితంగా అలా అలా అనుకొంటు న్నారు. కొందరు నేలపడి మ్రొక్కుతున్నారు. ఆయన దృష్టికి అందరు సమంగా ఉన్నట్లుంది. ఎవరిని ఏమీ అనలేదు. నిర్వికారంగా, నిరామయంగా చిరునవ్వులు చిందబోస్తున్నాడు. చూస్తున్నాడు చిట్టిబాబు. ఆ దేవుని ప్రక్కన నిలబడివున్న యిద్దరు దేవునిలాంటి మనుష్యులను చూస్తున్నాడు. ఒకతను హారతి పడుతున్నాడు. మరొకతడు పైకి చూస్తున్నాడు. పైలోకంలో వున్న దేవునికోసమేమో పైకి చూస్తున్నాడు. ప్రక్కనున్న దేవునికంటే పైలోకంలో వున్న దేవుడు గొప్పవాడేమో మరి! ఆ దేవునిలాంటి మనిషి పైలోకంలో చూస్తున్న దేవుణ్ణి చూడవలెననుకున్నాడు చిట్టిబాబు. అతని చూపులతో తన చూపులు కలిపాడు. దిగ్భ్రమ చెందాడు చిట్టిబాబు. ప్రత్యక్షమైనది పెద్ద చిత్రము! వర్ణనాతీతమైన రంగురంగుల చిత్రము! ఒక కాలు, ఒక చేయి లేపగలిగినంత మేరకు పైకిలేపి నృత్యభంగిమలోనున్న జ్యోతిలక్ష్మి చిత్రము! సినిమా పోస్టర్‌లోని జ్యోతిలక్ష్మి చిత్రము. దేవునిలాంటి మనిషి తప్పక చూడవలసిన చిత్రము!

చిట్టిబాబు ఆలోచనలు చెదరి పోయాయి ఓ క్షణం. చెదరి, అటు ఇటు తిరిగి ఎచటికో వెళ్ళాయి. వెళ్ళి వెళ్ళి ఓ పుస్తకంలో తొంగి చూశాయి. అది తెన్నేటి సూరి కవిత!

కీలు గుఱ్ఱముపైన-బాలీసు కానుకొని
ప్రాణాలు లేనట్టి-భగవంతుడొచ్చాడు
ఊరంత ఊరేగుతూ-ఉత్సాహము సారించుతూ....

ఆ పైన సూరి ఎవరినో ఏమో అడుగమన్నాడు. అది చూచిన చిట్టిబాబు తాను అడుగు వాడనుకొన్నాడు. అక్కడినుండి ఒక్క పెట్టున వచ్చి పడ్డాడు బజార్లో. లాభం లేకపోయింది. అప్పటికే వెళ్ళిపోయాడు దేవుడు. అక్కడ లేడు దేవుడు.

"దేవుడు లేడు! దేవుడు లేడు!!" అని గొణుక్కొంటూ ముందుకు సాగాడు చిట్టిబాబు. మలుపు తిరిగాడు. ఎదురుగా ఆ దేవుడి పుష్కరిణి. మురికి నీటి కంపు తెంపులు తెంపులుగా వస్తూ ఉంది. ఓ మూల కొన్ని బోడి గుండ్లు స్నానానికి అయత్తమవుతూ ఉన్నవి. మరో మూల ఎవడో ముడ్డికడుగడానికి అటు యిటు చూస్తున్నాడు. ఇది దేవుని పుష్కరిణి అనుకొన్నాడు చిట్టిబాబు. కను చీకటి ఆవరిస్తూ ఉంది. విద్యుత్కాంతులు వింత కాంతులీనుతున్నాయి. ఆ కాంతిలో ఆ దేవుడి గాలిగోపురం డాబుసరిగా, దర్జాగా, ఠీమ్మి విరచుకొంటూ నిలబడివుంది. ఎవరో యాత్రికుడు ఆ గోపురాన్ని 'ఫోటో' తీయడానికి తంటాలు పడుతున్నాడు. ఆ గోపురాన్ని చూశాడు చిట్టిబాబు. చూస్తూ ఆలోచించాడు. ఆ గోపురం....హైందవ సంస్కృతికి చిహ్నం. ఆలయ ప్రవేశానికి మహద్వారం. ఆ ఆలయమున్నది పవిత్ర పుణ్యక్షేత్రం. అప్పుడు తట్టింది అతనికి యిది పుణ్యక్షేత్రమని. తాను నిలబడివున్నది పుణ్యక్షేత్రంలో పుష్కరిణివద్ద అని! తన రాతే మారితే ఆ గీత ప్రభావమే జరిగితే పుణ్యక్షేత్రంలోని పుష్కరిణిని బాగుచేయవలెననుకొన్నాడు. దేవుడు చేయలేని పనిని తాను చేయవలెననుకొన్నాడు.

ఇన్ని యేండ్లుగ, ఎన్నో యేండ్లుగ దేవుడు ఆలోచించలేనిది తాను ఆలోచించాడు. దేవుడు చేయలేని పని తాను చేయబోతున్నాడు. తృప్తి

తొణికిసలాడింది చిట్టిబాబు కన్నుల్లో! ఎంతో బరువు దించినట్లయింది చిట్టి బాబు గుండెల్లో!!.... తేలికపడిన తనువు మూడడుగులు ముందుకు వేసింది.

"రూం కావాల్నా సార్!" ఆరేళ్ళ కుఱ్ఱవాడు అరవైయేళ్ళ ముసలివానిని అడుగుతున్నాడు.

"ఏం రూం?" ఎదురుప్రశ్న వేశాడు అరవైయేళ్ళ ఆసామి బొంగురు గొంతుకతో.

"రూం సార్, రూం!" రెట్టించాడు కుర్రవాడు ఆమాత్రం తెలియదా అన్నట్లు.

"ఏముంటుం దక్కడ?" కావలెననే కవ్వించింది ముసలిప్రాణి.

"కుర్చీలుంటాయి, టేబిలు వుంటుంది. మంచముంటుంది. మంచం మీద పరుపుంటుంది. పరుపుమీద దిండ్లుంటాయి. పైన పంకా తిరుగుతూ వుంటుంది. స్నానానికి నీళ్ళుంటాయి. ఇంకా....ఆఁ! ఇంకా....ఆఁ! ఆఁ! పిల్లలుకూడ వుంటారు సార్!" ఠీవిగా నిలబడ్డాడు పాఠం బాగా అప్పచెప్పిన కుర్రవాడిలా ఆరేళ్ళ కుర్రవాడు. 'అహ్హహ్హ!' అని నవ్వుతున్నాడు ముసలి. అరిగిపోయిన పండ్లు అందంగా కనుపిస్తున్నాయి. మూరెడు ముందుకు వచ్చిన పొట్ట, నవ్వుతూ వుంటే ఎగిరెగిరి పడుతూ వుంది.

మూడడుగులు ముందుకువేసిన చిట్టిబాబు ముఖం మూడు వంకరులుగ తిరిగింది. ముఖం మూడువంకర్లు తిరిగితే ముంగాళ్ళకు బంధాలు పడ్డవి. ముసలి ఆకారం ఆరేళ్ళ కుర్రవాడిని అనుసరించింది. చిట్టిబాబు నిలబడి పోయాడు. నిలబడివాళ్ళను చూస్తున్నాడు. చూస్తూ ఆలోచిస్తున్నాడు. ఇది పుణ్యక్షేత్రము. ఈ క్షేత్రానికి దైవదర్శనార్థం ఎందరో వస్తున్నారు. ఎన్నో తరాలుగా వస్తున్నారు. అమ్మమ్మ అంటూ వుండేది- ఒకప్పుడు ఈ క్షేత్రంలో ఎంతో ఆచారముండేదట. ఇక్కడ పూచిన ప్రతి పూవు దేవునికోసమేనట! అందుకే ఆడవాళ్ళు తలలో పూవులుకూడ పెట్టేవారు కాదట. ఆనాడు అంత నియమము- అంత నిష్ట. ఈరోజు అంతా తారుమారయింది. క్షేత్రం విహార స్థలంగా మారింది. వీధికి రెండుమూడు లాడ్జీలు. లాడ్జికి అధమపక్షం పది గదులు. గదికి ముగ్గురు ముండలు! దేవుడిపేరుతో రావడం. గవర్నమెంటు సారాయి అంగడిలో దూరడం. ఓ లాడ్జి గదిలో పడి పొర్లడం-ఓహ్! ఓయీ

దేవుడా! నీ ధర్మాన ఎంత ఆనందం మోసుకొని పోతున్నారయ్యా ఈ భక్తులు! నిన్నుజూచి మరెంత పున్నెం మూటగట్టుకొని పోతున్నారయ్యా ఈ మాన వులు!!....

"వాడిచేతిలో పుండుపుట్ట. వాడిమాయ వాడికి దగల! నామీద చెయ్యి చేసుకొన్నాడు. ఇరంపరంలేని యదవచెయ్యిపట్టి యీదిలో పడితిని. వాడిగతి దేవుడే చూస్తాడులే!" ఎవరో ఒక నడివయసు ఆడది. నోటిలో రక్తం కారుతూ వుంది. కళ్ళల్లో నీరు కారుతూ వుంది. కన్నీటితో కలిపిన రక్తం. రక్తంలో కలిపిన కన్నీరు. అప్పుడప్పుడు చేతితో అటూయిటూ తుడుచుకోవడతో మొగానికి వికృతంగా రంగువేసినట్లుంది. ఆమె యేడుస్తూ వుంది. యేడుస్తూ తిట్టుతూ వుంది. తిట్టుతూ వడివడిగా నడుస్తూవుంది.

"నా కొంప నాయాలు కూలిస్తే, యీడికొంప కూల్చేవాడు లేకపోలే దులే! డబ్బుచల్లి యీ కోర్టుల్లో గెలిస్తే సరిపోతుందా? ఇదంతా చూస్తూనే వుండాడులే పైన మండేవాడు!"- ఓ శవాకారం. 'హైకోర్టు వక్కీలు' అని వ్రేలాడుతున్న బోర్డు ముందు నిలబడింది. నిలబడి వాపోతూ తెరలుతెరలుగా దగ్గుతూ వుంది.

అ సమీపములోనే పెద్ద హోటలు. వస్తూపోతున్నవారితో పెద్ద సంద డిగా వుంది. ఓ బిచ్చగాడు ఒక చేతితో దొప్ప పట్టుకొన్నాడు. మరొక చేతితో డొక్క తట్టుతున్నాడు. కడుపుమంటనంతా కంటిచూపుల్లో నిలిపినట్లున్నాడు. 'దర్మం బాబూ! దయచూడండి బాబూ!!' అని ఆగడం చేస్తున్నాడు. ఎవరో నవనాగరీకుడు 'ఏమిటీ న్యూసెన్సు?' అని హోటలు అధినేతను అడుగు తున్నాడు. అధినేత ఎవరిమీదనో మండిపడ్డాడు అగ్గిమీద గుగ్గిలంలా. వాడు బిచ్చగాడిమీద విరుచుకపడ్డాడు. బిచ్చగాడు కదలనంటే కదలనంటున్నాడు. వాళ్ళ వాదం సాగుతూనే వుంది. అంతలో మరొకడు ఓ పెద్దచెంబు మంచి నీళ్ళుదెచ్చి బిచ్చగాని మొగాన కొట్టాడు. 'దేవుడా! చూడు. బాగా కన్నులు తెరచి చూడు!! నా గతి వీళ్ళకు పట్టేలాగ చూడు!!' అని గొణుక్కుంటూ,

గొణుక్కుంటూ కుంటుకొంటూ, కుంటుకొంటూ తిరిగి చూచుకొంటూ ముందుకు నడుస్తున్నాడు బిచ్చగాడు.

జాలివేసింది చిట్టిబాబుకు. దేవునిమీద జాలివేసింది. ఆఫీసులో తనకు పైవాళ్ళు యిద్దరంటే యిద్దరు. ఒకరు మేనేజరు. మరొకరు ఆఫీసరు. వీరిద్దరితో వేగడానికే తనకు తలప్రాణం తోకకు వస్తూవుంది. పాపం! ఈ దేవుడు యిందరితో యెలా వేగుతున్నాడో? ఇందరి మొరలను యెలా వింటున్నాడో? బహుశా ఈ మొరలన్నిటినీ వినివిని విసిగి వేసారి ఏమీ చేయలేని స్థితిలో నిరామయంగా నిలబడిపోయాడేమో అదే మంచిదని! ఇదంతా చూచి చూచి, ఆలోచించి ఆలోచించి, ఆపైన ఏడ్చేవాడు చిట్టిబాబు. కానీ యీనాడు నవ్వుతున్నాడు. తన ఆలోచనలతో తానే తనివిదీర నవ్వుతున్నాడు!

తనివిదీర నవ్వుకొనేసరికి తేలికపడింది హృదయం. ఆలోచనలు ఆగిపోయాయి. అసలు తాను బయలుదేరింది సినిమాకన్న సంగతి గుర్తుకు వచ్చింది. అదిరిపడ్డాడు చిట్టిబాబు. అదరిపడి అటూయిటూ చూచి అందరిలాగే ముంజేతివైపు చూచుకొన్నాడు, అప్పటికే ఆలస్యమైపోయిందేమో అని! అందరికీవున్న గడియారం తనకు లేదు. తన ముంజేయి బోసిగా వుంది. నిట్టూర్చాడు చిట్టిబాబు. నిట్టూరుస్తూ అరచేతివంక చూచుకొన్నాడు. అరచేతిలో గీత! అదే మారితే మొట్టమొదటిసారిగా ఓ గడియారం కొనవలెననుకొన్నాడు. ఆ గడియారం అనేది లేక తాను చాల యిబ్బందిపడుతున్నాడు. చేయవలసిన పని తాను వేళకు చేయలేకపోతున్నాడు. కొన్ని కార్యక్రమాలు వాయిదా పడుతున్నాయి. కొందరిదగ్గర మాట నిలబెట్టుకోలేకపోతున్నాడు. ఈవేళ సినిమా కూడా ఆలస్యమైపోయేటట్లు తోచింది. సినిమా సంగతి మనసులో మెదిలేసరికి వడివడిగా నడిచాడు చిట్టిబాబు.

సినిమా హాలు ముందు జనం పలుచబడ్డారు. అప్పటికే ఆట ప్రారంభమైనట్లుంది. ఒకటీ అర రిక్షాలు మాత్రం అటుయిటు తిరుగుతున్నాయి. కాలుగాలిన పిల్లిలా పరుగెత్తాడు చిట్టిబాబు ఓ కౌంటరు దగ్గరికి. పరుగెత్తినవాడు పరుగెత్తినట్లుగ మరో కౌంటరు దగ్గరి కురికాడు. అక్కడినుండి తిరుగు

ముఖం పట్టాడు. క్రింద తరగతుల టిక్కెట్లన్నీ అప్పటికే అమ్ముడు పోయాయి. సినిమా హాలు ముందు చిన్నబోయిన మొగంతో నిలుచుకొన్నాడు చిట్టిబాబు. రంగురంగుల విద్యుత్కాంతులతో చిత్రంగా వెలుగుతూ ఉంది సినిమా హాలు. అప్పుడు నడుస్తున్న చిత్రం తాలూకు అర్ధ నగ్నంగా, అందంగా వున్న చిత్రాలు హాలు ముందర అలంకరించబడ్డాయి. అందంగా అలంకరించబడి ఆహ్వానిస్తున్నట్లున్నాయి. తిరిగి వెళ్ళిపోవడానికి మనస్కరించ లేదు చిట్టిబాబుకు. పై తరగతి టిక్కట్టు కొందామనుకొన్నాడు. తాను క్రింది తరగతి మనిషి కదా? అని ఆలోచనలో పడ్డాడు. అయినా ఫరవాలేదను కొన్నాడు. అనుకుంటూ పై తరగతి కౌంటరు వద్దకు వెళ్ళాడు. వెళ్ళి అలానే నిలబడిపోయాడు. నిలబడి అర నిముషం చూపు నిలిపాడు. ఆ పైన నోరు తెరచాడు!.... ఆవు దూడ!!.... ఎంతో ఒద్దికగా, మరెంతో ముద్దుగా, రెండు టిక్కట్లు చేతిలో పట్టుకొని ఎదురుపడ్డారు. ఎదురుపడి, నిశ్చలంగా నోరు తెరిచి నిలబడి వున్న చిట్టిబాబును చూచి అదరిపడి, అంతదూరం వెళ్ళి నవ్వులతో విరగపడి, ఒకరునొకరు రాచుకొంటూ సినిమా హాల్లో జొరబడి, చిట్టిబాబు కాళ్ళకు కట్టారు కట్లు. అటుయిటు కదలలేక నిలబడిపోయాడు చిట్టి బాబు. నిలబడి ఆలోచిస్తున్నాడు.

అప్పటికి దాదాపు పది సంవత్సరాల క్రిందటనే తనకు ఆడదాని అవశ్య కత తెలిసివచ్చింది. అప్పుడు తన వయస్సు పదిహేనేండ్లు. పదిహేనేండ్ల వయస్సుకే అందమైన ఆడమొగాన్ని చూడకూడదనుకొంటూ చూడడానికి ఆరంభించాడు. చూచినపుడంతా, నరాలు జివ్వుమని లాగాయి. గుండెల్లో ఊహలు రివ్వుమని లేచాయి. తాను ఆ ఊహల్లో .... తీయని వూహల్లో తేలియాడేవాడు. అది ఒక రసమయ జగత్తు. వర్ణింప నలవికాని మత్తు. దారిలో నడుస్తూ వుంటే నడిచినట్లు ఉండేది గాదు. గాలిలో తేలిపోయినట్లు తోచేది. ఎండ వెన్నెలగా భాసించింది. ఆకలిదప్పులు.... పాపం! అవి ఎంత మంచివి. జోలికి రానేలేదు. అలా ముచ్చటగా మూడేండ్లు గడచింది. అంతలో అబ్బాయికి మైనరు తీరిందన్నారు. మైనరు తీరేసరికి - గున్నమామిడి పండులాంటి అమ్మాయి కాదు కానీ, గుమస్తా గిరి వరించింది. గాలికి వదలి

వుండిన యింట్లో వాళ్ళు తన్నొక పెద్దమనిషి క్రింద జమకట్టారు. భయభక్తిగ పలుకరించేవారు. వినయవిధేయతలు ప్రకటించేవారు. మొదట అది చాలా తృప్తి నిచ్చింది తనకు. అందరు తనంటే 'భయపడుతున్నారులే!' అని మురిసిపోయాడు. కానీ రానురాను యింట్లో వాళ్ళ మెత్తని ప్రవర్తన వెనుక దాగిన రహస్యం తెలిసిపోయింది. మెత్తగ లొంగదీసుకొని మొత్తం బాధ్యతలు నెత్తిన రుద్దారు. ఇప్పుడు యింటి అవసరాలన్నిటికీ తాను బాధ్యుడు!- ఆ గృహము- ఏ మహాపాపి అన్నాడో స్వర్గసీమ అని! వాడి నాలుక వెయ్యి ముక్కలు కావాలనుకొంటాడు చిట్టిబాబు. తెచ్చే జీతమా-చాలదు. చాలినా చాలకపోయినా బ్రదకాలి. బ్రదకాలి అంటే కొన్ని కనీస సౌకర్యాలన్నా కావాలి. దానికి డబ్బుకావాలి. "ఏవేళకు లేచినా రాళ్ళ కాలువ దగ్గరే తెల్లారినట్టు" ఎటు తిరిగినా అటు తిరిగి యిటు తిరిగి డబ్బు దగ్గరే తెల్లారుతూ ఉంది బ్రదుకు. తన తెలివితేటలను జాగ్రత్తగా లెక్కగట్టి, "ఇదో! యిదే! యిది తీసుకొని బ్రదుకు. ఆపై మాట్లాడకు!.... మాట్లాడితివో జాగ్రత్త!" అని తన జీవితానికే విలువ గట్టింది ప్రభుత్వం. తాను తెస్తున్న జీతాన్ని తెలుసుకొని, దానికి విలువగట్టి, "అబ్బాయీ! అటు చూడు. అడుక్కు తినేవాడు బ్రతుకుతున్నాడు. అందల మెక్కి తిరిగేవాడు బ్రదుకుతున్నాడు. ఎక్కడికక్కడ తృప్తిపడాలి నాయనా! ఆశలకు అంతు ఎక్కడిది? మట్టసంగా బ్రతుకడానికి నేర్చుకో! అప్పుచేసి, లేని అగచాట్లు ఎందుకు నెత్తిన రుద్దుకొంటావు? ఇదంతా నీ శ్రేయస్సు కోసమే!" అని లోకం పాఠం నేర్పింది, ఎక్కడ అప్పుకోసం తయారవుతాడేమోయని ముందు జాగ్రత్త తీసుకొని. ఈ యాతన చిట్టిబాబులో ఆలోచనలు రేకెత్తించింది. అందుకే చిట్టిబాబు ఆనాటినుండి అందమైన మొగాలను కూడ మరచి ఆలోచిస్తున్నాడు. లోకాన్ని మరామత్తు చేయవలెనని ఆలోచిస్తున్నాడు.

కానీ ఈరోజు ఆవు దూడ కంట పడ్డాయి. అందమైన ఆవు దూడ కంట పడ్డాయి. ఆవును దూరంగా తరిమివేశాడు. దూడను నిలబెట్టి చూశాడు. ప్రక్కన నిలబెట్టుకొని చూశాడు. ఒడ్డు పొడుగు, అందము చందము........ ముచ్చటగ ఉంది దూడ. ముద్దుగ ఉంది దూడ! దూడ వయ్యారంగా నడుస్తూంటే నడకలో అందం. ఓరగంట చూస్తే కనుకొలకుల్లో అందం.

నొక్కుల జుట్టులో అందం. నవ్వితే బుగ్గ సొట్టల్లో అందం. దానిమ్మ గింజ ల్లాంటి పలువరసలో అందం! అబ్బ! అందం! అని ఆలోచిస్తూ గట్టిగానే అరచాడు చిట్టిబాబు. నిక్కిచూచి, ఒంటరిగా నిలబడివున్న చిట్టిబాబును చూచి, చిటికెడు ముక్కుపొడుం దట్టించి, "ఏవండీ, ఏదో కలవరిస్తున్నట్టున్నారే! ఆట మొదలు పెట్టి అర్ధగంట దాటింది. మీరు సినిమాకు వెళ్ళరా?" అన్నాడు బుక్కింగు క్లార్కు. ఆ మాటతో అదిరిపడ్డాడు చిట్టిబాబు. అటుయిటు చూచి బోలెడంత సిగ్గు ఒలకబోసి సరాసరి కౌంటరు దగ్గరికి వెళ్ళి టిక్కెట్టు కొన్నాడు. పై తరగతి టిక్కెట్టు కొన్నాడు. ధీమాగా కొన్నాడు. ఆపై ఠీవిగా నడిచాడు చిట్టిబాబు పై తరగతికి!—

అప్పటికే ఆట నడుస్తూ వుంది. అంతసేపు వెలుగులో వుండి హాల్లో అడుగు పెట్టేసరికి ఒక్కసారిగ అంధకారములో మునిగినట్లయింది. ఎటు వెళ్ళడానికి తోచకుండా నిలబడ్డాడు చిట్టిబాబు. "ఇటు సార్! యిటు!!" అంటూ ఎవరో కుర్రవాడు మినుక్కు మినుక్కుమంటున్న చేతి దీపంతో దారి చూపించాడు. అతడు చూపిన దారి వెంబడి ఓ చివరి వరకు నడిచాడు. ఆపై అతడు చూపిన కుర్చీలో కూర్చున్నాడు. కూర్చుని నడుస్తున్న సినిమా చూస్తున్నాడు. చూస్తూ దూడను గురించి ఆలోచిస్తున్నాడు.

"బలె ఉంది గదూ దూడ!" అన్నది మనస్సు.

"అబ్బ! వేరే చెప్పాలా?" బదులు పలికాడు తాను.

"అయితే ప్రేమించరాదూ!" ప్రోత్సహించింది మనసు.

"అంత సులభమా?" ప్రశ్నించాడు తాను.

"కాక మరి?" నిర్లక్ష్యంగా బదులు పలికింది మనసు.

"అయితే ఆ సులభ మార్గమేదో చెప్పరాదూ! నీకు పున్నెముంటుంది!" బ్రతిమలాడాడు తాను.

"ఏముంది? వాలకం చూస్తే కాలేజీ పిల్లలా ఉంది. ఉదయం కాలేజీకి వెళ్ళడానికి ఎటూ బస్సు ఎక్కుతుంది. సాయంత్రం కాలేజినుండి తిరిగి రావడానికి కాలేజీలో బస్సు యెక్కి, ఉదయం బస్సు ఎక్కినచోట దిగుతుంది.

అంటే దినమునకు ఒక్కసారి బస్సు ఎక్కుతుంది. ఒక్కసారి దిగుతుంది. ఈ రెండు పనులు జరిగేది ఒక్కచోటే!- కాబట్టి ఆ చోటు పసికట్టు. పని కట్టుకొని అక్కడ నిలబడు. ఆపై యింటి వరకు వెంటపడు!"

"తదుపరి దవడపళ్ళు రాల్చుకో!"

"ఛీ! ఛీ! ఏమిటా మాటలు? సుద్ద దద్దమ్మలా వున్నావే? కొంతకాలం ఓపికగా ఆమె చుట్టు తిరుగు. ఆమె నిన్ను చూచినా నువ్వు ఆమెను చూడ నట్లుగా తిరుగు. తరువాత కొంతకాలం చూచీ చూడనట్లుగా తిరుగు. అప్పుడు ఆమె నీకొక బిరుద ప్రదానం చేస్తుంది మనస్సులోనే- 'బాడీ గార్డ్!' అని. ఆపై 'అయ్యో! పాపం!' అన్న సానుభూతితో అప్పుడప్పుడు మాత్రం ఆమె నిన్ను చూస్తుంది. కొంతకాలానికి ఆ సానుభూతి అభిమానంగా మారుతుంది. అప్పటినుండి ఆమె నిన్ను చూడడానికి ఆరంభిస్తుంది. 'ఆమె నిన్ను చూస్తుంది!' అన్న విషయం దృఢపడినప్పుడు నీవున్ను ఆమె వైపు చూడు. చూచి చిన్నగా నవ్వు. ఆమె తల మెల్లగా వాలిపోతుంది. అప్పుడు నీవు కాస్త బిగ్గరగా నవ్వినా పరవాలేదు. ఆమె మళ్ళీ ఒక్కసారి తల యెత్తి చూస్తుంది. అప్పుడు మెల్లగా కన్నుగొట్టు!"

"శ్రీమద్రమారమణ గోవిందో! హరి!!"- కొంప కూలుతుంది.

ఆట ఆగింది. తెరమీద 'విశ్రాంతి' అని కనబడింది. హాలంతా విద్యు త్కాంతులతో వెలిగింది. ఆలోచనతో వుండిన చిట్టిబాబు అటు యిటు చూచి ఆపై ప్రక్కన చూశాడు. ప్రక్కన దూడ! ఆ ప్రక్కన ఆవు'- దూడ చిలిపిగా చూస్తూ ఉంది తన వైపు. కుర్చీలో ఒదిగిపోయాడు. ఒదిగి కూర్చుని చూచీ చూడనట్లు చూస్తున్నాడు చిట్టిబాబు. దూడ లేచింది. దూడ వెంబడి ఆవు లేచింది. దూడ వెంబడి ఆవుగా బయటకి నడిచారు. నడుస్తూ ఉంటే చీర కుచ్చెళ్ళు తగిలాయి! ఉక్కిరి బిక్కిరయ్యాడు చిట్టిబాబు. ఉడుతలా కుర్చీకి అతుక్కుపోయాడు. 'కొంగు తగిలితే మగవాళ్ళు!' పాట శ్రావ్యంగా వినిపిస్తూ వుంది. చిట్టిబాబు ఆనందలహరిలో తేలిపోతున్నాడు. తేలిపోతూ పాటను అనుభవిస్తున్నాడు.

అయిదు నిముషాలు గడచింది. మసక చీకటి హాలుకు మసి పూసింది. బయటనుండి ఒక్కొక్కరుగ లోనికి వస్తున్నారు. వచ్చి వారివారి కుర్చీలలోనే కూర్చుంటున్నారు. అంతవరకు మేలు!- ఇష్టమొచ్చిన చోట కూర్చుని, భావ స్వాతంత్ర్యము వ్యక్తి స్వాతంత్ర్యము వున్న దేశములో ఈ మాత్రం స్వాతంత్ర్యం లేదా? అని వాదులాడకుండా అంతమట్టుకు అక్కడైనా మనుష్యుల మనిపించుకొంటున్నారు. ఆవు వెంబడి దూడగా లోనికి వచ్చారు. సంగీత రసాస్వాదనలో మునిగిన చిట్టిబాబు కుర్చీకి చేరగిలబడి కాళ్ళు బార సాచి వున్నాడు. ఆవు జాగ్రత్తగా దాటుకొనింది. దూడ దాటుకొనేటప్పుడు కాలు తగిలింది. 'సారీ!' అనింది దూడ ముద్దుగా. ఎగిరిపడి కుర్చీలో నిటారుగ కూర్చున్నాడు. కూర్చున్నా మెలికలు తిరిగిపోతున్నాడు చిట్టిబాబు. ఏదో బదులు చెబుదామని చెప్పలేకపోతున్నాడు. "అయ్యో! పిచ్చి సన్నాసీ! ఇంతటి అపూర్వావకాశాన్ని జారవిడిస్తే యెలా?....మళ్ళీ రమ్మంటే వస్తుందా? ఊఁ! కానీ- అదో! కాఫీ అమ్ముతున్నారు చూడు. ఇవో! ఈ అబ్బి చాక్లెట్లు కొనమంటున్నాడు చూడు. మూడు కాఫీ........ఆరు చాక్లెట్లు........ఊఁ! ఆర్డరివ్వు! త్వరగా!"....

"ఆర్డరైతే యిస్తాను. కానీ అవి వాళ్ళకు యిచ్చేదెలాగూ అని?"

"ప్రతి దానికి యిలా నంజితే యిక తెల్లారినట్టే!....మొదట కాస్త బెట్టు చూపిస్తారు. నువ్వు మాత్రం పట్టు వదలద్దు. 'ప్లీజ్! ప్లీజ్!' అని రెండంటే రెండుసార్లు అను. అంటున్నప్పుడు కాస్త దీనంగా మొగంపెట్టు. అంతే. వచ్చినట్లు తీసుకొంటారు. కాఫీ తాగుతూ మాట కలుపు. చాక్లెట్లు చప్పరిస్తూ వాళ్ళని కొనియాడు- చాలు. నువ్వు అగ్రశేణి ప్రేమికుడవై పోతావు."

"నిజంగానా?"

"ప్రయత్నించి చూడరాదూ! నీకే తెలుస్తుంది."

"ఏమోనబ్బా! నాకేమో భయంగా ఉంది."

"అయ్యో! పిఱికి సన్నాసీ!- 'అలస్యం అమృతమ్ విషమ్!' ఊఁ! కానీ!"

తొందర పెడుతూ వుంది మనసు. ఎంత ప్రయత్నించినా గొంతు పెగల్లేదు. అటు యిటూ చూస్తాడు. కాఫీ అమ్ముతున్న వానిని చూస్తాడు. చాక్లెట్ల అబ్బిని చూస్తాడు. ఆపై దూడను చూస్తాడు. 'గుడగుడ' అంటుంది గుండె. అంతటితో ఆగిపోతాడు. కానీ చిట్టిబాబు కోసం సినిమా ఆగలేదు. సినిమా అయిపోయింది. పాపం! చిట్టిబాబును ఆ అవస్థలోనే నిలిపి సినిమా అయిపోయింది. అందరూ ఓ ప్రవాహంలా హాలు బయటపడ్డారు. చిట్టిబాబు కూడ పడ్డాడు దూడ వెంట!—

తిధి వారం నక్షత్రం చూడలేదు చిట్టిబాబు. మంచి లగ్నంకోసం మంతనాలు జరుపలేదు. అయినా అ 'వెంటపడు' ప్రారంభోత్సవము మంచి లగ్నములోనే జరిగినట్లుంది. కొన్ని పనులు అలాగే జరుగుతుంటాయి. మరి కొన్ని పనులు ఎంత మంచి లగ్నంలో ప్రారంభించినా పట్టుమని పది రోజులు కొనసాగవు. ఆయిదేండ్లు నిర్విఘ్నంగా కొనసాగింది ఆ వెంటపడడం.

సాధారణంగా ఎనిమిది గంటలప్పుడు మునిసిపాలిటీ సైరను మేలు కొలుపులు పాడేది చిట్టిబాబుకోసం! ఆపైన మగత నిద్రలో మరో అరగంట పడకమీద పది దొర్లుతాడు. తరువాత లేస్తాడు. లేచి ప్రక్క యింట్లో 'గంట ఎంత?' అని అడిగిస్తాడు. 'తొమ్మిదింబావు' అని బదులు వస్తుంది నిర్దాక్షిణ్యంగా. ఆదరాబాదరా మొగం కడుగుతాడు. ఓపిక వుంటే స్నానం - లేదంటే అదీలేదు. ముంగాళ్ళమీద పరుగులు తీస్తే, అప్పటికే పావుగంట ఆలస్యమయ్యేది. మేనేజరుగారి వడ్డింపుతో పని ప్రారంభమయ్యేది. కానీ యీ అయిదేండ్లలో అయిదు గంటల తరువాత ఎన్నడు నిద్ర యెఱుగడు చిట్టిబాబు!

అయిదు గంటలకు నిద్ర లేచిన చిట్టిబాబు ఆరు గంటలకు యిల్లు కదలుతాడు. ఈ గంట వ్యవధిలో ఉన్న రెండు జతల బట్టలలో మాసిన జతను ఉదకడం, ఉదికి వుంచిన జత బట్టలను చెంబు యిస్త్రీ చేయడం, కాల కృత్యాలు తీర్చుకోవడం చేస్తాడు. ఆరు గంటలకు యిల్లు వదలిన చిట్టిబాబు ఏడు గంటలకు 'బస్‌స్టాప్' దగ్గరచేరుతాడు. అల్లంత దవ్వులో నిలబడతాడు. నిలబడి దూడను గుఱించి ఆలోచిస్తాడు. ఆలోచిస్తూ ఎదురు చూస్తాడు.

దూడ వస్తుంది. చిట్టిబాబు ఎదురుతెన్నులు కాస్తున్నాడని కాదు, కాలేజీకి వెళ్ళడానికని వస్తుంది. వస్తూ ఉంటే నడకనాణ్యాలు దిద్దుకొంటుంది. రాజహంస పాఠాలు నేర్చుకొంటుంది. చిట్టిబాబు గుండె ఆనందాలు చేర్చుకొంటుంది. అంతకు మునుపే ఆ 'బస్‌స్టాప్' కన్నెపిల్లల కలకలముతో నిండి ఉంటుంది. ఆమె రాకతో అందరు ఆమెను చూచి చిరునవ్వులు కురిపిస్తారు. ఆమె కూడ నవ్వుతుంది. నవ్వుతూ వాళ్ళల్లో కలిసిపోతుంది. కలిసిపోయినా, చుక్కల్లో చంద్రునిలా, సులభంగా గుర్తు పట్టవచ్చు.

చూస్తూ నిలబడతాడు చిట్టిబాబు. నిలబడి ఆలోచిస్తాడు. అక్కడ గుమిగూడిన అందరిలో ఒక్కొక్కరిలో ఒక్కొక్క ప్రత్యేకత ఉంది. ఒక పిల్లకు ముక్కు అందం. మరో పిల్లదానికి పలువరుస అందం. ఇంకో జవరాలికి నొక్కులు తిరిగిన పొడుగాటి వెంట్రుకలు అందం. ఒక తన్వికి కటిస్థలి అందం. మరొక మగువకు వక్షస్థలి అందం! ఇలా యిలా, ఎన్నో యెన్నో ప్రత్యేక అందాల సమ్మేళనమే దూడ అని తలుస్తాడు చిట్టిబాబు. అక్కడ వున్న అందమంతా దూడలోనే వుందని అభిప్రాయపడతాడు చిట్టిబాబు. అందుకే అందరిలో ఆమెనే చూస్తూ నిలబడతాడు చిట్టిబాబు!—

బస్సు వస్తుంది. వచ్చి నిలబడుతుంది. నిలబడిందే తడవుగ తోసుకుంటూ తొక్కుకుంటూ, బస్సులో పడడానికి అందరు ప్రయత్నిస్తారు. కాస్త ముందు అయితే కూర్చొవడానికి స్థలం దొరుకుతుందేమో? అని అందరి తాపత్రయము. ఆ తాపత్రయములో సభ్యతమరచి పోతారు. మూడు జుట్లు అయినా చేరవచ్చును కానీ మూడు కొప్పులు మాత్రం చేరరాదన్న సామెతను సార్థకం చేస్తారు. ఒక్కొక్క రోజు ఆ తోపులాటలో 'దూడ' అందరి మధ్యన పడుతుంది. పడి నలిగి పోతుంది. ఆమె అలా నలిగి పోతూంటే చిట్టిబాబు గుండె చివుక్కుమంటుంది. ఒక్కొక్కరిని పడిపిపట్టుకొని రబ్బరు బంతిలా ఆమడల దూరానికి విసరి పారవేయాలనుకొంటాడు. అనుకొంటూ ఆమె వైపు చూస్తాడు. అప్పటికే ఆమె అందరి మధ్య దబ్బలా అయిపోతూ ఉంటుంది. "అయ్యో! ఆమె ఒంటి నిండుకు వున్న వంపులు చదరమై

పోతున్నాయే!'' అని వాపోతాడు. వాళ్ళు బస్సు యెక్కి కూర్చున్నా, చిట్టిబాబు నిలబడి వాపోతూనే ఉంటాడు. బస్సు వెళ్ళిపోతూనే ఉంటుంది. దూడను మోసుకొని పోతున్న బస్సు చిట్టిబాబు గుండెలను కూడ మోసుక పోతుంది.

ఇప్పుడు గుండెలు లేని 'ఎన్జీవో' చిట్టిబాబు. తన 'ఎన్జీవో' పదవికి నిజంగా గుండెలు అవసరమే లేదు. గుండెలున్నవాడు గుట్టుగ వుండలేడు. ఆ గానుగెద్దు జీవితం గడపలేడు. (ఇది ఈ మధ్య 'ఎన్జీవోల' సమ్మెలో తేలిన సారాంశం. దూడ మాయలో పడిన చిట్టిబాబుకు తెలియని వేదాంతం!) అందుకే యింటికంటే గుడి భద్రమని చిట్టిబాబు ఆఫీసుకు బయలుదేరుతాడు. ఆఫీసు యిల్లు అనుకొని అక్కడే కాపురం పెట్టిన మేనేజరు చిరునవ్వుతో ఆహ్వానిస్తాడు చిట్టిబాబును. "ఇలా అయితే నువ్వు తప్పకుండా బాగుపడతావు. నీకెంతో ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉంది. ఇంకను కాస్త ముందు రావడానికి అలవాటు చేసుకో! డబ్బు యేముంది నాయనా?.... వెధవది! వస్తుంది. పోతుంది. పేరు సంపాదించాలి. మంచిపేరు సంపాదించాలి.'' తెలిసిందా అని కన్నులతోనే ఆశీర్వదిస్తాడు. నోటంటమాట వెలువడితే కుఱ్ఱవాడు చెడిపోతాడేమో అని అతని బెంగ. ఈ అయిదేండ్ల కాలంలో అంతకంటే ముందు ఆఫీసుకు వెళ్ళలేకపోయాడు చిట్టిబాబు. అందుకే బాగుపడలేకపోయాడు.

నిర్ణీత కాలములో తూర్పున పుట్టి పడమటనే క్రుంగుతాడు అనుకొనే సూర్యుడు కూడ ఆయన భేదముత్తో కొన్ని నిముషాలు అటో యిటో అవుతున్నాడు. గంట కొట్టడానికే నిర్ణయింపబడిన దేవస్థానం ఆఫీసు బిళ్ళ జవాను రాత్రిపూట మగత నిద్రలో అటో యిటోగా కొట్టుతున్నాడు. 'నా హయాములో రైళ్ళనన్నిటినీ సకాలములో నడిపిస్తాను, లేదా నేనే రాజీనామా చేస్తాను!'' అని సగర్వంగా చాటుకొన్న మంత్రివర్యుని మాటలు రైలు చక్రాల వేగాన్ని యింకను కాస్త తగ్గించాయి, నిదానమే ప్రధానము, క్షేమకరము అన్న లక్ష్యాన్ని పురస్కరించుకొని. కాగా రైళ్ళు సకాలములో

రాలేదు. మంత్రివర్యుడు రాజీనామా చేయలేదు. ఎంతో శాస్త్రీయ దృక్పథంతో, మరెంతో నైపుణ్యంతో తయారుచేయబడిన రోదసీ నౌకలు, చరిత్రను సృష్టించిన వ్యోమగాములు తెలుసుకోలేనంత చిన్న తప్పుతో తప్పి మహా వీరుల ప్రాణాలు బలి అవుతున్నాయి. కానీ ఈ అయిదేండ్లలో చిట్టిబాబు మాత్రం 'బస్ స్టాప్'కు చేరడం అర నిముషం అటుయిటూ పొర్లలేదు.

ఓరోజు సాయంకాలం. అలజడిగావున్న బజార్లో ఆలోచిస్తూ నడుస్తున్నాడు చిట్టిబాబు. దూడనుగురించి ఆలోచిస్తూ నడుస్తున్నాడు. నడుస్తూ అటుయిటు చూస్తున్నాడు. చూస్తూ నిలబడిపోయాడు. నిలబడి నిదానించి చూశాడు. సందేహంలేదు. నిజంగానే దూడ!....అవుమెంటలేని దూడ!!- ఓ బట్టలకొట్టు మెట్లమీదనుండి దిగుతూంది వయ్యారంగా. చేతిలో పొట్లం వుంది. బట్టలకొట్టు ప్రక్కన కిరాణా కొట్టుముందు కూర్చుని పకోడీలు నములుతున్న గుప్త అదోరకంగా చూస్తున్నాడు దూడవైపు. ఆ గుప్తగారి పొట్టనుకాదు కానీ, ఈసారి కండ్లను చిత్తుచిత్తుగ పొడిచివేయవలెననుకున్నాడు చిట్టిబాబు. దూడ బట్టలకొట్టు మెట్లు దిగింది. మెట్లుదిగి కొట్టుముందు నిలబడింది. నిలబడి అటుయిటూ చూస్తూంది. రిక్షాకోసమేమో అనుకొన్నాడు. ఆపైన తనవైపు చూసింది. మెల్లగా నవ్వాడు తాను. ఆమెకూడ సన్నగా నవ్వింది. 'దూడ నవ్వింది! దూడ నవ్వింది!!' అని ఎగిరెగిరిపడ్డాడు చిట్టిబాబు. ఆపై మెల్లగా తల ఆడించాడు రమ్మని పిలిచినట్లు. కాసేపు తీక్షణంగా చూచింది దూడ. వణకిపోయాడు చిట్టిబాబు. 'ఎందుకు వచ్చిన గొడవ?' వెళ్ళదామనుకొన్నాడు. తాను బయలుదేరేసరికి దూడ బయలుదేరింది. దూడ బయలుదేరేసరికి చూస్తూ తాను నిలబడిపోయాడు. వెళ్ళడానికి బయలుదేరిన దూడ నేరుగా తాను నిలబడివున్నచోటుకు వచ్చింది. వచ్చి ముద్దుగా నవ్వింది. తాను నవ్వాడు. అప్పుడు దూడప్రక్కన చిట్టిబాబు వున్నాడు. చిట్టిబాబు ప్రక్కన దూడవుంది. ఒకరి నొకరు చూచుకొన్నారు. చూచుకొంటూ నవ్వుకొన్నారు. నవ్వుకొంటూ బజారు వైపు చూశారు. బజారంతా తమవైపు చూస్తూవుంది. చూస్తూ అసూయపడి నట్లుంది. అసూయ! అది ఆంధ్రులకు ఒంటపుట్టిన రోగమేకదా? అనుకొన్నారు.

గర్వంగా బజార్లో నడుస్తూవున్నారు. ప్రక్క-ప్రక్కన నడుస్తున్నారు. 'ఆవు దూడ' నడచినట్లు నడుస్తున్నారు. నడుస్తూవుంటే - వాళ్ళ గుండెలనిండుకు ఆనందం. వాళ్ళ తలలనిండుకు ఆలోచనలు. ఆనందలహరిలో తేలిపోతు న్నారు. తేలిపోతూ రోడ్డుమీదనే నడుస్తున్నారు. ఊరి పొలిమేరలవరకు నడిచారు. విశ్వవిద్యాలయ భవనాలు దాటి నడిచారు.

అక్కడ నిలబడ్డారు. నిలబడి చూశారు. అంతా మైదానము. ఆ మైదానములో విసరిపారవేసినట్లు అక్కడక్కడ పెద్ద భవనాలు. మిగత ప్రదేశ మంతా చిట్టి పొట్టి పొదలు. ఆ పొదలమీద కిచకిచలాడుతూ వుల్లాసంగా ఎగురుతున్న పిట్టలు. దీనికంతటికి బంగారు పూతపూసి రామణీయకతను చేకూర్చడానికి ప్రయత్నిస్తున్న సంజవెలుగులు. ఆ వెలుగులను కబళించడానికి తయారవుతున్న చీకటిదెయ్యము. అందంగా వుంది ప్రదేశము. ఆ అందాన్ని చూస్తూ ఒకరినొకరు చూచుకొన్నారు. ఒకరినొకరు చూచుకొంటూ నవ్వుకొన్నారు. నవ్వుకొంటూ ఒకరివెంబడి ఒకరు నడిచారు.

ఆ మైదానములో ఆ చిట్టిపొట్టి పొదలమధ్య ఓ వంక. రాళ్ళ రప్పలతో నిండిన వంక. అక్కడక్కడ యిసుకతిన్నెలుగల వంక. ఓ యిసుకతిన్నెవద్ద నిలబడ్డారు యిద్దరు. నిలబడి కలయచూశారు. నిర్మానుష్యంగా వుంది మైదానము. ధైర్యంగా ఆ యిసుకతిన్నెలమీద కూర్చున్నారు. కూర్చుని యిసుకను కుప్పలుతోస్తూ వుంది దూడ. ఇసుకలో గీతలు గీస్తున్నాడు చిట్టిబాబు. గీతలు గీస్తూ ఆమెను చూస్తున్నాడు.

దూడ తల వాలిపోయింది. ఇసుక కుప్పలు తోయడంలోనే నిమగ్నయైనట్లు తోస్తూంది. చిరునవ్వులను పెదవులు బిగపట్టుతున్నాయి. కోరికలు కనుకొలకులకు కాంతినిస్తున్నాయి. బరువుగా సాగుతున్న శ్వాసక్రియ వక్షస్థితి వంపులను యింపు కూరుస్తూ వుంది. సంజవెలుగులు ఆమె అందానికే అందాన్నిస్తున్నాయి.

మాట్లాడవలెనని తపన. మాటలు పెగిలిరాని అశక్తత. నండూరి వారన్నట్లు గుండె గొంతుకలో కొట్లాడుతూ వుంది. ఒకచోట కుదురుగ

కూర్చోనలేకపోతున్నాడు. ముందుకు జరుగలేకపోతున్నాడు. ఎట్లో నిబ్బరించు కొని మెల్లగ గొంతు సవరించుకొన్నాడు. మెల్లగా తిరిగిచూచింది దూడ!- ఆమె అలా ఓరగంట విలోకిస్తే - కనుకొలకులు నవ్వుతున్నాయి. విప్పారిన పెదవులు నవ్వుతున్నాయి. అరుణరాగరంజితాలైన బుగ్గలు నవ్వుతున్నాయి. తలలో పూవులు నవ్వుతున్నాయి. గాలికి రేగిన ముంగురులు నవ్వుతున్నాయి.

ఎంతో మాట్లాడవలెననుకొన్నాడు చిట్టిబాబు, ఏమీ మాట్లాడలేకపోతున్నాడు చిట్టిబాబు.

"మీకు పాటలు వచ్చా!" ముద్దుగా అడిగింది దూడ.

"ఓ!" అన్నాడు తాను.

"అయితే ఓ పాట పాడండి!"

తొలిరోజు. దూడను మొట్టమొదటిసారిగా సినిమాహాల్లో చూచినరోజు. తిథి వారం నక్షత్రం చూచుకొనకుండా వెంటపడినరోజు! - పడకమీదపడి దొర్లుతూ నిద్రరాక, యేమీ తోచక, దూడను మరువలేక, రాత్రంతా జాగరణ చేసిన రోజు! తాను వ్రాసుకొన్న పాట! తనకు యిష్టమైన పాట!

గుండెల్లో గుడి కట్టితి....ఓ చెలియ
గుడిలోన నిను నిల్పితి
కన్నీటితో కడిగితి
పాదాలు ఓ చెలియ! కరుణించమని వేడితి ॥గుండె॥

కోరికలు వడపోసితి- ఓ చెలియ!
క్రొత్త ప్రమిదెలోన నింపితి
అనురాగమే వత్తిగా....ఓ చెలియ
ఆశాజ్యోతినే వెలిగించితి.... ॥గుండె॥

భావాలు కలవోసితి- ఓ చెలియ!
భావసుమమాలనే కట్టితి!

గళసీమలో నిల్పితి- ఓ చెలియ
గళమెత్తి నే పాడితి.... ||గుండె||

"అబ్బ! ఎంత బాగుందండీ!" మురిసిపోయింది దూడ. ముగ్ధురాలై పోయింది దూడ. ముందు వెనుక చూడకుండా ముద్దుపెట్టింది దూడ. ముద్దు పెట్టుతూ గాఢంగా కౌగలించుకొనింది దూడ. "ఆహా! ఓహో!" అన్నాడు చిట్టిబాబు. వీపు 'ఛళ్ళు' మనింది. ఎగిరిపడ్డాడు చిట్టిబాబు.

"ఏమి(త్రా బాబూ! నడివీధిలో నిలబడి కలలుగంటున్నావేం?- రోజులు బాగలేదు నాయనా! ఎక్కడ చూచిన ఏదో ఘోరం జరుగుతూనే వుంది. ఈ మోటార్లకు, కార్లకు, లారీలకు కళ్లు లేవు. కాస్త కళ్ళు తెరచి నడవండి అని చెప్పే పోలీసువాళ్ళ చొక్కాలకు నిక్కర్లకు లెక్కలేనన్ని జేబులు కుట్టి యిచ్చింది ప్రభుత్వం. నువ్వే చెప్పు. అవి ఖాళీగా వుంటే వాటి ప్రయోజకత్వం చెడినట్లే గదా?—కాబట్టి మన జాగ్రత్తల్లో మనం వుండడం మంచిది. అయినా నా వెర్రి కానీ, నీలాంటి నాలాంటి ఎన్జీవోలు వుండినా వూడినా కాబట్టం దెవరికిలే! నే వస్తా!" అంటూ వెళ్ళిపోయాడు మిత్రుడొకడు. ఈ లోకంలో పడ్డాడు చిట్టిబాబు. వెంటనే ఎదురుగా వున్న బట్టలకొట్టు వైపు చూశాడు. దూడ అక్కడలేదు!- సిగ్గుపడిపోయాడు చిట్టిబాబు! చిన్నగా ముందుకు సాగాడు చిట్టిబాబు!....

ఒకనాటి ఉదయం. ఆఫీసుకు వెళ్ళుతున్నాడు చిట్టిబాబు. దూడతో కలిసి వెళ్ళుతున్నాడు. దూడతో మాట్లాడుతూ నడుస్తున్నాడు.

"నేను ఒకరిని ప్రేమించానండీ!" నంగిగా పలికాడు చిట్టిబాబు.

"ఒకరినేం ఖర్మ! ప్రేమమయం జగత్సర్వం. ప్రేమించండి. మీకు యిష్టమైన వాళ్ళనంతా ప్రేమించండి. భావ స్వాతంత్ర్యము, వ్యక్తి స్వాతంత్ర్యము వున్న దేశములో ప్రేమ స్వాతంత్ర్యము లేకపోతే యెలా?" ధైర్య వచనాలు పలికింది దూడ.

"అదేమిటండీ అలా అంటారు? నాది ఒకే గుండె. అందులో ఒకరికే స్థానము. మీరేదేదో అంటున్నారే!" బుంగమూతి పెట్టాడు చిట్టిబాబు.

"అయితే మీరు చాల మంచివారన్నమాట!"

ఉబ్బిపోయాడు చిట్టిబాబు. ఊరబెట్టిన వుద్ది పప్పులా వుబ్బిపోయాడు. మాటలు రాక తబ్బిబ్బులయ్యాడు.

"ఆగిపోయారేం?" ప్రశ్నించింది దూడ.

"మరి....మరి....నేనేమో ప్రేమించానండీ! ప్రేమించిన దానికి ఫలితంగా కొన్ని యేండ్లుగ ఆమె చుట్టు తిరుగుతున్నాను. కానీ....కానీ.... ఆమెను అడుగలేక పోతున్నానండీ!"

"ఏమని?"

"ఆమె కూడ నన్ను ప్రేమించిందా? లేదా? అని."

"అక్కడే పొరపాటు పడుతున్నారు. మీరు ఎప్పుడూ ప్రశ్న వేయకూడదు."

"మరి నాకెలా తెలుస్తుంది?"

"ప్రశ్న వున్నప్పుడు తప్పక దానికి సమాధానం గూడ వుండి తీరుతుంది. కాబట్టి ప్రశ్న వేసినపుడు సమాధానమేమో తప్పక దొరుకుతుంది. కానీ మీరు ప్రేమించిన వ్యక్తి మాత్రం మీకు దొరకకపోవచ్చు!"

"అంటే?"

"అంటే-మీరు ప్రేమించిన వ్యక్తి దగ్గరకు వెళ్ళి 'నేను మిమ్మల్ని ప్రేమించాను.' అని అంటే, ఆమె 'నేను మిమ్మల్ని ప్రేమించలేదు' అని అంటుంది. అప్పుడు ఏం చేస్తారు?"

"ఏం చేయాలి?"

"పిచ్చి సన్నాసీ!- అందుకే ప్రశ్న వేయకుండా పరిస్థితులనే కల్పించాలి. నువ్వు ప్రేమించిన వ్యక్తి ఆ పరిస్థితుల్లో యిరుక్కొని నిన్ను ప్రేమించి తీరాలి!"

"పరిస్థితులు....అబ్బ....మాటలా?"

"మరి! ప్రేమంటే!....ఆటలా?"

ఎంత బాగ చెప్పింది దూడ! ఎగిరి గంతువేశాడు చిట్టిబాబు. 'అద్భుతంగా చెప్పారండీ!' అంటూ ఆమె చేతిని వడిసిపట్టుకొన్నాడు. చేతిలో చేయి కలిపి ఆమె తెలివితేటలను అభినందిస్తున్నాడు చిట్టిబాబు. చెంప 'ఛళ్ళు!' మనింది. కళ్ళల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. చేతిలో చేయి వీడిపోయింది.

"బ్రూట్! బుద్ధుందా నీకు? లేదు- పిచ్చి పట్టిందా?" దారిన పోతున్న ఎవరో నవనాగరీకురాలు రొప్పుతూ వుంది రోషంతో. అప్పటికే అక్కడ అయాచితంగా తయారైన న్యాయవాదులు నానా మాటలు అంటున్నారు కోపంతో. తల కొట్టివేసినట్లయింది చిట్టిబాబుకు.

"క్షమించండి!....ఏదో పరధ్యానంగా....క్షమించండి....మిత్రునితో మాట్లాడుతున్నట్టు....క్షమించండి....పొరపడ్డాను క్షమించండి!...." అంటూ వడివడిగా నడిచిపోయాడు చిట్టిబాబు. వెకిలిగా నవ్వుతూ న్యాయవాదులు అదోలా చూస్తున్నారా నాగరీకురాలి వైపు క్రాపులు, కాలర్లు సర్దుకొంటూ, 'ఛీ ఛీ! వీళ్ళకంటే కపిల తీర్థంలో కోతులు మేలు!' అనుకొంటూ వెళ్ళింది ఆ సుందరి. ఆ మాటలు ఎవరిని ఉద్దేశించి అన్నదో తెలియకుండా ఒకరి మొగం ఒకరు చూచుకొంటున్నారు న్యాయవాదులు!

దూడ వెంటపడ్డ ఈ అయిదేండ్లలో అద్భుతమైన అనుభవాలివి. ఊహాలోకంలో విహారాలివి. అందుకు తగ్గట్టుగ వడ్డింపులుకూడ దొరికినవి. ఒకసారి ఆఫీసులో అవసరమైన వుత్తరానికి అత్యవసరంగా బదులు వ్రాయమన్నారు. వ్రాస్తూ కూర్చున్నాడు చిట్టిబాబు. గంటలో పూర్తి కావలసిన పని, రెండుగంటలైనా పైకి లేవలేదు చిట్టిబాబు. కాగా మేనేజరు లేచిరావలసి వచ్చింది. వచ్చిచూచిన మేనేజరుగారికి పిచ్చెక్కిపోయింది. చిట్టిబాబు చేతిలో కాగితం పెరుక్కొన్నాడు. పెరుక్కొని అందరికీ చూపించాడు. చూపిస్తూ

నోటికివచ్చినట్లు తిట్టాడు. ఆ కాగితంమీద వ్రాత! 'దూడ!....దూడ!.... దూడ!....'అన్న వ్రాత. ఎవరికీ యేమీ అర్థంకాలేను. ఏమిటిది? అని అడిగితే చిట్టిబాబు బదులు చెప్పలేదు. అది అతని తలరాత అన్నారు ఎవరో నవ్వుతూ.

ఈ అయిదేండ్లలోనే బాంగ్లాదేశంలో కల్లోలం జరిగింది. అక్కడ మానవత్వానికి మారణహోమం జరిగింది. మనుష్యులు మనుష్యులనే చంపుకొన్నారు. మానభంగాలు చేసుకొన్నారు. 'రక్షించండి! రక్షించండి!!' అని ఆ దేశ ప్రజలు ఎలుగెత్తి యేడ్చారు. ఆ బీభత్సాన్ని కరుణామయంగా చిత్రించాయి పత్రికలు. కాఫీ 'సిప్'చేస్తూ, సిగరెట్టు పీలుస్తూ నిద్రలేచీ లేవడంతోనే అందరు ఆ వార్తలను చదివారు. 'అయ్యో! పాపం!' అన్న సానుభూతితో అక్కడే మరచిపోయారు. బంగ్లాదేశవాసుల ఆర్తనాదాలు గాలిలో కలిసిపోయాయి. అలనాడు జంతువుల మొరలను విన్న దేవునికీనాడు మనుష్యుని మొరలు చెవికెక్కలేదు. అయితే ఈనాటి మనుష్యులకంటే ఆనాటి జంతువులే మేలేమో?

బాంగ్లాదేశంలో కల్లోలం జరిగితే ఆంధ్రదేశంలో సమ్మె జరిగింది. చరిత్రను సృష్టించే సమ్మె జరిగింది. సమ్మె చేసినవారు 'బంద్' జరిపారు. ప్రభుత్వం కన్నెర్రజేసింది. పోలీసులు అమాయకుల రక్తాన్ని జుర్రుకొన్నారు. ఇంత జరిగింది. మనిషి మనిషిలో రక్తం మరిగింది. దూడ మాయలో పడిన చిట్టిబాబుకుమాత్రం చీమకుట్టినట్లనిపించలేదు.

"ఎన్జీవోలు ఎందుకు సమ్మె చేయాలి? సమ్మె అంటే అర్థమేమి? అర్థం తెలియదు. ఆలోచనలేదు. అనర్థాలుమాత్రం బోలెడు. పోనీ, యిది ప్రజాస్వామ్యమా? ప్రజాస్వామ్యంలో వీళ్ళు నిజంగా మనుష్యులే అయితే ఎందుకు వీళ్ళను జంతువులమాదిరి కాల్చి చంపుతున్నారు? అంటే!_ మను

ష్యులు మనుష్యులనే కాల్చి చంపుతున్నారన్నమాట. కొందరు చస్తుంటే కొందరు మిద్దెలమీద మేడలమీద నిలబడి వేడుక చూస్తున్నారే! వీళ్ళు ప్రజ లేనా? ఇది ప్రజాప్రభుత్వమా? - బాంగ్లా దేశంలో కల్లోలమేమి? బజార్లో యీ అలజడి యేమి?...." యిలా బీరకాయ పీచులాసాగివుండేవి చిట్టిబాబు మెదడు లోని ఆలోచనలు. కానీ దూడ మాయలో పడ్డాడు. దూరమయింది లోకం శోకడ. అరచేతిలో గీత చూచుకొని అయిదేండ్లు అయింది.

అయిదేండ్ల తరువాత ఓ రోజు. ఓ మిత్రుడు తేనీటి విందుకు పిలి చాడు చిట్టిబాబును. ఆ మిత్రుడు కలిగిన యింట బిడ్డ. ఆ కలిగిన యింటి బిడ్డ లేమిలో వున్న ఓ భామను ప్రేమించాడు. ప్రేమా లేదు గీమా లేదు అన్నారు పెద్దవాళ్ళు. 'ఉంది' అన్నాడు తాను. 'కాదంటే? అవునంటావా?' అన్నారు వాళ్ళు. 'అవును!' అన్నాడతడు. 'అయితే యిక నీ దారి నీది! మా దారి మాది!!' అన్నారు పెద్దవాళ్లు. 'కడకు అందరిదీ ఒకటే దారి!' అని నవ్వాడు అతను. దానికి 'విప్లవాత్మకమైన పెండ్లి' అని పేరు పెట్టాడు. ఆ లేమిలో వున్న భామను నలుగురి మిత్రుల మధ్య నిలబెట్టి బొట్టు కట్టవలె నను కొన్నాడు. దానికి తేనీటి విందు జత కలిపాడు. అందుకే అందరి మిత్రులను అక్కడ చేర్చాడు.

ఆ మిత్ర బృందములో అబ్బాయి తరపున వచ్చిన వాళ్ళల్లో చిట్టిబాబు ఉన్నాడు. అమ్మాయి తరపున వచ్చి వాళ్ళల్లో 'దూడ' ఉంది.

పెండ్లి జరిగింది. విప్లవాత్మకమైన పెండ్లి బొమ్మల పెండ్లిలా జరి గింది. విందు జరిగిన తరువాత నూతన వధూవరులను కూర్చోపెట్టి, చుట్టూ అందరు కూర్చున్నారు. కూర్చుని కాసేపు కబుర్లలో పడ్డారు. ఆపై అందరి దృష్టి సంగీతం వైపు మరలింది. పాట పాడడానికి కాసేపు నీవంటే నీవని పోటీ పడ్డారు. తరువాత ఆడవారి వైపు దూడ, మడవారి తరపున చిట్టిబాబు పాడవలెనని ఏకగ్రీవంగా తీర్మానించారు, ఈ ఏకగ్రీవ తీర్మానాలను అన్నిటి కంటే బాగా నేర్పింది మన ప్రభుత్వం కాబట్టి.

దూడ పాడింది. కమ్మగా పాడింది. నెమ్మదిగా పాడింది. తలవంచుకొని, ముసిముసిగా నవ్వుకొని, 'తోటలో నా రాజు తొంగి చూచెను నేడు!' అన్నపాట పాడింది. అదొక తోటయితే ఆ తోటలో చిట్టిబాబు ఒక రాజుగా వివశుడై పోయాడు. తేనీటి విందుకు ఆహ్వానించిన మిత్రుణ్ణి కోటిసార్లు అభినందించాడు మనసార మనస్సులోనే!

"ఈమె పేరు గీత. బి. ఎ. చదువుతూ ఉంది. తెలుగు సాహిత్యం మీద మంచి అభిలాష. ఈనాడు వెలువడుతున్న నవలలన్నిటినీ ఒక్క గుక్కలో చదివింది!"

మిత్రబృందానికి పరిచయం చేశారు ఆమెను!

'నమస్తే!" అని అందరికీ నమస్కరించింది గీత.

దూడ- కాదు గీత నమస్కరించిందనుకొన్నాడు చిట్టిబాబు. ఆమెకు వినమ్రుడై ప్రతినమస్కారం చేశాడు!

చిట్టిబాబు వంతు వచ్చింది. గొంతు సవరించుకొన్నాడు. అందరివైపు ఒక్కసారి కలయజూశాడు. ప్రత్యేకంగా గీతవైపు చూశారు. హాయిగా ఆలాపించాడు.

ఆ గడియ ఒక గడియ
అపురూపమౌ గడియ
ఆరాధ్య దైవతము
అవతరించిన గడియ....ఆ గడియ॥

కనుగొనల పొంగినవి
కలత కోరికలు

మదినిండ విరిసినవి
మధురమౌ భావనలు....ఆ గడియ॥

నా భావ సుమముల
నావ నిర్మించుకొని
జిలుగు పయ్యెదనేమొ
తెరచాప దించుకొని
దూరాతి దూరముల
తీరముల విహరించ
మనసు పొంగిన గడియ
మధురమౌ ఆ గడియ....ఆ గడియ॥

చిట్టిబాబు పాట పాడాడు. అనుభవిస్తూ పాడాడు. అందరూ ఆశ్చర్య పడేటట్లు పాడాడు!

"ఇతని పేరు చిట్టిబాబు. చక్కని ప్రణయగీతాలు వ్రాస్తాడు. ఇతని కవిత్వాన్ని కంఠ మాధుర్యాన్ని యిప్పుడు మీరు చవి చూశారు!"

సిగ్గుపడుతూ అందరికీ నమస్కరించాడు చిట్టిబాబు. అందరికీ నమస్కరిస్తున్నా అతని చూపులు గీతవైపుకే పరుగులిడుతున్నాయి. ఆమె ఈ లోకంలో లేదు. మరో లోకంలోవున్న ఆమెను వూహించుకొని మురిసి పోయాడు చిట్టిబాబు. అందరు బయలుదేరుతున్నారు. బయలుదేరుతూ ఒక్కరి వద్ద ఒక్కరు సెలవు తీసుకొంటున్నారు. గీత చిట్టిబాబును సమీపించింది.

"మా యిల్లు...."

"నాకు తెలుసునండీ!"

"మీకెలా తెలుసు?" ఆశ్చర్యం ధ్వనించింది గీత మాటల్లో.

తల వంచుకొన్నాడు చిట్టిబాబు. క్రొత్త పెళ్ళికూతురిలా తలవంచు కొన్నాడు. అయిదేళ్ళు యింటిచుట్టు తిరిగానని చెప్పలేక తల వంచుకొన్నాడు.

"పోనీలెండి! కారణాలతో అవసరమేముంది? అప్పుడప్పుడు మా యింటికి వస్తూ ఉండండి!" ఆహ్వానించింది గీత.

తల ఆడించారు చిట్టిబాబు మంచి అబ్బాయిలాగ. గీత వెళ్ళిపోతూ వుంది. ఆమె వెళ్ళిపోతూవుంటే చూస్తూ నిలబడ్డాడు. నిలబడి- అయిదేండ్లు తిరిగిన ఫలితం పొందినందుకు ఆనందిస్తున్నాడు. ఆపై ఆమె యింటికి పోవడ మెప్పుడని ఆలోచిస్తున్నాడు!....

ఆ మరుసటి రోజు!....అందమైన బజార్లో ఆలోచిస్తూ నడుస్తూ వుండిన చిట్టిబాబు....గీత యింటికి కెళ్ళడానికి బయలుదేరిన చిట్టిబాబు.... గీత యింట్లో అడుగుపెట్టాడు. అతని రాకకోసమే కాచుక కూర్చున్నట్లుంటి గీత. సాదరంగా ఆహ్వానించింది. కూర్చొనడానికి కుర్చీ చూపింది. 'ఫ్యాన్' వేసింది. అర సోలెడు పాలల్లో ఆ మాత్రం నీళ్ళు చేర్చి అందమైన గ్లాసులో యిచ్చింది. ఆపై అతనికి ఎదురుగ కూర్చొనింది. పేరుకు అతడు త్రాగు తున్నది పాలు!....చూపులతో అతడు గ్రోలుతున్నది ఆమె సోయగాలు!!....

గీత సాహిత్యాన్ని గురించి మాట్లాడింది. శరత్ సాహిత్యాన్ని గురించి మాట్లాడింది. శేష ప్రశ్నలో 'కమల' అద్భుతమైన మనిషి అని అనింది. శ్రీకాంత్‌లో శ్రీకాంత్‌ను పిరికివాడనింది. చలంగారి మైదానములో అమీర్ వ్యక్తిత్వాన్ని అభినందించింది. పట్టణములో జరుగుతున్న సినిమాల గురించి ప్రస్తావించింది. ఆపై చిట్టిబాబును ఓ పాట పాడమనింది. చిట్టిబాబు పొంగిపోయాడు. తన హృదయాన్ని విప్పి ఆమె ముందు పెట్టగల అవకాశం

లభించినందులకు పొంగిపోయాడు. అయిదేళ్ళ తరువాత లభించిన అదృష్టానికి పొంగిపోయాడు. ఆపై గొంతు సవరించుకొన్నాడు.

ఏ పూలతో నిన్ను పూజింతునో చెలియ
ఏ భావగీతికల భూషింతునో సఖియ ॥ఏ పూల॥

పూచిన పూలన్నీ వాడిపోతున్నాయి
తోచిన భావాలు పాత వౌతున్నాయి ॥ఏ పూల॥
ముడిచి విడిచిన పూలు మున్నూరు మూరేల
తడిమి విడిచిన భావ సౌందర్యమే గోల ॥ఏ పూల॥
వాడి పోనీ పూలు వనరైన భావాలు
దొరకునా నీ పూజ జరుగునా మనసార ॥ఏ పూల॥

పాట ఆగింది. ఆమె పైకి లేచింది. లేచి నవ్వుతూ లోనికేగింది. మరో రెండు నిముషాల్లో దోసెడు పూలతో తిరిగి వచ్చింది. ఆ దోసెడు పూలు టేబిలు మీద పోసింది.

"చూడండి! మీరు కవులు. ఎప్పుడూ ఊహా జగత్తులోనే విహరిస్తుంటారు. అలా అయితే లాభం లేదు. వాస్తవ జగత్తును కూడ అప్పుడప్పుడు చూస్తూ ఉండాలి. లేకపోతే హాని జరుగడానికి అవకాశ ముంది. ఇప్పుడు చూడండి. మీరు వాడిపోని పూలు దొరకలేదని మీ ప్రేమ పూజను వాయిదా వేసుకొన్నారు. ఈ వాడిపోని పూలు మార్కెట్‌లోనికి వచ్చి చాల రోజులయింది. ఈ పూలను పట్టుకవెళ్ళండి. ఎవరో యేమో పాపం! ఎంతగా పరితపిస్తున్నారో ఆమె కోసం! వెళ్ళండి. మీ ప్రేయసిని ఈ వాడిపోని పూలతో మనసార పూజించండి. ఇప్పటికే ఆలస్యమైనట్లుంది!" వస్తున్న నవ్వును ప్రయత్నపూర్వకంగా ఆపుకొంటూ అంది గీత.

టేబిలు మీద పూలవైపు పరిశీలించి చూశాడు చిట్టిబాబు. పరిశీలించి చూచి పాలిపోయాడు చిట్టిబాబు!.... అవన్నీ ప్లాస్టిక్ పూలు!—

గొంతులో తడి ఆరింది. ముండ్లమీద కూర్చున్నట్లుంది. లేచి నిలబడ్డాడు. తిరుగుతున్నది తలనా? లేదు లోకమా?— అర్థం కావడం లేదు. గీత కొంటెగా చూస్తూ నవ్వుతూ వుంది సన్నగా సన్నజాజిలా! అక్కడ నిలబడలేకపోయాడు చిట్టిబాబు. గీత నవ్వుతూంటే చిట్టిబాబు ఆ యింటి కడప మెట్లు దిగుతున్నాడు. మెట్ల మీద దిగుతూంటే గీత విరగబడి నవ్వడం వినిపిస్తూ ఉంది. వినిపిస్తూ వీపు మీద శూలంలా పొడుస్తున్నట్లుంది. నిట్టూర్చాడు చిట్టిబాబు. నిట్టూరుస్తూ అరచేతిని చూచుకొన్నాడు. అయిదేండ్ల తరవాత అరచేతిని చూచుకొన్నాడు. అరచేతిలో గీత! - అదృష్టాన్ని తేగలిగిన ఒక్కగా నొక్క గీత! - అది మారలేదు. ఆశించిన గీత! - అరచేతిలోనికి రాలేదు. రెండు కన్నీటి బొట్లు మాత్రం రాలి, అరచేతిలో పడ్డాయి. ఆ కన్నీళ్ళు గీత నిండుకు నిండుకొన్నాయి. ఆ గీత!-అంతయి.... యింతయి.... అలనాటి వామనుడిలా ఆ వీధి అంత అయింది. ఆ వీధి ఓ కన్నీటి ప్రవాహంలా కనుపిస్తూంది చిట్టిబాబుకు. ఆ కన్నీటి ప్రవాహంలో పడి కొట్టుకపోతున్నాడు చిట్టిబాబు!

విడుదలైన

మా యితర ప్రచురణలు

కాగితం పులి

(నవల)

రచన: నూతలపాటి గంగాధరం

గాడిద బ్రతుకులు

(నవల)

రచన: కలువకొలను సదానంద

సమాజము - సాహిత్యము

(వ్యాస సంపుటి)

రచన: ఆర్. ఎస్. సుదర్శనం

వివరాలు :

చిత్తూరు జిల్లా రచయితల
సహకార ప్రచురణ సంఘం
చిత్తూరు